శరత్సాహిత్య గ్రంథావళి :

# గృహదహనము

(మొదటి భాగము)

శరచ్చంద్ర చటర్జీ

అనువాదకుడు :

పిలకా గణపతిశాస్త్రి
(సాహిత్యశిరోమణి)




పబ్లిషర్సు : అద్దేపల్లి అండుకో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# గృహదహనము

సురేశుడు మహిముడికి చాలాదగ్గిర స్నేహితుడు. ఒక్కసారిగా ఎఫ్, ఏ. పాసవడంతోనే అతను వెళ్ళి మెడికల్ కాలేజీలో జేరాడు. కాని మహిముడు తను పూర్వంఉన్న సిటీకాలేజీలోనే ఉండిపోయాడు.

అందుచేత సురేశుడి ఆత్మగౌరవానికి ఏదో ఆఘాతం కలిగినట్లయింది. ఆకారణంచేత అతనుమహిముడితో "ఈరోజుల్లో బి, యే; ఎమ్మే పాసవడంవల్ల ఏమీ లాభంలేదని నేను నీతో మాటిమాటికీ చెబుతూనే ఉన్నాను. ఇప్పటికీ ఇంకా వ్యవధి ఉంది. నువ్వు మెడికలు కాలేజీలో జేరాలి" అన్నాడు.

మహిముడు నవ్వి "సరే! జేరాలి కాని; ఖర్చుసంగతికూడా కొంచెం ఆలోచించాలా!" అన్నాడు.

"ఆ'! అదిమాత్రం నువ్వు పెట్టుకోలేనంత పెద్ద ఖర్చవుతుందా! అదీగాక నీకు స్కాలరుషిప్పు కూడా దొరుకుతుందిగా!"

ఆమాట మీద మహిముడు చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

సురేశుడు కొంచెం కంగారు పడుతూ, "అబ్బెబ్బే! ఇది నవ్వి ఊరుకోవలసిన విషయంకాదు! ఇదుగో! నేను ముందే చెబుతున్నాను. నువ్వు ఆలస్యం చేశావంటే టెరంమధ్యలో చేరవలసిఉంటుంది. ఖర్చుసంగతీ అదీ తరవాత ఆలోచించుకోవచ్చును" అన్నాడు.

మహిముడు "సరేలే! బాగానేఉంది" అన్నాడు. సురేశుడు మళ్ళీ "ఇదుగో నేను చెబుతున్నాను విను. నీకు ఏదిబాగుంటుందో ఏదిబాగుండదో ఇంతవరకూ కూడా నాకు తెలియడం లేదు! నేను తొందరగా కాలేజీకివెళ్లాలి. అందుచేత దోవలో నీకు గట్టిగా ఏవిషయం లోనూ మాట ఇవ్వలేను. కాని రేపో ఎల్లుండో ఈవ్యవహారం

ఏదో ఒక ఒడ్డుకి చేరిస్తేనేగాని నేను వదిలిపెట్టదలుచుకోలేదు. నేను రేపు పొద్దున్నే వస్తాను. వచ్చేటప్పటికి బసలో ఉండు" అని చెప్పి గబగబా కాలేజీవైపు వెళ్ళిపోయాడు.

ఆతరవాత పదిహేను రోజులు గడిచిపోయాయి. మహిముడు ఏమయ్యాడో, అతను మెడికలు కాలేజీలో చేరడం సంగతి ఏమయిందో అది పరమేశ్వరుడికే తెలియాలి! సురేశుడు ఆపైన, ఒక ఆదివారం నాడు మిట్టమధ్యాహ్నం వేళ వెతికి వెతికి మహిముడున్న బస కనుక్కున్నాడు. అది కాలేజీవిద్యార్థులందరూ సామాన్యంగా అద్దెకుండే ఇల్లు. అదిపైకి పరమదరిద్రంగా కనబడింది. అతను మేడమెట్లెక్కి పైకివెళ్ళాడు అక్కడ ఒక చీకటిగా ఉన్నకొట్లో ఒకచిరిగిపోయిన చాపమీద కూచుని ఐదారుగురు భోజనం చేస్తున్నారు. మహిముడు తలెత్తి చూసేటప్పటికి చటుక్కున సురేశుడు కనబడ్డాడు. మహిముడు "హఠాత్తుగా బస మార్చవలసి వచ్చింది. అందుచేత నీకు కబురు చెయ్యలేక పోయాను. అయితే, నాబస ఎల్లాగ పట్టుగున్నావు?" అన్నాడు.

సురేశుడు అతని మాటలకేమీ సమాధానం చెప్పకుండా చటుక్కున ఆపక్కనున్న గుమ్మంమీద కూర్చుని, తదేకదృష్టితో వాళ్ళవిస్తళ్ళకేసి చూడడం మొదలుపెట్టాడు. అన్నం బాగా చవక రకం బియ్యంతో వండినట్టుంది. పప్పు చారులాఉంది ఆపక్కని రెండు మూడుకలిపి చేసినకూర ఉంది. పెరుగూ లేదు! పాలూ లేవు! ఆఖరికి నోటికి రుచించేవస్తువు ఒక్కటైనా లేదు.

మహిముడు అందరితోనూ కలిసి ఎంతో ఆప్యాయంగా భోజనం చేస్తున్నాడు. కాని అతనికేసి అల్లాగ చూస్తూంటే సురేశుడికి కళ్ళమ్మట నీళ్ళు గిర్రున తిరిగాయి. అతను ఏదో వంకమీద ముఖం ఇంకొకపక్కకి తిప్పి కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ లేచినుంచున్నాడు.

ఒక్కొక్కప్పుడు మామూలు మాట మీద కూడా సురేశుడికి కళ్లమ్మట నీళ్లు తిరుగుతూ ఉంటాయి.

భోజనం అయిన తర్వాత మహిముడు సురేశుణ్ణి తన పక్కన కూర్చో పెట్టాడు. సురేశుడు గద్గద స్వరంతో "మహిమా! నేను మాటి మాటికీ నీ కరుకుదనం సహించలేకుండా ఉన్నాను!" అన్నాడు.

మహిముడు ప్రశాంతంగా "అంటే నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు.

ఆ మాట మీద సురేశుడు ఇల్లా అన్నాడు.

"నేను నా కళ్ళతో చూసేదాకా, ఈ పట్టణంలో ఇల్లాంటి ఇల్లు ఉంటుందని కాని, ఇల్లాంటి అన్నం ఎవరైనా తింటారనిగాని బొత్తిగా నమ్మలేక పోయాను. సరే! బాగానే ఉంది! కాని కేం నువ్వు ఈ ఇల్లు ఎల్లాగ సంపాదించావు? నువ్వు మొట్టమొదట ఉండేది ఎంత పాడుగా ఉన్నా దానికీ దీనికీ పోలికే లేదు! అయితే నువ్వది ఎందుకు వదిలేశావు?"

సురేశుడు ఇల్లాగ అడగడంవల్ల మహిముడి హృదయం కరిగిపోయింది. ఎక్కడా చలించని అతని గంభీరస్వభావం కూడా ఇట్టే మాయమైపోయింది. అతను గద్గదకంఠంతో "సురేశా! నువ్వు మా పల్లెటూళ్ళో ఉన్న ఇల్లు చూడలేదు! ఆ ఇల్లు నువ్వు చూసి ఉంటే ఇక్కడ ఉండడం నాకు ఏమీ కష్టంకాదని గ్రహించి ఉందువు. ఇంక తిండివిషయంలోనా! మంచి సంప్రదాయమైన కుటుంబాల్లో పుట్టిన ఈ అయిదారుగురూ ఈ అన్నం ఎంతో ఆప్యాయంగా తింటూ ఉన్నప్పుడు నేనుమాత్రం తినలేనూ!" అన్నాడు.

ఆ మాట మీద సురేశుడు ఎంతో ఆవేశంతో "నువ్వు తినగలవా? తినలేవా! అనే విషయం నేను చర్చించడంలేదు! ప్రపంచకంలో ఎప్పుడూ కూడా మంచీ చెడ్డా ఉంటూనే ఉంటాయి! కొందరు సుఖాలు అనుభవిస్తున్నారు, కొందరు కష్టాలూ అనుభవిస్తున్నారు! అయితే

నువ్వింతగా అవస్థపడ్డానికి అవసరం ఏమివచ్చిందని నా ప్రశ్న! అన్నాడు.

మహిముడు ఆపైన మాట్లాడక కూరుకుని చిరునవ్వు నవ్వాడు; ఎంత సేపటికీ ఏమీ అనలేదు.

సురేశుడు మళ్ళీ "సరే! నువ్విక్కడ ఎందుచేత ఉన్నావో ఉన్నావు! ఆవిషయం నాకక్కర్లేదు! కాని నీకెల్లాగో అల్లాగ సహాయం చెయ్యవలసిన పూచీ నామీదఉంది. నే నిప్పుడే బండి తెప్పించి నీసామానులన్నీ అందులో వేయించి మాయింటికి తీసుకువెడతాను. ఇక్కడ నిన్నీవిధంగా విడిచిపెట్టి వెళ్ళిపోతే నాకింక నిద్రపట్టదు. అన్నమూ నీళ్ళూ కూడా సయించవు! నువ్వు నీ హోటలు నౌకర్ని పిలిచి బండి తెమ్మనమని చెప్పు" అన్నాడు. ఆపైన అతను మహిముణ్ణి బలవంతంగా చెయ్యిపట్టుకుని లేవదీసి నుంచోబెట్టి, స్వయంగా అతనిపరుపు చుట్టడం మొదలు పెట్టాడు.

మహిముడు అతన్నేమీ అడ్డు పెట్టడానికి ప్రయత్నించలేదు; కాని ప్రశాంతమైన గంభీరస్వరంతో "ఏమిటిసురేశా! నీ కంతకంతకి మతి పోతూందేమిటి?" అన్నాడు.

సురేశుడు కళ్ళుపైకెత్తి "మతిపోవడం ఏమిటి? నువ్వురావా?" అన్నాడు.

"రాను"

"ఎందుకు రావు? నీకూ నాకూ ఏమీ సంబంధం లేదా! మాయింటికి రావడానికి నీకేమైనా చిన్నతనంగా ఉందా?"

"లేదు"

"అయితే ఇహనేం! మరి?"

మహిముడు "సురేశా; నువ్వు నాకు స్నేహితుడవే! నీలాంటి స్నేహితుడు నా కింకొకడు లేడు! ఇల్లాంటి స్నేహితుడు ఇంకెవరికన్నా ఉన్నాడో లేడో చెప్పడంకూడా కష్టమే! అల్లాంటప్పుడు కేవలం స్వల్ప

సుఖంకోసం ఇంత మంచి స్నేహాము పోగొట్టుకోమంటావా?'' నేనంత తెలివి తక్కువవాణ్ణనుకున్నావా?'' అన్నాడు.

సురేశుడు "స్నేహంఅనేది నీకొక్కడికే సంబంధించింది కాదు. నాకూ, దాం అందులో భాగంఉంది. ఒక వేళ నువ్వుచెప్పినట్టు ఆస్నేహం పోతుం దనుకో! దానివల్ల వచ్చే కష్టనిష్ఠూరా లేవో నాకు మాత్రం తెలియదూ? నే నేమంత మూర్ఖుణ్ణా? ఒక వేళ, అంత అడుగడుక్కీ జాగ్రత్తగా ఉండకపోడంమూలాన్ని ఆస్నేహం పోయినా, దాని కోసము మనమేమీ విచారపడనక్కరలేదు. శరీరారోగ్యానికి కూడా సహాయపడక పోయినతరవాత, ఇంక, ఆస్నేహానికి విలవేమిటి?'' అన్నాడు.

మహిముడు నవ్వుతూ "అయితే నేనీ వేళ నీ వాదానికి ఓడిపోయాను. కాని, నీతో ఒక్కమాట నిశ్చయంగా చెబుతున్నాను సురేశా! నేనేమో ఇష్టపడి ఈకష్టాలన్నీ అనుభవించడానికి ఇక్కడికీవచ్చానని నువ్వనుకుంటున్నావు కాని ఆమాట నిజంకాదు'' అన్నాడు.

సురేశుడు "సరే! నిజం కాకపోవచ్చును. నా కా కారణం ఏమిటో తెలియక్కర లేదు! కాని నీది కేవలం డబ్బు కూడబెడదామనే ఉద్దేశం అయితే, మాయింటికివచ్చి ఉండచ్చునుగా! దీనివల్ల నువ్వను కున్నదాని కేమీ తిరకాసు రాదుకూడాను'' అన్నాడు మెడతిప్పి.

మహిముడు సంగ్రహంగా "సరే! ఈసారికి ఇల్లాగపోనీ! సురేశా! ఇపైన ఇంకేదైనా ఇబ్బందివస్తే తప్పకుండా నీతో చెబుతానులే!'' అన్నాడు.

మహిముడువట్టిన పట్టువిడిపించడం కష్ట మని సురేశుడికి తెలుసును. అందుచేత అతను మరేవిధంగానూ పట్టు పట్టకుండా మొహం చిన్నబుచ్చుకుని. కోపంతో అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. కాని స్నేహితుడు అల్లాగ ఇబ్బందిపడుతూ ఉండడమూ అదీ చూడడంవల్ల ఆవిషయం అతని

మనస్సులో బల్లెంలాగ నాటుకుపోయింది.

సురేశుడు గొప్ప ధనవంతుల బిడ్డ. మహిముడంటే అతని కెంతో ఆప్యాయం. స్నేహితుడికి తనకిచేతనైన సహాయం చేద్దామని అతను మనస్సులో ఎప్పుడూ అనుకుంటూ ఉంటాడు. కాని మహిముడు ఇంత వరకూ ఏవిధమయినసహాయానికీ అంగీకరించలేదు! సురేశుడు ఎంత బలవంతిపెట్టినా ఈవేళకూడా అతను దేనికీ అంగీకరించలేదు!

౨

ఒక అయిదు సంవత్సరాలు గడిచినతరవాత ఇద్దరిస్నేహితులకీ మధ్యన ఈవిధంగా సంభాషణ నడిచింది.

సురేశు—మహిమా! ఆరోజుల్లో నువ్వంటే నే నెంత ఆప్యాయంగా ఉండేవాణ్ణి; అది ఇంతని చెప్పడంకూడా చాలాకష్టం!

మహిము—సురేశా! ఆవిషయం చెప్పమని నేను నిన్నేమీ బల వంత పెట్టడంలేదు!

సురేశు—ఇప్పుడు నీవిషయంలో అంత శ్రద్ధలేదనుకుంటాను.

మహిము—ఆశ్రద్ధలేకపోతే నిన్ను దండిస్తానని నే నెప్పుడూకూడా అనలేదే!

సురేశు—నీమనస్సులో కౌటిల్యం ఉందని నీశత్రువు కూడా అనలేదు!

మహిము—శత్రువుచెయ్యలేనిపని స్నేహితుడుకూడా చెయ్యలేడని తర్కశాస్త్రంలోఎక్కడైనా నియమం ఉందా?

సురేశు—అబ్బెబ్బే! వెళ్ళివెళ్ళి చివరికి బ్రహ్మసమాజం వాళ్ళ పిల్ల వల్లో పడ్డావా? ఆపిల్లదగ్గిర యేముంది? మొహంఅంతా ఎండిపోయి ఉన్నపిల్లలా ఉంటుంది, అన్నమానం పుస్తకాలు బట్టీపట్టడంచేత, ఒళ్ళంతా చిక్కి శల్యంఅయిపోయి, ఉఫ్ అంటే పడిపోయేలాగ ఉంటుంది. ఆకంఠస్వరంకూడా పిల్లికూతలాగ అసహ్యంగా ఉంటుంది.

మహిమ — నువ్వన్న మాట నిజమే కావచ్చు!

సురేశు — మహిమా! ఒక్కమాట చెబుతాను విను! పల్లెటూరి వాళ్లెప్పుడూ బ్రహ్మసమాజం వాళ్ళ పిల్లల్ని చూసి ఉండరు. వాళ్లు ఆడ వాళ్ళు ఇంగ్లీషులో ఉత్తరాలు రాస్తారనే మాట వినేసరికి నిర్ఘాంతపడి పోయి చూస్తారు. వాళ్ళ దగ్గిరికి వచ్చేటప్పటికి ఎంతో మర్యాదగా దూర దూరంగా తొలగిపోతూ ఉంటారు. ఆ అమాయకుల దగ్గిర ఏమి చేసినా వాళ్ళు ఆశ్చర్యపడిపోయి సాష్టాంగప్రణామం చేస్తూంటారు. వాళ్ళ దగ్గిర నువ్వు ఏత మాషా చేసినా చెయ్యవచ్చును! కాని మనది పల్లెటూరు కాదు! ఇక్కడున్న వాళ్ళని నువ్వింత సులభంగా బుట్టలో వెయ్యడం కష్టం!

మహిమ — సురేశా! నేను నీతో ఒట్టుపెట్టుకుని చెబుతున్నాను. మీ పట్టణ వాసం వాళ్ళని బుట్టలో వెయ్యాలనే సంకల్పం నాకు కొంచమైనా లేదు! నేను ఆ అమ్మాయిని తీసుకు వెళ్ళి పల్లెటూళ్ళోనే ఉంటాను! ఇందులో నీకేమైనా తప్పు కనపడిందా?

సురేశుడు మండిపడుతూ ఇల్లాఅన్నాడు. "తప్పు లేకపోవడమేమిటి! ఇందులో అన్నీ తప్పులే! వందలు, వేలు, లక్షలు, కోట్లు తప్పులున్నాయి! నువ్వు ప్రపంచకాని కంతటికీ పూజనీయమైన హిందూమతంలో జన్మించి ఒక స్త్రీ మోహపాశంలోపడి నీజాతిని ధ్వంసం చేసుకుంటున్నావా? ఇది కేవలం మోహము! ఒక్కసారి ఆమె వేసుకునే మేజోళ్లూ, బాగైన చీరలూ మాన్పించి, సామాన్యసంసారిస్త్రీలు కట్టుకునే రంగుచీరలు కట్టించించి చూడు! ఆ మోహం ఉండేదీ పోయేదీ అప్పుడు తెలుస్తుంది! అప్పుడు ఆ ఒట్టికట్టబొమ్మ్మకేసి చూస్తే నీభ్రమ పూర్తిగా తొలిగిపోతుంది! ఆమెలో నీకు ఏమివిశేషం కనుపించింది? పోనీ కుట్టుపనీ అదీ వచ్చినపిల్లని నువ్వు పెళ్ళాడదామని అనుకుంటున్నావని అనుకో! కలకత్తాలాంటి పట్టణాల్లో కుట్టుపని చేసే వాళ్ళు కావలిసినంతమంది దొరుకుతారే! ఇంక కేవలం ఒక్క ఉత్తరం రాయడంకోసం నీకు బ్రహ్మసమాజస్థులపిల్లని పెళ్లి

చేసుకోవలసిన అగత్యమేమీలేదు! అదీగాక నీ కేదైనా కారణంవల్ల కాలూ చెయ్యీ వంగితే ఈబ్రహ్మసమాజంవాళ్ళ పిల్ల వంటచేసి కాస్త చారూ అన్నం పెట్టగలదా? నీ కేదైనా జబ్బుచేస్తే పరిచర్య చెయ్యగలదా? ఆపిల్లలకి చిన్నప్పటినుంచీ ఇల్లాంటివి చెయ్యడం నేర్పుతారా? భగవంతుడిదయవల్ల అల్లాంటిరోజులు రాకూడదనే అనుకుందాము. ఒకవేళ వస్తే మాత్రము, ఆపిల్ల నిన్ను విడిచిపెట్టి తప్పకుండా తనదారిని తను పోతుంది. అల్లా వెళ్ళకపోతే నువ్వు నన్ను ఏపేరుపెట్టి పిలిచినా పిలువద్దువుగాని!

మహిముడు అల్లాగే ఏమీ మాట్లాడకుండా ఊరుకున్నాడు. సురేశుడు మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు.

"మహిమా—నేనుపొరబాటునైనా నీకు అయిష్టమైనపని చెయ్యనని నీకు తెలుసును! నేను బ్రహ్మసమాజంలో అనేకమంది స్త్రీలని చూశాను! ఒకళ్ళిద్దరు మంచివాళ్ళుంటే ఉండవచ్చును! అందులో పెద్ద విశేషం ఏమీలేదు! కాని మనహిందువుల ఇళ్ళల్లోని పిల్లలికీ, వాళ్ళకీ, పోలికేలేదు! అయితే, నువ్వు పెళ్ళిచేసుకుందామనుకుంటే కాని నాతో చెప్పావుకావేం! సరే పోనీలే? అయిందేదో అయిపోయింది! ఇంక నువ్వక్కడికి వెళ్ళవలసిన జరూరు ఏమీలేదు! ఇదుగో! నేను నీకు మాట ఇస్తున్నాను. ఒకనెల రోజులలోపుగా నేను నీకొక మంచి సంబంధం వెతికి వివాహంచేస్తాను. నేనుచెప్పిన సంబంధం చేసుకున్నావంటే బ్రతికి ఉన్నంత కాలమూ సుఖంగాఉండవచ్చును! ఏవిధమైన బాధాపడక్కరలేదు! ఒకవేళనేను చెప్పినట్లు ఒకనెలరోజుల లోగా సంబంధంకుదర్చ లేకపోతే, నీకు ఎల్లాగతోస్తే అల్లాగ చేద్దువుగాని! ఈబ్రహ్మసమాజం పిల్ల పాదపద్మాలకే నమస్కరిద్దువుగాని! నే నేమీ అడ్డు పెట్టను! కాని ఈ నెలరోజులూమాత్రం నువ్వు ధైర్యంగా ఉండి, చిన్నతనంనించీ మనకున్న స్నేహం సంగతి ఆలోచించాలి! ఏం? అంతవరకూ

ఆగుతావా!"

మహిముడు మొట్ట మొదట ఉన్నట్టుగానే అల్లాగే మౌనంగా ఉండి పోయాడు. అతను ఔనని గాని, కాదనిగాని ఏమీ సమాధానం చెప్పలేదు! కాని తన మిత్రుడు తనకోసం ఎంతగాఢమైన వేదన అనుభవిస్తున్నాడో తెలిసింది.

సురేశుడు మళ్లీ చెప్పడం ప్రారంభించాడు.

"మహిమా! నీకు జ్ఞాపకం ఉందా? నువ్వు బ్రహ్మసమాజస్థుడవు కాకపోయినా నాటి మాటికీ బ్రహ్మమందిరంలోకి వెడుతూఉండే వాడవు? నే నప్పడు అన్యమానమూ అల్లా వెళ్ళవద్దని చెప్పానా! లేదా? ఇంతమహాపట్టణంలోనూ నీకు ఒక్క హిందూ దేవాలయమైనా కనబడలేదూ? ఆహిందూ దేవాలయంలోకి వెడితే ఈవిధమైన కపటనాటకం ఆడడానికి అవసరం లేకపోవునుగదా! నువ్వు ఇల్లాగ ఏదో వల్లోపడిపోతావని, నేను అప్పుడే అనుమానించాను!"

ఆమాటమీద మహిముడు కొంచెం నవ్వి ఇల్లా సమాధానం చెప్పాడు?

నరే! నువ్వు ఏదోఅనుకున్నావు కాని నేను నాప్రవర్తనలో కపటం ఉందని ఎప్పుడూఅనుకోలేదు! దానికేంగాని సురేశా? నిన్నొక మాట అడుగుతున్నాను! నీకసలు భగవంతుడిమీదే నమ్మకంలేదుగదా! అల్లాంటప్పుడు హిందూ దేవతల్ని ఎందుకు అంగీకరిస్తావు? ఈపరిస్థితుల్లో నేను బ్రహ్మమందిరంలోకి వెళ్లినా, హిందూ దేవాలయంలోకి వెళ్ళినా నీకు ఒక టేగా!"

సురేశుడు మళ్ళీదృఢమైన కంఠస్వరంతో ఇల్లాగఅన్నాడు.

"భగవంతుడనేవాడు అసలులేనేలేడు! నేను ఉన్నాడని ఎప్పుడూ అంగీకరించను! ఈభగవంతుడూ ఈ దేవతలూ ఇవన్నీ ఒట్టికల్పనలు! కాని మనకళ్లకి కనబడేమానవసంఘం అంటేమాత్రం నాకుగౌరవంఉంది.

అందుకనే నేనుమాఉన్నాణ్ణి పూజిస్తాను. మానవసేవ చెయ్యడంవల్లనే మనుష్యునిజన్మ సార్థకం అవుతుందని నా అభిప్రాయము! హిందూ సంఘంలో పుట్టాను కాబట్టి హిందూసంఘం ఉద్ధరించడం నావిధి! నా ప్రాణాలు పోయినాసరే! నిన్ను బ్రహ్మసమాజంవాళ్ళ పిల్లని పెళ్లిచేసుకో నివ్వను! అసలింగా బ్రహ్మసమాజం అభివృద్ధికావడం నాకిష్టంలేదు! కేవారమిత్రుక్కినారి అమ్మాయిని వివాహంచేసుకుంటా నని నువ్వు మాట ఇచ్చావా?"

మహిమను——లేదు! మాటఇవ్వడం అనేది ఇంతవరకూ జరగలేదు.

సురేశుడు——ఇవ్వలేదా? సరే! మంచిపనిచేశావు. ఇప్పుడు ఏమీ అనకుండా మాట్లాడకూరుకో. నే నీనెలాఖరులోగా నే నీకువివాహం చేయిస్తాను.

మహి——నేను వివాహంకోసం పరితపించిపోతున్నానని నీతో ఎవరైనా చెప్పారా?......నువ్వుకూడా కొంతకాలం మాట్లాడకూరుకుంటే, ఇంకనాకు వివాహం కావడమే కష్టమైపోతుంది.

సురేశుడు——ఏం? ఎందుకై పోతుంది? ఏం చేశావు? నువ్వు ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నావా?

మహిమను——ఇందులో నువ్వింతగా ఆశ్చర్యపడవలిసిన విషయం ఏమీ లేదు! కాని, నువ్వు ఆ అమ్మాయి విషయంలో మాత్రం మర్యాదగా మాట్లాడు!

సురేశుడు——మర్యాదగా మాట్లాడడం నాకు తెలుసును! నువ్వు చెప్పక్కర్లేదు! అయితే ఆ అమ్మాయికి వయస్సెంత ఉంటుందని అడగవచ్చునా?

మహిమను——నాకు తెలియదు.

సురేశుడు——తెలియదూ? ఇరవయ్యో, ఇరవయ్యైదో, ముప్ఫయ్యో, నలభయ్యో.——లేకపోతే, అంతకంటే ఎక్కువో——ఏమీ తెలియదూ?

మహిముడు—తెలియదు.

సురేశుడు—నీకంటె చిన్నదా? పెద్దదా? బహుశా అదికూడా ఎరగ వనుకుంటాను!

మహిము—తెలియదు.

సురేశుడు—నిన్ను వల్లో వేసుకుంటుందంటే మరీ చిన్నపిల్ల అయిఉండదు! ఇల్లాగ అనుకోవడం ఏమీ అసందర్భం కాదనుకుంటాను! ఏమంటావు?

మహిము—సరేలే! ఏదీ ఏదీ అసందర్భంకాదు! సరే! దానికేం గాని, నాకు కొంచెం తొందరపనిఉంది వీధులోకి వెళ్లాలి.

సురేశుడు—సరే! మహిమా! నాక్కూడా యిప్పుడు పని ఏమీలేదు నడు! నీతోకూడా కొంతదూరంవస్తాను.

స్నేహితులిద్దరూ కలిసి వీధులోకి వచ్చారు. కొంచెందూరం నిశ్శబ్దంగా నడిచిన తరవాత, సురేశుడు మెల్లిగా "తెలిసి ఉండీ కూడా నే నీవేళ నీమనస్సు చాలా కష్టపెట్టాను, ఈమాట నీ కంతగా విడమర్చి చెప్పవలిసిన అవసరం లేదనుకుంటాను" అన్నాడు.

మహి—లేదు.

సురేశుడు మళ్ళీ ఆవిధంగానే మృదుస్వరంతో "సరేగాని నిన్నెందుకు బాధపెట్టానో తెలుసునా?" అన్నాడు.

మహిముడు నవ్వి "అసలు విషయం నువ్వు నాకు విడమర్చి చెప్పక పోయినా నే తెలుసుకునిఉండేవాణ్ణే! అందుచేత ఈవిషయంకూడా అట్టే మరీమరీ చెప్పవలిసిన అవసరం ఉండ దను కుంటాను" అన్నాడు.

మహిముడూ సురేశుడూ చెట్టాపట్టాలు పట్టుకుని నడుస్తున్నారు. సురేశుడు ఎంతో ఆప్యాయంగా అతనిచెయ్యిగట్టిగా నొక్కిపట్టుగుని "కాదు! మహిమా! నేను నీ కేమీనచ్చచెప్పాలని అనుకోవడంలేదు. ఎవరైనా నేను చెప్పేదానిలో తప్పు పట్టుకోవచ్చును గాని నువ్విల్లాగ

తప్పు పట్టుకునే వాడవు కాదు. మళ్ళీ ఇంకొక్కసారి ఉన్నమాటేదో నీముఖంమీదే అనేస్తున్నాను. నేను ప్రేమించినదానిలో సగమైనా నువ్వు నన్ను తిరిగి ప్రేమించలేవు. నువ్వు ఆట్టే కష్టసుఖాలు లెక్కపెట్టేవాడవు కాదు; కాని, నువ్వు దుఃఖపడుతుంటే నేను చూసి సహించలేను. మనచిన్నతనంలో ఒకసారి ఈమాటమీద మనిద్దరికీ ఎంతతగాదాలయిందో జ్ఞాపకం తెచ్చుకో! ఇప్పుడు ఇంత కాలానికి ఎవరికోసం నన్ను విడిచిపెట్టదలుచుకున్నావో వారివల్ల నువ్వు సుఖపడగలిగితే నాకష్టం నేనంతగా లెక్కపెట్టను. ఎంతదుఃఖమైనా నవ్వుతూ సహించగలను; పైకి ఒక్కమాటైనా అనను" అన్నాడు.

మహిముడు "ఈవివాహంవల్ల నేను సుఖపడకపోతే సుఖపడక పోవచ్చును. గాని నిన్ను విడిచిపెట్టేస్తానని ఎల్లాగ అనుకున్నావు?" అన్నాడు.

సురే—నువ్వు నన్ను విడిచిపెట్టినా విడిచిపెట్టకపోయినా, నేను నిన్ను విడిచిపెట్టేస్తాను.

మహిము—ఎందుచేత? బ్రహ్మసమాజంలో కలిసినా నేనునీకు స్నేహితుణ్ణి కావచ్చునుగా!

సురే—వల్లకాదు; ఎప్పటికీ వల్లకాదు! బ్రహ్మసమాజస్థులంటే నాకుకిట్టదు. నాకు బ్రహ్మసమాజస్థుడు ఒక్కడూ స్నేహితుడులేడు.

మహిము—నీకు వాళ్లంటే కిట్టకపోవడానికి కారణంఏమిటి?

సురే—చాలా కారణాలున్నాయి. ఒకటేమిటంటే—వాళ్లు మన సంఘం చెడ్డదని విడిచిపెట్టేశారు. అలాంటివాళ్ళని "మంచివా" ళ్లని నేను ఏవిధంగానూ కూడా దగ్గిరికి తీసుకోలేను; వాళ్లంతా మనసంఘం నీచమైనదనిమనదేశంలోనూ ఇతరదేశాల్లోనూకూడా యాగీ చేస్తున్నారు. వాళ్లు మంచివాళ్లయితే కావచ్చును. కాని మనకి మాత్రం వాళ్లు శత్రువులు!

మహిముడి కీమాటలు వింటూంటే అంతకంతకి విసుగు ఎక్కువవడం మొదలు పెట్టింది. చివరికతను "అయితేఇప్పుడునువ్వు నన్నేం చెయ్యమంటావు?" అన్నాడు.

సురేశు—ఇదిగో! అదే! ఇందాకటినించీ నేనుచెబుతూ వస్తున్నాను.

మహిము—సరే! ఆచెప్పేదికూడా పూర్తిగా చెప్పి వేసెయ్యి!

సురేశు—ఏమైనాసరే, ఈవిడ మీదప్రేమ నువ్వు విడిచిపెట్టవలిసి ఉంటుంది. కొంచెము ఇంచుమించుగా ఒక నెలరోజులుదాకా నువ్వామెను కలుసుకోడానికి వీలుండదు.

మహిము—ఒక వేళ నే నామెను విడిచిపెట్టలే ననుకో! నా కామెమీద మోహంకంటె అతిరిక్తమైన ప్రేమ ఉందనుకో! దానికి నువ్వేమంటావు?

సురేశుడు కొంచెము సేపు ఆలోచించి ఇల్లాఅన్నాడు.

"మహిమా! ఇప్పుడు నే నా గొడవలేమీ ఆలోచించడంలేదు. నాకు నువ్వంటే ఎంతో ప్రేమ అన్నసంగతిమాత్రంనాకు తెలుసును. నాసంఘంమీద నాకంతకంటె గొప్పప్రేమఉంది. అదీగాక నువ్వొక్కసారి, నీకు చిన్నతనంలో మసూచికంరావడం, మనం ఇద్దరం గంగానదిలో నావెక్కి నప్పుడు అదిమునగడం, చచ్చిపోతున్నామనుకోడం, అప్పటిఅవస్థా అవన్నీ తలుచుకో! మహిమా! ఈమరిచిపోయినసంగతులన్నీ జ్ఞాపకం చేసినందుకు నన్నుక్షమించ మనిప్రార్థిస్తున్నాను. ప్రస్తుతం నేను చెప్పవలిసిందేమీ లేదు" ఆతరవాత చటుక్కుని వెనక్కుతిరిగి, సురేశుడక్కడినించి అతితొందరగా వెళ్లిపోయాడు.

3

సురేశుడిహృదయంలో ఒకతీవ్రమైన ఉద్వేగం ఉన్నట్లే, అతి మార్దవమూ స్నేహస్వభావమూ కూడా ఉన్నాయి. పరిచితులకిగాన్ని

అపచితులకిగాని, ఎవరికైనా కష్టంవచ్చిందనే మాటవింటే, అతనికి కళ్ళ మ్మట నీళ్లుగిర్రున తిరుగుతాయి. అతని చిన్నతనంలో దోమలూ ఈగలూ మొదలైన క్షుద్రప్రాణుల్నికూడా చంపలేకపోయేవాడు. సరీగ్గా జైనులూ మార్వాడీలూమోస్తరుగా అతను కొన్నాళ్ళు జేబునిండా పంచదారపోసుకుని, చెట్లకింద తిరిగేచీమలకి పెట్టేవాడు. ఇంతేకాదు: చిన్న తనంలో అనేకసారులు అతను మత్స్య మాంసాలు తినకూడదని ప్రతిజ్ఞపట్టాడు; కాని ఏ లాభము? మళ్ళీకొన్నాళ్ళకి మానేస్తూండేవాడు. అతను ఇల్లాగఎన్నిసార్లు ప్రతిజ్ఞపట్టాడో చెప్పడం కష్టం! అతనుఎంతెంతమందికి ఎన్నెన్ని ఉపకారాలు చేశాడో లెక్కలేదు! వాటివిషయం అతనికి జ్ఞాపకమే ఉండదు! స్కూలులోఉన్న అందరిలోనూ మహిముడుచాలామంచివాడు. అతనెప్పుడూ చిరిగి పోయినబట్టలు కట్టుకుంటూఉండేవాడు. ఊడిపోతూఉండే జోళ్ళు తొడుక్కునేవాడు. అతనిశరీరం చిక్కి శల్యంలాగఉండేది. ముఖం ఎప్పుడు చూసినా వాడిపోయిఉండేది. ఈ అన్నికారణాలవల్లా సురేశుడికి అతనంటే ఎక్కువ ఇష్టం కలిగింది. కొద్దిరోజుల్లోనే వారిద్దరిస్నేహమూ వరదనీరులాగ వృద్ధిపొందింది.ఆరోజుల్లో దాన్నిగురించి ఆస్కూల్లోవా ళ్ళంతా ఎంతోవింతగా చెప్పుకునే వారు. మహిముడికి నాలుగురూపాయల స్కాలరుషిప్పు దొరికింది. కేవలం దానిమీద ఆధారపడి అతనుకల కత్తా వచ్చాడు. ఆపైన తనపల్లెటూరినుంచివచ్చి కలకత్తాలో స్థిరపడిన ఒకసామాన్యవు వర్తకుడిదగ్గిరగుమాస్తాగా కుదురుకుని ఆ ఆసరామీద కాలేజీలోచేరాడు. అప్పటినుంచీ కూడా సురేశు డతన్ని తీసుకొనివెళ్ళి తన ఇంట్లో ఉంచుకోడానికి ప్రయత్నంచేస్తూనే ఉన్నాడు. కాని ఏవిధంగానూకూడా అతన్ని ఒప్పించలేకపోయాడు. మహిముడు ఇక్కడే ఉండి, ఒకపూట తినీ, ఒకపూటతినకుండానూ ఎల్లాగో అల్లాగ కాల క్షేపంచేస్తూ, మొత్తంమీద కష్టపడి, ఎంట్రన్సుపరీక్ష పాసయ్యాడు.

ఆతరవాత జరిగినకథంతా మనం మొదటి ప్రకరణంలో చదువుకున్నాము.

ఆతరవాత ఒకవారం గడిచిపోయింది. మళ్ళీ సురేశుడికి సుహాసుడెక్కడా కనబడలేదు. అందుచేత అతను మళ్ళీ సుహాసుడిబసలోకి వెళ్ళిచూశాడు. ఆవేళ ఏకోపంగా అవడంచేత స్కూలుకి కాలేజీకీ కూడా సెలవువచ్చింది. బసలో పర్యాప్తుచేసినమీదట, అతడు ప్రొద్దున్నే లేచి ఎక్కడికో వెళ్ళాడనిన్నీ ఇంతవరకూ కూడా తిరిగి రాలేదనిన్నీ తెలిసింది. అందుచేత అతను కేదారముఖర్జీగారి ఇంటికి వెళ్ళి సెలవు రోజు కులాసాగా గడుపుతూ ఉండి ఉంటాడని సురేశు డనుకున్నాడు. ఆవిషయంలో అతనికి కొంచెమైనా సందేహంకలగలేదు!

ఈసిగ్గులేనిమనిషి చిన్నతనంనించీ వస్తూన్న స్నేహానికి సంబంధించిన మర్యాదంతా ఒకక్షణంలో విడిచిపెట్టి ఒకసామాన్యస్త్రీ మోహపాశంలో తగులుకున్నాడు. అధమపక్షం ఒకవారం రోజులైనా ధైర్యంగా ఉండలేకపోయాడు. ఒక్కపరుగుపెట్టి కేదారిముఖర్జీగారి ఇంట్లోకి వెళ్ళి కూర్చున్నాడు! ఈసంగతులన్నీ తలుచుకునేసరికి సురేశుడిమనస్సులో సుహాసుడిమీద ఒకదారుణమైన విద్వేషాగ్ని ప్రజ్వలించింది. అతను ఒక్కక్షణకాలంలో ఏమీ ఆలోచించకుండా ఒక బండి కుదుర్చుగుని, అందులో ఎక్కి, తిన్నగా వెళ్ళి కేదారముఖర్జీగారిఇంటి దగ్గర ఆపమని చెప్పాడు. బండిలో వెడుతూ సుహాసుడితో "ఓరి సిగ్గుమాలినవాడా! ఓరి కృతఘ్నుడా ఎంతపనిచేశావు! నువ్వు నీ ప్రాణాలు ఈస్త్రీపాదాలదగ్గిర అర్పిస్తే, ధన్యుణ్ణవుతానని అనుకుంటున్నావు! అసలీప్రాణాలు ఎక్కడివి? తనప్రాణాలైనా లెక్క చెయ్యకుండా రెండుసారులు నీప్రాణాలెవరు రక్షించారు? ఆవిషయంలో నువ్వుకొంచెమైనా కృతజ్ఞత చూపించావా?" అని అందామని నిశ్చయించుగున్నాడు.

కేదారముఖర్జీ ఉంటూాన్న వీధి సురేశుడికి తెలుసును. ఒకటిరెండుసార్లు ఆపక్కనున్న వాళ్ళని కనుక్కొని ఎల్లాగయితేం ఆబండివాడు బండి కేదారి ముఖర్జీగారి ఇంటియెదురుగుండా నిలబెట్టాడు. బండిలోనుంచి దిగి సురేశుడు అక్కడఉన్న ఒకనౌకర్ని అడిగి మేడమీద నలు గురూకూచునే గదిలోకి వెళ్ళికూచున్నాడు.

అక్కడ, తివాసీమీద వేసిన కుర్చీమీద తలగడా కానుకుని ఒకవృద్ధుడు కూర్చున్నాడు. ఆయన పత్రికచదువుతూ సురేశుడి కేసి చూశాడు. సురేశుడు ఆయనకి నమస్కారంచేసి, "నాపేరు సురేశచంద్రబెనర్జీ; నాకూ మహిముడికీ స్నేహం." అని తన సంగతి తెలియజేశాడు.

ఆవృద్ధుడు మళ్ళీ నమస్కారం చేసి, కళ్ళజోడుతీసి కింద పెడుతూ "కూర్చోండి" అన్నాడు. సురేశుడు కూర్చుంటూ "మహిముడి బస లోకివెళ్ళి దర్యాప్తుచేసి కనుక్కుంటే అతనిక్కడికి వచ్చాడని తెలిసింది. అందుచేత ఇక్కడికివస్తే, ఈవిధంగా మీతోపరిచయముంకూడా కలుగు తుందని ఇల్లాగవచ్చాను" అన్నాడు.

వృద్ధుడు "మీరు రావడంవల్ల నాకుచాల సంతోషంగా ఉంది. కాని మహిము డిక్కడికి పదిపదిహేను రోజులనించి రావడంలేదు. మేము ఈవేళపొద్దున్నే అతను ఎక్కడున్నాడో తెలుసుకోవడం ఎల్లాగా? అని అనుకున్నాము" అన్నాడు.

సురేశుడికి చాలాఆశ్చర్యం వేసింది. అతను "కాని అతని బసలో వాళ్ళంతా—"అన్నాడు. వృద్ధుడు "బహుశా, మరెక్కడకైనా వెళ్ళి ఉంటాడు సరే! బాగుంది! మీమాట విన్నాక నామనస్సు నిశ్చింతగా ఉంది" అన్నాడు.

దోవలో బండిలో వస్తూవస్తూ సురేశుడు మహిముడికి చెప్ప వలిసినమాటలు నాలుగూచెప్పి తీరాలనినిశ్చయించుకున్నాడు; కాని

ఆవృద్ధుడి ప్రశాంతమైన ముఖమూ, ఆమృదువైన కంఠస్వరమూ ఆమాటలూ అన్నీకలిసి, అతని ఆవేశం బాగా తగ్గించివేశాయి. అయినా గాని అతను తనసంకల్పం మరిచిపోలేదు. లోలోపల వీళ్ళు ఎంతమంచివాళ్ళయినా బ్రహ్మసామాజికులే! వీళ్ళఆచారం అంతా కేవలం నటన! వీళ్ళు ఈనటనవల్ల తెలివితక్కువవాళ్ళ నందరినీ మోసగించి, తమపనులన్నీ నెరవేర్చుకుంటున్నారు. అందుచేత ఈకిరాతులదగ్గిర తన్మయత్వం చేత ఒళ్ళు మరిచిపోయి కూర్చుంటే ఏమీలాభంలేదు! ప్రయత్నంచేసి వీళ్ళచేతుల్లోనుంచి స్నేహితుణ్ణి రక్షించి తీరాలి" అని తాపాలూ నిరసనలూ సాగుతూ కూర్చున్నాడు. కొంతసేపటికి అతను ఒకనిశ్చయానికి వచ్చి "మహిముడు నాకు బాల్య స్నేహితుడు. మీఆజ్ఞ అయితేఅతని విషయంలో రెండు మూడు మాటలు చెప్పాలని అనుకొంటున్నాను; చెప్పనా?" అన్నాడు.

వృద్ధుడు కొంచెం నవ్వి "అయ్యో! ఎంతమాట! అభ్యంతరం ఏమిటి! చెప్పండి! ఆయన మీపేరు ఒకసారి చెప్పగా విన్నాను కూడాను" అన్నాడు.

సురేశుడు "మీఅమ్మాయికీ మహిమునికీ వివాహం నిశ్చయమైపోయిందా?" అన్నాడు.

వృద్ధుడు "ఆఁ! ఒకవిధంగా నిశ్చయం అయిపోయినట్టే అనుకోండి!" అన్నాడు.

సురేశుడు—"అయితే మహిముడు బ్రహ్మసమాజంలో చేరలేదుగదా! మరి అతనికి మీఅమ్మాయినిచ్చి వివాహం చేస్తారా?" అన్నాడు. వృద్ధుడేమీ అనకుండా మాట్లాడక ఊరుకున్నాడు. సురేశుడు "సరే! ఆమాట అల్లాగ ఉండనియ్యండి! కాని, అతని ఆస్తిపాస్తులు ఎల్లాంటివి? పెళ్ళాన్నీ పిల్లల్నీ పోషించుకునేయోగ్యత ఉందా? లేదా! ఒకపల్లెటూళ్ళో, కేవలం హిందువు లందరికీమధ్యన

నగం నగం కూలిపోతూన్న మట్టికొంపలో మీఅమ్మాయి కాపరం చెయ్యగలదా? చెయ్యలేదా? ఒకవేళ వాళ్లందరికీ మధ్యన ఉండలేక పోతే సుహితుడు దేమన్నా మరోదారి చూడగలడా? చూడలేడా?" అని ఈవిషయాలన్నీ మీరేమైనా ఆలోచించారా?" అనిఅడిగాడు.

కేదారముఖర్జీ నిటాగ్గా కూర్చుని "లేదు! ఈవిషయాలేవీ నాకు తెలియనే తెలియవు! అతనుకూడా నాతోటి ఈమాట లెప్పుడూ చెప్పనేలేదు" అన్నాడు.

సురేశుడు "కాని నే నీవిషయాలన్నీ బాగాఆలోచించాను. ఒకసారి సుహితుడితోకూడా చెప్పాను. కొంతవినడానికికష్టంగాఉన్నా ఈవిషయాలన్నీ సంప్రతించడానికే, మీదగ్గిరికి వచ్చాను. మీ అమ్మాయి వివాహంలో మీరీ విషయాలన్నీ ఆలోచించిచూడండి. నాస్నేహితుడు మాత్రం ఈపూచీలన్నీ తననెత్తిమీద వేసుకుని, బతికిఉన్నంతకాలము ఆబరువులతో కుంగిపోతూ బాధపడడానికి నేను బొత్తిగా అంగీకరించను" అన్నాడు.

కేదారబాబు ముఖంమీద కత్తివేటు వేసినా నెత్తురులేదు. అతను అల్లాగ కొంతసేపుండి "మీరు ఏమిటిఅంటున్నారు సురేశ బాబూ!" అన్నాడు.

"నాన్నగారూ" అనిపిలిచి ఒకపదహారు పదిహేడేళ్ల బాలిక చటుక్కున గదిలోకివచ్చింది. తండ్రిగారిదగ్గిర ఒకఅపరిచితు డైనయువకుణ్ణి చూసిఆమెచటుక్కున నిలబడిపోయింది.

"ఎవరు? అచలా! నువ్వా! రాఅమ్మా! సిగ్గుపడడం ఎందుకు? ఈయన మనసుహితుడికి చాలా దగ్గిరస్నేహితులు!"

అచల కొంచెముందుకి వచ్చి, రెండుచేతులూజోడించి నమస్కారం చేసింది. సురేశుడు ఆమెకేసి చూశాడు.

ఆమెఆకారము ఎంతోఉజ్వలమైన శ్యామలవర్ణంతో తళ తళ

లాగుతూంది. శరీరం సళ్ళాకులా సన్నంగా ఉంది. చెక్కిళ్ళు, చుబుకమూ, పెదవులూ, ఎంతో సునోహరంగానూ సుకుమారంగానూ ఉన్నాయి. ఆమెదృష్టిలో ఒకవిధమైన స్థయిర్యం కనిపించింది. ఆమె ఆవిధంగా నమస్కారం చేసి అక్కడే నుంచుండి పోయింది. సురేశు డామె ముఖంవైపు చూసి ఒక్కక్షణంలో పరమానందభరితుడై పోయాడు. మళ్ళీ కేదారబాబు చెప్పడంప్రారంభించాడు; "అతనిసంగతి విన్నావా! అమ్మా! అతను రాత్రికేసుని మనం ఇక్కడ బెంగపెట్టు కుని చచ్చిపోతున్నాము! ఇదిగో! ఈయన చెబుతున్నారువిను! ఈ యన అతనికి చాలాదగ్గిరస్నేహితులు. అందుకనే అతనిసంగతి చెప్పడానికి ఇక్కడికివచ్చారు. ఈయన రాకపోతే ఏంకావాలి చెప్పు! అతను ఇంత విశ్వాసఘాతకుడనీ ఇంతదగాకోరనీ ఎవరికి తెలుసును! అతనికి స్వంతగ్రామంలో సగం సగంపడిపోతూన్న ఇల్లొక్కటిఉందిట! అదైనా మట్టికొంపట! అతనికే కట్టగుడ్డా తినతిండీ లేన ప్పుడు ఇంక నిన్నేం పోషిస్తాడు! అబ్బా! ఎంత భయంకరమైన వ్యక్తి! ఇల్లాంటి మనిషికికూడా లోలోపల అంతవిషం!"

ఈమాటలు వినీవినడంతోనే అచల తెల్లబోయింది. సురేశుడి ముఖంకూడా నల్లబడిపోయింది. అతను ఏమీమాట్లాడకుండా, కర్రబొమ్మలాగ అచలకేసిచూస్తూ అల్లాగే కూర్చుండి పోయాడు.

## ౪

సురేశుడికి అతనుఅన్నమాట లన్నీవెళ్ళి అచలహృదయంలో బా కుల్లా నాటుకున్నాయని అనిపించింది. కాని కేదారబాబు మాత్రము ఈవిషయం కొంచెమైనా గమనించలేదు. కాని ఆమె ఏదోకొంచెం కంగారుపడుతూన్నట్లు గమనించి ఇల్లా చెప్పడం ప్రారంభించాడు.

సురేశబాబూ! మీరు, ఒకదగ్గిరస్నేహితుడు తనవిధికృత్యం ఎల్లాగనెరవేర్చాలో అల్లాగనెరవేర్చారు. పొరబాటువల్లనైనా మేము

మీారన్న మాటలు అన్యథాభావించకు. మీరు నాకు చెప్పింది కొంచెంమనస్సులో కష్ట కలిగించినమాట! ఈవిషయం అతనికి కూడా కష్టంగానేఉంటుంది. కాని మీారు ఉన్నదేదో ఉన్నట్టు చెప్పేసేశారు. సహజంగా నిజమైనప్రేమఉంటే ఇదే! జ్వరంవచ్చినపిల్లకి తల్లి అన్నంపెట్టడంమానేస్తుంది. కానైతేం అదితల్లికి కష్టంగానేఉంటుంది. అయినాగాని ఆపనిచెయ్యకతప్పతుందా? సురేశబాబూ! ఉన్నమాట ఏదోఉన్నట్టు చెబుతున్నాను. మహిముడు కూడా మమ్మల్ని ఇంత మోసంచేస్తా డనిమేము కల్లోనైనా అనుకోలేదు. ఇంచు మించుగా రెండేళ్ళపూర్వము బ్రహ్మసమాజంలో అతనిమాటలూ అతనిధోరణీ చూసి నేనెంతోఆనందపడి, స్వయంగా ఎంతోగౌరవంగా అతిన్ని మాయింటికి తీసుకునివచ్చి మాఅమ్మాయితో పరిచయం కలిగించాను. అప్పుడు ఇత నింతమోసం చేస్తాడని నాకేం తెలుసును! అయ్యో! ఇల్లాంటిదగామనిషిని నేను ఇంతవర కెప్పుడూ చూడలేదు. ఇల్లా చెబుతూ చెబుతూ కేదారబాబు లోపలిఆవేశం పట్టలేక, లేచినుంచుని ఇటూ అటూపచారుచెయ్యడం ప్రారంభించాడు.

సురేశుడూ అచలా ఇద్దరూ తలవంచుకుని ఏమీఅనకుండా ఊరుకున్నారు. కేదారబాబు ఒక్కసారిగా నిర్భ్రాంతపోయి నుంచుని చటుక్కుని అచలతో ఇల్లాఅన్నాడు "వీల్లేదు, ఇదిజరగడానికి వీల్లేదు! ఎంతమాత్రం జరగడానికి వీల్లేదు! సురేశబాబూ!! మీారు అన్నిటికంటే మీావిధినిర్వహణానికి అగ్రస్థానంఇచ్చి మీాన్నేహధర్మం నెరవేర్చడానికి ఇక్కడికివచ్చారు. ఆవిధంగానేతండ్రినైన నాకుకూడా ఒకకర్తవ్యం ఉంది. ఆకర్తవ్యం నేనునెరవేర్చుకుంటాను! అచలకీ మహిముడికీ సంబంధం కొంచెం చాలాదూరందాకానే నడిచింది. అది నా కళ్ళారామాశాక ఏమీా కార ణంలేకుండా దేవిడీమన్నాచెయ్యడం బాగుండదు. అందుచేత దీనికి మనకి ఒకగట్టిసాక్ష్యం దొరకాలి. సురేశబాబూ! మేము మీామాట

నమ్మదగినదని అనుకోకండి. కాని ఇది నాకు ముఖ్యంగా తెల్సుకోవలిసిన విషయం! ఏమమ్మా! అచలా! ఏమంటావు? ఈ విషయంలో మనకి ఏదైనా, ఒక నిశ్చితమైన ప్రకారం కలిగితేనేగాని ఏమీ చెయ్యడానికి వీలుండదు."

అచలా సురేశుడూ అల్లాగే కూర్చుండిపోయారు. ఇది మంచిదని గాని చెడ్డదని గాని ఏవిధమైన అభిప్రాయమూ కూడా పైకి చెప్పలేదు. కేదారబాబు ఒక్క క్షణం ఆగి మళ్ళీ ఇల్లాగ అన్నాడు. "కాని సురేశబాబూ! ఈ విషయంలో సరియైన ప్రమాణం ఇచ్చి మాకు నమ్మకము కలిగించేపూచీ మీ మీదే ఉంది. మహిముడి ఇంటి వ్యవహారాలమాట అల్లాగ ఉండనీయండి! అతని పల్లెటూళ్ళో అతని ఇల్లెక్కడ ఉందో కూడా మాకు తెలియదు."

ఇంతలో నౌకరు లోపలికి వచ్చి "కింద వినాసబాబుగారు కూర్చున్నారండి" అన్నాడు.

ఆమాట వినేటప్పటికి కేదారబాబు ముఖం నల్లగా మాడిపోయింది. ఆయన ఒక్క నిమిషం ఊరుకుని, ఈ వేళ ఆయన వస్తారని అనుకోలేదే! సరేలే ఇదిగో! నేను వస్తున్నా నని చెప్పు!" అన్నాడు. ఆపైన మళ్ళీ సురేశబాబు కేసి తిరిగి,

"సురేశబాబూ! నన్ను మీరొక్క అయిదారు నిమిషాల దాకా క్షమించాలి. కొంచెం వెళ్ళి ఆయన్ని పంపించి వచ్చేస్తాను. తీరా వచ్చాక కలుసుకోకుండా పంపించివేస్తే బాగుండదు. అమ్మా! అచలా! సురేశబాబుగారిని నీ కెంతో దగ్గిర స్నేహితులుగా చూసుకో! తెలుసుకోవలసిన విషయా లేమైనా ఉంటే నువ్వే ఆయన దగ్గిర్నించి తెలుసుకోవచ్చును. నేను ఇప్పుడే వస్తాను" అని చెప్పి కిందికి వెళ్ళిపోయాడు.

అప్పుడు ఒక్క క్షణంలో వారి నాలుగు కళ్లూ కలిసిపోయాయి. ఆ ఉత్తర క్షణంలో వారిద్దరూ మళ్ళీ తలలు వంచుకున్నారు. ఆతర

వాత అల్లాగ ఒక్క. నిమిషం ఉండి సురేశుడు మెల్లిగా "మేమిద్దరమూ చిన్ననాటి స్నేహితులము. కాని అతను చేసిన దాన్నిబట్టి నేను సిగ్గుచేత మీ మొగము కూడా తల ఎత్తుకోలేక పోతున్నాను" అన్నాడు.

అచలమ్మ మృదుస్వరంతో "వారి విషయంలో మీరు సిగ్గుపడవలసిన అవసరం ఏమీ లేదు" అంది.

సురేశుడు "మీరిల్లాగ అంటారేమిటి! అతనిల్లాంటి కపట నాటకం ఆడి, కేవలం నాస్తికుడిలాగ వ్యవహరించిన తరవాత. స్నేహితుణ్ణి ఉండికూడా నేను సిగ్గుపడకుండా ఎల్లా ఉండగలను? ఈ విషయంలో నేను సిగ్గుపడకపోతే మరెవ్వరు సిగ్గుపడతారు? ఎప్పుడైతే మహిముడు నాతో ఏమీ చెప్పకుండా తనలో తను స్వయంపాకము మొదలుపెట్టాడో, అప్పుడే నేను ఇందులో ఏదో తమాషా ఉందని గ్రహించి ఉండవలసింది" అన్నాడు.

అచల "మేము బ్రహ్మసమాజికులము. అయితే మీరు మా సమాజంతో ఏవిధమయిన సంపర్కమూ కూడా పెట్టుకోడానికి ఇష్టపడలేదు కాబట్టి ఆయన బహుశా ఈ విషయం మీతో చెప్పి ఉండరు" అంది.

అతనికి ఆ సమాధానం బాగుండలేదు. అచల తన ముఖం ఎదట మహిముడు చేసినది సమర్థిస్తుందని అతను ఊహించలేకపోయాడు. అందుచేత అతను నిరుత్సాహపోయిన కంఠస్వరంతో "ఈ విషయం మీరు బహుశః మహిముడివల్లనే విని ఉంటారని నేననుకుంటాను" అన్నాడు.

అచల కొంచెం తలకదిపి "అవును ఆయన ఒకనాడు నాతో చెప్పారు" అంది.

సురేశుడు "అయితే అతను నా దగ్గిర ఉన్న లోటుపాట్లు చెప్పడానికేమీ జంకలేదన్నమాట!" అన్నాడు.

అచల కొంచెం వాడిపోయినముఖమై ఖరితో ఒకచిరునవ్వునవ్వి, "ఇందులో తప్పుమాట ఏముంది? అందరూ ఒక్కవిధంగా ఉండరు. మీకూ మాకూ సంబంధం లేదని తెగతెంపులు చేసుకుని వెళ్ళిపోయిన వాళ్ళ సంబంధం మీకు ఇష్టంలేకపోతే, ఇందులో పెద్దతప్పేముంది?" అంది.

ఈసమాధానం ఒకవిధంగా సురేశునికి నచ్చినసమాధానమేకాని అతను ఇదే మరిఒకరివల్ల వినిఉంటే సంతోషపడి ఉండేవాడు. అయితే మానవతి ఐన ఈబ్రాహ్మతరుణి ముఖంవల్ల వ్యక్తమయిన ఈబ్రహ్మసమాజ వైముఖ్యం చూస్తే అతనికి కొంచెమైనా సంతోషం కలగ లేదు. అదీగాక బ్రహ్మసమాజంవిషయంలో ఒకళ్ళ ఇష్టానిష్టాలు కను క్కోడానికికూడా అతనుకుతూహలపడలేదు. కాని మహిముడు మాటల సందర్భంలో తన్నిగురించి మంచిమాటలు చెప్పాడోలేదో కనుక్కో వాలని అతనికి కుతూహలంకలిగింది. కాని అచల అతనిమనస్సులో ఉన్నవిషయం గ్రహించలేక పోయింది; అందుచేత! ఆమె అతనడిగిన ప్రశ్నకి సూటిగాసమాధానంచెప్పి మాట్లాడక ఊరుకుంది.

సురేశుడు మనస్సులో ఎంతోనొచ్చుకుని ఇల్లాఅన్నాడు. "నాకు బ్రహ్మసమాజంఅంటే ద్వేషంఉన్నదీ లేనిదీ మహిముడే బాగానిర్ణయించి చెప్పగలడు. అతనిమీద నాకు కొంచెమైనా ద్వేషంలేదు. ఈవిషయంలో మీ రేమీ అపనమ్మకం పెట్టుకోన క్కరలేదు. మహిముడుకూడా ఈవిషయం అంగీకరించితీరతాడు."

అచల సురేశుడిముఖంవైపు స్థిరమైనదృష్టితో చూస్తూ "ఆయన ఎప్పుడూకూడా అబద్ధాలాడరు" అంది.

ఈమాటతో సురేశుడు ఆశ్చర్యంచేత నిశ్చేష్టుడైపోయాడు. స్త్రీలు ఇంతదృఢంగా ప్రతివాదం చెయ్యగలరని అతను ఎప్పుడూకూడా అనుకో లేదు. ఆ ఆశ్చర్యం అతనిలో ఒకక్షణకాలంమాత్రమే ఉండి, పోయింది.

అతను జీవితంలో ఎప్పుడూ నిజమూ అనేది అలవాటుచేసుకోలేదు అందుచేత ఉత్తరక్షణంలోనే కొంతఉత్సాహం తెప్పించి చటుక్కుని "మీరు నన్ను క్షమించాలి; అతను నాకు బాల్యస్నేహితుడు, అతనిసంగతి నాకు మీకంటే కొంచెంఎక్కువగానే తెలుసును; వివాహమువిషయంలో అతను ఇక్కడ నిశ్చయమైనా మాటఇచ్చాడు; కాని నాతోటి వివాహంకన్నా స్థిరపడలేదని చెప్పాడు. ఇదంతానేను మీకు చెప్పడమని అనలేను" అన్నాడు.

అచల అల్లానేప్రశాంతస్వరంతో "ఆయన వివాహ విషయంలో ఇంకానిశ్చయంచేసుకుని చెప్పలేదు" అంది.

సురేశుడు "మా నాయనగారుకూడా అల్లాగేఅన్నారు. ఇదీగాక తనపరిస్థితి ఏమిటో మీతోచెప్పకుండా దాచుకోవడానా లేదు. ఇది చెప్పడమని అనలేను. పెళ్ళాం పిల్లల్ని పోషించుకోలేని సంగతి,ఇతరులతో చెప్పకపోయినా మీతోనైనా చెప్పిఉండవలసింది" అన్నాడు అచల అల్లాగే మాట్లాడకూరుకుంది. సురేశుడు మళ్ళీ అందుకుని "మీరుఅతనుచేసినపొరపాట్లన్నీ కప్పి పుచ్చడానికి ప్రయత్నిస్తున్నారు. అయితే ఉన్నమాట ఉన్నట్లు చెప్పండి. అతని సంగతులన్నీ పూర్తిగా తెలిసిఉంటే మీ రతనితో ఇంత చనువుగా ఉండడానికి అంగీకరించేవారా?" అనిప్రశ్నించాడు.

అచల పూర్వాం మోస్తరుగానే మాట్లాడకఊరుకుంది. ఆమె దగ్గిరనించి ఏవిధమైన సమాధానమూ కూడా రాకపోవడంమూలాన్ని సురేశుడు మరింతఉద్వేగంతో చెప్పడం మొదలు పెట్టాడు "మహిముడు తననోటితో తనే మిమ్మల్ని తీసుకువెళ్ళి ఈకలకత్తా పట్టణంలో కాపరంపెట్టాలని అనుకోవడం లేదనిన్నీ, అట్లాంటిసామర్థ్యం తనదగ్గిర కొంచెమైనా లేదనిన్నీ కూడా నాతో అన్నాడు. అతను మిమ్మల్ని తీసుకువెళ్ళి, ఆకుగ్రామంలో కేవలం విరుద్ధమయిన

అహింసానంగ్రామానికి మధ్యన, అదరిద్రపు మట్టికొంపలో పడియ్యా లని చూస్తున్నాడు. ఆ విషయం శాస్త్రముందుగా మీతో చెప్పడం అతనివిధానుకం అంటారా? కాదంటారా? ఈకష్టాలన్నీ మీరు సహించగలరా! సహించలేరా? ఆనేవిమయమైనా మిమ్మల్ని కనుక్కోవడం అవసరంఅంటారా కాదంటారా?" ఈమాటలు అన్న తరవాత అతను సమాధానంకోసం కళ్లెత్తి ఆమెముఖం వైపు చూశాడు. అచల అల్లాగే ఏదో ఆలోచిస్తూ తలవంచుకుని కూర్చుండి పోయింది. ఆ మౌనగ్గిరకాని ఏసమాధానమూ రాకపోవడంవల్ల తనమాటలు బాగాపనిచేశాయని అనుకుని మళ్ళీ ఇల్లాగ అన్నాడు "చూడండి! ఈవేళ మీతోటి నేను ఉన్నమాటేదో ఉన్నట్టు చెబుతున్నాను. ఈవేళ నేను అతనికి ఉపకారంచెయ్యాలనే ఉద్దేశ్యంతోనే ఇక్కడికి వచ్చాను. అతను ఆపదలో పడిపోతూఉంటే చూస్తూఊరుకోవడం నాకిష్టంలేదు. అయితే ఇప్పుడునాకు అతన్ని రక్షించడంకంటే కూడా మిమ్మల్నిరక్షించడమే ముఖ్యకర్తవ్యమని అనిపిస్తోంది. ఎందు చేతంటే—అతని ఆపని చేతులారా స్వయంగా తెచ్చిపెట్టుకున్నది. కాని మీరు దీనివల్ల కేవలం ఒక అంధకార కూపంలోపడిపోతున్నారు. సరిగ్గా ఈపరిస్థితుల్లో మీనాన్నగారునామీద ఈవిషయం ఋజువుచెయ్య వలసినభారం మోపారు. ఇంతకుపూర్వం నేను స్నేహితుడికి విరుద్ధంగా ఈవ్యవహారంలో చెయ్యిచేసుకోవడం మంచిదికాదేమోనని అనుకున్నాను; కాని ఇప్పుడు ఆలోచిస్తే, నేనీ పనిచెయ్యక తప్పదనిన్నీ చెయ్యక పోతే కేవలం అన్యాయం చేసినట్టవుతుందనిన్నీ కూడా అనుకుంటున్నాను."

అచల "అయితే ఆయన ఈవిషయంవింటే మనస్సులో బాధ పడరూ?" అంది.

సురేశుడు ఇల్లాగ అన్నాడు "దీనికి మరింకేమీ ఉపాయంలేదు.

అతను కేవలం పరమనాస్తికుడులాగ ఈవిషయంలో మీ కింత ద్రోహం చేశాను. అంతునేకే స్నేహితుడైనా సరే, అతని కష్టసుఖాల సంగతి తెలిసీకూడా ఆలోచించకుండా చేశాను. అసలు ఉన్న చిక్కంతా ఎక్కడుంటాడో — నాకతని గ్రామం పేరైనా తెలియదు. ఏవిధంగానైనా అతని గ్రామం పేరు తెలిస్తే, రేపుపొద్దున్నే నేనుస్వయంగా అక్కడికివెళ్లి, కావలసిన ఋజువులన్నీ మీనాయనగారికి చూపిస్తాను. ఆపైన నేనుచేసిన దానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను"

అచల "అయితే దీనికి మీరింత శ్రమపడడం ఎందుకు? మానాన్నగారితో ఉన్న విషయాలేమిటో చెప్పేసెయ్యండి. ఆయన తరవాత నమ్మకమైనవాళ్ళద్వారా ఆవిషయాలన్నీ తెలుసుకుంటారు. ఇరవైనాలుగు పరగణాలలో ఉన్న రాజపురం ఇక్కడికి అట్టేదూరంకాదు" అంది.

సురేశుడు ఆశ్చర్యంతో నిర్ఘాంతపోయి "రాజపురమా! అయితే ఆపల్లెటూరుపేరు మీకు తెలుసునన్నమాట! అయితే ఇంకా ఏమైనా తెలుసునా?" అన్నాడు.

అచల తనకి స్వాభావికమైన ముఖవైఖరితోనే నాకూమీకూ తెలిసినంతే తెలుసును. రాజపురానికి "ఉత్తర భాగంలో ఒక మట్టియిల్లు ఉంది. ఆయింటికి లోపలభాగంలో మూడు చిన్నచిన్న గదులున్నాయి. వీధివైపున ఒకసావిడి ఉంది. ఆసావిట్లోనే ఆఊరి పాఠశాలకూడా ఉంది". అంది.

"అయితే అతని సంసారవ్యవహారం మాట?" అన్నాడు.

అచల "ఈవిషయంలోకూడా మీరుచెప్పిందే నిజం! ఏదోసామాన్యంగా కొంచెం ఆస్తి ఉంది. దాంతోటి కొంతకష్టంమీద అన్నవస్త్రాలకి లోటులేకుండా కాలక్షేపం అయిపోతూంది" అంది.

సురేశుడు "అయితేమీకేవిషయాలన్నీ తెలుసునన్నమాట" అన్నాడు.

అచల "అబ్బే! నాకింకే తెలుసును; ఎందుచేతంటే ఒకనాడాయన్ని నే నీవిషయాలే అడిగాను; ఆయన ఇవ్వే చెప్పాడు. ఆయన చెప్పాడూ అబద్ధాలాడరన్న సంగతి మీకుమాత్రం తెలియదా? ఏమిటి!" అంది.

ఈసమాధానంతో సురేశుడిముఖం నల్లబడిపోయింది. "అతను మీకీవిషయాలన్నీ తెలిపినప్పుడు, నేను ప్రత్యేకం ఈవిషయాలన్నీ చెప్పడానికి మీదగ్గిరికి రావడం కేవలంఅనవసరం అన్నమాట! అయితే అతను మిమ్మల్నిఏవిధంగానూకూడా మోసంచెయ్యాలని అనుకున్నట్టే కనబడదు" అన్నాడు.

అచల "నాకు ఈవిషయాలన్నీ కొద్ది కొద్దిగా తెలిసినమాట నిజమే! అయితే ఇవన్నీ మీరు నాతో చెప్పడానికని రాలేదుగా! ఇవ్వన్నీ మానాయనగారితో చెప్పడానికనివచ్చారు. ఆయన కీవిషయాలేవీకూడా ఇంతవరకూ తెలియవు. ఈపైన మీరు చెప్పమంటేనాకు తెలిసినసంగతులన్నీ మానాయనగారితో చెబుతాను" అంది.

సురేశుడు ఆపైన తనకేమీ సంబధం లేనట్టు "ఏమో మీయిష్టము! కాని నేను వెళ్లి మహీముడితో జరిగినవ్యవహారం అంతా చెప్పి క్షమాపణఅడగాలని అనుకుంటాను. అప్పటికినాకు మనశ్శాంతి కలుగుతుంది," అన్నాడు.

అచల "అయితే అంత క్షమాపణఅడగవలసిన అవసరం ఉంటుందా?" అంది.

సురేశుడు మళ్లీ పెద్దఉద్వేగంతో "అవసరంలేదూ? నేను సంగతి సందర్భాలు ఏమీ తెలుసుకోకుండా అతనిమీద పెద్దనిందారోపణ చేశాను. నేను చేసింది ఎంతపెద్దతప్పో మీరేమన్నా ఆలోచించారా? అతన్ని నాస్తికుడన్నాను. దగాకోరన్నాను. మాటతప్పేబాపతుమనిషి అన్నాను. ఒకటేమిటి? అనవలిసినవి అన్నీ అన్నాను. అతనిదగ్గిరికి

వెళ్ళి నేను చేసినది అంతా చెప్పి, క్షమించమని అడిగితేగాని నాకు మనశ్శాంతి కలుగుతుందా!" అన్నాడు.

అచల కొంతసేపు నిశ్శబ్దంగా ఉన్నతరవాత మళ్ళీమెల్లగా "కాని నేను చెబుతున్నాను వినండి సురేశబాబూ! ఈమాట లేపి చెప్పవలసినఅవసరం లేదు. ఒకప్పుడు మనస్సులో పశ్చాత్తాపపడి క్షమాపణవేడుకుంటే చాలు! అన్నిసందర్భాల్లోనూ పైకి ప్రత్యక్షంగా క్షమాపణ వేడుకోవడం ఒకటే మంచిదనేవిషయం నేను అంగీకరించను. ఈవిషయం వింటే ఆయన మనస్సులో బాధపడవచ్చును! అలాంటప్పుడు ఆయనకి ఈవిషయం చెప్పడంవల్ల ఉపయోగం ఏముంది! నేను మాయాయనగారితో మీరహస్యవిషయం తిరిగీ ఆయనదగ్గర ప్రస్తావించవద్దని గట్టిగా చెబుతాను" అంది.

సురేశుడు "సరే! బాగుంది" అన్నాడు. ఆపైన అచల ముఖం వైపు కొంతసేపు నిశ్శబ్దంగా చూసి "నేను మహిమాన్వితుల మనస్సు కష్టపెట్టకూడదని ఎప్పుడూ అనుకుంటూంటాను. మీ సంకల్పంకూడా అంతే! సరే బాగుంది! ఇదేమాట నే నీవిషయం ఏమీ అతనిదగ్గర ప్రస్తావించను. అసలు ఈవేళ అతని విషయంలో. నాకేమేమి అభిప్రాయాలు కలిగాయో, అవికూడా చెప్పడం నాకిష్టంలేదు, కాని ఒక్క విషయంమాత్రం మీతో చెప్పకుండా ఇక్కడినించి వెళ్ళదలుచుకోలేదు! అన్నాడు.

అచల అతనివైపు స్నేహపూర్వకంగా చూసి "దానికేం! చెప్పండి!" అంది.

సురేశుడు "నే నతన్ని క్షమాపణకోరడానికి వీల్లేకపోయింది; కాని మిమ్మల్ని నేను క్షమించమని ప్రార్థిస్తున్నాను. నన్ను క్షమించండి!" అని తనరెండుచేతులూ జోడించాడు.

అబ్బెబ్బే! ఇదేమిటి! "అని అచల ఒక్కక్షణంలో అతనిరెండు

చేతులూ పట్టుకుని. మళ్లీ మరుక్షణంలోనే విడిచిపెట్టేసి, ఇదేమిటి చెప్పండి!" అంది. అల్లాగ అంటూండగానే, ఆమెముఖం సిగ్గుచేత ఎర్రబడిపోతుంది.

సురేశుడి శరీరంఅంతా ఒక్కసారిగా గగుర్పొడిచింది. ఆశ్చర్యకరమైన ఆకస్మిక స్పర్శా, ఆ ఎర్రని ముఖకాంతీ రెండూ కలిసి, ఒక్కసారిగా! ఒక్కక్షణంలో అతన్ని తన్మయుణ్ణిచేసివేశాయి. అతను, ఆమె అవనతముఖంకేసి కొంతసేపు నిశ్చలంగా చూసి చివరకి మెల్లిగా "ఇప్పుడు నేను చేసినపనిలో అన్యాయం ఏమీలేదు. నే నిదివరకు చేసిన అన్యాయంలోకల్లా మంచిపని ఇదిఒక్కటే! కేవలం మిమ్మల్ని క్షమాపణ వేడడంవల్లనే నామనస్సులో ఉన్న క్షోభంతాసంపూర్ణంగా ఉపశమిస్తుంది" అన్నాడు.

అచల మనస్సులో కొంతకలవరపడి, "మీరల్లా అనడం న్యాయం కాదు. రెండుసార్లు ఆయన్ని మృత్యుముఖం లోనుంచి కాపాడిన మీరు"—అంది.

"మీకు— ఇదీ తెలిసిందీ?"

"ఆ, తెలిసింది! మీతోసమానమైన స్నేహితులు ఆయనకింక ఎవరున్నారు? లేరు బహుశః మీరుతప్ప ఇంకెవ్వరూ లేరనుకుంటాను. మరి ఆవిషయంలో మేమిద్దరమూ—"

అచలముఖంమీద మళ్ళీకొంచెం ఎర్రదనం కనిపించడంప్రారంభించింది. ఆమె ఒకక్షణకాలం ఊరుకుని "మీరు ఆయన్ని మృత్యుముఖంలోనించి మళ్లీఇవతలికి తీసుకువచ్చారు. అందుచేత మీరాయనవిషయంలో ఏమన్నా సరే! నే నది మరోవిధంగా తీసుకోలేను మీమనస్సులో ఏవిధమయిన బాధగాని ఏవిధమయిన సంకోచంగాని ఉండడానికి అవసరంలేదు. క్షమాపణ అనేశబ్దం ఉచ్చరించడంవల్ల మీమనస్సుకి తృప్తి కలిగితే ఆశబ్దం మీరు వాడడానికి నే నంగీకరించి ఉంచున్నగాని

అల్లాగ అనడానికికూడా నాకేమీ అభ్యంతరంలేదు" అంది.

సరే! పోనీలెండి! అని సురేశుడు లేచినుంచుని "మీఆయనగారితో చెప్పిపోవడానికి వీల్లేకపోయింది, ఆయన ఏమనుకుంటారో ఏమిటో ఎప్పుడో ఒకనాడు మహిముడితో కలిసివస్తాను! నమస్కారం" అన్నాడు.

అచల కొంచెం చిరునవ్వునవ్వి 'నమస్కారం' అంది. తరవాత "ఆయనతోకూడానే రావాలని ఒకనియమంఏమీలేదు" అంది.

"నిజంగానే!"

'నిజంగానే'

"అయితే చాలాఅదృష్టవంతుణ్ణి" అని సురేశుడు ఆమెకు మళ్ళీ ఒకనమస్కారంచేసి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

౫

ఇవతలికిరాగానే సురేశుడిశరీర మంతా మత్తెక్కినట్టు ఇటూ అటూ ఊగిసలాడడం మొదలు పెట్టింది. మధ్యాహ్నం ఎండలో క్రమక్రమంగా వేడితగ్గడం ప్రారంభించింది. సురేశుడుబండిఅక్కరలేదనిచెప్పి కేవలం పాదచారిగానే గబగబా వెళ్లిపోయాడు. కలకత్తాలో జనసంకులమైన ఆరాజమార్గంలో పూర్తిగామునిగిపోయి, తనపరిస్థితులన్నీ ఒకసారి గాఢంగా ఆలోచించుకోవాలని అతనికి కోరిక కలిగింది.

అచలముఖమూ, ఆమెఅవయవములూ, ఆమెమాటలూ, ఆసంభాషణా, అవన్నీ మొదటినుంచి చివరిదాకా అతనికి మాటిమాటికీ జ్ఞాపకం రావడం మొదలెట్టాయి. అవన్నీ తలుచుకుంటూంటే అతనికి తను ఆమెకు అన్నిటిలోనూ లొచ్చే అని అనిపించింది.

ఆమెముఖంలో పెద్ద అలౌకిక సౌందర్యం ఏమీలేదు. మాటల్లో

గాని, విద్యాబుద్ధుల్లోగాని, జ్ఞానంలోగాని పెద్దవిశేషం ఏమీ కనపడలేదు! కాని అతనికి మాటిమాటికీ ఎప్పుడూ చూడని ఒక అపూర్వమైన వ్యక్తిని చూచినట్టనిపించడం మొదలు పెట్టింది. ఇన్నాళ్ళూ ఆవించీ అతను బ్రహ్మసామాజికులంటే బాగా తక్కువచూపుతో చూసేవాడు; అతను దోవలో నడుస్తూ నడుస్తూ తను చూసినవ్యక్తి అంత ఆశ్చర్యకరంగా ఉండడానికి కారణం ఏమిటా అని మాటిమాటికీ ఆలోచించడం మొదలు పెట్టాడు.

అతనికి ఆ వేళ ఆ స్త్రీలో ఒక అపూర్వమైన మాధుర్యం కనబడింది. దానివల్ల అతనిహృదయం అంతా ఇది అని నిర్ణయించడానికి వీల్లేని ఒకవిధమైన సార్థకత్వంతో నిండిపోయింది! అతనికి ఆమెతో సరియైనపరిచయం ఇంతవరకూ కలగకపోయినమాట నిజమే! కాని ఆమె చాలా గొప్పవ్యక్తి అయి ఉంటుందేమో ననిన్నీ, ఆమెహృదయం చూరగొన్న వ్యక్తి దురదృష్టవంతుడని అనడానికి వీల్లేదనిన్నీ—అతనికి సందేహం లాంటిదైనా ఎందుకు కలగలేదు? ఇల్లాగ ఆలోచిస్తూంటే ఆ ఆలోచనాధార చటుక్కుని అతన్ని ఆ దారిలో కొట్టి ఆపివేసినట్లయింది. ఆమె అనుభవంలోనూ, వయస్సులోనూ, జ్ఞానంలోనూ కూడా, అతనికంటె చిన్నదే! ఇందులో సందేహం ఏమీ లేదు; కాని అతన్ని కొన్ని నిమిషాల సంభాషణలోనే ఓడించివా రేసింది! దీనికంతటికీ కారణం ఆమె గంభీరంగా ఉండడమేనని అతనికిస్పష్టంగా తెలిసిపోయింది. ఆమె పైకి శాంతంగానే కనబడింది. కాని ఆమెహృదయం వజ్రంలాంటిది. పైకి ఏమీ మాట్లాడలేదుగాని ఆమె కన్ని విషయాలూ తెలుసును. ఆత్మసంయమనంవల్లనే ఆమె కీగుణాలన్నీ అబ్బాయని అతను నిశ్చయించుకున్నాడు. మహిముడివిషయంలో సురేశుడు అన్నీ తెలిసినవాడి లాగ ఊరికే వాగుతూ కూర్చున్నాడు. ఆసమయంలో ఆమె కిందికి చూస్తూ మాట్లాడకూరుకుంది; అతను ఏమిఅన్నా సహించి ఊరు

కుంది. ఒక్కక్షణకాలమైనా వాదవివాదాలు పెంచి, దెబ్బలాడి సురేశుణ్ణి న్యాయనిర్ణయం చేయలేదు, తనకి సమస్తమూ తెలిసినా, ఏమీ ఎరగనట్టు మాట్లాడకుండా ఉంది. ఎంతో మనోనిగ్రహం అవలంబించింది. ఆమె తనకి మహిముడిమీద ఎంతప్రేమ ఉన్నా అదిపైకి ఏమీ కనబడనీయలేదు; కాని అతనికి ఎంతసంక్షేపంగా సూచించింది!

అతను ఆమె ఈ ఆత్మనిగ్రహ విద్య మహిముడిదగ్గిర నేర్చుకుందనిన్నీ, నేర్చుకున్నది కాస్తా బాగా నేర్చుకుందనిన్నీ, అనేకసార్లు లోలోపల అనుకోడం ప్రారంభించాడు. అతనికి చిన్నప్పటినించీ ఆత్మనిగ్రహమనేది కొంచెమైనా అలవాటుపడలేదు అందుచేత ఆమెలో కనబడిన ఈ ఆత్మనిగ్రహం చూసి! అతను ఎంతో ఆశ్చర్యపడ్డాడు. ఆవ్యక్తి పాదపద్మాలమీద తనశిరస్సు ఉంచగలిగితే తనజన్మ ధన్యమవుతుందని అనుకున్నాడు.

... ... ... ...

అనేకమైన సందులూగొందులూ తిరిగి, బాగా అలిసిపోయి, సాయంత్రం అయ్యేసరికి సురేశు ఇంటికి చేరుకున్నాడు. ఇంటికి వచ్చేటప్పటికి మహిముడు చేతులతో కళ్ళుకప్పుకుని ఒకకుర్చీమీద కూర్చున్నాడు. సురేశుడికి అతన్ని చూసేటప్పటికి ఎంతో ఆశ్చర్యం వేసింది. సురేశుడు దగ్గిరికి వెళ్ళీవెళ్ళడంతోటే మహిముడు లేచి "రా! సురేశా! అన్నాడు. "ఇదిగో! వచ్చావే!" అనిచెప్పి, సురేశుడు మెల్లిగా ఒకకుర్చీలాక్కుని దానిమీద చతికిలబడ్డాడు.

మహిముడు అప్పుడప్పుడు వస్తూఉంటాడు. అతను రావడంవల్ల సురేశుడు ఎంతో ఆనందపడుతూఉంటాడు. కాని ఈవేళ అతని నోట్లోంనించి ఒక్కమాటైనా ఇవతలికి రాలేదు! దానికి మహిముడు లోలోపల ఎంతో ఆశ్చర్యపడి "బసలోకి వెడితే నువ్వువచ్చావని తెలిసింది. అందుచేత ఒకసారి——" అన్నాడు.

అంతలో సురేశుడు అందుకుని "దయచేసి ముఖంచూపిద్దామని అనుకున్నావు! అంతే కాదూ? నువ్వువచ్చిఎన్నాళ్ళయిందో కొంచెమైనా జ్ఞాపకంఉందా?" అన్నాడు.

దానికి మహిముడు నవ్వి "జ్ఞాపకం ఉంది కాని ఎక్కడా ఊపిరి విడవడానికైనా ఖాళీలేక," అని సురేశుడి ముఖంకేసి చూశాడు. గ్యాసులైటువెలుతురులో సురేశుడిముఖం కాస్తా వాడిపోయినట్లు కనబడింది; అతడివైఖరిలో ఒకవిధమైన కాఠిన్యం ఉన్నట్లుకనబడింది; మహిముడుఅతన్ని కొంచెం సంతోషపెట్టాలని ఉద్దేశించి ఎంతోమృదువుగా "నువ్వుకోపపడడానికి కారణం లేకపోలేదు! నేనావిషయం ఒప్పుకుంటాను; కాని అసలెక్కడాకూడా నాకు ఖాళీఉండడంలేదు. చదవవలిసిందీ రాయవలిసిందీ చాలావుంది. అదీకాక సాయంత్రంవేళ వొకట్యూషనుకూడా—"అన్నాడు.

"మళ్ళీ ట్యూషనులు చెబుతున్నావూ?"

మహిముడు ఆమాటకితిన్నగా సమాధానంచెప్పకుండా "నన్ను వెతుక్కుంటూవచ్చావు ప్రత్యేకం. ఏమైనా పనిఉందా?" అని అడిగాడు.

సురేశుడు "అవును. ఉంది. ఈవేళ నువ్వురాకపోతే రేపు ప్రొద్దున్న నీకోసం ప్రత్యేకం రావలిసివచ్చేది" అన్నాడు.

మహిముడు ఆకారణంఏమో తెలుసుకోడానికి ఆతుర్దాగాఉన్నట్లు సురేశుడిముఖంకేసి చూడ్డం మొదలుపెట్టాడు.

సురేశుడు చాలాసేపటిదాకా నిశ్శబ్దంగాఉండి, మహిముడు తొడుక్కున్న చెప్పులజోడుకేసి చూస్తూ, "మళ్ళీబహుశా కొన్నాళ్ళనించి కేదారబాబుగారింటికి వెళ్ళలేదనుకుంటాను" అన్నాడు. మహిముడు 'లే' దన్నాడు.

"ఏం? ఎందుకు వెళ్ళలేదు? నామూలాన్నేనా? నేను నువ్వింక వెళ్ళడానికి అంగీకరిస్తున్నాను. అక్కడికి నీయిష్టంవచ్చినట్లు వెళుతూ వస్తూ ఉండు!"

మహిముడు నవ్వి "నేను వెళ్ళను, కాని ఇల్లా శపథంపట్టినట్టు నాకేమీ జ్ఞాపకంలేదే!" అన్నాడు.

సురేశుడు "పోనీ! అల్లాంటిది ఏమీ లేకపోతే బాధ ఏమీలేదు! గాని నావల్ల ఏదైనా ఇబ్బంది కలిగితే మాత్రం నువ్విక్కడి నించి అల్లాంటి ఇబ్బంది ఏమీ పడక్కరలేదని చెబుతున్నాను" అన్నాడు.

"సురేశా! ఇది అనుగ్రహమా? లేకపోతే నిగ్రహమా?"

"మహిమా! నీకెల్లా అనిపిస్తూంది?"

"ఇన్నాళ్ళనించీ ఎల్లాగ అనిపించిందో అల్లాగే అనిపిస్తూంది"

ఆమాటమీద సురేశుడు "అయితే దీనిఅర్థం ఏమిటంటే—ఇదంతా నామతిభ్రమ అన్నమాట! ఇంతేనా? అయితేసరే! నువ్వేమను కున్నా అనుకోవచ్చును. దానివల్ల నాకేమీ ఇబ్బందిలేదు. నేను కేవలం నావల్ల కలిగిన ఇబ్బందిమాత్రం లేకుండా చేస్తున్నాను" అన్నాడు.

"అయితే నేను దీనికి కారణం ఏమిటో అడగవచ్చునా?"

"నువ్వు అడుగుతున్నావు, గాని ఈమతిభ్రమణానికి కారణం ఏముంటుంది?"

మహిముడు ఒక్క క్షణకాలం గంభీరంగా ఉండి "అయితే సురేశా! నీ యిష్టం వచ్చినట్లు ప్రపంచకంలో అందరికీ కష్టాలువచ్చి తొలిగిపోతూంటే బాగుండిపోను! కాని అసలు ప్రపంచకంలో ఎప్పుడూ ఇల్లాజరగదు; నీకు బాధలేనిచోటే నాకు బాధకలగవచ్చు" అన్నాడు.

"అంటే?"

"అంటే నా అభిప్రాయం ఇది; నువ్వు ఆనాడు బ్రహ్మసమాజంలో ఉన్న స్త్రీలనిగురించి చెప్పావేం? దాన్నిగురించి బాగా ఆలోచించాను. అయితే! ఆవేళ నువ్వు ఒకనెలరోజులలోవుగా ఏదైనా సంబంధం స్థిరపరుస్తానని చెప్పావు? దానిసంగతి ఏమైంది?"

సురేశుడు ముఖంఎత్తి మహిముడిముఖంకేసి చూశాడు. గాంభీ

ర్యము అనేకుమందితో మహిముడతన్ని తీవ్రంగా వేళాకోళం చేస్తున్నాడు. అదిమానిసి సురేశుడు గంభీరభావంతో "మహిమా! నేనుకొన్నికొన్ని వివాహసంబంధాల విషయంలో ఆలోచించి చూశాను. ఈపెళ్ళిళ్లు కుదర్చడం నాకేంప్రవృత్తి కాదు." అన్నాడు. ఆపైన మళ్లీనవ్వి, "సరే వేళాకోళంమాటలకేంలే! వాటి మాట అల్లాఉండనీ! ఇన్నాళ్ళనించీ నువ్వు నామాటమీద గౌరవంఉంచినందుకు నీకు వెయ్యినమస్కారాలు. సరే! ఈవేళ నేనుకూడా అంగీకరించానుగనక, ఒకసారి రేపుపొద్దున్నే అక్కడికివెళ్లవూ?" అన్నాడు.

"లేదు, అక్కడికి వెళ్ళను. నేను రేపు పొద్దున్నే బయలుదేరి ఇంటికి వెడుతున్నాను."

"ఎప్పుడు తిరిగివస్తావు?"

"పది పదిహేనురోజులు పట్టవచ్చును! ఏమో! ఒకనెలరోజులు కూడా అయితేకావచ్చును"

"నెలరోజులే! వద్దు! మహిమా! అంత ఆలస్యంచెయ్యవద్దు." అని చెప్పి సురేశుడు అతని పక్కకివెళ్లి అతనికుడిచెయ్యి తనచేత్తోపట్టుకుని "మహిమా! నేనుచేసిన అపరాధం మరీ పెద్దది కానియ్యకు! ఎల్లాగైనా రేపుపొద్దున్న ఒక్కసారివెళ్ళు! వాళ్ళంతా నీకోసం ఎదురుచూస్తూ ఉంటారు" అన్నాడు. అల్లా అంటూంటే అతనికంఠస్వరం కంపించింది.

దీనివల్ల మహిముడికి కలిగినఆశ్చర్యానికి హద్దులేదు. సురేశుడు ఇంతఉద్వేగంతో మాట్లాడడం ఇంతబతిమాలుకోవడం ఇదంతా చూస్తేనే అతనికి ఆశ్చర్యంవేసింది. ఆపైన ఒకబ్రహ్మసమాజస్థుల పిల్లగురించి సురేశుడు ఇల్లాగ మాట్లాడడంవల్ల మహిముడికి మరీ మతిపోయినట్లుయింది, అతను కొంచెంసేపటిదాకా సురేశుడిముఖంకేసి అదేపనిగాచూసి "నాకోసం ఎవరు ఎదురు చూస్తూంటారు? కేదార ముఖర్జీగారి అమ్మాయా?" అని అడిగాడు.

సురేశుడు తనమనస్సు కుదుటపరుచుకుంటూ "అయితే కావచ్చును" అన్నాడు.

మహిముడు మళ్ళీ కొంతసేపటిదాకా సురేశుడికేసి చూస్తూ నుంచున్నాడు. సురేశుడు ఈలోగా వెళ్ళి బ్రహ్మసమాజస్థులతో పరిచయం కలిగించుకుని ఉండవచ్చుననే ఊహకూడా అతనిమనస్సుకి తట్టలేదు. మళ్ళీ కొంతసేపటిదాకా నిశ్శబ్దంగా ఉండి మహిముడు "సురేశా! నేనీవేళ నీచేతులో ఓడిపోయానని అంగీకరిస్తున్నాను. ఈవేళ నీమనస్సులో ఉన్నవిషయం కేవలం నాబుద్ధికి అతీతమైనది. బ్రహ్మసమాజస్థులపిల్ల నాకోసం ఎదురాచూస్తూ ఉంటుం దన్నావు! నువ్వు ఇల్లాగ అంటావని నేను కల్లోనైనా అనుకోలేదు!

సురేశుడు "సరే! ఈవిషయంలో ఇల్లాగ ఎందుకుచెప్పానో నీకు తరవాత చెబుతాను. సరే! దీనికి సమాధానంచెప్పు. రేపుపొద్దున్న నువ్వక్కడికి వెడతావా? వెళ్ళవా?" అన్నాడు.

"అబ్బే! ఏమైనాసరే! నేను రేపుపొద్దున్న వెళ్ళడానికి వీలుండదు. నాకు రేపు పొద్దున్న బండిమీద ఇంటికి వెళ్ళవలిసపనిఉంది"

"అయిదారు నిమిషాలైనా అక్కడికివెళ్ళిమాట్లాడలేవూ?"

"అబ్బే! వీల్లేదు. దానికేంగాని, నువ్వీవేళ ఇల్లాగ మాటాడుతున్నావు! ఏమిటికథ!"

"ఆవిషయంఅంతా నీకు మరోనాడు చెబుతాను. ఈవేళమాత్రం కాదు. సరేగాని, నువ్విల్లా అన్నావని నేనక్కడికివెళ్ళి చెప్పిరావచ్చునా?"

మహిముడు ఆమాటమీద మరింతఆశ్చర్యపడి, సరే! వెళ్ళవచ్చును! కాని! దానికిప్పుడంత పెద్దతొందర రేమివచ్చింది" అన్నాడు.

సురేశుడు "తొందర ఏమీలేనిమాట నిజమే! కాని నాపేరు చెబితే వాళ్ళెవరైనా గుర్తుపట్టగలరా?" అన్నాడు.

"ఒకవ్యక్తి తప్పకుండా గుర్తుపడుతుంది"

సురేశుడు "ఆఁ చాలు ఇంతమాత్రం చాలు! నిన్నే హితుణ్ణంటే ఆవిడికి తెలుస్తుందా?" అన్నాడు.

మహిముడు "తెలుస్తుంది" అన్నాడు.

సురేశు డిప్పుడు కొంచెం నవ్వడానికి ప్రయత్నించి "అయితే నన్ను బ్రహ్మసమాజం ద్వేషించే హిందూమిత్రుణ్ణని అనుకుంటుందా? ఏమిటి?" అన్నాడు.

మహిముడు "కాఁ నువ్వీవిషయం ఒకపెద్దగర్వంగా చెప్పుకుంటూ ఉంటావుగా!" అన్నాడు.

సురేశుడు "అవును ఆమాటనిజమే!" అని కొంతసేపునిశ్శబ్దంగా నేలకేసిచూస్తూ ఊరుకున్నాడు. ఆపైన మళ్ళీచటుక్కుని లేచినిల బడి "మహిమా! ఈవేళ నాకేమిటో ఎక్కువగా నిద్రవస్తూంది. అందుచేత వెళ్ళి కాస్సేపు నిద్రపోతాను." అనిచెప్పి ఏదోపరధ్యానంగా ఉన్నవాడిలాగ మెల్లిమెల్లిగా ఆగదిలోంచి ఇవతలికివచ్చేశాడు.

## ౬

సురేశుడిమాట మహిముడెంత లక్ష్యపెట్టకపోయినా కేవలం అతని మాట తోసివెయ్యలేక అతనినాళ్ళనించీ అచలనిచూడడానికి వెళ్ళలేదు. సురేశుడుకూడా నిస్సందేహంగా దీనికి ఇదేకారణం అని అనుకున్నాడు. మహిముడు కేవలం ఒకబ్రాహ్మబాలికదృష్టిలో తనస్నేహితుణ్ణి చిన్నబరచడానికి ఇష్టపడక, ఇన్నాళ్ళనించీ అక్క డికి వెళ్ళలేదన్నసంగతి నిశ్చయమని తెలిస్తే సురేశుడిహృదయం గర్వంతో ఉప్పొంగిపోయి ఉండును; కాని ఒక శూన్యశయ్యమీద పడుకుని ఆలోచిస్తూఉన్న అతని కావిషయం ఆనందదాయకంగా కనబడలేదు. కొన్నిరోజులు గడిచినతరవాత ఏదో ఖులాసా

బాతాఖానీలో తనుఅన్న మాటలన్నీ మహిముడివల్ల అచలచెవిలో పడతాయనికూడా అతను మాటిమాటికీ అనుకున్నాడు. ఆమె ఒకనాడు మహిముడిదగ్గిర సుఖస్వప్నాల్లో మునిగిపోతూ, ఈచేత గానిస్నేహితుడికి ఇంతఈర్ష్య ఎందుకుకలిగిందా? అని ప్రశ్నించుకుని ఉంటుంది. ఆమెచాలామితభాషిణి అందుచేత భర్తని ఆవిషయంలో ఆక్టై నొక్కినొక్కి ప్రశ్నించదుకూడాను! కాకపోతే ఒకసారి మనస్సులో "ఈయన తనస్నేహంవిషయంలో ఇంత అహంభావం పెట్టుకుని అనవసరంగా ఎంతశ్రమపడ్డాడు! అనవసరమైన గొడవల్లోపడి లోలోపల ఎంతబాధ పడుతూఉంటాడో! అనుకుంటుంది.

సురేశుడికి ఆరాత్రి సుఖంగా నిద్రపట్టలేదు. సరిగ్గా నిద్రపట్టేసమయానికి ఈ ఆలోచనలన్నీ కలిసి "సురేశా! నీకు ఒకళ్ల వ్యవహారాల్లో జోక్యం కలుగజేసుకోవాలనే బలహీనం ఎప్పుడు పోతుంది?" అనిప్రశ్నించాయి. పొద్దున్నే లేచిన తరవాత అతనికి ఏపని చెయ్యడానికీ కూడా ఇష్టం లేకపోయింది. కొంచెం పొద్దెక్కి ఎక్కడంతోనే అతనొక బండిలోకూర్చుని కేదారముఖర్జీగారింటికి వెళ్లాడు. అక్కడఉన్న నౌఖరు "బాబుగారు ఆలీపురంకోర్టుకి వెళ్లారనిన్నీ, వచ్చేలోగా నాలుగైదుగంటల ఆలస్యం అయినా కావచ్చుననిన్నీ" చెప్పాడు. సురేశుడు తిరిగి వెళ్లిపోవడానికి సిద్ధపడి "అయితే ఇద్దరూకూడా కలిసేవెళ్లారా ఏమిటి? "అని అడిగాడు.

ఆప్రశ్నకి అర్థం ఏమిటో ఆనౌఖరికి తెలియలేదు. వాడు "అదేమో నాకు తెలియదు బాబూ!" అన్నాడు.

సురేశుడు కొంత సందేహంపడ్డాడు. ఇంటియజమాని లేనప్పుడు వయస్సులోఉన్న ఆయనకుమార్తెను గురించిప్రశ్నించడం బ్రాహ్మమర్యాద అవునా? కాదా? అన్నవిషయం అతను తేల్చుకోలేకపోయాడు. అసలు అతనికి ఉన్న పని అంతా ఆఅమ్మాయితోనే! అల్లా కొంతసే

పాలోచించి చివరికతను 'బాబుగారు రావడంలో ఒకవేళ ఇంత ఆలస్యంకాకపోతే కాకపోవచ్చునుగా! నేను ఒక అరగంటసేపు కూర్చుని ఆయనకోసం ఎదురు చూస్తూ ఉంటాను" అన్నాడు.

నౌఖరు సురేశుణ్ణి తీసుకువెళ్ళి నాలుగుకుర్చీలున్న గదిలో కూర్చోబెట్టి "అమ్మాయిగారు ఇంట్లోనే ఉన్నారు. వారికి కబురుచెప్పనాండి!" అని సమాధానంకోసం సురేశుడికేసి చూస్తూ నుంచున్నాడు. సురేశుడు తనమనస్సులో కలిగినఅత్యంతాసక్తి ప్రయత్నపూర్వకంగా అణచివేసి, కొంచెంసేపు ఆలోచించాడు. అతనికి అచల తనతో వచ్చి మాట్లాడ్డానికి ఏమీసంకోచించదని ధైర్యంకలిగింది. అందుచేత పైకి ఆట్టే అంత ఇష్టంలేనట్టునటిస్తూ, "నేను వచ్చానని ఆవిడతో చెబుతావా! సరే చెప్పు! పోనీ అంతవరకూ ఆవిడితోటే కబుర్లు చెబుతూకూర్చుంటాను" అన్నాడు.

నౌఖరు లోపలికివెళ్ళిన కొంతసేపటిలోనే ఆపక్కనున్న తెర తొలగించి అచల లోపలికివచ్చింది. సురేశుడు ఆమెనుచూడ్డంతోనే లేచినుంచుని "మహిముడు ఇంటికి వెళ్ళిపోయాడు ఏల్లాగైనా ఒక్కసారి అతనుమిమ్మల్ని కలుసుకుంటే బాగుంటుందని నే నెన్నోసార్లు చెప్పాను; కానిఎంతచెప్పినా అతను నామాటచెవిని పెట్టేలేదు! ఇంత—" అన్నాడు.

ఒక్కక్షణకాలం అచల తెల్లబోయింది; కాని ఆమె అతనికి నమస్కారం చేసి అక్కడఉన్న ఒకకుర్చీమీద కూర్చుని "ఆయన ఇంటికి తొందరగావెళ్ళవలసిన పనిఏమన్నా ఉందేమో" అంది. ఇంటిదగ్గర ఎవరికీ జబ్బుచెయ్యలేదుకదా!" అంది.

అచల నమస్కారం చెయ్యడంజూసి సిగ్గుపడి, సురేశుడుకూడా తిరిగి నమస్కారం చేశాడు. ఆపైన అనవసరంగా తనుఆవేశంతో మాట్లాడ్డమూ ఆమెశాంతమూ ధైర్యమూ విడిచిపెట్టకుండా ఎంతోమర్యా

దగా మాట్లాడడమూ చూస్తే, అతనికి పూర్వంకంటె వెయ్యిరెట్లు ఎక్కువగా సిగ్గూ సంకోచమూ కలిగాయి. మళ్ళీ అతను తనకంఠ స్వరం సాధ్యమైనంత సహజంగా మార్చుకుని "ఎంతతొందరపనిఉన్నా ఉండవచ్చును. మీ యింటికి వచ్చి నాలుగైదునిమిషాలు మాట్లాడ డానికికూడా వీల్లేనంత పెద్దపనా అది? చెప్పండి ఆస లంతేకాదు! అతను తిరిగి మళ్ళీ ఎప్పుడువస్తాడో కూడా తిన్నగా తెలియదామీరి. అదీగాక, జ్వరంవచ్చిందని ఇంత తొందరగా పరిగెత్తుకలిసినంత బంధువు లెవరున్నారతనికి? నేనైతే ప్రాణాలు పోయినాసరే ఇల్లాంటిపనిచెయ్య లేను!" అన్నాడు.

ఆమాటమీద అచల ముఖంమీద సిగ్గూ స్నేహమూ కలిసిన ఒకచిరునవ్వు తాండవించింది. ఆమె "మీకింతవరకూ ఎవరూ లేరు! అందు చేతనే ఇల్లాగ మాట్లాడుతున్నారు. ఒకవేళ ఎవరైనా ఉంటే! వెనకా ముందూచూడకుండా ఈవిధంగావెళ్ళిపోయేవారే! నేను ఉన్న దున్నట్టు చెబుతున్నాను" అంది.

సురేశుడు తనుకూర్చున్న కుర్చీచేతిమీద గట్టిగా ఒకదెబ్బకొట్టి "నే నెప్పుడూ ఇల్లాచెయ్యను! మీకు నాసంగతి తెలియదు కాబట్టి ఇల్లాగ అంటున్నారు! తెలిస్తే ఎప్పుడూఇల్లాగ అనరు" అన్నాడు.

అచల "అయితే సరే! నే నెప్పుడో అప్పుడు పట్టుకుని చూపి స్తానుగా! అప్పుడంటురుగాని!" అంది.

సురేశుడు "ఓ! తప్పకుండా చూపించవచ్చును! సరే! దానికేం, అది అల్లాఉంచండి! మహిముడిదగ్గిర నేను స్నేహానికి సంబధించిన మాట ఏదీదాచలేను! అల్లాగ దాచడంకూడా మంచిదికా దనుకుం టాను!" అన్నాడు.

అల్లాగ అంటూనే మరింత ఉద్వేగంతో "మీరేదో ముందు నాదగ్గిర ఇల్లాంటిపొరబాటు పట్టుకుని చూపిస్తామంటున్నారు! దానికేం

గాని, మీకు ఏమీ తెలియకుండా ఇదంతా జరిగిఉండదు! ఎల్లాగైనా మహిముడూ మీరూ ఒకటే! ఈవేళనుంచీ మహిముడు నాకైతే ఆప్తుడో మీరూ అంతఆప్తులే!" అన్నాడు.

అచల సిగ్గుతో చిరునవ్వు నవ్వుతూ తలవంకించి . 'సరే! ముందు ముందు అంతా తెలుస్తుందిగా! కాని మిమ్మల్ని పరీక్షించినదాకా నేను మీ స్నేహితుణ్ణి దోషి అని అనలేను సురేశబాబూ!" అంది.

సురేశుడు వెంటనేమళ్ళీ గంభీరంగా "సరే! మీ యిష్టము! కాని నన్ను పరీక్షించేశుభదినం ఈజన్మలో వస్తుందా? రాదా? అని నా సందేహము! సరే! దానికేం! ఆమాట అల్లాగ ఉంచండి. ఈవేళ పొద్దున్నే బయలుదేరి ఇక్కడకి ఎందుకువచ్చానో తెలుసునా? నిన్న రాత్రి తెల్లవార్లూకూడా నాకు నిద్రపట్టలేదు! ఈవేళకూడా నిద్ర పట్టదనే అనుకుంటున్నాను. నేను అనేకమైన అపరాధాలు చేశాను. అవ్వన్నీ ఒక్కొక్కటే మీదగ్గిర చేసినట్టు ఒప్పుకుని, ఆపైన తిరిగి వెళ్ళిపోతాను. ఇందుకోసమే నేనిక్కడికి వచ్చాను" అన్నాడు.

అచలకి అతనిలో ఉండే భావోద్వేగం తెలియకపోలేదు. అందుచేత ఏదోశంకిస్తూ ఉన్నట్టు అతనికేసి చూస్తూకూర్చుంది. సురేశుడు మళ్ళీచెప్పడం ప్రారంభించాడు. "నిన్నసాయంత్రం ఇంటికి వెళ్ళేసరికి అక్కడ మహిముడు కూర్చునిఉన్నాడు. బ్రాహ్మసామాజికులికి నేనంటే కిట్టదని మీకు తప్పకుండా తెలిసేఉంటుంది. అంటే మరేమీ లేదు! బ్రహ్మసమాజం అంటే నాకు అట్టేఅంతమంచి అభిప్రాయంలేదు."

అచల అతనికేసి చూసి "అవును, నాకా విషయం తెలుసును" అంది.

సురేశుడు మళ్ళీ చెబుతూ "మీకు తెలియని దేముంది! కాని నేను బ్రహ్మసమాజం ద్వేషించేరోజుల్లో మీతో నాకింకా పరిచయం కలగలేదనే మాటమాత్రం మరిచిపోకండి! ఈకారణంచేతనే నేను

మహిముణ్ణి ఒక నెలరోజులదాకా ఇక్కడికి రావద్దని బలవంతపెట్టి ఆపేశాను! ఏం నేను చెప్పింది తెలియలేదూ? అన్నాడు.

అచల తల అడ్డంగాతిప్పి "లేదు" అంది. మళ్ళీ బహుశా మీరు "పురుషు లెవరినైనా మరిచిపోవడానికి ఒక నెలరోజులు గడిచిపోతే చాలు నని అనుకొంటుంటారు" అంది.

ఈ ఆఘాతం సురేశుడు ఎంతో సమభావంతో సహిస్తూ "నే నెప్పుడూ తెలిసితక్కువగానే ప్రవర్తించాను. అందుచేత ఏదో ఇంకు మించుగా ఇల్లాగే ఆలోచించి చేశాను. అసలు ఇంతకంటేకూడా దారుణమైన ఎత్తోటి ఎత్తాను. నేను ఈ నెలలోపుగానే మహిముడి కొకసంబంధం స్థిరపరిచి వివాహం చేసెయ్యాలని ప్రతిజ్ఞపట్టాను. ఏమైనాసరే! అతనికి మీసంబంధం తప్పించడం ఒకటే నాముఖ్యధర్మ మని నిశ్చయించేసుకున్నాను. నాస్నేహితు డయినకూడా అతనొక స్త్రీమోహంపాశంలో పడి హిందూసంఘం విడిచిపెట్టడ మనేది జరగనియ్య కూడదని నిశ్చయించుకున్నాను" అన్నాడు

అచల బిగపట్టినఊపిరి ఒక్కసారిగా విడిచిపెడుతూ "ఆపైన?" అని అడిగింది.

కత్తివాటువేసినా నెత్తురుచుక్కకనబడని ఆమెముఖంకేసి చూసి సురేశుడు నవ్వి "ఆపైన పెద్ద భయపడవలసిం దేమీజరగలేదు. నే నిప్పుడా పాపసంకల్పం పూర్తిగా విడిచిపెట్టేశాను! ఆవిషయం నేను మీఎదురుగుండానే అంగీకరిస్తున్నాను. నిన్నరాత్రి అతన్ని మిమ్మల్ని కలుసుకోమని ఎంతో బలవంతపెట్టాను. ఇంతకుపూర్వం నేను మీదగ్గిరికి రావద్దని అతన్ని అన్యాయంగా బలవంతపెడితే దానికతడు అంగీకరించాడు కాని ఈవిషయంలోమాత్రం నేను ఎంతబలవంతపెట్టినా నా మాట వినలేదు. ఆఖరికి మిమ్మల్ని కలుసుకోకుండానే కలకత్తావిడిచి పెట్టి వెళ్ళిపోయాడు" అన్నాడు.

అచల "వెళ్ళేటాని కేదైనా కారణం మీతో చెప్పారా?" అని అడిగింది. సురేశుడు "లేదు! ఏదో తొందరపని ఉందన్నమాటొక్కటీతప్ప మరే మిన్నీ చెప్పలేదు" అన్నాడు.

అచల ఒకపెద్దనిట్టూర్పు విడిచిపెట్టి, తనలోతను అనుకుంటూన్నట్టు "తొందరపని! జరూరు! ఆయన నోటమ్మట అస్తమానమూ ఈమాటలే! ఆయనతో ఎప్పుడూ ఇదేవ్యవహారం! ఎప్పుడూ ఆజరూరుపని ఒక్కటే ఆయనకి ముఖ్యకర్తవ్యంలాగ ఉంది" అంది.

సురేశుడు "మీ కతను ఒకఉత్తరంరాసి తనవ్యవహారం ఏమోకొంచెం సూచనగానైనా చెప్పవచ్చునుగా!" అన్నాడు. అచల అబ్బే! ఆయన ఉత్తరం ఎప్పుడూరాయరు!" అంది.

సురేశుడు కొంచెం సేపు ఏమీఅనకుండా ఊరుకున్నాడు. ఆపైన మళ్ళీ ముఖంఎత్తి అచలవైపు చూశాడు. అల్లాగ ఒక్కనిమిషం చూసి "అతొందరపని ఏమిటో! పోని చెప్పనైనా చెప్పడుగదా! అతని సుఖదుఃఖాలూ, మంచిచెడ్డలూ అన్నీ అతనిఒక్కడివే! కేవలం స్వార్థపరుడు. ఎప్పుడూ ఎవడికీకూడా తనగొడవ కొంచెమైనా తెలియ నియ్యలేదు! అతను చిన్నప్పటినించీ ఇల్లాంటి ప్రవర్తనవల్ల నామనస్సెన్నిసార్లు కష్టపెట్టాడో లెఖ్ఖలేదు! కఠినుడు! అతను ఒకదాని తరవాత ఒకటిచొప్పున ఎన్నిరోజులు ఎన్నిఉపవాసాలు చేసేవాడో చెప్పడంకష్టం! దానివల్ల నేను తిన్నతిండిలో విషంకలిసినట్టు బాధపడే వాణ్ణి! కాని ఎప్పుడూకూడా నాదగ్గిర్నించి ఒక్కపైసయినా పుచ్చుకునే వాడు కాడు! నాకు భయంఏమిటంటే—ఇల్లాంటి నల్లరాయితో స్నేహంచేసి నేనింతబాధ పడుతున్నానుగదా! చివరికివివాహం చేసుకుని మీరేంబాధ పడతారో! అని" అన్నాడు. అల్లాగ మాటాడుతుంటే చటుక్కుని అతనికళ్ళమ్మట నీళ్లు గిర్రునతిరిగాయి. చటుక్కుని ఆకన్నీళ్లు తుడుచుకుని, అతను ఒక్కసారి బలవతంగా

నవ్వి "చూడండి! పైకి నేను చాలా కఠినికుండె కలవాడిలాగ కనిపిస్తాను! కాని నాది చాలా మెత్తనిమనస్సు! మహిముడు దీనికి కేవలము వ్యతిరేకం! కాని మాలాంటి దగ్గిరస్నేహితులు ప్రపంచకంలో చాలా తక్కువమంది ఉంటా రనుకుంటాను!" అన్నాడు.

అచల తలవంచుకునే మృదుస్వరంలో "అంతా నాకు తెలునును. సురేశబాబూ! అంతేకాదు! ఇప్పుడుకూడా ఆస్నేహం అల్లా అక్షయంగా వృద్ధిపొందుతూందని నాఅభిప్రాయం" అంది.

ఆమాట వినేసరికి సురేశుడికి చిన్ననాటి పూర్వస్మృతులన్నీ కోలాహలంచేస్తూ ఒకి దానివెనక ఒకటిగ పైకివచ్చాయి. అతను గద్గదస్వరంతో "సరే! మీకివ్వన్నీ తెలియనే తెలునును! నేను మిమ్మల్ని ఒక్కభిక్ష పెట్టమని అడుగుతున్నాను. మీవిషయం ఏమీ తెలియక పోవడం చేత నాకు మీఅంతరవిషయంలోనూ ఒకవిధమైన ద్వేషముండేది. అల్లాగ ద్వేషించానని అనుకుంటే కూడా నాకిప్పుడుమనస్సులో బల్లెంగుచ్చుకున్నట్టుంది. నన్నుక్షమించి నాకింక అల్లాంటిబాధ లేకుండా చెయ్యండి! ఇదే నేనుకోరేభిక్ష" అన్నాడు.

భావావేశంచేత అతని కంఠస్వరం మళ్ళీ గద్గద మైంది. అతన్ని చూస్తే అచలహృదయంలో గూడా భావావేశం పొంగి పొర్లి వచ్చింది. సురేశుడు పైకి పొంగి పొంగి వస్తూన్నకన్నీళ్ళు తుడుచుకోడానికి పక్కకి మొహం తిప్పేటప్పటికి ఎదురుగుండా అచల తండ్రి ప్రత్యక్షమయ్యాడు! కేదారబాబు సురేశుణ్ణిచూసి సంతోషంతో "ఇదిగో! సురేశబాబు!" అన్నాడు. సురేశుడు లేచి ఆయనకి నమస్కారం చేశాడు.

కేదారబాబు కూర్చోకుండానే "మీకు మహిముడిసంగతి ఏమైనా తెలుసునా? అతను నాకీమధ్యన బొత్తిగా కనబడడంలేదు!" అన్నాడు. సురేశుడు మహిము డేదో తొందరపనిమీద పొద్దున్నబండిలో

ఇంటికి వెళ్ళిపోయాను. అసలీ విషయం చెప్పడానికే నే నిక్కడికి వచ్చాను" అన్నాడు.

కేదారబాబు నిర్ఘాంతపోయి "ఇంటికి వెళ్ళిపోయాడా? అన్నాడు. అల్లాగ అంటూనే అతను కోపంతో మండిపడి "ఇంటికి వెళ్ళిపోయాడా పోనీ! పోతే పోనివ్వండి! యింక అతనికీ నాకూ సంబంధం ఏమీ లేదు! కాని సురేశబాబూ! మీకెప్పుడైనా రావాలనిఉంటే కాస్త జూసుకుని, ఇలాగ మాయింటికి ఒకసారి వస్తూండండి! మీరువస్తే నే నెంతో ఆనందిస్తాను. కాని మీ మిత్రరత్నం ఇంక మాయింట్లో అడుగుపెట్ట డానికికూడా నే నంగీకరించను. ఎప్పుడైనా కలుసుకుంటేమాత్రం మీ రెండుకూ సిగ్గూబిడియమూ ఉండనక్కరలేదుగాని. అవమానానికైనా జడవ్వద్దా? అని అడగండి!" అన్నాడు.

సురేశుడు తలవంచుకుని కూర్చున్నాడు. కేదారబాబు అతని మనస్సులో ఉన్న అభిప్రాయం కనుక్కోడానికి ప్రయత్నించి కొంత ఉత్సాహంతో, చటుక్కున "అబ్బెబ్బె! సురేశబాబూ! యిందులో పెద్దసిగ్గుపడవలసిన విషయం ఏమీలేదు! మీరుచెయ్యవలసిన పనేదో మీరుచేశారు! దానికోసం మీరుగర్వపడవలిసిందన్నమాట! మీరు ఎల్లాంటి ఆపత్తులోంచి నన్నుల్ని రక్షించారో, దానికి మీయందు మేము ఎంతకృతజ్ఞతతో ఉన్నామో మీరు గ్రహించలేరు!" అన్నాడు.

ఆపైన అచలకేసి చూసి "నిన్నటినించీ ఈవిషయం తలుచుకుంటూంటే నాకు చాలాఆశ్చర్యంగా ఉంది. అసలా మహిముడు సురేశబాబు లాంటివ్యక్తితో ఎల్లాగ స్నేహంచేశాడు? చేసిన తరవాత ఆస్నేహం ఇంతకాలమూ ఎల్లాగ స్థిరంగాఉంది? అన్నాడు.

ఆతరవాత ఒక్కనిమిషం ఆగి, కేదారబాబు మళ్ళీ ఇల్లాగ అన్నాడు "ఇల్లాంటి మనిషి దేనిమీదా కోరికలేని మావంటి

వాళ్ళని మోసగించడంలో విశేషం ఏమీలేదు! కాని ఆశ్చర్యం ఏమిటంటే—నావంటి ఆవలిస్తే పేగులు లెక్కపెట్టే మనిషికికూడా "ఇతను ఎవడు? ఎల్లాంటివాడు! ఇతనిసంగతి పూర్తిగాకనుక్కుందాము" అనే అభిప్రాయమే కలగలేదు! ఎంతచిత్రము! అన్నాడు.

ఆమాటకి సురేశుడేమీ సమాధానం చెప్పలేదు! అంతేకాదు అతను ముఖంఎత్తి కేదారబాబుకేసైనా చూడలేదు! కేదారబాబు కొంచెంసేపు ఆగి, తనబట్టలకేసి చూసుకుంటూ "బాబూ! మీరు కొంచెం సేపు ఆగాలి! నేను ఇప్పుడే బట్టలు మార్చుకుని వస్తాను! నేను అడగవలసినవి ఎన్నో ఉన్నాయి" అనిచెప్పి లోపలికి వెళ్ళబోయాడు; కాని సురేశుడు "నాకు ఆలస్యం అయిపోతుంది ఈవేళనన్ను వెళ్ళనివ్వండి! మళ్ళీ ఎప్పుడైనా వస్తాను" అని ఒకవిధమైనకంగారుతో లేచి నుంచుని నమస్కారంచేసి వాళ్ళిద్దరికేసీచూసి మెల్లిమెల్లిగా వీధులోకి వచ్చేశాడు.

కాని ఆమర్నాడు ఉదయమే అతనక్కడికి వచ్చాడు. మూడోనాడుకూడా అల్లాగే సరిగ్గా ఆవేళకే అక్కడ అతనిబండి వచ్చి ఆగినచప్పుడైంది. ఆపైన నాలుగోనాడు కూడా అతని బండిఅల్లాగే అక్కడికి వచ్చినిలబడేసరికి అప్పుడే బాగాపొద్దెక్కింది. తండ్రిగారితో భోజనం చేద్దురుకాని స్నానానికిలెండని చెప్పి; అచల ఆయన్నిలేవదీయబోతోంది. కానిఇంతలోనే సురేశుడు రావడంచేత లేవడానికి వీల్లేకపోయింది. కేదారబాబు సురేశుణ్ణి కూర్చోబెట్టి కులాసాగా కబుర్లు చెప్పడంప్రారంభించాడు.

సురేశుడు ఈసంగతి గ్రహించాడు. అందుచేత అతను నాలుగైదు మామూలుమాటలు చెప్పి లేవబోయాడు; కాని కేదారబాబు అతనికేసి చూసి, గాఢరావడి "సురేశబాబూ! మీరీవేళ ఇంతవరకూ కూడా భోజనంచెయ్యనేలేదా ఏమిటి?" అని అడిగాడు.

సురేశుడు నవ్వి "నేను కొంచెం ఆలస్యంగా భోజనం చేస్తాంటానులెండి!" అన్నాడు.

కేదారబాబు సురేశుడు చెప్పేమాటలు ఏమీ వినిపించుకోకుండానే తనధోరణిలో గబగబా, "అయ్యో యో! ఇంతవరకూ ఇంకా స్నానమూ భోజనమూ కానేలేదూ? సురేశబాబూ! మీరిప్పుడు ఇంక ఒకనిమిషమైనా ఆలస్యం చేయవద్దు! ఇక్కడే స్నానంచేసి రెండుమెతుకులు నోట్లో వేసుకుందురుగాని! అమ్మా! అచలా! నువ్వేప్రయత్నం ఏదో కొంచెం త్వరగా చేయించు! అప్పుడే పన్నెండు కొట్టింది! అయ్యో యో! ఎంతపని జరిగింది!" అనిచెబుతూ, ఆప్రయత్నం అంతా స్వయంగా చేయించడానికి లోపలికి వెళ్లాడు.

అచల ఇంతవరకూ అల్లాగే కదలకుండా నుంచుండిపోయింది. ఇప్పుడుకూడా ఆమెలో చాంచల్యం ఏమీకనబడలేదు! తండ్రిగారు వెళ్లిపోయినతరవాత ఆమె మెల్లిగా "మీకు మాయింట్లో భోజనం చెయ్యడానికి అభ్యంతరం ఏమీలేదూ!" అంది.

సురేశుడు ముఖం ఎత్తి కొంత సేపు అచలకేసి చూసి, ఆపైన "మీరేమిటి అంటున్నారు!" అన్నాడు.

"మీరు బ్రహ్మసమాజస్థుల ఇంట్లో భోజనం చెయ్యరుగాదూ?

"భోజనం చెయ్యడం మాత్రంలేదు గాని మీరువచ్చి వడ్డిస్తే భోజనం చేస్తాను."

ఆపైన సురేశుడు మళ్ళీ ఒక్కనిమిషం ఉండి "నేను వేళాకోళానికి అంటున్నానని అనుకుంటున్నారేమో! కాని నేను వేళాకోళానికి అన్నమాటకాదు. మీరే పట్టుకువచ్చివడ్డిస్తే నేను తప్పకుండా భోజనం చేస్తాను" అన్నాడు.

ఇల్లాగ అన్నతరవాత సురేశుడుమళ్ళీ అచలముఖంకేసి చూడడం మొదలు పెట్టాడు. ఈసారిమాత్రంఅచల తలవంచుకుని లోలోపలనవ్వింది

పొంగివచ్చే నవ్వొవుగుంది. ఆపైన ఆమె ఒక్కక్షణంఆగి "నేను నిజంగానే మీరు వేళాకోళం చేస్తున్నారని అనుకున్నాను, నిన్న మొన్నటిదాకా మీలాంటివాళ్ళఇంట్లో భోజనం చెయ్యడమంటే ఎంతో అసహ్యంగా ఉండేది గదా! అల్లాంటి వారికి మీకీవేళ మాయింట్లో భోజనంచెయ్యాలని ఎందుకుకోరిక కలిగిందో నాకేమీ తెలియడం లేదు! సురేశబాబూ!" అంది.

సురేశుడు ఔదాసీన్యం వహించి ఎంతో బాధ పడతూన్నట్లు ధ్వనించేకంఠస్వరంతో "అయితే ఇన్నాళ్ళనించీ మీచేతిఅన్నం తినడం అంటే నాకసహ్యం అనిమీరు అనుకుంటున్నారా?" అనిఅడిగాడు.

అచల "అయితే ఇల్లాగ అనుకోడం సహజకాదూ; మీలాంటి బాగాచదువుకున్న వ్యక్తి, ఇన్నాళ్ళనించీ అవలంబిస్తూన్న ఆచార వ్యవహారాలన్నీ ఒక్కరోజులో ఏమీ కారణంలేకుండా విడిచిపెట్టేస్తారని అనుకోవడం స్వాభావికమూ? అంది.

సురేశుడు "అవును. ఇది స్వాభావికమని నేను అనను! కాని ఏమీ కారణంలేకుండా ఆచారవ్యవహారాలన్నీ విడిచిపెట్టేస్తున్నానని ఎందుకంటారు? కారణంఅనేది ఏదోఒకటి ఉండకపోదు!" అన్నాడు. అల్లాగఅంటూ అత నామెకేసి అదేపనిగా చూడ్డంప్రారంభించాడు. అతనల్లాగ చూడ్డం చూసి అచల ఆశ్చర్యపోయింది. ఆమె అతనికేసి చూస్తూనే, తను అన్నమాట మూలాన్ని అతని మనస్సుకి బాగాకష్టం కలిగిందని గ్రహించింది. అతనిమనస్సుకి కష్టం కలగ జేయడం వల్ల ఆక్షణంలో ఆమెమనస్సుకి కొంత ఆనందం కలిగిన మాట నిజమే! కాని అంతట్లో అతని ముఖం అల్లాగ మాడి పోతుందని ఆమె అనుకోలేకపోయింది. అసలంత ఎక్కువబాధపెట్టడం కూడా ఆమె తాత్పర్యంకాదు. అందుచేత ఆమె మనస్సులో నొచ్చుకుని తనన్నమాటలన్నీ మెల్లిమెల్లిగా వేళాకోళంలోకి దింపేసి,

బలవంతంగా ఒక్క నవ్వు నవ్వి "మీవంటి వ్యక్తిపరిజ్ఞులుకూడా—" అని ఏదో అనబోయింది.

అంతట్లో సురేశు ఆమాట అందుకుని "చివరికి సీరులాగ వలచబడిపోతారు!" అని పూర్తి చేశాడు. ఆపైన నెమ్మది గద్గదస్వరంతో "మీరు ఒక్క రోజు నక్షణంలో వచ్చిన భూకంపం వల్ల ప్రపంచకంలో సగానికిసగం పాతాళంలో కలిసిపోతుందన్న సంగతి మీకు తెలుసునా? ఒకరోజంటే సామాన్యం కాదు!" అని ఆగిపోయి అచేతనంగా చూడడం మొదలు పెట్టాడు. అతని ధోరణి చూస్తే అచలకి భయం వేసింది. సురేశుని మొహాన్ని నరకనాళాన్ని ఊసరవెల్లుల్లాగ ఉబ్బాయి! కళ్లుకూడా తళతళ మెరుస్తున్నాయి! అతని ధోరణి చూస్తే ఏదో ఒకవస్తువుని చటుక్కుని పరిగెత్తుకొని వెళ్ళి పట్టుకునేవాడిలా కనబడ్డాడు!

అసలే పైన బాగా ఎండగా ఉంది. ఆపైన అంతవరకూ స్నానమూ చెయ్యలేదు! భోజనమూ చెయ్యలేదు! అందుచేత అతనికి కాళ్ళ కింది నేలకూడా గజగజ వణికిపోతూన్నట్టనిపించింది. అతను చింత నిప్పుల్లాగ ఎర్రగాఉన్న కళ్లు రెండూ పెద్దవిచేస్తూ నేను బ్రహ్మసమాజస్థుల్ని ద్వేషించేదీ, లేదండీ, వాళ్ళకే సమాధానం చెబుతాను! నాదృష్టిలో మీరు బ్రహ్మసమాజస్థులందరికంటేకూడా చాలాగొప్పవారు!" అన్నాడు.

అతని ఆడున్మాదం అంతాచూసి, అచల భయపడిపోయి స్తబ్దురాలై పోయింది. అందుచేత ఆమె ఈప్రసంగం ఎల్లాగయినామార్చి వెయ్యాలనే ఉద్దేశ్యంతో గట్టిగా వంటమనిషిని పిలిచింది. కాని అతి మృదువైన ఆమెకంఠస్వరం సురేశుని కఠస్వరందాటి పైకి రాలేకపోయింది. అతను పూర్వంమోస్తరుగానే మంచితీవ్రస్వరంతో "అవును ఇదంతా రెండురోజుల పరిచయమే! అయితే రోజులచేతా, గంటల

చేతా, మహిముడిసంగతి కొలిచి చెప్పవచ్చును! కాని సురేశుడి సంగతి ఇల్లా చెప్పడానికి వీల్లేదు! అతను దేశకాలాలకి అతీతుడు! మీరు భూమినంతా కదిలించి ఒక్క ముద్దలో మింగివేసే భూకంపం ఎప్పుడైనా చూశారా!—" అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

అచల వేటగాడికి భయపడిన ఆడలేడిలాగ ఒక్క క్షణంలో లేచినుంచుని "మీస్నానానికీ దానికీ ఇంకా నేను ఏమీ ఏర్పాటు..." అని ఒక్క అడుగు ముందుకి వేసిందో లేదో!—అంతలో సురేశుడు కొంచెం ముందుకివంగి ఆమెకుడిచేయ్యి పట్టుకుని తనదగ్గిరికి లాక్కున్నాడు ఇల్లాగ మతిపోగొట్టుకునిచెయ్యి పట్టుకులాగితే స్త్రీసహించి ఊరుకోవడం అసంభవము! కాని అతను గట్టిగా లాగడంమూలాన్ని ఆమె అతనిశరీరంమీద పడింది. ఆమెభయంచేత నిర్ఘాంతపడి ఆర్తనాదంలో అస్పష్టంగా 'అమ్మో!' అని కేకవేసింది. ఆమె వేసిన కేక పెదవుల దాకా వచ్చేటప్పటికి సురేశుడు ఆమెరెండుచేతులూ తనగుండెదగ్గిరికి గట్టిగాలాక్కుని 'అచలా!' అని పిలిచాడు.

అచల రెండుకళ్ళూ పెద్దవిచేసి ఏదో మహేంద్రజాలంలో పడి స్మృతి తప్పిపోయినట్టు అతనికేసి అల్లా వెర్రిగా చూస్తూ నుంచుంది. సురేశుడుకూడా ఒకక్షణకాలం ఏమీ మాట్లాడలేకపోయాడు. బహుశః, అంతులేని పిపాసతో జ్వలించిపోతూన్న అతని పెదవులలోనించి ఒకనిశ్చలమైన తీవ్రజ్వాల ప్రజ్వలిస్తూ ఉండవచ్చును!

కొంతసేపటిదాకా అల్లాగఉండి సురేశుడు మళ్ళీ ఆమెరెండు చేతులూ తనహృదయంమీద ఉంచుకుని ఆవేశంతో ఇల్లా అన్నాడు; అచలా! ఆభూకంపానికి సంబంధించిన హృదయస్పందనం ఎల్లాగ ఉంటుందో ఒకసారి మీహస్తాలతో అనుభవించండి. అబ్బా! ఈహృదయంలో ఎంతభయంకరతాండవం జరుగుతూంది! ఏభూకంపంతో సరి పోల్చినా ఇది దానికంటే తక్కువఅనడానికి వీలుందా? ప్రపంచంలో ఉన్న

ఏధర్మంగాని, ఏమతంగాని, ఏజాతిగాని ఇందులోపడి పాతాళానికి వెళ్లకుండా ఉంటుందని చెప్పగలరా!''

అచల "వడ్డించిపెట్టేస్తున్నాను! నాన్నగారు వస్తున్నారు!'' అని బలవంతంగా తనచెయ్యిలాక్కొని మళ్లీకొంత తమాయించి తనకుర్చీమీద కూర్చుంది. ఆమరుక్షణంలోనే కేదారబాబు ఆగదిలోకివచ్చి "ఏం చెయ్యడం! బాగా ఆలస్యంఅయిపోయింది! ఈవంటమనిషి ఉండి ఉండి ఎక్కడికి వెళ్లాడో కూడా తెలియకుండా ఉంది! అమ్మా' అచలా! ఇదేమిటి! నీఒంట్లో బాగుందా? ముఖంఅంతా అల్లా ఎండిపోయినట్టుందేమిటి?'' అన్నాడు.

అతనివాక్యం పూర్తిఅవగానే అచల ఏదోవిధంగా కొంత నవ్వడానికి ప్రయత్నించి "ఒంట్లో బాగుండక పోవడం ఏమిటి? బాగానే ఉంది!'' అంది.

"పోనీ ఏమన్నా తలకాయనెప్పిగా ఉందా? పైన చూస్తేబాగా వేడిగా——''

"అబ్బే! ఏమీ లేదు! నాన్నగారూ! ఒంట్లో నిక్షేపంలాగ ఉంది''

కేదారబాబు అప్పటికి కంగారు మానేసి నిశ్చింతగా "అయితే, సరే కాని నీమొహం చూసేటప్పటికి నాకు భయంవేసింది. అయితే నువ్వే వెళ్ళి ఆప్రయత్నం చూడమ్మా! అయితే——''అన్నాడు.

అచల "అల్లాగే నాన్నగారు! నేను ఒక్కనిమిషంలో అన్నీ సిద్ధంచేస్తాను.కాని నేను ఇప్పుడే సురేశబాబుగారిని "ఇక్కడ భోజనం చెయ్యడానికి ఏమీ అభ్యంతరం ఉండదుగదా! అని అడిగాను'' అంది.

కేదారబాబు ఆమాటకి ఆశ్చర్యపడి 'ఆఁ' ఇందులో అభ్యంతరం ఏముంటుంది? అబ్బే! ఏమీఉండదు! సురేశబాబూ! నేను మీతో ఒకసారి మీరు మాఅబ్బాయిలాంటివా రని చెప్పలేదూ? ఇది కేవలం

మీనాన్నగృహంలాంటిది!" అన్నాడు.

ఆపైన మళ్లీ అచలకేసి తిరిగి సగౌరవంగా "కేవలం మనిషి ఉద్ధరించడానికి కాకపోతే భగవంతుడు ఈయన్నిక్కడికెందుకు పంపిస్తాడు!—అయితే ఇంక ఆలస్యం చెయ్యవద్దు. నాతో కూడా రండి! మిమ్మల్ని స్నానాలగదిలోకి తీసుకువెడతాను." అన్నాడు.

కాని సురేశుడు కేదారబాబు గదిలోకి రాగానే చూసి వంచినతల ఇంతవరకూ కూడా తిరిగి ఎత్తలేదు.

అచల "నాన్నగారూ! ఇంకా చెప్పడం ఎందుకు? మనలాంటి బ్రహ్మసమాజస్థుల ఇళ్ళల్లో భోజనంచేస్తే, ఆయన కేదైనా ఇబ్బంది ఉండవచ్చును. అదీగాక ఇష్టంలేకుండా భోజనంచేస్తే ఆరోగ్యంకూడా పాడైపోతుంది" అంది.

దానివల్ల కేదారబాబు హృదయానికి కేదో ఆఘాతం కలిగినట్లైంది. అతను అబ్బే! అదేమిటి? సురేశబాబు పెద్దయింటిబిడ్డ. ఆపైన సర్వస్వతంత్రుడుకూడాను. ఇక్కడికి అస్తమానమూ వస్తూపోతూ ఉంటారు గదా! ఆయన ఇక్కడ భోజనంచేస్తే స్వయంగా ఇష్టపడి చేసినట్టనిపిస్తుందిగాని పరోవిధంగా భావించడానికి వీలుండదు!" అన్నాడు. ఆపైన తలవంచుకుని అల్లాగే నిలబడిన సురేశబాబు కేసి చూశాడు. చూసీచూడ్డంతోనే ఆశ్చర్యంతో నిర్ఘాంతపడి "ఇదేమిటి! సురేశబాబు ఇలాఉన్నారు! ముఖంఅంతా ఎండిపోయినట్టుంది! సురేశబాబూ లేవండి! లేవండి! ఇంకఆలస్యం చెయ్యకండి! తక్షణం లేచి కాళ్లూ చేతులూ కడుక్కోండి" అనిచెప్పి, సురేశుడి చెయ్యి పట్టుకుని బలవంతంగా అక్కడినించి తీసుకువెళ్ళాడు.

౮

భోజనాలూ అవీ అయినతరవాత కేదారబాబు సురేశుణ్ణి ఎండలో ఇంటికి వెళ్ళనివ్వనేలేదు! విశ్రాంతి అని పేరుపెట్టి ఒకగదిలో అతన్ని

వైరుచేశాడు. సురేశుడు కళ్ళుమూసుకుని ఒకకుర్చీలో కూలబడ్డాడు. ఎంతప్రయత్నించినా అతనికి ఒక్కకునుకైనా పట్టలేదు! పైన ఆకాశం మీద సూర్యుడు నిప్పులుచెరుగుతున్నాడు. అతనికి ఆత్మనిగ్రహం లేకుండా ప్రవర్తించినవిషయం తలుచుకుంటే అంతకురెట్లు వదిరెట్లు ఎక్కువ బాధకలిగింది. ఈవిధంగా రోజల్లా ఆబాహ్యాంతరజ్వాలలవల్ల వేగిపోయి. అతను జీవచ్ఛవంలా తయారయ్యాడు. చివరికి కొంతసే పటికి అతనులేచి ఎదురుగుండా ఉన్న కిటికీ తెరిచి చూసేటప్పటికి ఇంచుమించుగా సూర్యాస్తమయం కావచ్చింది. కేదారబాబు అత నున్న గదిలోకివచ్చి ఒక పెద్దనిట్టూర్పు విడిచి "అబ్బా! ఈ వేళ ఎంత ఎండగాఉంది సురేశబాబూ! ఇన్నాళ్ళనించి చూస్తున్నాను! కల కత్తాలో ఎప్పుడూ ఇంతదారుణంగా ఎండకాయలేదు! మీా కేమన్నా కాస్తనిద్రపట్టిందా? అని అడిగాడు.

సురేశుడు ఆయనకేసిచూసి, "అబ్బే! నేను పగలు ఎప్పుడూ నిద్రపోను" అన్నాడు.

ఆమాటమీద కేదారబాబు చటుక్కుని "అసలు నిద్రపోవడం కూడా మంచిదికాదు; దానివల్ల ఆరోగ్యంపాడవుతుంది. అయినాగాని మీాకు పంకాలాగేవాడు తిన్నగా లాగుతున్నాడో లేకపోతే నిద్ర పోతున్నాడో అని నాలుగైదుసారులు ఇవతలికివచ్చి చూశాను. ఈపంకా లాగేవాళ్ళున్నారే! వీళ్ళతో మహాచెడ్డయిబ్బంది! మీారు కొంచెం కళ్ళుమూశారనేటప్పటికి వాళ్ళుకూడా కునికిపాట్లు పడడం ప్రారంభిస్తారు. సరే! ఇప్పుడుకాస్త వొంట్లో బాగాఉందా? మీారీ ఎండలోవీధిలోకి వెడితే, మరింత యిబ్బంది పడతారని నాకుతెలుసును" అన్నాడు.

దానికి సురేశుడేమీా సమాధానంచెప్పకుండా మాట్లాడ కూరుకు న్నాడు. కేదారబాబు కిటికీలన్నీ వొక్కొక్కటే తెరచి, తను

కూర్చున్న కుర్చీ అతనికి దగ్గిరగాలాక్కొనికూచుంటూ "సురేశ బాబూ! ఇందులో పెద్ద ఆలోచించవలసిం దేమీ లేదని నా అభిప్రాయము. మహిముడికి స్పష్టంగా వొకపుత్త్రరం రాసివా రేద్దామని అనుకుంటున్నాను. మీ రేమంటారు?" అన్నాడు.

ఈప్రశ్న వినేటప్పటికి సురేశుడికివీపుమీద కమ్చీతో చురుక్కుమని కొట్టినట్లయింది. అత నొక్కసారి వులిక్కిపడ్డాడు. అదిచూసి కేదారబాబు మళ్ళీ "ఇతరులికి కష్టంగావున్నా, మనకి విధాయకమైన పనులు ఎల్లాగ చెయ్యాలో ఆవిషయమంతా యింతకుపూర్వమే నేను మీవల్ల నేర్చుకున్నాను. యింతవరకువచ్చాక మీరింక వెనక్కి తిరిగితే ఏమీలాభంలేదు" అన్నాడు.

సురేశుడు కొంచెంసేపు మౌనంగావుండి "మీరు చెప్పేమాటేమో బాగా నేవుంది. కాని ఈవిషయంలో మీఅమ్మాయి అభిప్రాయం కూడా కనుక్కోవడం మంచిది" అన్నాడు. ఆమాటమీద కేదారబాబు కొంచెంనవ్వి "అవును మీరన్నమాట సబబే!" అన్నాడు.

"ఆమెకూడా స్పష్టంగా ఉత్తరంరాసెయ్యమని అంటూందా?"

కేదారబాబు ఈప్రశ్నకిసూటిగాసమాధానం చెప్పక "యించుమించుగా అంతేఅనుకోండి! ఈవిషయాలన్నీ ముఖాముఖిని కుండబద్దలుకొట్టినట్లు మాట్లాడడం అందరికీ కష్టంగానే ఉంటుంది. ఇందులో నాకు కొంత అనుభవంకూడా కలిగింది. ఈవిషయాలన్నీ షడ్డోదారిలోకి తీసుకురాకపోతే, ఈయితిభ్రమణం ఎందాకా వెడుతుందో అని నాకు భయంగాఉంది. అందుచేత ఈవిషయం ఏదో యీవేళరాత్రి తేల్చేద్దామని అనుకుంటున్నాను." అన్నాడు.

ఆమాటతో సురేశబాబు ముఖం వాడిపోయింది. అతను "అయితే దీనికింత తొందరెందుకు? ఏదోనాలుగైదు రోజులు ఆలోచించి ఆపైనరాస్తే బాగుంటుంది" అన్నాడు. కేదారబాబు "ఇందులో

ఇంక ఆలోచించే దేముంది! నేను మా అమ్మాయిని ఇంక అతనికి ఇవ్వకూడదనినిశ్చయించాను. అల్లాంటప్పుడు ఈవ్యవహారంఎంతశీఘ్రముంగా పరిష్కారంచేస్తే అంతమంచిది!" అన్నాడు.

సురేశుడు "అయితే ఈవ్యవహారంలో నా పేరుకూడాచేర్చాలా!" అన్నాడు.

కేదారబాబు "నేనింత ముసలివాణ్ణయిపోయాను. నాకీమాత్రం ఆలోచనకూడా ఉండదనుకుంటున్నారా? ఈవిషయంలో ఎప్పుడూ కూడా మీప్రస్తావనే రానివ్వను!" అన్నాడు.

సురేశుడు అమ్మయ్యా, అనుకుని ఒక్కనిట్టూర్పు విడిచిపెట్టాడు; కాని ఆతరవాత అతనేమీ అనలేదు! ఊరికే మాట్లాడకుండా కూర్చున్నాడు. ఈవిషయం కేదారబాబు గమనించకపోలేదు. పైగా అతనీమధ్య ప్రవర్తించిన దాన్నిబట్టి కేదారబాబు మనస్సులో ఒక విషయంలోఒకసందేహం కలిగింది. ఆసందేహం అటో ఇటో తేల్చుకుందామని నిశ్చయించుకుని "సురేశబాబు! మీరీవిషయంలో మా కొక మహోపకారం చేశారు. ఇంతకంటేకూడా పెద్దఉపకారం ఒకటి మీవల్ల మేము అపేక్షించిఉన్నాము. మేము బ్రహ్మసమాజస్థులమే కాని, అందరిదారీ వేరు! మాదారి వేరు. అపైన మాఅమ్మాయి తల్లిమోస్తరుగా చిన్నప్పటినించీ లోలోపల హిందువుగానే ఉండిపోయింది. చిన్నప్పణ్ణించీకూడా దానికి బ్రహ్మసమాజస్థులధోరణి అంటే ఆట్టే ఇష్టంలేదు! అన్నాడు.

సురేశుడు ఎంతోఆశ్చర్యపడి ముఖం ఎత్తి కేదారబాబు కేసి చూశాడు. సురేశుడిమనస్సులో పైకికనబడకుండా ఇంతవరకూ అణిగి ఉన్న ఈఔత్సుక్యంగమనించి, కేదారబాబు "అమ్మాయికి ఎప్పుడో అప్పుడు వివాహంచెయ్యాలిగదా! ఈవిషయంలో మాత్రం నేను మీఅందరికిమల్లేనే ప్రాచీన హిందూసంప్రదాయాన్నే ఎక్కువగా గౌర

విస్తాను, సురేశబాబూ! ఒకసంబంధం మీమూలాన్ని విడిచిపెట్టేస్తు న్నాము. కాబట్టి కాస్తఏదైనా మంచిసంబంధం ఒకటి మీమాపించేపూచీ కూడా మీమీదే ఉంది'' అన్నాడు

సురేశుడు "చిత్తం అల్లాగే! ఈవిషయంలో నేను నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను!'' అన్నాడు.

ముఖంమీాద ప్రతిబింబించిన అతనిఅభిప్రాయంగమనించడానికి ప్రయ త్నిస్తూ, కేదారబాబు మళ్లీ కొంతసంకోచించి ఇల్లాగ అన్నాడు. "బ్రహ్మసమాజస్థుల్లో ఈవిషయంమీాద కొంతకలవరం బయలుదేరే టట్లుంది అందుచేత ఎంతశీఘ్రంగాపీలయితే అంతశీఘ్రంగా అచలకి వివాహంచేసేస్తే. ఇల్లాంటి గొడవేమీ బయలుదేరడానికి వీలుండదని చూస్తున్నాను; కానిసురేశబాబూ! ఇందులో ఒకపెద్ద ఇబ్బంది మాత్రం లేకపోలేదు.''—

అని ఆపైన కేదారబాబు తలుపులవతలికి తొంగిచూసి, సురేశు డికి బాగా దగ్గిరిగావచ్చి "సురేశబాబూ! అసలుచిక్కెక్కడుందంటే వరుడు కాస్త రూపవంతుడూ గుణవంతుడూ అయినా, హిందూ సంఘంలోలాగ చటుక్కుని పిల్లనతనికి కట్టిపెట్టడం కష్టం! పిల్ల చిన్నప్పటినించీ శాస్త్రచదువుసంధ్యలున్న కుటుంబంలో పుట్టి పెరిగింది. మరి యిప్పుడు బాగాపెద్దదైంది. అందుచేత అమ్మాయికి ఏమీకూడా చెయ్యడానికివీలుండదు. అయితే, కాస్త పిల్లకీ పిల్లవాడికీ మనస్సులు కలిస్తే తప్ప అమ్మాయిఅభిప్రాయం ఏకోనిశ్చయంగా తెలియదు; ఏం! నేనుచెప్పింది తెలియలేదూ!'' అన్నాడు.

యీమాటలు వింటూవింటూ సురేశుడు కొంత పరధ్యానంలో పడ్డాడు. యీనూతన ప్రేమాఘాతంవల్ల అతనికిశరీరంమీాద స్పృహ తప్పిపోయింది. మధ్యాహ్నంవేళ మంచీచెడ్డా చూడకుండా తను చేసిన అభీభత్స వ్యవహారం అంతా తలుచుకుంటే అతనిముఖం

వొక్కసారిగా నల్లబడి పోయింది. ఆవేళ పొద్దున్నే వచ్చినవార్తా పత్రిక అక్కడే అతనికాళ్ళమీదపడివొర్లుతూంది. అతనది చేత్తోపుచ్చుకుని అందులో వున్న ప్రకటనలన్నీ అదేపనిగా చూడ్డం మొదలుపెట్టాడు.

శేఖరబాబు యీవిషయం గమనించాడు. సురేశుడిలోకలిగిన యీ ఆకస్మికమైన మానసికపరివర్తనానికి సరిగ్గా తల్లక్రిందులుగా అర్థంతీసుకుని అతనెంతో ఆనందించాడు. అతనిశరీరం అంతా వొక్కసారిగా గగుర్పొడిచింది. ఆపైన అనుకుదొరికిందని వొకబ్రహ్మాండమైన ఎత్తువెత్తాలని సంకల్పించి సురేశుడితో "సురేశబాబూ! నాకొక్క విషయంమాత్రం మహావిచిత్రంగాకనిపిస్తుంది. ఆజన్మాంతమూ పరిచయం ఉన్నా ఒక్కొక్క వ్యక్తిమీద మనకిఏమాత్రమూ నమ్మకంకలగదు. ఒక్కొక్కవ్యక్తితో రెండుమూడుగంటల పరిచయం కలిగేటప్పటికి అతనిచేతుల్లో మనప్రాణాలు సమర్పించినా ఏమీ ఇబ్బంది ఉండదనిపిస్తుంది. ఆవ్యక్తితో మనకికేవలం రెండుమూడుగంటల పరిచయామే ఉన్నప్పటికీ. ఏదో పూర్వజన్మ సంబంధం ఉన్నట్టనిపిస్తుంది. పైమాటఎందుకు? మీసంగతి చెప్పండి సురేశబాబూ? మీతో నాకు కలిగినపరిచయం ఎంత?" అన్నాడు.

సరిగ్గా ఈసమయానికే అచల ఆగదిలోకి వచ్చింది. సురేశుడు ఒక్కసారి ఆమెకేసి కళ్ళెత్తిచూసి మళ్ళీపేపరు చదువుతూ కూర్చున్నాడు.

"అన్నగారూ! మీరిప్పుడు టీతాగుతారా? కోకోతాగుతారా?"

"నేను కోకోయే తాగుతానమ్మా!"

"సురేశబాబూ! మీరు టీ తాగుతారు కదూ?"

సురేశుడు పేపరుకేసిచూస్తూ అస్ఫుటస్వరంతో "నాకు టీయే ఇవ్వండి" అన్నాడు.

"మీకు పంచదార చాలావెయ్యాలికాదూ?"

“అబ్బే! నలుగురికీ ఎల్లా వేస్తే నాకూ అల్లాగే వెయ్యండి”

అచల వెళ్ళిపోయింది. కేదారబాబు తను ప్రారంభించిన వ్యవహారం మళ్ళీ ప్రస్తావిస్తూ మెల్లిగా “సురేశబాబూ! మీరీసంగతి చెప్పండి! ఈముసలితనంలో నేనీ పిల్ల పెళ్ళికోసమని ఎంతబాధ పడుతున్నానో పరమేశ్వరుడికే తెలియాలి! నేనీవ్యవహారం అంతా మీతో చెప్పకుండా ఉండలేకపోతున్నాను! లేకపోతే తనగృహచ్ఛిద్రాలన్నీ ఎవడన్నా పరాయివాడితో చెప్పుకుంటాడా? నేనింతవరకూ ఎవ్వరికీ తెలియనివ్వనిమాట మీతో చెబుతూంటే నా కేవిధమైన సంకోచమూ కలగడంలేదు! దీనికి కారణంఏమిటి? దీనికిఏదో అనూహ్యమైన ఒక పూర్వజన్మసంబంధం ఉండితీరాలి! ఏం తెలియలేదూ?” అన్నాడు.

సురేశుడు ఆశ్చర్యంతో నిర్ఘాంతపోయి, ముఖంఎత్తి ఆమాటలన్నీ అల్లాగే వింటూకూర్చున్నాడు. కేదారబాబు మళ్ళీప్రారంభించి. “ఈ చెప్పడమనేది కేవలం పరమేశ్వరుడి ఆజ్ఞ. చెప్పకుండా ఉండడం నా తరమా? చెప్పవలసివచ్చినప్పుడు చెప్పితీరాలి!” అని కుర్చీచేతిమీద వొక్కదెబ్బకొట్టాడు.

కాని కేదారబాబుచెప్పిన ఈపెద్దఉపోద్ఘాతంతరవాత, కుమార్తె వివాహంలో ఆయనదురవస్థ ఎల్లాంటిదో తెలిసికోవడం సురేశుడికి కష్టమైంది. అందుచేత కేదారబాబు తనవిషయం అంతా సవిస్తరంగా చెప్పాడు. “సురేశబాబూ! నేనొకపెద్దవ్యాపారం చేసేవాణ్ణి. కేవలం కొందరిదుర్మార్గంవల్లా! కృతఘ్నతవల్లా ఆవ్యాపారం అంతా గంగలో కలిసిపోయింది. అయినా నేను చాలాకాలందాకా ధైర్యంగానే నిలబడ్డాను. ఆపైన ఋణం క్రమక్రమంగా పెరిగింది. ఆఖరికి నాఒక్కకూతురి చదువుకికూడా తగినంతడబ్బు లేకపోయింది. ఆపైన నామీద అయిదారు దావాలు డిక్రీలయ్యాయి. వాటిమూలాన్ని

నాకు రాత్రింబవళ్లు అన్నంకూడా సయించేదికాదు. ఈఅప్పుల తగాదాలమూలాన్ని ఆఖరికి జీవితమే దుర్భరమైపోయింది. అయినా గాని నేను నోరువిడిచి ఎవ్వరినీ ఏసహాయమూ అడగలేను! తలుచుకుంటే నిమిషంలో నాఅప్పులన్నీ తీర్చేసి నాకు సహాయంచెయ్యగల స్నేహితు లెందరో యీపట్టణంలో ఉన్నారు. అయితేఏం! నేను మాత్రం ఎవ్వరినీ సహాయం కోరలేకపోతున్నాను!”

మళ్ళీ కేదారబాబు కొంచెంసేపు కొంత ఆలోచించినట్లు నిశ్చలంగాఉండి “అయితే సురేశబాబూ! మీతో యీవిషయం చెప్పడానికి నా కేవిధమైన సంకోచంగాని సందేహంగాని కలగలేదు! ఇది కేవలం పరమేశ్వరుడి ఆదేశం కాకపోతే మరేమిటి? అని చెప్పి, రెండు చేతులూ పైకెత్తి ఎంతో భక్తితో పరమేశ్వరుడికి నమస్కరించాడు.

సురేశుడికి భగవంతుడిమీద నమ్మకంలేదు. అందుచేత అతనా భక్తిభావంలో కేదారబాబుతో ఏకీభవించలేకపోయాడు. అయినా గాని అతను మనస్సులో కొంతబాధపడి, మళ్ళీ ధైర్యం తెచ్చుకుని “అయితే మీకు ఋణం ఎంతఉంటుంది” అని అడిగాడు.

కేదారబాబు “ఋణమా? నావ్యాపారమూ అదీ తిన్నగా సాగితే ఈఋణ మొకలెఖ్ఖా! ఇంచుమించుగా మూడునాలుగువేలుంటుందనుకోండి!” అని చెప్పి ఇంకాఏదో చెప్పబోతూంటే, అచల ఒక నౌకరుచేతులో టీ సామానులూ అవీ పెట్టి తనచేతితో మంచినీళ్ళ కూజా పట్టుకుని ఆగదిలోకి వచ్చింది.

కేదారబాబు వేడివేడిటీలో ఒకగుక్క తాగి, సంతోషసూచకమైన ఒక అవ్యక్తధ్వని చేసి, గిన్నె బల్లమీదపెట్టి మళ్ళీ “చూడండి సురేశబాబూ! పరమేశ్వరుడికి నామీద అత్యద్భుతమైనదయ ఉంది. అందుచేతనే ఇంతవరకూకూడా నాకుజీవితంలో ఒకడిదగ్గిర తలవంచుకోవలసిన అవస్థ పట్టలేదు. ఇన్నాళ్ళనించీ మహిమునితో ఈమా

టలు అనాలనుకుంటూనే అనలేకపోయేవాణ్ణి. పరమేశ్వరుడీమాటలు నానోటమ్మట రానీకుండాచేశారు. ఈవిధంగా ఎందుకు చెప్పలేక పోయేవాణ్ణో నా కిప్పుడు బాగా బోధపడింది" అన్నాడు. ఆపైన తలమీద రెండుచేతులూ జోడించి, పరమేశ్వరుడి దయతలుచుకుని హృదయపూర్వకంగా నమస్కరించాడు.

సురేశుడు తను తాగేగిన్నెకేసి చూస్తూ "తమకి రూపాయలు ఎప్పుడు అవసరంఅవుతాయి" అనిఅడిగాడు. కేదారబాబు తాగే కోకోగిన్నె బల్లమీద పెట్టి "నాకు డబ్బుఅవసరం ఏముంది బాబూ అదేమున్నా ఉంటేమీకే!" అంటుచెప్పి, ఒకవిధమైన దర్జాగానవ్వు నవ్వాడు. ఇదేదో సురేశుడికి మొట్టమొదట బోధపడలేదు. అందుచేత అతను ముఖం పైకెత్తి చూశాడు. అచలకూడా ఇదేమిటో బోధపడక తెలుసు కోవాలనే ఉద్దేశంతో తండ్రిగారి ముఖంవైపు చూస్తూంది. కేదార బాబు ఒకసారి కూతురుకేసీ, ఇంకోసారి సురేశుడికేసీ చూసి నేను చెప్పినదానిలో బోధపడక పోవడాని కేమీ లేదు, ఈఇల్లూ అదీ నేనేమీ కూడా తీసుకు వెళ్ళనుగదా! ఇదిమిగిలితే మీయిద్దరికీ మిగులు తుంది" అనిచెప్పి ఒక చిన్న చిరునవ్వు నవ్వాడు.

వెంటనే ఆఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. ఆఉత్తరక్షణంలోనే వారిద్దరూ ఎర్రబడిన తమతమ ముఖాలు వంచుకున్నారు. రెండు కప్పుల కోకోపూర్తిచేసేసిన మరుక్షణంలో కేదారబాబుకి జవాబుగా రాయవలసిన ఒకఉత్తరంసంగతి జ్ఞాపకం వచ్చింది. అతను చటుక్కుని లేచి నిలబడి "సురేశబాబూ! ఈవేళ మిమ్మల్ని భోజనానికి చాలా ఇబ్బంది పెట్టాము. రేపు మధ్యాహ్నంకూడా మీరు మాఇంట్లో భోజనం చెయ్యాలి" అని పిలిచి పడమటివైపునున్నతలుపు తెరచి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

తెరవబడిన ద్వారంలోంచి, సాయంకాల సూర్యకాంతి, తళుక్కుమని

సురేశుడిముఖంమీద పడింది. చటుక్కుని ముఖంఎత్తి చూసేటప్పటి కతనికి అచల తదేకధ్యానంతో చూస్తోన్నట్టుకనబడింది. అతను చటుక్కుని దృష్టి మరొకవైపుకి త్రిప్పేశాడు. రెండుసమిషాలతరవాత ఆగదిలోఉన్న పెద్దగడియారం టిక్కుటిక్కు మనడంతప్ప మరేశబ్దమూ వినబడలేదు.

౨

ఆగదిలో వ్యాపించినప్రశాంతి భంగపరుస్తూ సురేశుడు "హాస్యాం డగా ఒకచెడ్డపని చేసేశాను" అన్నాడు. అచల ఏమీ మాట్లాడలేదు సురేశుడు మళ్ళీ "సత్యముంగా నేను మీ కొకరాక్షసుడిలాగ కనబడి ఉంటాను. బహుశః నాతో ఒంటరిగా కూర్చోడానికికూడా మీకు భయం వేస్తూందనుకుంటాను" అని హఠాత్తుగా నవ్వడం ప్రారంభిం చాడు. అచల ఇప్పటికీకూడా ముఖంపైకెత్తలేదు! కాని తరవాత తరవాతఒకసారి సురేశుడిముఖంకేసి చూసింది. అంతబలవంతంగా నవ్వడంమూలాన్నీ, అవమానంవల్లా, సిగ్గువల్లా అతనిముఖం వికృతమైపోయినట్లు కనబడింది;

మళ్ళీ ఆగదిఅంతా నిశ్శబ్దంతో నిండిపోయింది. ఆగోడమీదఉన్న గడియారంమాత్రం టిక్కుటిక్కు మని ధ్వనిచేస్తూ ఆనిశ్శబ్దతకి భంగం కలిగిస్తోంది. కొంతసేపటికి అల్లాగ నిశ్శబ్దంగా కూర్చోడం దుర్భర మైపోయింది. అతను చటుక్కుని నిటార్గా కూర్చుని "చూడండి! ఇంతవరకూజరిగినతరవాత మనం ఇంక మొహామాటపడుతూకూర్చో డంవల్ల ఏమీలాభం లేదు, సూర్యాస్తమానం అయింది; అప్పుడే చీకటి పడుతూంది కూడాను, అందుచేత ఇప్పటికి నేను వెళ్ళిపోతాను. కాని వెళ్ళేముందు ఒకటిరెండు విషయాలు మిమ్మల్ని అడగా లను కుంటున్నాను. చెబుతారా? అన్నాడు.

అచల మొఖంఎత్తి చూసింది. అతనికేసి చూస్తే ఎంతో బాధ వడుతూన్నట్లు కనబడ్డాడు. ఆమె "చెబుతాను; అడగండి" అంది.

సురేశుడు కొంతసేపు నిశ్చలంగా ఉండి "మాతృశ్రీగారి అప్పు తీర్చి వెయ్యడానికి నేను రేపోఎల్లుండో ఒకసారి ఇక్కడికివస్తాను. కాని బహుశః ఇక మీతో కలుసుకోవలసిన అవసరం ఉండదనుకుంటాను; అయితే మన ఇద్దరివిషయంలోనూ ఆయన అభిప్రాయం ఏమిటో మీకు తెలుసునా!" అనిఅడిగాడు.

అచల "మామగారు నాతో ఏమీస్పష్టంగా చెప్పలేదు" అంది.

సురేశుడు "నాతోనూ చెప్పలేదు? అయినా నానమ్మకం ఏమిటంటే ఆయన నా కే—అయితే దానికి మీరంగీకరించరనుకుంటాను" అన్నాడు.

అచల "అంగీకరించను" అంది.

సురేశుడు—ఎప్పటికీ ఒప్పుకోరూ!"

అచల కిందికి చూస్తూ "ఒప్పుకోను" అంది.

సురేశుడు "ఇంక మహిమనుడిఆశఏమీ ఉండదనుకోండి! అప్పుడో?" అన్నాడు.

అచల "ఆ ఆశ లేనేలేదు!" అంది.

సురేశుడు "బహుశః అప్పుడుకూడా అంగీకరించరన్నమాట!" అన్నాడు.

అచల తలయెత్తలేదు. పూర్వంమల్లేనే దృఢస్వరంతో "అవును; అప్పుడు కూడా అంగీకరించను!" అంది.

సురేశుడు కుర్చీలోకూలబడి ఒక పెద్దనిట్టూర్పు విడిచి "సరే ఒక విధంగా వ్యవహారంఅంతా పరిష్కారం అయిపోయిందన్నమాట! ఇప్పటికి నాప్రాణాలు కుదుటబడ్డాయి." అన్నాడు ఆపైన కొంత

సేపుఅల్లాగే ఏమీ మాట్లాడకుండా కూర్చున్నాడు. ఆపైన మళ్ళీ నిటారుగా కూర్చుని "అయితే. ఇందులో ఒక పెద్దచిక్కు ఉంది: మీనాన్నగారి ఋణం తీరడం కష్టం" అన్నాడు.

అచల భయపడుతూ, కొంతసంకోచంతో ముఖంపైకెత్తి "ఆసందర్భంలో అయితే మీరు అప్పుఇవ్వలేరా?" అంది.

'ఇవ్వలేకేం!' అనిచెప్పి ఏకాగ్రదృష్టితో ఏదో తీక్ష్ణంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతని వైఖరిచూసి, అచల మళ్ళీతలవంచుకుంది. కొంతసేపు అల్లాగఉండి, సురేశుడు మళ్ళీనవ్వాడు. అయితే ఇప్పుడు అతనినవ్వులో ఆనందం లేకపోవచ్చును గాని కృత్రిమం మాత్రంలేదు. అతను మళ్ళీ "చూడండి! మీతోపరిచయం కలిగినతరవాత నేను చేసినపని ఒకటీ మంచిదనిచెప్పడానికి వీల్లేదు. నాకీవిషయం బాగా తెలుసును. కాని నేనంత నీచుణ్ణికాను. నే నీడబ్బు మీనాన్నగారికి లంచం ఇవ్వడంలేదు. ఆయన ఆపత్తులో ఉన్నారుకాబట్టి సహాయం చేస్తున్నాను. ఈడబ్బు ఇవ్వడం విషయంలో నేను మీఇష్టానిష్టాల మీద ఆధారపడలేను. ఆయన ఎల్లాగ తీసుకుంటారా అని ఆలోచిస్తున్నాను! సరే! మనమిద్దరమూ ఈవిషయం ఎల్లాగచేస్తే బాగుంటుందో ఆలోచిద్దాము" అన్నాడు.

అచల ముఖం ఎత్తి "సరేచెప్పండి!" అంది.

సురేశుడు మళ్ళీ ప్రారంభించి "దైవవశంవల్ల నేనెంతో భాగ్యవంతుణ్ణియ్యాను. అయినాగాని నాకు డబ్బుమీద అంతమమకారం ఎప్పుడూలేదు! నాలుగువేలు ఒకళ్ళకి ఇవ్వడంఅంటే నాకంతలెఖ్ఖలో పనికాదు. మీరు సుఖపడడానికి ఇంతకంటె ఎక్కువకూడా ఇవ్వగలను! సరే! దీనిసంగతి ఇల్లాగ ఉండనీయండి! అసలువిషయం ఒకటి ఉంది. నానాఇబ్బందులూ పడకుండా ఈడబ్బుదొరికితే బాగుండునని అనుకుంటున్నారు! ఒకవిధంగా ఆలోచిస్తే డబ్బుదొరికినట్టే అను

కోండి! ఏం? నేనుచెప్పింది తెలియలేదూ?" అన్నాడు.

అచల తలకదిపి "ఆ తెలిసింది" అంది.

సురేశుడు మళ్ళీ "అసలు ఉన్నవిషయం ఏదో స్పష్టంగా చెబుతున్నాను. దీనికి మీరు రేపు అనుకోకండి! ఆయనకి రూపాయలు చాలా అవసరం! అయితే ఇంత ఋణంచేసి అప్పుతీర్చేశక్తి ఆయన దగ్గిర లేదు. నామట్టుకి నాకు అప్పివ్వడం అంతకష్టంగాదు. అయితే ఇదంతా చాలా తేలికగా జరిగిపోయేపనే! కాని మీరు ఒక్కపనిమాత్రం చెయ్యాలి! కొంచెంఎల్లుండిదాకా ఆగి మీమనస్సులో ఉన్న అభిప్రాయమేమిటో ఆయనతో చెప్పాలి! అల్లాగచేస్తే ఆపైన ఏమీ తగాదాఉండదు. ఏం? ఈమాత్రం చెయ్యలేరూ?" అన్నాడు.

అచల పూర్వంలాగే అలాగే తలవంచుకుని నిశ్చలంగా కూర్చుంది. సురేశుడుమళ్ళీ "కేవలంకబ్బుకోసముని అభిప్రాయం మార్చుకోకుండా ఉండడంచూస్తే మీమీద నాకెంతో గౌరవంకలుగుతూంది" అని చెప్పి లేచినుంచున్నాడు. ఆపైన మళ్ళీ ఒక్కచిన్ననవ్వు నవ్వి "నా కివ్వాళ ఏమనడానికీకూడా నోరాడకుండా ఉంది; కానివెడుతూ వెడుతూ నాతప్పులన్నీ మరిచిపోవలిసిం దని మాత్రంమిమ్మల్ని అర్థిస్తున్నాను" అన్నాడు. ఆపైన కొంచెంసందేహించి "నమస్కారం! చెయ్యవలిసిన చెడ్డపనులన్నీ చేసేసిమీదగ్గిరనించి వెడుతున్నాను కాని నిజంగా నేనొక పిశాచాన్ని మాత్రంకాదు! నరేపోనియ్యండి! నమస్కరం పుట్టించ డానికి ఏకిధంగానూ వీల్లేనప్పుడు చెప్పకుండా ఉండడమేముంచిద్, అని చెప్పి రెండుచేతులూ పైకెత్తినమస్కారం చేస్తూనే అక్కడినించి తొందరగా వీధులోకి వెళ్ళిపోయాడు.

క్రమంగా అతనిపాదధ్వని ఆమేడమెట్లలో అణగిపోయింది. అచల ఆధ్వనివింది. వినీవినడంతోనే అకారణంగా ఆమెకళ్ళలోనించి కన్నీటి బిందువులు జలజలారాలాయి.

కేదారబాబు గదిలోకివస్తూనే "సురేశబాబూ!" అని పిలిచాడు. అచల గబగబా కళ్ళునొత్తుకుంటూ "ఇప్పుడే గబగబా వెళ్ళిపోయారు" అంది.

కేదారబాబు ఎంతో ఆశ్చర్యపడి "అదేమిటి! నాతో మాట్లాడకుండానే వెళ్ళిపోయారా! వెళుతూంటే రేపొద్దుట భోజనం అన్నమాట జ్ఞాపకంచేశావా?" అని అడిగాడు.

అచల సిగ్గుపడి 'జ్ఞాపకం లేకపోయింది నాన్నగారూ!' అంది.

"జ్ఞాపకంలేదూ? బాగుంది!" అని కేదారబాబు నిశ్చేష్టుడై అక్కడున్న ఒకకుర్చీమీద కూలబడిపోయాడు. కూతురుకంఠస్వరాన్నిబట్టి అతనికేదో సందేహం కలిగింది; కాని ఆచీకటిలో ఆమెముఖం కనబడక పోవడం మూలాన్ని ఆసందేహం అట్టేకాలం ఉండలేదు. కేదార బాబు "ఈపెద్దతనంలో నేను స్వయంగా చేసుకోకపోతే ప్రతీపనిలోనూ ఏదోలోటు కనిపిస్తూనేఉంటుంది. చివరికి పనికూడా ఒకప్పుడూ కాదు. సరే! వెళ్ళి నౌకరుచేతికి ఒకచీటీఇచ్చి పంపుతాను. సురేశబాబుగారి ఇల్లెక్కడో!" అని అంటూనే లేచినుంచున్నాడు.

అచల "నాకూ తెలియదు నాన్నగారూ!" అంది.

"ఏమంటున్నావు? అడ్రసుకూడా తెలియదూ?" అంటూ కుర్చీచెయ్యి ఊతం చేసుకుని అంతలో కూలబడిపోయాడు. కాని వెంటనే తిన్నగాకూర్చుని, కఠినంగా "నీమెడకి నువ్వే ఉరిపోసుకోవాలనుకుంటే—పోసుకో! నాకు అడ్డవలిసిన అవసరం ఏమాత్రంలేదు. ఊరికే మాటవరసకి ఇంతడబ్బు ఇస్తానన్నమనిషి ఎల్లాంటివాడో ఒక్కరవ్వ ఆలోచించాలి! ఇంతాచేసి ఆయన ఎడ్రసు ఏదో కనుక్కోలేదూ! పెద్దదానవయిన కొద్దీ మరీ ఇల్లాగ తయారవుతున్నావేమిటే అచలా! అని చెప్పి, అతనొక పెద్దనిట్టూర్పు విడిచి పెట్టాడు.

అచలకి అప్పులపాలై బాధపడుతూన్న తండ్రి ఎల్లాంటి నీచ పనులకి ఒడికడుతున్నాడో తెలుసు. అవన్నీ తలుచుకుంటూంటే అచలగుండె బద్దలై పోయింది. అయినాగాని ఆమె ఇన్నాళ్ళూ మారు మాట్లాడకుండా సహించింది. మాట్లాడితే కన్నబుద్ధిమనే తండ్రితో ఆమె ఏవిధమైన వాగ్వాదమూ పెట్టలేదు; కాని మనస్సులో మాత్రం ఎంతో సిగ్గుపడి పశ్చాత్తాపపడింది. ఈసంగతి కేదారబాబు గ్రహించి లోలోపల సంతోషించాడు.

ఇంతలో 'నౌకరువచ్చి దీపం వెలిగించి వెళ్ళిపోయాడు. కేదార బాబు మళ్ళీ కొంతసేపు హాయిగా, కొంత ఆక్షేపణగా కలిసినస్వరంతో "పోనీ మహిముడి విషయంలో నైనా నువ్వు ఇంతవరకూ ఏవిషయమూ చెప్పలేకుండా ఉన్నావు. అతని సంగతి ఏమయిందో తెలియకపోవడం కూడా కొంతవరకు మంచిదే! పరమేశ్వరుడు ఏంచేసినా మంచి కోసమే చేస్తాడు. సురేశబాబుతో మాత్రం మనం ఇల్లాగ వ్యవహరిస్తే బాగుండదు! కేవలం పరమేశ్వరుడే ఆయన్ని మనదగ్గిరికి పంపించాడు" అన్నాడు.

అచల ముఖం ఎత్తి "సురేశబాబుగారిదగ్గిర మీరొప్పు డప్పు పుచ్చుకోవా లనుకుంటున్నారా?" అని అడిగింది. కేదారబాబు భగవద్భక్తికి ఏదో పెద్ద ఆఘాతం తగిలినట్లయింది. అతను కూతురికేసి చూసి "అవును—అమ్మా! అది కేవలం అప్పనడానికి వీల్లేదు—సు రేశబాబు ఎంతమంచివారో నీకు తెలియదు తల్లీ! ఈకాలంలో ఇల్లాంటివాళ్ళు నూటికీ కోటికీ ఒక్కొక్కళ్ళుంటూంటారు! ఈఇల్లంతా అప్పుల పాలైపోవడం ఆయన కిష్టంలేదు. ఉంటే మాఇద్దరికీ ఉంటుంది! కాకపోతే నేనింక ఎన్నాళ్ళు బతుకుతానమ్మా! ఏం! నేను చెప్పింది తెలియలేదు." అన్నాడు.

అచల ఏమీ అనకుండా మాట్లాడ కూరుకుంది, కేదారబాబు

ఉత్సాహంతో మళ్ళీ ఇల్లాగ అన్నాడు.

"నేనెప్పుడూ నిర్మొహమాటంగా మాట్లాడతానని మీకు తెలుసును! లోపల ఒకమాటా పైకి ఒకమాటా చెప్పడం నావల్లగాదు! అందుచేత నేను ఇన్ని విషయాలూ తెలిసిన తరవాతకూడా మహిముడికి పిల్లనివ్వడంకంటె తీసుకువెళ్ళి గంగలో తోయడం మంచిదని ఉన్నమాటేదో ఉన్నట్టు చెప్పేశాను" సురేశబాబుకూడా ఇల్లాగే అభిప్రాయపడ్డారు. అందుచేత మహిముడి వివాహానంగతి అప్పుడే చాలామంది నోళ్లలో పడిపోయిందనీన్నీ, ఇప్పుడు మహిముడిసంబంధంకూడా స్థిరపరచాలనిన్నీ, లేకపోతే సంఘంలో చాలా గోలబయలుదేరుతుందనిన్నీ చెప్పేశాను! ఏమైనా సరే! నూరుచెప్పు! లక్షచెప్పు! మనిషిఅంటే సురేశబాబే మనిషి! అందుచేత ఇల్లాంటివ్యక్తిని చూపించినందుకు నేను పరమేశ్వరుడికి నాటి మాటికీ నమస్కారం చేస్తున్నాను!"

తండ్రి నమస్కారం చెయ్యడం నిర్విఘ్నంగా పూర్తి అయిపోయిన తరవాత అచల మెల్లిగా "నాన్నగారూ! ఈయనదగ్గిర ఇంతఋణం చెయ్యకపోతే వ్యవహారం నడవదూ?" అని అడిగింది.

కేదారబాబు ఈమాటతో ఒక్కసారిగా భయపడి ఉలిక్కిపడ్డాడు. ఆపైన "ఋణం చెయ్యకపోతేవ్యవహారం నడవదా? అని అడుగుతున్నావా?—అంటే;—బాగుంది!" అన్నాడు.

"లేకపోతే—పోనీ—మనం ఈఅప్పును తీర్చివెయ్యలేమూ?"

కేదారబాబు మనస్సులో ఒక పెద్దఅనుమానం ఏదో బయలుదేరింది. ఆఅనుమానంచేత అతను "ఏం; అప్పుతీర్చివెయ్యవలసిందన్నమాట సురేశుడు— అని సగం అడిగి ఊరుకున్నాడు. అతనిముఖాన్ని కత్తినాటువేసినా నెత్తురులేదు! అచల అతని ముఖంకేసి చూసి లోలోపల ఎంతో బాధపడింది. అందుచేత "చటుక్కునిఆయన ఎల్లుండి వచ్చి డబ్బంతా పట్టుకువస్తానన్నారు" అంది.

"అయితే ఇప్పటిప్పుడంటారా——"

"అబ్బే! ఆవిషయం ఆయన ఏమీ మాట్లాడలేదు"

"రాతా కోతా మొదలైనవేవీ——"

"ఆయన ఆగోడకేమీ అడ్డుపెట్టలేదు!"

"సరే బాగుంది అనిచెప్పి కేదారబాబు సంభాషణసంకోచంవల్ల ఆగిపోయిన ఒకపెద్దనిట్టూర్పు విడిచిపెట్టాడు. పైకళ్ళుమూసుకుని కుర్చీచేతులమీద అనుకుని రెండుకాళ్ళూ పైకెత్తి ఎదురుగుండా ఉన్న బల్లమీద పెట్టాడు. హాయిగా ఆనందించేతా- అతని శరీరం అంతా జల్లుమని పులకరించింది. కొంచెంసేపు ఈవిధంగా ఉండి కాళ్ళు బల్లమీదనించి దింపి. పెద్దగొంతుకతో అతనిట్లా అన్నాడు. "అచలా! ఈవ్యవహారం అంతా మొదటినించీ ఎల్లాగ నడిచిందో చూశావా? ఇందులోనీకు కేవలం అనిగ్రహానుగ్రహసమర్థుడైన పరమేశ్వరుడిహస్తం కనబడడంలేదూ!"

అచల నిశ్చలంగా తండ్రిముఖంకేసి చూస్తూకూర్చుంది. కేదారబాబు తనువేసిన ప్రశ్నకి సమాధానంకోసం నిరీక్షించకుండానే మళ్ళీ "ఇదంతా పరమేశ్వరుడుచేసిందేనని నాకు కళ్ళఎదురుగుండా స్పష్టంగా కనిపిస్తూంది. నీతో నేనేంచెప్పనుతల్లీ! రెండేళ్ళనించి చూస్తున్నాను. నాకింటికి కునుకు పడితేఒట్టు, రాత్రింబగళ్ళు ఆపరమేశ్వరుణ్ణే ధ్యానిస్తూ కూర్చున్నాను. సురేశుణ్ణి చూడగానే—అదేమిటో గాని పూర్వజన్మంలో నాకతను కుమారుడై ఉండాలని అనిపించింది" అన్నాడు.

అచల ఏమీఅనకుండా అల్లాగే మాట్లాడకుండా కూర్చుంది. ఆమెకు తండ్రిగారి సంసారపు ఇబ్బందులన్నీ బాగా తెలును. కాని కేదారబాబు ఇంతబాధపడుతున్నాడని ఆమెఎప్పుడూ ఊహించలేకపోయింది. రెండుసంవత్సరాలనించి కేదారబాబు ఆదయామయుణ్ణేఆరా

ధిస్తున్నాను. ఆదయామయుని అనుగ్రహంచేత తనకష్టాలన్నీ చాలా వరకు గట్టెక్కాయి. ఆమాట నిజమే! కాని ఆమెకు తనసమస్యలన్నీ నానాటికీ భయంకరమైపోతూన్నట్టు కనిపించాయి. సురేశబాబుదగ్గిర అప్పుపుచ్చుకోవడం విషయంలో ఆమె ఒకవిధంగా సంకల్పించింది. ఆమె కాసంకల్పం విడిచిపెట్టక తప్పదని అనిపించింది. తండ్రిగారి మనస్సు కష్టపెట్టడము ఆమెకెంతమాత్రమూ ఇష్టంలేదు! ఏమైనాసరే కేదారబాబు సురేశబాబుదగ్గర డబ్బు తీసుగోవడం తప్పకుండా జరిగి తీరవలిసిందే!

సాయంకాల ప్రార్థనకోసం కేదారబాబు లేచివెళ్ళిపోయాడు. జరిగినవ్యవహారం అంతా మొదటినించి చివరదాకా ఆలోచించుకుంటూ అచల అక్కడే కూర్చుండిపోయింది.

ఈఇద్దరుమిత్రులూ ఈవేళ ఆమెజీవితంలో ఒకసంధిస్థలంలో ఒకరిపక్క ఒకరు ఎదురుగుండా నుంచున్నారు! ఇందులో ఒకవ్యక్తితో "ఇక్కడనించివెళ్ళిపో!" అని చెప్పి, అతన్ని సాగనంపివెయ్యవలిసి ఉంటుంది. ఈవిషయంలో అణుమాత్రమైనా సందేహంలేదు! అయితే సాగనంపడం ఎవర్ని? ఆమెకు మహిముడు ఒక గొప్పనమ్మకంతో నిశ్చలంగా తనఎదట కూర్చున్నట్టు కనబడింది. ప్రశాంతమైన అతని ముఖం జ్ఞాపకం చేసుకునేటప్పటికి అచలకి కళ్ళమ్మటనీళ్ళు గిర్రున తిరిగాయి. పాపం! మహిముడుచేసిన తప్పేమీ లేదు! వెళ్ళిపొమ్మనగానే అతను మారు మాట్లాడకుండా వెళ్ళిపోతాడు. ఇంక బతికివుండగా అతనుఏసందర్భంలోనూ ఏవిధంగానూకూడా తనదారికి అడ్డంరాడు! ఆలోచించడానికికూడా వీల్లేని తమఎడబాటు సమయంలోకూడా, అతని ఆనిశ్చలగాంభీర్యం అణుమాత్రమైనా జంకదు! దీనికతనుఎవ్వరినీ నిందించడు! అసలుకారణం తెలిసికోడానికి ప్రయత్నం కూడా చెయ్యకపోవచ్చును! అయితే ఆశ్చర్యమిశ్రితమైన ఒకతీవ్ర

యాతన అతనిముఖంలో రేఖామాత్రంగా కనిపిస్తే కనిపించవచ్చును! అంతేగాని మరేమీ కనబడదు! క్రమంగా సురేశుడికీ అచలకీ వివాహం అయిందన్న సంగతికూడా అతనిచెవిలో పడుతుంది. ఆమాట [illegible]దిరి పాటుగా. వినడంవల్ల [illegible] అతనొక పెద్దనిట్టూర్పు విడిచిపెడితే విడిచిపెట్టవచ్చును! లేకపోతే, ఒకక్షణకాలం ఓ చిరునవ్వు నవ్వుకొని తనపనియేదో తనుచూసుకుంటూ [illegible]. ఇల్లాగ ఈవిధంగా ఈసంగతులన్నీ ఆలోచించుకుంటూంటే, సిగ్గువల్లా జాలివల్లా ఆమెముఖం ఎర్రబడింది.

౬

ఆతరవాత పది పదకొండురోజులు గడిచిపోయాయి. కేదారబాబు ధోరణి చూస్తే మంచికులాసాగా ఉన్నట్టు కనబడ్డాడు. అతను మంచి వయస్సులో ఉన్నప్పుడుకూడా ఇంతకులాసాగా ఎప్పుడూ ఉండలేదు. ఈవేళసాయంత్రం బయస్కోప్కు చూసి తిరిగివస్తూవస్తూ తోవలో అతను బండిఆపి, కిందికిదిగి "సురేశబాబూ; నేనిక్కడినుంచి సమాజానికి నడిచేవెళ్ళిపోతాను. మీరిద్దరూ ఇంటికివెళ్ళండి తాయనా!" అని చెప్పి చేతికర్రఆడిస్తూ గబగబా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

సురేశుడు అచలతో "ఈవేళ మీనాన్నగారు మంచికులాసాగా ఉన్నారు." అన్నాడు.

అచల తండ్రిగారు వెళ్ళినవైపే చూస్తూ "అవును మీదయవల్లనే!" అంది.

బండి ఒకసందులోకి మళ్ళింది. అందుచేత వారికింక కేదారబాబు కనబడలేదు. సురేశుడు అచలకుడిచెయ్యి తనచేత్తోపట్టుకొని "ఈమాటంటే నేనెంత బాధపడతానో మీకు తెలుసును! నన్ను బాధపెట్టడానికేనా మాటిమాటికీ ఇల్లా అంటూంటారు!" అన్నాడు.

అచల నిరుత్సాహంగా ఒకచిన్న నవ్వు నవ్వి "మీరుచూపించిన ఈదయ అంతా ఎప్పుడూ మరిచిపోగలనో ఇది మాటిమాటికీజ్ఞాపకం చేసుకుంటున్నాను. అది నాకేగాని మిమ్మల్ని బాధపెట్టడంకోసం కాదు" అంది.

సురేశుడు ఆమెచెయ్యి కొంచెంగట్టిగా నొక్కిపట్టుకుని "అయితే నేను మరింత బాధపడతాను" అన్నాడు.

అచల "ఎందుచేత?" అంది.

సురేశు—నాదయ జ్ఞాపకం ఉంచుకోవడంవల్లనే మీ ఆనందం కలుగుతూంది. ఆనందించడానికి మీకంతకంటే మరేవిషయమూ లేదు! ఈసంగతి నాకు బాగా తెలుసును. ఇది నిజమవునా కాదా చెప్పండి!

అచల— "ఒకవేళ చెప్పకపోతే!"

సురేశు— ఇష్టంలేకపోతే చెప్పవద్దు! దానికేంగాని మాటిమాటికీ నన్ను పెద్దగా మన్నించడం ఎందుకూ? కొంత బాగా చనువుగా మాట్లాడకూడదా?

అచల ముఖంవాడిపోయింది. ఆమె తల ఒంచుకుని మెల్లిగా "ఎప్పుడో అల్లాగ చనువుగా మాట్లాడేరోజూ వస్తుంది. ఆమాట మాత్రం మీకు తెలియదా?" అంది.

వాడిపోయిన ఆ సుముఖం చూసి, సురేశుడు ఒకపెద్దనిట్టూర్పు విడిచిపెట్టి "ఇది నిశ్చయమే! అయితే ఒకటిరెండు రోజులు ముందు నించీ చనువుగా మాట్లాడితే తప్పేముందీ!" అన్నాడు.

అచల ఆమాటకేటూ జవాబుచెప్పలేదు. ఏదో పరధ్యానంగా ఆబండి వెళ్ళే దారికేసి చూస్తూ కూర్చుంది. ఒక్కనిమిషం అల్లా నిశ్శబ్దంగాఉండి సురేశుడు చటుక్కుని "మహింముడి కీవిషయాలన్నీ తెలిసిపోయాయని అనిపిస్తూంది అన్నాడు.

అచల ఉలిక్కిపడి ముఖం సురేశుడికేసి తిప్పింది "ఆ పైన సురేశుడి చేతిలో ఉన్న తన చెయ్యి చటుక్కున లాక్కుని 'మీకెల్లా తెలిసింది?' అని అడిగింది.

అత్యంత శాంత శక్తి కలిగిన ఆమె కంఠస్వరం సురేశుడి చెవిలో బల్లెంలా గుచ్చుకుంది. అతను "లేకపోతే ఈ పాటికి తను ఇక్కడికి వచ్చేసి ఉండును. అప్పుడే పది పదిహేను రోజులైంది" అన్నాడు.

అచల "ఈ వేళలో కలుస్తుగుని అప్పుడే పంధొమ్మిది రోజులైంది. నాన్నగారు ఆయనకేమైనా ఉత్తరం రాశారేమో మీకు తెలుసునా?" అని అడిగింది.

సురేశుడు క్లుప్తంగా 'నాకు తెలియదు' అన్నాడు.

"ఆయన ఇంటిదగ్గిరనించి వచ్చారో లేదో మీకు తెలుసునా?"

"అబ్బే! ఆసంగతీ తెలియదు"

అచల బండిలోనించి అవతలికి చూస్తూ మృదువైన కంఠస్వరంతో "నాన్నగారు ఆయన ఎదురుచూస్తున్నారని అవివరాలన్నీ ఉత్తరం రాయాలనుకుంటున్నారు. తీరా హఠాత్తుగా ఆయనిక్కడికి వస్తారో ఏమిటో" అంది.

మళ్ళీ కొంతసేపటిదాకా ఇద్దరూ మాట్లాడకూరుకున్నారు, సురేశుడు తనచేతో ఆమె చెయ్యి పట్టుకుని మెల్లిగా "మీకు క్రమ క్రమంగా నామీద అశ్రద్ధ కలుగుతూందని ఆలోచిస్తూంటేనే నాకెంతో బాధగా ఉంది. నేను కేవలం డబ్బుద్వారా బలవంతంగా మిమ్మల్ని నా స్వాధీనం చేసుకుంటున్నానని మీరెప్పుడూ అనుకుంటూ ఉంటారులా ఉంది. నేను చేసినతప్పు ఒక్క—" అన్నాడు.

అతనా మాట పూర్తిచెయ్యకుండానే అచల చటుక్కుని ముఖం తిప్పి అతన్ని అడ్డుకుని "అబ్బే! మీరెప్పుడూ ఇల్లా అనవద్దు! ఇందులో మీతప్పు కొంచెమైనా ఉందని నేననలేను!" అంది. ఆపైన

మళ్లీ కొంచెం సేపాగి ప్రపంచములో వ్యవహారాలన్నీ ధనప్రభావంవల్లనే జరుగుతూ ఉంటాయి! ఇది ప్రపంచకం లో అందరికీ తెలిసినవిషయమే! కాని మీరుమాత్రం డబ్బాశ చూపించి పని చక్కబెట్టలేదు! ఈ విషయం మానాన్నగారికి తెలియకపోతే తెలియకపోవచ్చును. గాని నాకు బాగా తెలుసును! ఇన్నివిషయాలూ తెలిసి తరవాతకూడా నేను మీవిషయంలో అశ్రద్ధ చేస్తే ఇంక ననుకలోకూడా నాకు చోటుండదు!" అంది.

అతిసామాన్యమైన ప్రసంగం వచ్చినప్పుడుకూడా సురేశుడికి ఇట్టే కళ్ళమ్మట నీళ్లు పెట్టుకోవడం అలవాటు! ఇచట ఈమాత్రం ఇష్టంగా మాట్లాడడంతో నేఅతనికి కళ్లమ్మటనీళ్లు గిర్రున తిరిగాయి. అతను నాకన్నీళ్లు ఆచలచేతులతోనే తుడిచి "ఈచేసిన తప్పు—ఈఅన్యాయం—నాకు తెలియకపోలేదు! కాని నేను అశక్తుణ్ణి!"—

కేవలం అశక్తుణ్ణి! ఈఆఘాతం మహాయముడు కొబట్టి సహించుకున్నాడు; గాని నేనే అయితే— ఈపాటికి నాహృదయం బద్దలయిపోయి ఉండును!" అన్నాడు. అల్లాగమాట్లాడుతూ ఏదో ఆఘాతం తగిలి తేరుకొన్న వాడిలాగ గద్గదస్వరంతో "సురు నాసొత్తు కాదనిన్నీ ఇంకొకరి సొత్తు అయిపోయిందనిన్నీ ఊహించుకోవడంకూడా నాకెంతో బాధగాఉంటుంది. మీరు నాకు లభించలేమోనని అనుకున్నంతమాత్రాన్ని నాకాళ్ళకింద ఏదో భూకంపంజరుగుతూన్నట్టుంటుంది" అన్నాడు.

అప్పుడప్పుడే వీధుల్లో దీపాలొక్కొక్కటే వెలుగుతున్నాయి. బండి సందులోకి మళ్ళుతిరగగానే ఒకదీపంవెలతురు సురేశుడి ముఖంమీదపడింది. అతనికళ్ళల్లో తళతళలాడుతున్న కన్నీటిబిందువులమీద అచలదృష్టిపడింది- ఈక్షణంలో బయలుదేరిన జాలివల్ల ఆమె ఎప్పుడూ చేయనిపని చెయ్యగల్గింది! కుంకుమ కివంగి చేతితో అతని

కన్నీళ్లు తుడిచి "నేను మానాన్నగారు చెప్పినమాట కెప్పుడూ వ్యతిరేకంగా నడవలేదు! ఆయన నన్ను మీచేతుల్లో అప్పగించారు" అంది.

సురేశుడు ఆమె చెయ్యి నోటిదగ్గర పెట్టుకుని మాటిమాటికీ ముద్దు పెట్టుకుంటూ "ఇదినాకన్నిటికంటేకూడా చాలా గొప్పగౌరవం! ఇంతకంటే నేను ఎక్కువవేమీ కోరను! నా కీమాత్రంకూడా లేకుండా చెయ్యకండి!" అన్నాడు.

బండి క్రమక్రమంగా ఇంటిఎదటికివచ్చి ఆగింది. సైనువాడు వచ్చి తలుపు తెరచి పక్కకి తప్పుకున్నాడు. సురేశుడుకిందికిదిగి. ఎంతో జాగ్రత్తగా అచలని బండిలోంచి ఇవతలికి దింపాడు. దిగిదిగడంతోనే వాళ్ళిద్దరికీ ఎదురుగుండా మహిముడుకనబడ్డాడు. అతన్ని చూసీ చూడ్డంతోనే వాళ్ళిద్దరూ శిలాప్రతిమల్లాగ నిలబడిపోయారు!

మరుక్షణంలో అచల ఒక అవ్యక్తమైన ఆర్తనాదంచేసి, ఒక్కక్షణంలో తన చెయ్యివెనక్కి లాక్కుని దూరంగా నిలబడిపోయింది. మహిముడు ఆశ్చర్యంతో నిర్ఘాంతపడి "సురేశా! నువ్విక్కడికి వచ్చావేమిటి?" అన్నాడు.

మొట్టమొదట సురేశుడినోట్లోనించి మాటే ఇవతలి కూడాపడలేదు! ఆపైన నిర్ఘాంతపడి తెల్లబోయిన ముఖంమీద బలవంతంగా ఒకచిరునవ్వు తెప్పించుకుని. "ఇదేమిటి? మహిమా! మళ్ళీ నువ్వు కనబడలేదు! ఏమిటి విశేషాలు! ఎప్పుడువచ్చావు? సరేలే! పైకివెడదాం నడు!" అని చెబుతూనే అతనిదగ్గిరికివెళ్ళి అతని చెయ్యిపట్టుకుని, కొంచెం వేళాకోళంధోరణి— "ఈవిడతండ్రిగారొకతమాషాచేశారు. ఆయనేమో సమాజానికి వెళ్ళిపోయారు! ఈవిణ్ణి ఇంటిదగ్గిర దిగబెట్టవలసిన భారం ఈదౌర్భాగ్యుడిమీద పడింది, సరేలే! పైకివెడదాం పద! ఒకవిధంగా ఇది మంచికే అయింది. లేకపోతే నిన్ను కలుసుకోవడమే పడకపోవునేమో! ఏమిటి? ఇన్నాళ్ళనించీ యింటిదగ్గిర

ఉండి ఏం చేస్తున్నావు? " అన్నాడు.

మహిముడు "కొంచెంపనుండిలే!" అన్నాడు. ఆశ్చర్యంచేత నిర్ఘాంత పడి నుంచున్న అతనికి, దగ్గిరగానుంచున్న అచలకి నమస్కరించాలనేమాటే జ్ఞాపకంరాలేదు!

సురేశు ఠతని వీపుమీద తట్టి "చాలాగట్టివాడవోయ్ నువ్వు! మేము నీసంగతి తెలుసుకోలేక తల్లకిందులైపోతున్నాము. ఆఖరికి ఒకవుత్తరమైనా రాశావుకావేం! ఏమిటి అల్లాగ అక్కడే నిలబడి పోయావేమిటి? పైకివెడదాం పద!" అంటూ అతన్ని బలవంతంగా పైకి లాక్కువెళ్ళాడు. పై గదిలోకివెళ్ళి అందరూ కూర్చోగానే, సురేశుడిలో ఇందాకటినుంచీ కనబడుతూన్న చురుకుదనమూ చలాకీ ఒక్కసారిగా మాయమైపోయాయి. తెల్లసిగ్గ్యానులైటు వెలుతురులో అతని ముఖం నల్లగా మసిబొగ్గులాగ మాడిపోయింది! రెండుమూడు నిమిషాలదాకా ఎవరూకూడా ఒక్కమాటైనా మాట్లాడలేదు! మహిముడు ఒకసారి స్నేహితుడికేసీ, ఆపైన అచలకేసీ, శూన్యదృష్టితో చూశాడు. ఆపైన యథాలాభంగా "అంతా కులాసాగాఉన్నారా? అని అడిగాడు.

అచల ఏదో సమాధానం చెప్పింది; కాని ముఖంఎత్తి మహిముడి కేసి చూడలేదు. మహిముడు "నాకు చాలాఆశ్చర్యంగావుంది! అయితే సురేశుడికీ మీకూ పరిచయం ఎల్లాగకలిగింది?" అని అడిగాడు.

అచల ముఖంఎత్తి ప్రాణాలు అరిచేతిలో పెట్టుకుని. "ఈయన నాన్నగారికి నాలుగువేలఋణం తీర్చేశారు" అని చెప్పేసి ఊరుకుంది. ఆమెముఖంకేసి చూస్తూంటే మహిముడి నోట్లోనించి "ఆపైన?" అనే ప్రశ్నతప్ప మరేమీవినబడలేదు!

"ఆతరవాత వ్యవహారంఅంతా మీరు మానాన్నగారినడిగి తెలుసు

కోండి!" అని చెప్పి, అంత తొందరగా ఉక్కడిసించి లేచి ఇవతలికి వచ్చేసింది. మహిముడు నిర్ఘాంతపడి కొంతసేపు అల్లాగే కూర్చుండి పోయాడు. ఆపైన సురేశుడికేసి తిరిగి, 'సురేశా! ఏమిటీకథ!' అన్నాడు.

సురేశుడు పెద్ద ఔద్ధత్యంతో "నేను నీకుమల్లే ప్రాణాలన్నీ డబ్బుమీద పెట్టుకోను! ఎవడైనా పెద్దమనిషి ఇబ్బందిలో ఉండి నన్ను సహాయం చెయ్యమంటే నేను చేస్తాను. అంతే! ఒకవేళ ఆపెద్దమనిషి ఆడబ్బు తిరిగి ఇవ్వకపోతే అందులో నాతప్పేముంది! అప్పటికీకూడా తప్పు నాదే అంటావా? అల్లాంటప్పుడు ఒకసారి కాదు! వందసార్లనుకో! నాకేం బాధలేదు!" అన్నాడు.

స్నేహితుడు చెప్పిన ఈకథా, అతనిముఖవైఖరీ అదీచూసి మహిముడు నిర్ఘాంతపడి మతిపోయినవాడిలాగ అల్లాగే చూస్తూ కూర్చున్నాడు. అల్లాగ ఒక్కనిముషం ఉండి చివరికి "సురేశా! హఠాత్తుగా నువ్వేదో తప్పుచేశావని నేననడం ఏమిటి? ఇదంతా ఏమిటో నాకు బోధపడడంలేదు! దయచేసి నువ్వు చెప్పేదేదో స్పష్టంగా చెబితేనేగాని నీమాట నాకు బోధపడడంలేదు!" అన్నాడు.

సురేశుడు. పూర్వంమోస్తరుగానే కఠినంగా "ఇంతకంటె స్పష్టంగా ఏంచెప్పడానికి, ఏముంది." అన్నాడు.

మహిముడు "అయితే! సరే! నే నావేళ ఇంటికివెళ్ళిపోయానా! అప్పటికి నువ్వు వీరినెరగవు! ఇంతలోనే వీరికీ నీకూ ఇంత గొప్పపరిచయం ఎల్లాకలిగిందో, నీమనస్సులో ఆపత్తులోఉన్న బ్రహ్మసమాజస్థులికి నాలుగువేలు అప్పుఇచ్చేటంత ఔదార్యం ఎల్లాకలిగిందో నాకేమీ తెలియడంలేదు! నువ్వీవిషయం కొంచెమైనా చెబితే నేను చాలాకృతార్థుణ్ణవుతాను!" అన్నాడు.

సురేశుడు "నువ్వు కృతార్థుడవయితే కావచ్చును! కాని ఇప్పుడా

విషయాలన్నీ మాట్లాడడానికి నాకు టైములేదు! ఇప్పుడు నేను తొందరగా వెళ్ళిపోవాలి! సరే! దాని కేంగాని నువ్వు కేదారబాబు గారిని అడగవచ్చును. ఆయన నీకీ విషయాలన్నీ చెప్పడానికి కనిపెట్టుకుని కూర్చున్నారు" అన్నాడు.

మహిముడు "అయితే సరే!" అని లేచినించుని" నాకూ వినడానికి చాలా కుతూహలంగా ఉంది. అయితే ఆయనకోసం కనిపెట్టుకుని కూర్చుని అవ్వన్నీ వినడానికి నాకూ టైములేదు! నేను వెడుతున్నాను! అన్నాడు.

సురేశుడు నిశ్చలంగా అల్లాగే కూర్చున్నాడు. ఏమీ మాట్లాడలేదు! మహిముడు ఇంట్లోనించి ఇవతలికి వచ్చేశాడు. అతను వీధులోకి వచ్చేటప్పటికి ఆ అంధకారంలో అతని కేసే చూస్తూ, అచల అక్కడ నిలబడి ఉంది! కాని, అతనిదగ్గిరికి రావడానికిగాని, అతనితో మాట్లడడానికిగాని ఎటూ ఇష్టం కనబరచలేదు! అందుచేత అతను నిశ్శబ్దంగా మెట్లుదిగి వీధులోకి వెళ్ళిపోయాడు.

## ౧౦

కొంచెం అతిజరూరుగా మందులుకొని తీసుకువెళ్ళవలిసిన పనిఉండడంచేత మహిముడు కలకత్తా వచ్చాడు. అందుచేత అతను ఆరాత్రి బండిలోనే తిరిగి వెళ్ళిపోయాడు. సురేశుడు. వెళ్ళి అతను భోజనం చేసేచోట వాకబుచేశాడు; కాని అతనక్కడికిరానేలేదని తెలిసింది. బహుశః ఆరోజున కేదారబాబుగారి ఇంటి దగ్గిర ఈచర్చే జరిగి ఉండాలి.

కేదారబాబు కీమధ్యన బయస్కోపుమీాద ఆసక్తిఎక్కువైంది. ఆవేళ టీపుచ్చుకున్నతరవాత అందరూ షికారు వెళ్లాలనుకున్నారు. కింద గుమ్మం ఎదురుగుండా సురేశుడి బండి నిలబడి ఉంది! ఇంతలో అకస్మాత్తుగా దుష్టగ్రహం వక్రించినట్లు మహిము డక్క

డికివచ్చి, మెల్లిగా తలుపుపక్కగుండా నిలబడ్డాడు. అతన్నిచూసే టప్పటికి అందరిముఖంలోనూ ఒక్కసారిగా భావపరివర్తనం కలిగింది. కేదారబాబు నీరసంగా ఉన్నా, బలవంతంగా ఒక చిరునవ్వునవ్వి "మహిమా! రా! వచ్చికూర్చో అంతా కులాసాగా ఉన్నారా?" అని అడిగాడు.

మహిముడు నమస్కారంచేసి లోపలికి వెళ్ళి కూర్చున్నాడు. ఇంటి దగ్గిర ఇన్నాళ్ళు ఆలస్యం అయిందేమని అడిగితే అతను "కొంచెం తొందరపని ఉంది" అని మాత్రమే సమాధానం చెప్పాడు. సురేశుడు అక్కడ బల్లమీద పడిఉన్న ఆవేళపేపరు తీసి చదువుతూ కూర్చు న్నాడు. అచల ఆపక్కనే కుర్చీమీద పడిఉన్న బొమ్మతీసుకుని, దానిమీద ఊలుకుట్టేపనిలో మునిగిపోయింది. అందుచేతమాట్లాడడం అనేపని కేదారబాబుమీదే పడింది.

చటుక్కుని అచల ఏదోవంకమీద లేచి, గుమ్మంఅవతలికి వెళ్ళి, మళ్ళీ ఒకనిమిషంలో తిరిగివచ్చేసింది. ఆఉత్తరక్షణంలోనే ఆగదిలో పంకాకదలడం ప్రారంభించింది. కేదారబాబుకి గాలితగలడం వల్ల కొంతకులాసా వచ్చి "ఈవేళ పంకాలాగేవాడికి ఇప్పటికైనా దయకలగ డం అదృష్టమే!" అన్నాడు.

సురేశుడు తీక్ష్ణమైన వక్రదృష్టితో మహిముడికేసి చూశాడు. మహిముడి నుదుటిమీద అతనికి అయిదారు చెమటబిందువులు కనిపించాయి. తత్క్షణమే అతనికిఅచల ఎందుకు లేచివెళ్ళిందో పంకాలాగే వాడికి ఇంతహఠాత్తుగా దయఎందుకు కలిగిందో—అదంతానిమిషంలో బోధపడిపోయింది. ఆవిషయం అంతా అతని మనస్సులో ఒక్కమెరుపు లాగ మెరిసిపోయింది. ఏగాలివల్ల కేదారబాబుకి కులాసాకలిగిందో, దానివల్లే సురేశుడికి ఒళ్ళంతా భగభగ మండిపోయింది. సురేశుడు జేబులో వాచీపైకితీసి చూసి తీక్ష్ణమైన కంఠస్వరంతో "కేదారబాబు గారూ! అప్పుడే అయిదుగంట లయింది! ఇంక ఆలస్యంచెయ్యడంవల్ల

వ్యవహారం నడవదు"! అన్నాడు.

కేదారబాబు అంతటితో సంభాషణ కట్టిపెట్టి టీకోసం ఒక్క కేక పెట్టాడు. నౌకరు టీసామానులు పట్టుకొని ఒకక్షణంలో నాలుగు రక్కడికి వచ్చాడు. అచల తనకుట్టుపని కట్టిపెట్టి రెండుగిన్నెలలో టీతయారుచేసి, తండ్రికీ సురేశబాబుకీ ఎందుకుగుండా పెట్టింది. కేదార బాబు 'ఏం, అచలా నువ్వు తాగవన్నావ్?' అని అడిగాడు. అచల మెడతిప్పి "తాగను. ఈవేళ బాగా ఉక్కగాఉంది" అంది.

తత్క్షణమే అతనిదృష్టి మహిముడిమీద పడింది. అతను కంగారు పడుతూ ఇదేమిటి! మహిముడికివ్వకం మానేశావు' "ఏంమహిమా! నువ్వు టీ తాగవూ?" అని అడిగాడు. మహిముడు సమాధానం చెప్ప కుండానే అచల అతనికేసి తిరిగి ఎంతోమృదువుగా "ఇంత గాలు పులో మీరు టీతాగడం ఎందుకు? అదీగాక ఇంత ఉక్కగాఉంటే మీకు టీ సయించదుకూడాను!" అంది.

మహిముడి హృదయంమీదనించి కొండంతబరువు దింపినట్లయింది. అతనేమీ మాట్లాడలేదు. కేవలం పట్టలేనంతఆశ్చర్యంతో రెప్పవెయ్య కుండా అల్లాగే చూస్తూ కూర్చుండి పోయాడు. అచల "ఒక్కనిమిషం ఆగండి! నేను నిమ్మపళ్లరసంతో షరబత్తు తయారుచేసి తీసికు వస్తాను." అని చెప్పి తను అడిగినప్రశ్నకిసమాధానం ఏమీ వినకుండానే ఆగదిలోంచి వెళ్లిపోయింది. సురేశుడు మరోకపక్కకి ముఖంతిప్పి కొయ్యబొమ్మలాగ, టీతాగుతూ కూర్చున్నాడు. ఆవేళ అతను తాగే టీలో ప్రతీ బిందువులోనూకూడా విషం కలిపినట్లయింది.

కేదారబాబు టీతాగడం ముగించి, తొందరగా బట్టలువేసుకొని వీధిలోకి వెళ్లడానికి సిద్ధంగా నుంచున్నాడు. అచల అల్లాగే తను ఉన్నచోటే కూర్చుని, తనకుట్టుపనిలో మునిగిపోయింది. అదిచూసి కేదారబాబు ఆశ్చర్యపడి "ఇంకా కుట్టుపనితోనే కూర్చున్నావు!

అది ఇంకా పూర్తి అవలేదూ!" అన్నాడు.

అచల ముఖం ఎత్తి ప్రశాంతభావంతో "నేను రాను నాన్నగారూ! అంది.

"రావూ! ఇదేమిటి!"

"రాను! నాన్నగారూ ఈవేళకి మీరు వెళ్ళండి! నాకేమిటో ఒంట్లో బాగుండలేదు." అని అచల ఒకచిరునవ్వునవ్వింది. సురేశుడికి లోలోపల కాలుకొచ్చింది. అయినా అతను దురహంకారం అప్పుడని "రండి! కేదారబాబుగారూ! మనం వెడదాము! ఆవిడికి బహుశః ఒంట్లో బాగుండలేదు. దీనికి పెద్ద వాదోపవాదా లెందుకు!" అన్నాడు.

కేదారబాబు సురేశునికేసి చూస్తూనే, అతను లోలోపల మండిపడుతున్నా డని గ్రహించాడు. అందుకని కూతురితో "ఏం నీకుఒంట్లో బాగుండలేదా!" అన్నాడు.

అచల "లేదు నాన్నగారూ! ఒంట్లో బాగుండకపోవడం యేమిటి! బాగానేఉంది." అంది సురేశుడు మహిముడివైపు వీపుతిప్పి నుంచున్నాడు. అందుచేత అతని హృదయభావం గ్రహించలేకపోయాడు. ఒకక్షణం ఉండి "వెడదాం రండి కేదారబాబుగారూ! ఆవిడికి ఇంటిదగ్గిర ఏదైనా జరూరువని ఉండవచ్చును. అంతబలవంతంగా తీసుకు వెళ్ళవలిసిన తొందరవని ఏముంది!" అన్నాడు. కేదారబాబు కఠినంగా "నీకు ఇంటిదగ్గిర ఏదేనా పనుందా! అన్నాడు." అచల అతనికేసి తిరిగి 'లేదు' అంది.

కేదారబాబు అకస్మాత్తుగా "ఇదుగో! నేను చెబుతున్నాను! రా! బొత్తిగా మంచీచెడ్డా తెలియక్కర్లేదూ! ఏమిటా పెంకితనం!" అనికట్టిగా అరిచాడు.

అచల కుట్టుతూన్న అట్ట చటుక్కుని చేతులోంచి కిందపడిపోయింది. ఆమె నిర్ఘాంతపడి కళ్ళు చక్రాల్లాగచేసి. తండ్రికేసి ఒక

సారీ, సురేశుడికేసి ఒకసారి చూసింది. ఆపైన ముఖం ఒకపక్కకి తిప్పుకుని చటుక్కుని ఆగదిలోనుంచి వెళ్లిపోయింది!

సురేశుడి ముఖం నల్లగా మసిబొగ్గులాగ అయిపోయింది. అతను "మీరు ప్రతీవిషయంలోనూ అవిణ్ణి బలవంత పెడుతున్నారు. అయితే నాకిక్కడ నుంచోడానికి వ్యవధి లేదు. సెలవిస్తే వెళ్లిపోతాను" అన్నాడు.

కేదారబాబు తను తొందర పడ్డందుకు లోలోపల నొచ్చుకున్నాడు. అతనికి సురేశుడన్న మాటవల్ల బాగా కోపంవచ్చింది; కాని ఆకోపంఅంతా వెళ్లి మహిముడిమీద విసుచుకుపడింది. అసలు మహిముడు లోలోపల ఎంతో బాధపడి అక్కడినించి లేచి వెళ్లాలని అనుకుంటున్నాడు? కాని ఇంతలోనే కేదారబాబు "మహిమా! నీ కేమన్నా ఇక్కడ తొందరపని ఉందా! అని అడిగేశాడు. మహిముడు లోలోపల వేసన అణుచుకుని "లేదు" అన్నాడు.

కేదారబాబు వెళ్ళిపోవడానికి లేచినుంచుని "ఈవేళ కొంచెం తొందరపనిలో ఉన్నాము. ఏదైనా మరోనాడువస్తే—"అన్నాడు.

మహిముడు మధ్యలో అందుకుని "అలాగే వస్తానండి! కాని రావడానికి అంతపెద్దఅవసరం ఉందా?" అన్నాడు. కేదారబాబు మనస్సులో సురేశుణ్ణి ఉద్దేశించుకుని "ఇందులో నా స్వంత-వ్యవహారంఏమీ లేదు. నీకంత రావడం అవసరం అని అనిపిస్తే; రా! ఒకటిరెండు సంగతులు మాట్లాడుకోవలసివుంటే మాట్లాడుకోవచ్చును" అన్నాడు.

ముగ్గురూకలిసి వీధులోకి వచ్చేశారు.! సురేశుడు మహిముడికేసి చూడనైనాచూడకుండా కేదారబాబుని తీసుకువెళ్ళి బండి ఎక్కాడు; బండికదిలింది. మహిముడు రెండడుగులుముందే వెళ్ళాడు. ఇంతలో అతనికి తనపేరువినబడింది. చటుక్కుని వెనక్కి తిరిగాడు. కేదారబాబుగారి నౌకరు రొజుకుంటూ వచ్చి, ఒక కాగితంముక్క

అతనిచేతిలో పెట్టాడు. ఆ కాగితంముక్కమీద 'అచల' అనేమాట ఒక్కటే రాసిఉంది. వాడు "అమ్మగారు పిలుస్తున్నారండి" అన్నాడు.

అతను వెనక్కితిరిగి మేడమెట్లదగ్గరికి వెళ్ళాడు. అక్కడ అచల నిలబడిఉంది. ఆమెకళ్ళు ఎర్రగా వాచిఉన్నాయి. అతన్ని చూసీచూడ్డం తోనే ఆమెకళ్ళమ్మట నీళ్ళుతిరిగాయి. మహిముడు దగ్గరకిరాగానే ఆమె "మీరు నన్ను కనాయివాడిచేతులికి అప్పగించి చూస్తూకూర్చున్నారా! ఇంత స్వామిద్రోహం చేసినమనిషికి నన్నప్పగించడంలో మీఉద్దేశం ఏమిటి?" అంది. అల్లాగ అంటూంటే ఆమె కళ్ళమ్మట కన్నీటిబిందువులు జలజలా రాలాయి.

మహిముడు నిర్ఘాంతపోయి. అలాగేనిలబడిపోయాడు. అచల రెండు మూడునిమిషాలతరవాత చీరచెరగుతో కన్నీళ్ళుతుడుచుకొని "నేనిప్పుడు సిగ్గుపడుతూ కూర్చుంటే లాభంలేదు.. మీకుడిచెయ్యి ఒకసారి ఇల్లాగయివ్వండి" అనిచెప్పి అతనికుడిచెయ్యి తనే [illegible] పట్టుకుని, తన చేతిబంగారపుకంకణం అతనిచేతికి పెట్టి "ఇప్పుడునాకు ఆలోచించడాని కేమీ పాలుపోవడం లేదు. మీకింక ఏంచేస్తే బాగుంటుందనితోస్తే ఆపనిచెయ్యండి. అనిచెప్పి నమస్కారంచేసి మెల్లిమెల్లిగా గదిలోకివెళ్ళిపోయింది.

౧౧

చీకటి పడ్డతరవాత మహిముడు తనబసకి బయలుదేరాడు. ఆసమయంలో అతన్ని చూస్తే బతికిఉన్నాడో లేడో చెప్పడం చాలాకష్టం. సురేశుడు ఇక్కడికి ఎలాగవచ్చాడు? అతనికి అంతటుంటంతో ఇంత లోనే ఇంత గొప్పపరిచయం ఎల్లాగకలిగింది! ఇల్లాటి సందేహాలేవీ అతనికితీరలేదు! కాని అసలు జరిగినసంగతేదో అతనికి

తెలియకపోలేదు! కేదారబాబుసంగతి అతనికి మొదటినించీ కూడా బాగా తెలుసును! అతనికి ఎక్కడనించైనా కాస్త రూపాయలవాసన తగిలిందంటే అతను ఎట్టాగా అది ఒదిలిపెట్టడు. ఈవిషయంలో ఏమీసందేహంలేదు! సురేశుడి సంగతి కూడా అతనికి అనేకవిషయాల్లో బాగా తెలుసును! అతనికిఏదైనా కావలసివస్తే దాని కోసం ప్రాణాలకికూడా తెగించి పనిచేస్తాడు. అతనికి రూపాయలంటే ఎప్పుడూలక్ష్యంలేదు! ఒకనాడు సుహిముడు గంగలోపడి మునిగి పోతూంటే సురేశుడు తనప్రాణాలసంగతి ఆలోచించకుండా అతన్ని రక్షించాడు! ఈనాడతను ఒకస్త్రీ వ్యామోహంలో చిక్కుకుని, అతని కేసి ముఖంఎత్తిచూడలేకపోతూండంటే—అందులో అతన్ననవలిసిన పని ఏముంది? అందుచేత ఇదంతాఒకగొప్ప దురదృష్టంవల్ల ఇలాగ జరిగిందనుకున్నాడు; కాని సుహిము డతన్ని నిందించలేక పోయాడు. అయితే ఈప్రబలమైన అడ్డంకు లన్నిటినీ ఎదుర్కొని, అచల తనదగ్గిరికి వస్తుందనే గట్టినమ్మకం అతనికి కలగలేదు అయితే ఆమె అన్నమాటలవల్లా, ఆమెచేసినపనివల్లా అతనికి మళ్ళీ కొంతఆశ కలిగింది. అంతేగాని నిజంగా గట్టినమ్మకం ఏమాత్రము కలగలేదు. ఆఉంగరంకేసి చూస్తున్నాగాని అతనికేమీ ధైర్యంకలగలేదు! అయితే ఏదోఒకటి తేలిపోవడం మాత్రం చాలాఅవసరం! పరిస్థితులు తెలుసుకోకుండా ఒకక్షణకాలం పొరబాటు పడ్డా వ్యవహారం అంతా చెయ్యిదాటిపోతుంది. ఏమైతే అది అవుతుంది! దీనిసంగతేదో చివరి కంటా చూస్తేనేగాని అతను ఒదిలిపెట్టదలుచుకోలేదు! ఈవిధంగా అతనొక దృఢసంకల్పం చేసుకుని. ఆదరిద్రంబడుతూన్న బసలో ప్రవేశించాడు.

ఆతరవాతరోజున. రెండుఝాములు దాటినతరవాత అతను కేదారబాబుగారింటికివెళ్ళాడు. అందరూకలిసి ఇప్పుడే ఎక్కడికో వెళ్ళారని

అతనికి తెలిసింది. అతను అనుకున్నాడూ మళ్ళీ వెళ్ళాడు. కాని ఆ వేళకూడా ఎవర్నీ కలుసుకోడానికి వీల్లేకపోయింది. నాలుక్కడికెళ్తే అందరూకలిసి బయస్కోపు చూడడానికి వెళ్ళారనీ రావడం చాలా ఆలస్యం అవుతుందనీ చెప్పారు. ఆ అంకహా అశేపదంలో ఎవరెవరున్నారో అతనడక్కుండా తెలుసుకున్నాడు. అభిమానం మాటా, అవమానం మాటా ఎలాగున్నా, అతనిలాంటి మనిషి రెండురోజులు పనికట్టుకువచ్చి, తిరిగిపోవడమే ఒక పెద్దవిషయం అయినాకాని ఆఉంగరం అతన్ని ఒకచోట కూర్చోనివ్వలేదు! మూడోనాటికూడా అతన్ని చెయ్యపట్టుకొని కేదారబాబుగారింటికి బరబరా లాక్కువెళ్ళింది. ఈవేళ మహిముడు కేదారబాబుగారింటికి వెళ్ళేసరికి ఆయన మేడమీద టీ తాగుతున్నారని తెలిసింది. మహిముణ్ణి ద్వారంలో చూడగానే కేదారబాబు గంభీరంగా "రా! మహిమా!" అనిమాత్రం అన్నాడు. మహిముడు చేతులెత్తి నిశ్శబ్దంగా నమస్కారంచేశాడు.

దూరంగా, తెరిచిఉన్న కిటికీదగ్గిర ఒకసోఫామీద, అచలా సురేశుడూ ఒకరిపక్కని ఒకరు కూర్చున్నారు. అచల ఒళ్ళో ఒకపెద్ద బొమ్మలపుస్తకం ఉంది. వాళ్ళిద్దరూకలిసి ఆబొమ్మలు చూస్తున్నారు. ఒకసారిమాత్రం సురేశుడు కన్నెత్తి చూశాడు. అంతే! మళ్ళీ ఆబొమ్మలకేసి చూస్తూకూర్చున్నాడు. అచల ఆఖరికి కన్నెత్తిఅయినా చూడలేదు! అందుచేత ఆమెముఖం కూడాకనబడలేదు. ఆమె అంత ఏకాగ్రదృష్టితో ఆబొమ్మలు చూడడం చూస్తే—కొత్తమనిషి లోపలికివచ్చినప్పుడు అయిన కాళ్ళచప్పుడుగాని, అతన్ని తండ్రిగారులోపలికి రమ్మనడంగాని—ఏమాత్రమూకూడా వినబడిఉండదని అనుకోడం అసంగతంకాదు.

మహిముడు లోపలికివస్తూనే ఒకకుర్చీలాక్కుని దానిమీదకూర్చున్నాడు. కేదారబాబు చాలాసేపటిదాకా మళ్ళీఏమీ మాట్లాడ

లేదు. కొంచెం కొంచెంగా టీ చప్పరిస్తూ కూర్చున్నాడు.

టీ తాగడం పూర్తి అయిపోయింది. ఆపైన కూడా అలాగే మాట్లాడకుండా కూర్చోడం అతనికి చాలా కష్టమైపోయింది. అందుచేత టీకప్పు కింద పెడుతూ "అయితే నువ్విప్పు డేం చేస్తున్నావు! ఇంకా నీ పరీక్ష సంగతీ అదీ తేలడానికి ఇంకొక నెల పడుతుందనుకుంటాను" అన్నాడు. మహిముడు ఆ మాటకి "అవునండి" అని మాత్రమే సమాధానం చెప్పాడు.

కేదారబాబు "సరే! నువ్వు పరీక్ష పేసవుతావనుకో! నువ్వు పేసవడంలో నాకేమీ అనుమానం కలగడంలేదు; అయితే కొంతకాలం డబ్బుసంపాదిస్తే నేగాని నువ్వుమరేపనీ చెయ్యడానికి వీలుండదు. ఏం సురేశబాబూ! మహిముడిసంసారపరిస్థితులు అట్టే అంత బాగా లేవని తెలిసింది. అవునా? అన్నాడు.

దానికిసురేశుడేమీ సమాధానం చెప్పలేదు. మహిముడు చిరునవ్వు నవ్వి, మెల్లిగా "పరీక్ష పేసవగానే డబ్బుసంపాదించడానికి వీలవుతుందని చెప్పడానికి వీలులేదు." అన్నాడు.

కేదారబాబు ఆమాటమీద ఇల్లాఅన్నాడు. "అవును ఆమాట నిజమే! అంతా పరమేశ్వరుడికృప! అయితే ప్రయత్నంచేస్తే సాధ్యం కానిదేమీ ఉండదు. మనశాస్త్రకారులంతా పురుషుడు సింహంలాగ ఉండాలన్నారు. నువ్వు కూడా అల్లాంటి పురుషసింహానివి కావాలి. కేవలం మనం గొప్పవాళ్ళం ఎల్లాఅవుతామా! అనేయావ తప్ప మరో ధ్యానం ఉండకూడదు. ఆతరవాత గృహస్థ ధర్మమనేది! అల్లాగ చూసుకోకపోవడం కేవలం మహాపాపము!" ఆపైన సురేశుడికేసి తిరిగి మళ్ళీఇల్లాగ అన్నాడు! ఏం! సురేశబాబూ! పిల్లల్ని మంచి పోషణలో ఉంచి వాళ్ళకి మంచిచదువు చెప్పించాలి! ఇల్లా చెయ్యక పోవడంమూలాన్నే హిందూసంఘం అంతా అధోగతి పాలై పోతోంది. బ్రహ్మసమాజస్థులమని పేరుపెట్టుకుని. మనం కూడా ప్రపంచానికి

సరియైన ఆత్మస్థైర్యం కల్పించకపోతే నాగరిక ప్రపంచంలో ఇక మనం ముఖంఎత్తుకుని తిరగడానికి వీలవుతుందా!" ఏమంటావు సురేశబాబూ! అవునా! కాదా?

సురేశుడు వెనక మోస్తరుగానే మాట్లాడకుండా కూర్చున్నాడు. మహిముడికి లోలోపల కాలుకొచ్చి "తమరిచ్చిన సదుపదేశం నేను ఎప్పటికీ మరిచిపోను! అయితే తమరీ విషయాలు ఆలోచించడానికేనా నన్నిక్కడికి పిలిపించింది?" అన్నాడు.

కేదారబాబుకి అతని మనస్సులో అభిప్రాయం తెలిసిపోయింది. ఆపైన "అబ్బే! కేవలం ఇందుకోసమే కాదు! ఇంకా ఇంకా మాట్లాడవలసినవి మరికొన్ని విషయాలున్నాయి" అని తనకి ఎదురుగా ఉన్న సోఫా కేసిచూస్తూ కూచున్నాడు.

ఆతరవాత సురేశుడు చటుక్కుని లేచినుంచుని "మనంవెళ్ళి కొంచెం ఆగదిలో కూర్చుందాము! రండి!" అనివంగి అచల ఒళ్ళో ఉన్న బొమ్మలపుస్తకం తీసుకున్నాడు. అతనుచేసిన ఈసంజ్ఞ అచలవిషయంలో ఎందుకూ పనికిరాకుండాపోయింది. ఆమె ఇంతకి పూర్వం ఎల్లాగకూర్చుందో అల్లాగే కూర్చుండిపోయింది. లేవడానికి కొంచెమైనా ప్రయత్నం చెయ్యలేదు. కేదారబాబు ఆవిషయం గ్రహించి "మీరిద్దరూ వెళ్ళి కొంచెం ఆపక్కగదిలో కూర్చోండి! నేను మహిముడితో కొంత మాట్లాడవలసిన పనుంది." అన్నాడు. ఆమాట మీద అచల ముఖంఎత్తి 'తండ్రికేసి చూసి' నేనిక్కడే ఉండిపోతాను నాన్నగారూ! అంది.

సురేశుడు ఆమాటమీద అయితే సరే! చాలా బాగుంది! నేనొక్కణ్ణే వెళ్ళిపోతాను. అనిచెప్పి మండిపడుతూ చేతిలోఉన్న పుస్తకము అచల ఒళ్ళోకి విసిరేసి, దబదబ చప్పుడుచేస్తూ అక్కడినించి ఇవతలికి వచ్చేశాడు.

పిలవలేను! మరొకడితో అయితే ఇన్నాళ్ళనించీ నువ్వుచేసినదానికి వ్యవహారం చాలావరకూ వెళ్ళిఉండును! నేను చాలా నెమ్మదైనవాణ్ణి! అనవసరంగా ఒకడితో తగాదా పెట్టుకోవడం నాకిష్టంలేదు! అందుచేత పిలువనంతవరకు నా మనస్సులో ఉన్నదేదో నీతో నెమ్మదిగానే చెప్పిచూశాను! నువ్వు కొంతకాలం ఆగడం మంచిదనికాని చెడ్డదనిగాని నేనప్పుడు చెప్పలేదు! ఇంగ్లీషువాళ్ళేంచేస్తారో చెప్పవలసిన పూచీ నామీద లేదు! అదీగాక మనం ఇంగ్లీషువాళ్ళం కాదు. బంగాలీవాళ్ళము! మన దేశంలో పిల్ల పెద్దదయిందంటే తల్లిదండ్రులకి కంటి నిద్రపట్టదు. అన్నం నీళ్ళు కూడా సయించవు! ఈమాత్రం నీకుమాత్రం తెలియదా! ఏమిటి?" అన్నాడు

ఒక్కనిమిషంలో మహిముడి ముఖం కందగడ్డలాగ ఎర్రబడింది. అతను కొంత తమాయించి, కొంత నెమ్మదిగా "మీరిందాకా వ్యవహారం చాలావరకు వెళ్ళిఉండునన్నారు! అంతవ్యవహారం చాలావరకూ వెళ్ళడానికి నేనుచేసినతప్పేముంది? అయితే దానికేంలెండి! మీప్రశ్నకి నాకు సమాధానం చెప్పక్కర్లేదు! మీఅమ్మాయి అభిప్రాయంకూడా ఇదేనా? అని నేనడుగుతున్నాను! అన్నాడు. ఆపైన అతను చటుక్కుని లేచివెళ్ళి' అచల కెదురుగుండా నిలబడి 'ఏం! నిజమేనా?' అన్నాడు. అచల ఆమాట మీద ముఖం ఎత్తనూలేదు! సమాధానం చెప్పనూ లేదు!

మహిముడు పైకిపొంగివస్తూన్న గాద్గద్యం అణుగుని "ఏకాంతంగా కూర్చుని నీమనస్సులో ఉన్నఅభిప్రాయం తెలుసుకోడానికి నాకు వీలయిందికాదు! అందుచేత ఇప్పుడీప్రశ్న అడుగుతూన్నందుకు నన్ను క్షమించాలి. ఆవేళ ఏదో ఆవేశంవచ్చి ఆఉంగరం నాకు ఇచ్చిఉంటావు! ఇప్పుడు దానికి నిన్నేమీ అనను! ఒక్కమాట చెబితే చాలు! ఆఉంగరంనీకు తిరిగిఇచ్చివెయ్యమన్నావా! వద్దా?" అని అడిగాడు.

సురేశుడు పెద్దతుపానుగా గదిలోకివచ్చి "కేదారబాబుగారూ! మీరు నన్ను క్షమించాలి! నేనిక్కడ ఇంకొక్క నిమిషమైనా ఉండడానికి వీల్లేదు!" అన్నాడు.

అక్కడ ఉన్నవాళ్ళంతా ఒక్కసారి కళ్ళెత్తి అతనికేసి చూశారు. కేదారబాబు 'ఏం చేశారు?' అని అడిగాడు. సురేశుడు అభినయిస్తూన్నట్టు చేతులుతిప్పుతూ "ఏంచేశామిటి! నేను చేసినదానికి క్షమాపణ కూడాలేదు. నాదగ్గరి స్నేహితుడొకడు ప్లేగువచ్చి చావుబతుకుల మీద ఉన్నాడు. నేను నా వ్యవహారాలన్నీ మరిచిపోయి ఇక్కడకూర్చుని వృథాగా కాలక్షేపంచేస్తున్నాను!" అన్నాడు.

కేదారబాబు కంగారుపడి "ఏమిటిఅంటున్నారు! సురేశబాబూ! కొంపదీసి మీరక్కడికి వెడతారాఏమిటి?" అన్నాడు. సురేశుడు చిన్నగానవ్వి "నేనీపాటికి అప్పుడే అక్కడికి వెళ్ళవలసింది" అన్నాడు.

కేదారబాబు ఎంతో సందేహిస్తూ ఏమిటిది! ప్లేగువచ్చిన చోటికే! అయితే అక్కడ ఊరికేవరైనా దగ్గరబంధువులు—" అన్నాడు.

సురేశుడు "బంధువులు అంటున్నారా? అతను అంతకంటేకూడా చాలాదగ్గరవాడు!" అన్నాడు. ఆపైన మహిముడికేసి ఒకక్రీగంటి చూపు చూసి "మహిమూ! మన నిశీథుడికి నిన్న రాత్రి ప్లేగుతగిలింది. బతుకుతాడని ఆశ కలగడంలేదు! నీతోకూడా ఈమాట చెప్పాలనుకున్నాను! నువ్వొక్కసారి అతన్ని చూడవూ?" అన్నాడు. మహిముడికి నిశీథుడంటే ఎవరో జ్ఞాపకంరాక ఆలోచించి 'నిశీథుడెవరు!' అన్నాడు.

"నిశీథుడెవరంటున్నావా? ఇంతలోనే నిశీథుణ్ణి మరిచిపోయావా? అతనితోకూడా నువ్వు సెకండియరంతా కలిసి చదివావు కూడాను. ఇంత ఆపత్తులోఉన్నా నీకతనిసంగతే జ్ఞాపకంరావడంలేదూ?" అన్నాడు. ఆపైనముఖంతిప్పి, అచలకేసి చూసి "ఇప్పటికైనా జ్ఞాపకంవచ్చిందా అతనిసంగతి?" అన్నాడు.

మహిముడు. సురేశుడచలకేసిచూడడం సహించి "భవానీపురం నించి వస్తూఉండేవాడు! అతనేనా? అని అడిగాడు.

సురేశుడు వ్యంగ్యంగా "అవునతనే! ఇంతవరకూ జ్ఞాపకంరాకపో వడానికి మనకి పరిచయముండున్న నిశీథు లెంతమంది ఉన్నారు! అయితే నువ్వొక్కడికి వస్తావా?" అన్నాడు.

నిశీథుడిసంగతి బాగా జ్ఞాపకం తెచ్చుకున్న తరవాత మహిముడు "అయితే అతనిప్పు డెక్కడఉన్నాడు!" అని అడిగాడు.

దానిమీాద సురేశుడు "ఎక్కడఉంటాడు? భవానీపురంలో ఇంట్లోనే ఉన్నాడు! ఈసమయంలోనైనా ఒక్కసారి అతన్ని చూడ్డం నీకు విధాయకంకాదూ? నేను డాక్టర్ని! నేనువెళ్ళితీరాలి! అంత గొప్ప స్నేహం నువ్వు మరిచిపోకపోతే నాతోకూడావస్తావు! కేదారబాబు గారూ! మీరు మాట్లాడవలసినసంగతి ఈపాటికి పూర్తిఅయిపోయి ఉంటుంది. కొంచెంసేపు సెలవిప్పించడానికి వీలవుతుందా!" అని అడిగాడు.

ఈఅనుగ్రహం ఎవరిమీాదకలిగిందో కేదారబాబుకి తెలియలేదు! అతను ఉద్విగ్నహృదయంతో ఒకసారికూతురు కేసీ ఒకసారిమహిముడి కేసీ చూస్తూకూర్చున్నాడు.

ఈ ముందుకాబోయే అల్లుడికి ఏమాటంటే పెద్దకోపం వస్తుందో తెలుసుకోవడ మనేది కేదారబాబుకి యింతవరకూ సాధ్యంకాలేదు! అందుచేతఅతను ఏమాటూ అనలేకపోయాడు! మహిముడుకూడా మతి పోయినవాడిలాగ అలాగేచూస్తూ కూర్చున్నాడు!

ఈవిషయాలన్నీ గమనిస్తూంటే అచలముఖం కంకంలాగ మారి పోయింది. ఆమె మెల్లిగాలేచి చేతులోఉన్న పుస్తకం బల్లమీాద పెట్టి కొంతసేపు ఆగి "మీారువైద్యులు అందుచేత వెళ్ళకతప్పదు! ఈమధ్యన చదువుకునే పుస్తకాల్లో ప్లేగునిగురించి రాశారు. ఇలాంటప్పుడు

ఈయనఅక్కడికి వెళ్ళడం ఎందుకు?" అనిఅడిగింది.

అచల ఇల్లాం అంటుందని సురేశుడు ఊహించలేకపోయాడు. అందుచేత అతను నిర్ఘాంతపడి ఉత్తరక్షణంలో చటుక్కుని "నేనక్కడ వైద్యం చెయ్యడానికోసం వెళ్ళడంలేదు! అక్కడ డాక్టర్లకేమీలోటు లేదు. నేను స్నేహితుడికి సేవచెయ్యడంకోసం అక్కడికి వెడుతున్నాను! స్నేహం ప్రాణాలకంటేకూడా గొప్పదని నాఅభిప్రాయము!" అన్నాడు.

ఒకరకమైనవికృతహాసంతో కంచుకంఠంతో అచలపెదవులమీద నృత్యం చేసింది. ఆమె "అందరూ కూడా అట్లే మహానుభావులు కావడం సామాన్యంగాకష్టం! ఇతరులతో స్నేహం సంగతి తెలిసికోలేక పోయినంతమాత్రాన్ని, సిగ్గుపడవలసిన అవసరంలేదని నా అభిప్రాయము. సరే! విను చుతేనేం! ఎల్లాంటిపరిస్థితుల్లో నయినా ఈయనక్కడికి రాలేరు" అంది.

సురేశుడిముఖం ఒక్కసారిగా నల్లబడిపోయింది. కేదారబాబుకి మనస్సులో ఏదో అనుమానం కలిగింది. అతను భయపడుతూ చూసి, "ఈగొడవంతా నీకెందుకు అచలా? నిజంగా సురేశబాబులాంటి—" అని ఇంకా ఏదో అనబోయాడు.

అచల చటుక్కుని మధ్యలో అందుకుని "అసలు సిక్కుడంటే ఎవర్నో ఈయన మొదట గుర్తే పట్టలేకపోయారు! అదీగాక ఆయనడాక్టరు! అందుచేత ఆయన వెడతారు! అదీగాక అపాయమైన చోటికి అనవసరంగా ఇంకొకర్ని తీసుకువెళ్ళడం ఎందుకు!" అంది.

హృదయానికి ఆఘాతం కలిగేటప్పటికి సురేశుడికి ఇంక మంచీచెడ్డా తెలియలేదు! అతను పిడికిటితో బల్లమీద ఒకపెద్దదెబ్బ కొట్టి ఇష్టం వచ్చినట్లు మాట్లాడడం ప్రారంభించాడు "నేనేం పిరికివాణ్ణికాదు! నేను ప్రాణాలంటేభయపడను" అన్నాడు. ఆపైన మహిమ్ముడికేసి చూస్తూ

"నేనితన్ని ఒకసారి చచ్చిపోకుండా రక్షించాను! ఆసంగతి అవునో కాదో ఈకృతఘ్నుణ్ణే అడగవచ్చును" అన్నాడు.

ఆమాటమీద అచల సగర్వంగా "అవును! ఈయన కృతఘ్నుడే! ఎందుకు కాదు! అయితే ఒక విశేషం ఉంది. రక్షించినవాణ్ణే సమయంవస్తే భక్షించడంకూడా జరుగుతూఉంటుంది. అంతేనా" అంది.

కేదారబాబు మతిపోయినవాడిలాగ "మాట్లాడకూడదు! అచలా! సురేశుబాబూ! పోనివ్వండి! ఎందుకీవాదనంతా! చెప్పండి!" అన్నాడు.

సురేశుకళ్ళు చింతనిప్పుల్లాగ ఎర్రబడ్డాయి. అతను కేదారబాబు కేసి చూసి "నేను ప్లేగున్న చోటికికూడా వెళ్ళగలను! దీనివల్ల నాకేం ఇబ్బందిరాదు! ప్రాణంఅంటే మహామునిదే ప్రాణం! నాప్రాణానికేమీ విలువలేదు! ఏం మీకు తెలియలేదూ? అన్నాడు.

సిగ్గూ బాధా భరించలేక అచల ఏడవడం మొదలుపెట్టింది. అల్లాగ ఒక్కనిమిషం ఏడ్చి గద్గదస్వరంతో మళ్ళీ "ఈయనప్రాణాలు ఈయన ఇవ్వగలరు! నేను దానికి అడ్డుపెట్టలేను! కాని అడ్డుపెట్టడానికి అధికారం ఎక్కడఉంటే అక్కడఅడ్డుపెట్టితీర్తాను! ఏమైనాసరే! అల్లాంటిచోటికి ఈయన్ని వెళ్ళనివ్వదలుచుకోలేదు!" అని అక్కణ్ణించి వెళ్ళబోయింది. అదిచూసి కేదారబాబు గట్టిగా "ఎక్కడికి వెళుతున్నావు అచలా!" అని అరిచాడు.

అచల స్తంభంలాగ నిలబడిపోయి "నాన్నగారూ! రాత్రింబగళ్ళు నేనింక బాధ భరించలేకుండా ఉన్నాను! నేను "ఇది జరగడానికి వీల్లేదు! నాప్రాణాలుండగా దీనికి ఒప్పుకోకూడదు!" అని అనుకుంటూంటే మీరుదీన్నే పట్టుకుని నాప్రాణాలు తోడేస్తున్నారు!" అని అంటూ, పొంగిపొంగి వస్తూన్న తనదుఃఖం ఆపుకుని, అక్కణ్ణించి గబగబా ఇవతలకి వచ్చేసింది! కేదారబాబు మతిపోయినవాడిలాగ కొంతసేపు అల్లాగే చూస్తూకూర్చున్నాడు. ఆపైన మాటిమాటికీ "పిల్లందరికీ

బొత్తిగా చిన్నతనం! లేకపోతే దీనికింత గొడవెందుకు!" అని అను కుంటూ కూర్చున్నాడు!

౧౨

ఆతరవాత ఒక నెలర్రోజులు గడిచిపోయాయి. కేదారబాబు ఓవరికి ఎల్లాగోఅల్లాగ సమాధానపడ్డాడు. వచ్చేఆదివారం నాడు అచలని మహిముడి కిచ్చి వివాహంచెయ్యడం నిశ్చయం అయిపోయింది. ఆనాడు సురేశుడన్న మాటలన్నీ వెళ్ళి కేదారబాబుమనస్సులో శూలాల్లాగ గుచ్చుగున్నాయి. కాని ఆవేళ సురేశుడుచేసిన అవమానంతలుచుకొని ఆకోపంచేత మహిముడికి అచల నివ్వాలని మాత్రం కేదారబాబు అనుకోలేదు! ఆరోజు మొద లుచ్చుగుని సురేశుడు మళ్లీకనబడలేదు. అతనెక్కడికి వెళ్ళాడోకూడా ఎవరికీ తెలియదు! కొంత వాకబుచెయ్యగా అతను ఆరాత్రే బయలు దేరి పడమరగా వెళ్ళాడని తెలిసింది. అత నెప్పుడు తిరిగివస్తాడోకూడా ఎవ్వరికీ తెలియదు.

ఆనాడు ఏడుపు ఆపుగోడానికి అచల గదిలోంచి అవతలికి వెళ్ళగానే మిగిలినముగ్గురూ ముఖాలు చిన్నబుచ్చుగుని కూర్చున్నారు! చివరికి మొట్టమొదట సురేశుడే మాట్లాడాడు. అతను కేదార బాబుకేసి చూసి "మీకభ్యంతరం లేకపోతే మీఎదురుగుండానే మీ అమ్మాయితో రెండుమూడుమాటలు మాట్లాడాలనిఉంది." అన్నాడు.

కేదారబాబు మనస్సులో బాధపడుతూ "ఎంతమాట! సురేశ బాబూ! మీరుమాట్లాడితే నాకభ్యంతరం ఏముంటుంది? ఇంకా మీకు చిన్నతనంపోలేదు!" అన్నాడు.

"అయితే ఒక్కసారి పిలిపించండి! నేను అట్టేసేపు కూర్చోడానికీ వీల్లేదు!"

అతనిముఖంలోనూ, కంఠస్వరంలోనూ కనబడిన ఆ అస్వాభావికమైన గాంభీర్యం చూస్తే కేదారబాబు హృదయంలో ఏదో భయంలాంటిది బయలుదేరింది. అయినాగాని బలవంతంగా నవ్వి మళ్ళీ అతని మాటే రెట్టిస్తూ "ఎంతసేపుచూసినా బొత్తిగా చిన్నతనం మాటలే! కొంతసేపు అమ్మాయిమనస్సు కుదుటపడనీయండి! సురేశబాబూ! మీకీవిషయం తెలిసిందా! ఆప్లేగుమాట వినేటప్పటికి—చిన్నపిల్లమాట అల్లాగ ఉండనీయండి!—నాకే భయం వేసి—ఏం! నేను అనేమాట తెలియలేదూ? అన్నాడు.

సురేశుడికిప్పుడు ఒకళ్ళ మానసిక పరిస్థితి వర్ణిస్తూంటే వినడానికి కొంచమైనా ఓపిక లేదు! అందుచేత అతనింక ఉండబట్టలేక, చటుక్కుని, "నాకింక ఒక్కనిమిషమైనా ఆలస్యం చెయ్యడానికి వీల్లేదు. కేదారబాబుగారు! నేనింక ఒకళ్ళకోసం ఎదురుచూస్తూ కూర్చోడానికి వీల్లేదు, అన్నాడు."

అయితే సరే! "ఎవడురా! అక్కడ" అని పిలిచి కేదారబాబు మహిముడికేసి వంకరదృష్టితో చూశాడు. మహిముడు లేచినుంచుని కేదారబాబుకి నమస్కరించి మెల్లిగా అక్కడినించి వీధులోకి వెళ్ళిపోయాడు.

కేదారబాబు స్వయంగావెళ్ళి అచలని తీసుకొనివచ్చాడు. అప్పటికప్పుడే ఎర్రనిసూర్యకాంతి కిటికీలగుండానూ తలుపులగుండానూ లోపలప్రవేశించి ఇంటినిండా వ్యాపిస్తూ ఉంది. కొంచెంపొడుగ్గా శలాకలాగ ఉన్న ఆమెశరీరంమీదకూడా ఆకాంతిపడి తళతళలాడింది. ఆమెశరీరంకేసి చూసేటప్పటికి, లోలోపల ఎంతో కుమిలిపోతూన్న సురేశుడిమనస్సుకి ఒక్కక్షణకాలం ఎంతో ఉల్లాసం కలిగింది. క్షణకాలం అతనికి ఆమెమీద మోహంకలిగింది. ఆఉల్లాసంగాని, ఆమోహం గాని, అంతకంటె ఎక్కువసేపుండలేదు! ఆమెకేసి ఒక్కనిమిషం

చూసేటప్పటికి అతని హృదయంలోని భావం అంతా మాయమైపోయింది! అయినా గాని అతనామె కేసి చూస్తూ అల్లాగే స్తంభంలాగ నిలబడిపోయాడు! ఆకాశకాంతి పరిగ్లానమై అచలముఖం మీద పడిన మాట నిజమే! కాని ఎదురుగుండా ఉన్న గోడమీద ప్రతిఫలించిన ఎర్రని సూర్యకాంతి ఆమె ముఖం మీద సంపూర్ణంగా ప్రసరించింది. అందుచేత సురేశుడికి ఆ ముఖం ఒక సువర్ణవిగ్రహం ముఖంలా కనిపించింది. ఒకవిధమైన అదృష్టం ఆమెలో ప్రవేశించి, సర్వాంగసంపూర్ణమైన ఆ కోమలమాధుర్యమూ సౌకుమార్యమూ నాశనం చేసినట్లు కనబడింది. ఇంతే కాదు ఆ ముఖంలో ఉండే ప్రతీ సౌందర్యరేఖా కూడా అతికఠిన మైపోయినట్లు అతనికి కనిపించింది. హఠాత్తుగా కేదారబాబు ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టాడు. ఆ నిట్టూర్పు ధ్వని అతని ఆలోచన లన్నీ కలచివేసింది. అతనామె కేసి తిన్నగా చూస్తున్నాడు.

కేదారబాబు మళ్ళీ ఇంకొకసారి తనపూర్వం అన్నమాటే ఏకరువు పెడుతూ "ఎవరితోనూ ఏం చెప్పడానికీ లేకుండా ఉంది! అందరికీ బొత్తిగా చిన్నతనం!" అన్నాడు.

సురేశుడు అచల కేసిచూసి దారుణమైన గంభీరస్వరంతో "మీరు ఇందాకా చెప్పిందంతా పూర్తిగా ఆలోచించే చెప్పారా?" అన్నాడు. అచల మెడతిప్పి 'అవును' అంది.

"ఈ అభిప్రాయం మారడానికి ఏమీ అవకాశం లేదా?"

అచల మళ్ళీ పూర్వం మోస్తరుగానే 'లేదు' అంది.

ఒక్కసారిగా సురేశుడి హృదయంలో రక్తం అగ్నిజ్వాలలాగ ఉప్పొంగింది. అతని కళ్ళూ ముఖమూ నిప్పుల్లా ఎర్రబడిపోయాయి. కాని అతను తన కంఠస్వరం యథాప్రకారంగా మార్చేసి "నా ప్రాణాలకి కూడా ఏమీ విలువ లేదని అన్నాక నాకు సమస్తమూ తెలిసిపోయింది!" అన్నాడు. ఆ సమయంలో అతని హృదయంలో మహాగ్నిజ్వాల భగభగ

మండిపోతూఉంది. అతను మళ్ళీ కొంత తమాయించి "నే నొక్క విషయం అడుగుతున్నాను! నేనొక్కణ్ణే మొట్టమొదట మీవల్లోపడ్డానా ఇంకా చాలామంది. మీవల్లో చిక్కుకు ఇల్లాగే ప్రాణాలుపోగొట్టు కున్నారా?" అన్నాడు.

భరించలేని ఆశ్చర్యంచేత అచల కళ్లు చక్రాల్లాగచేసి అతని కేసిచూస్తూ కూర్చుంది. సురేశుడు కేదారబాబు కేసి చూసి మళ్ళీ " తండ్రీ కూతురూకలిసి ఇల్లాంటి కపటనాటకం ఆడడం విదేశాల్లో జరుగుతూఉంటుందని అంటారు; ఇందులో కొత్త ఏమీలేదు! కాని ఒక్కవిషయం చెబుతున్నాను. కేదారబాబుగారూ! ఎప్పుడో ఒకప్పుడు మీరంతా తప్పకుండా జైలులోకి వెళ్ళవలసిఉంటుంది!" అన్నాడు.

కేదారబాబు గట్టిగా అరుస్తూ "ఏమిటీమాటలన్నీను రేశబాబూ!" అన్నాడు. సురేశు డేమీచలించకుండా "చాలు! చాలు! మాట్లాడకండి. ఈనాటకం అంతాఇంక నేనీ విషయం నాజన్మలో మరిచిపోలేను! నారూపాయలూ పోయాయి! దానికి తగినశాస్తీ అయింది! కాని ఇప్పటికైనా ఇంకా ఈకపటనాటకం చాలించండి!" అన్నాడు. అచల ఏడుస్తూ "నాన్నగారూ! మీరు రీయునదగ్గిర డబ్బు ఎందుకు పుచ్చుకున్నారు;" అని అడిగింది.

కేదార బాబు ఒకచిన్న తెల్లకాగితం ముక్కకోసం పిచ్చివాడిలాగ ఇక్కడా అక్కడా వెతికి, చిట్టచివరి కొకపాతపేపరు చేత్తో పట్టుకుని పెద్దగా అరుస్తూ "నేను తక్షణమే నోటురాసి ఇచ్చేస్తాను" అన్నాడు.

సురేశుడు "చాల్లెండి! చాల్లెండి! ఇప్పుడింక నోటురాయవలసిన అవసరంలేదు! ఆ! మీరిచ్చారు! నేనుపుచ్చుకున్నాను! ఈనాలుగు డిబ్బులకోసమూ తగుదునమ్మా! అని మీతో నేనుకోర్టెక్కుతాను."

అన్నాడు. కేదారబాబు ఇంకా ఏదో మాట్లాడబోయాడు. అతని పెదవులు ఊరికే కంపగా కదిలాయి; గాని మాటలు మాత్రం నోట్లోంచి ఊడిపడలేదు!

సురేశుడల్లాగే అచలకేసి చూస్తూకూర్చున్నాడు. ఆ తెల్లబోయిన ఆ మొహముఖమూ, కన్నీళ్లు నిండిన ఆకళ్లూ చూస్తే అతనికి పిసరంతైనా ప్రేమకలగలేదు! పైగా లోపల రాజుకుంటున్న కోపజ్వాల నూరు రెట్లు ఎక్కువగా మండిపోగా అతను [illegible]మైన కాఠిన్యంతో "గర్వపడడానికి [illegible]? ఈ ముఖానికీ, ఈ పువ్వుల్లాంటి [illegible] నేనేమో మీ అందం [illegible] ఎప్పటికీ అనుకోవద్దు" అన్నాడు.

తన తండ్రి ఎదురుగుండా ఇంత అవమానం జరిగినందుకు [illegible]భరింప లేక రెండుచేతులతోనూ కళ్లుమూసుకొని లుంగచుట్టుకుని కుర్చీలో పడిపోయింది

సురేశుడు లేచినుంచుని "నాకసలు బ్రాహ్మసమాజస్థులంటే కిట్టదు! అసలునాకు బ్రాహ్మసమాజస్థుల నీడతొక్కడం అంటే కూడా అసహ్యంగా ఉండేది. చిన్నప్పట్నించి ఎముకలకి పట్టిన ఆ ద్వేషమూ, అసంస్కారమూ, ఈ ఇంటిలో అడుగుపెట్టగానే ఒక్కసారిగా ఎగిరి పోయాయంటే ఇదంతా ఏదో ఇంద్రజాలం జరుగుతూందని నేనప్పుడే గ్రహించి ఉండవలసింది. నాకు ఆ కావలసిన శాస్తి కాస్తా అయిపోయింది; కాని వెళ్లేముందు మీ అందరికీ కోట్లకొలది కృతజ్ఞతా నమస్కారాలు చెయ్యనిదే మాత్రం ఇక్కడినుంచి వెళ్లలేను! అచలా! నమస్కారం!" అన్నాడు.

అచల ముఖంఎత్తకుండానే గద్గద స్వరంతో "నాన్నగారూ ఆయన్నింక నోరెత్తవద్దని చెప్పండి! ఇంతకంటె మహా [illegible]

తిరిగి ముస్తీ ఎత్తుకోవడం మంచిది; మీరాయన దగ్గరనుంచి పుచ్చు కొన్నదంతా తిరిగి ఇచ్చివేయండి" అంది.

సురేశుడు మళ్ళీ తలవంచుకుని "ప్రతీకారానికి తిరగడం మంచిదా మీకా ద్రోహం పట్టితీసుతుంది! నేనిప్పుడే చెబుతున్నాను! కాని ఆ రోజు వచ్చినప్పుడు మాత్రం నా పేరు కొంచెం జ్ఞాపకం చేసుకోండి!" అన్నాడు. ఆపైన సమాధానంకోసం ఎదురు చూడకుండానే అత డక్కడనుంచి తొందరగా వీధిలోకి వెళ్ళిపోయాడు!

కేదారబాబు కొంతసేపటిదాకా అల్లాగే నిర్ఘాంతపోయి కూర్చు న్నాడు. ఆపైన ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి "అబ్బా! ఎంతభయంకర మైనవ్యక్తి! ఇల్లాంటివాడనే నే నింట్లో అడుగే పెట్టనివ్వక పోదును" అన్నాడు.

తండ్రిఅన్న మాటలు అచలకి వినబడ్డాయి; కాని ఆమె ఏమీ మా ట్లాడలేదు. ఎల్లాగ పడిఉందో అల్లాగే పడుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. పక్కనే కుర్చీమీద కూర్చున్న కేదారబాబు అంతా చూస్తూ కూర్చు న్నాడు; కాని ఒక్కసారైనా ఓదార్చడానికి అతనికి సాహసం లేక పోయింది. క్రమంగా సాయంత్రంపడింది. నౌకరు లోపలికి వచ్చి దీపం వెలిగించే ప్రయత్నంలో ఉన్నాడు. అది చూసి అచల నిశ్శబ్దంగా తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఈవిషయాలేమీ కూడా మహిముడు తెలుసుకోలేకపోయాడు. కేదారబాబు తనకుమార్తెని మహిముడికిచ్చి వివాహం చెయ్యడానికి నిశ్చయించిననాడు మహిముడు అతనికేసి వెర్రివాడిలాగ చూస్తూకూర్చు న్నాడు. ఈవిషయంలో అతనిమనస్సులో అనేకసందేహాలు కలిగాయి; కాని తనఅదృష్టానికంతటికీ సురేశుడే చివరికి ప్రధానకారణం అయ్యా డన్నసంగతి మాత్రం అతనూహించుకోలేకపోయాడు. అచలమీద కలి గినప్రేమతోటీ, స్నేహంతోటీ అతని హృదయంపొంగిపోయింది. అతనిది

ఎప్పుడూ కష్టే మాట్లాడే స్వభావం కాదు. తొందరపడడంగాని, పెద్దఆవేశంగాని అతనిముఖంమీద ఎప్పుడూ కనబడవు! అల్లాగ కనబడితే జనం అంతా చాలావిచిత్రంగా చెప్పుకునేవారు. ఈవేళ సాయంత్రంకూడా అతను కేదారబాబు దగ్గిర కూర్చుని రెండుమూడు మాటలు మాట్లాడి ఒంటరిగా తిరిగి తనగదికి వెళ్ళిపోయాడు. అంతే! సామాన్యంగా రోజూవున్నట్టుగా అచలను కలుసుకుని ఆమెకి నమస్కారమైనా చెయ్యలేదు! అసలు వివాహప్రసంగం కేదారబాబే ఎత్తాడు. వివాహప్రసంగం ఎత్తడం ప్రారంభించి వివాహపురోజు స్థిరపరచడందాకా ఆయనే అంతా నడిపించాడు. అసలు కేదారబాబుకి ఇల్లాగ చెయ్యక తప్పలేదు. వివాహప్రసంగం ఎత్తినప్పుడు కేదారబాబు ముఖంలో కులాసాగాని, సంతోషంగాని ఏమీ కనబడలేదు! క్రమక్రమంగా రోజులు గడిచిపోయాయి. వివాహపురోజుకూడా బాగాదగ్గిరపడింది.

ఇంకే ఎల్లుండే వివాహము! కేదారబాబు వివాహం ఆర్భాటంగా లేకుండా చెయ్యాలని నిశ్చయించాడు. అందుచేత వివాహం నిమ్మకి నీరెత్తినట్లు జరగడానికి ఆయన శాయశక్తులా పనిచేశాడు.

ఈవేళ సాయంత్రంకూడా కేదారబాబు యథాప్రకారంగా టీ తాగుతూ కూర్చున్నాడు. దగ్గిరగానే ఒకకుర్చీమీద కూర్చుని అచల ఏదో కుట్టుపని చేసుకుంటూంది.

ఆమె అనేకరోజులనించి రాత్రింబగళ్ళు యమయాతన అనుభవించింది. ఇప్పుడు కొంచెంకొంచెం ఆమెకి మనశ్శాంతికలిగింది. అందుచేత ఆమె ముఖంమీద లేతవెన్నెలలాగ సంతోషచ్ఛాయ కనిపించింది. కేదారబాబు టీ తాగుతూ ఈసంగతి గమనించాడు. సురేశుడు దెబ్బలాడి వెళ్ళిపోయినప్పటినించీ కేదారబాబుమూతి ముడుచుకునే కూర్చుంటున్నాడు. సురేశుడు తిరిగివచ్చి మళ్ళీవంచేస్తాడో అని ఒకభయం. అదీగాక ఋణంవిషయంలో నోటురాసి ఇవ్వడమా? లేకపోతే మళ్ళీ

తెలుసుకొని అతని అభిప్రాయము. కేవలం యోగ్యతలనిపట్టి చూస్తే సురేశుడు [illegible] ఎన్నోరెట్లు గొప్పవాడు. ఇంతేకాదు; అతనితో కలిసిమెలిసి ఉంటున్నట్టైతే తనకది ఒకగొప్పలోటని కేదార బాబు అభిప్రాయము! అందుచేత సురేశుడిపైన కేదారబాబుకేమీ కోపంరాలేదు! ఇంతగ్రంథం నడిచినా, అచలని సురేశుడికిచ్చి వివా హంచెయ్యడాని కేదైనా ప్రయత్నించే, ఆవివాహం [illegible] దానికి ఆతనేమీ వెనక్కితిరక్కపోను! కాని ఇల్లాగ చెయ్యడానికి ఇంకేదీ ఉపాయంలేదు! అచల దగ్గిర సురేశుడి పేరెత్తడంకూడా చాలా ఇబ్బం దితోకూడుకున్నపని!

కుట్టుపని చేస్తూచేస్తూ, అచల ముఖంఎత్తి "నాన్నగారూ! సురేశబాబుసంగతి చదివారా?" అని అడిగింది.

అచల సురేశునిపే రుచ్చరించిం దేమిటని, ఉలిక్కిపడి కేదార బాబు అచలకేసి చూశాడు. తనపొరబాటుగా వినలేదా! అని అతని కనుమానం కలిగింది. పొద్దున్న వచ్చినపేపరు బల్లమీద పడిఉంది. అచల ఆపేపరుతీసి మళ్ళీ అమాటే అంది. కేదారబాబు గబగబా ఆపేపరు పేజీలు తిరగేశాడు. అంతేనేగాని జాగ్రత్తగా ప్రతీదీ పరిశీ లించి చదవలేదు! అందుచేత "సురేశుడా?" అన్నాడు.

అచల ఆపేపరుతీసి అందులో సురేశుణ్ణిగురించి రాసినభాగం వెతుకుతూ "బహుశః ఆయన మనసురేశబాబే అయిఉంటారు" అంది. కేదారబాబుకళ్ళుచక్రాల్లాగ చేసి "మనసురేశబాబా! ఆయన ఏంచే శారు? ఇప్పు డెక్కడఉన్నారు?" అని అడిగాడు. అచలపత్రికలో సురేశుణ్ణిగురించి రాసినభాగం చూపిస్తూ "ఇదుగో! ఇదిచదవండి నాన్నాగారూ!" అంది. కేదారబాబు సులోచనాలజోడుకోసం జేబులు తడుముకుంటూ "బహుశః నేను కళ్ళజోడు అగదిలో పడవేసిఉంటాను. ఏం రాసిఉందో వింటాను? నువ్వే చదివి పెట్టమ్మా!" అన్నాడు.

అచల ఆవృత్తాంతం అంతా చదివి వినిపించింది. ఆసంగతి అంతా పైజాగారునించి ఓ విశేషం రాశాడు. ఒకరోజున ఆపట్నంలో ఒక మహా బీద వాళ్ళకొంపలన్నీ తెగులుతో పోతున్నాయి. అసలే ప్లేగు! ఆపైన ఈఆపత్తు. పాపం దరిద్రులు పడేబాధకి అంతూదరీ కనబడడం లేదు! పాపం వాళ్ళంతా అల్లాగ బాధపడుతూ ఉండగా సురేశుడు అనే ఒక ఉదారపురుషుడు అక్కడికి, వచ్చి, వాళ్ళందరికీ ధనసహాయమూ, మందులసహాయమూ చేసి ఎంతో సాయపడ్డాడు. ఇంతే కాదు! తనప్రాణాపాయంకూడా లక్ష్యం చెయ్యకుండా అనేకమంది రోగులికి సేవచేస్తున్నాడు. ఆఉదారపురుషుడు అక్కడికి రాగానే "రోగంతో బాధపడుతూన్న ఒకస్త్రీ కాలిపోతూన్న ఇంట్లో చిక్కడి పోయింది" దని తెలిసింది. ఆవిణ్ణి రక్షించడానికి ఎవ్వరూ సాహసించలేకపోయారు. అందుచేత ఆవిణ్ణి రక్షించడానికి తనప్రాణాలుకూడా లక్ష్యంచెయ్యకుండా ఈయన అతిధైర్యంతో ఆమంటల్లో ఉరికాడు! ఇంకా ఇల్లాగే అతన్నిగురించి ఇంకా సవిస్తరంగా రాశారు.

చదివినతరవాత చాలాసేపటిదాకా కేదారబాబేమీ మాట్లాడలేదు! ఆపైన ఒకపెద్దనిట్టూర్పు విడిచిపెట్టి "అయితే ఈయన మనసురేశుడే అంటావా?" అన్నాడు. అచల ప్రశాంతంగా "అవును నాన్నగారూ! ఈయన మనసురేశబాబే! " అంది.

కేదారబాబు మళ్ళీఒకసారి చటుక్కుని ఆశ్చర్యపడ్డాడు. బహుశః అచల ఏమీ ఆలోచించకుండానే మన అనేశబ్దం మీాద ఒత్తిపలికి ఉంటుంది. లేకపోతే కేవలం ఈసురేశుడు మనవాడే అనే ఒకనిశ్చితాభిప్రాయం ప్రకటించడాన్నికైనా అల్లాగ ఒత్తి పలికిఉంటుది; కాని కేదారబాబు కాఒత్తిపలకడం మరోవిధంగా అర్థమయింది. మునిగిపోయేమనిషి గడ్డిపరకపట్టుకోడానికి చేతులుచాపినట్లు అచల ముఖంలోంచివచ్చిన ఆపదాన్ని కేదారబాబు ఎంతో ఆప్యాయంగా హృద

యానికి హత్తుకున్నాడు. ఈ ఒక్క శబ్దమూ అతని భావనాప్రపంచంలో ఎన్ని చిత్రవిచిత్రమైన ఆశాద్వారాలు తెరిచిందో! ఇన్నాళ్ళకి అతని ముఖం ఒక్కసారి ఆశాసమ్మిళితమైన ఆనందంతో తళుక్కుమని మెరిసింది. అతను ఆప్యాయంగా "అమ్మా! నీకీవిషయం తెలియదేమో! —"అని సగం చెప్పి ఊరుకున్నాడు. తండ్రిచటుక్కుని ఆగిపోవడంకనిపెట్టి అచల అతనిముఖంకేసి చూస్తూ "తెలియనిదేదో ఉందా ఏమిటి నాన్నగారూ!" అని అడిగింది.

కేదారబాబు తను చెప్పబోయేదేదో గబగబా చెప్పాలని అనుకుని, కొంచెం ఆ తొందర ఆపుకుంటూ "సురేశుడు మనతో దెబ్బలాడి వెళ్ళినందుకు, చాలా పశ్చాత్తాపపడుతూ ఉంటాడను కుంటాను! ఏమంటావు?" అన్నాడు.

అచల తత్క్షణమే అతని మాటలకు తాళంవేస్తూ "నాన్నగారూ! తప్పకుండా అంతే! నాకూ అల్లాగే అనిపిస్తోంది." అంది.

కేదారబాబు తొందరగా తలఊపేస్తూ 'తప్పకుండా! అందులో సందేహంఏమిటి? లేకపోతే అతను దేశాంతరం ఎందుకు పారిపోతాడు! ఒక అతిసామాన్యమైన స్త్రీని రక్షించడంకోసం నిప్పుల్లో ఎందుకుఉరుకుతాడు? కేవలం పశ్చాత్తాప వల్లనే అతను తనప్రాణాలు విడిచి పెట్టడానికి అక్కడికి వెళ్లాడని నాఅభిప్రాయము! ఏమమ్మా! అవునా? కాదా?" అన్నాడు.

అచల తండ్రిప్రశ్నకి తిన్నగా సమాధానం చెప్పకుండా "ఇంకా ఒకళ్లిద్దరి ప్రాణాలు రక్షించడానికి కూడా ఆయన ప్రాణాలు లక్ష్యపెట్టకుండా సాహసించారని విన్నాను" అంది. ఈ మాట కేదారబాబుకి అంతగా బాగా నచ్చలేదు! అందుచేత అతను అదివేరే సంగతి అచలా! అది కేవలం నిప్పుల్లో ఉరకడంమాత్రమే! ఇదినిశ్చయంగా తెలుసుకుని మృత్యువుని ఆలింగనంచేసుకోవడం! దానికీ దీనికీ తేడా తెలియడం లేదూ

నీకు!" అన్నాడు.

అచల ఆమాటలకేమీ సమాధానం చెప్పకుండా! "అయితే అయి ఉండవచ్చును! కాని మనుష్యులు అయినవాళ్లు ఎలాంటి పరిస్థితుల్లోనైనా ఇతరులని రక్షించడానికి సిద్ధపడతారు..." అంది.

కేదారబాబు ఆమాటలకి ఇంక అంతూదరీ లేకపోయింది! అతను గబగబా "సరిగ్గా అంతే! చాలాబాగా చెప్పావు! అందుచేతనే నేను నీలోని ఉత్తమోత్తమ మహాస్వభావం ఉందంటున్నాను. అతనిది చాలా విశాల హృదయం. అతనితో ఇంకొకళ్ళకి సాటేమిటి? మనం అనేకమంది చూస్తున్నాము! ఎవరైనా నష్టానికోటి కాలంటూ కూడ అయిదు వేలరూపాయలు ఇస్తారా? చెప్పమ్మా! అతను ఏదైనా చేసినా మనిషి చాలా బాధపడుతూ ఉంటాడని నా అభిప్రాయము! నిజం అంతే! నా ప్రమాణపూర్తిగా చెబుతున్నాను," అన్నాడు.

కాని ఇప్పుడంత ప్రమాణం చెయ్యవలసిన అవసరం ఏమీ లేదు! అసలీవిషయంలో అచలకి తెలిసినదానిలో నూరోవంతుకూడా కేదారబాబుకి తెలియదు! అయితే ఆమె దేనికీ సమాధానం చెప్పలేకపోయింది. ఒక్క క్షణకాలం ఏదో విషయం స్మరించడంవల్లనేమో ఆమెకు సిగ్గువేసింది. ఆసిగ్గు కనబడి పోతుందేమో అనే భయంచేత ఆమె చటుక్కుని ముఖం వంచుకొని మాటాడకూరుకుంది. కాని అత్యాసక్తితో ఆమె కేసిచూస్తూన్న తండ్రికావిషయం తెలియకపోలేదు! అందుచేత అతను పులకించిన హృదయంతో సాక్షాత్తు దేవత లని చెప్పదగిన మనుష్యులు చాలా తక్కువమందే ఉంటారు! చివరికి సురేశుడూ మనుష్యుల్లో చేర్చవలసినవాడే! అతని దగ్గిర దోషాలూ ఉన్నాయి. గుణాలూ ఉన్నాయి. అంతే అతను తొందరపడి కేకలువేయడం ఒక తప్పనిన్నీ అదే అతని స్వాభావమనిన్నీ నా అభిప్రాయం కాదు! పైవాళ్లు ఏమిఅన్నా అనవచ్చును. గాని వాళ్ళకి మల్లే మనంకూడా అతని తప్పులు ఎన్నడం మొదలుపెడితే ఇంక

వాళ్ళకీ మనకీ తేడా ఏమిటుంటుంది? గొప్ప వాళ్లు అనేకమంది తిండి లేకుండ వచ్చును; గాని మనుయు... వస్తే ఎవరు సహాయం చేస్తారు? అక్కడ ఏం రాసి ఉందో మళ్ళీ ఒకసారి చదువు చూస్తా వింటాను! ఇప్పట్లో ఊరికి ఆమెను రక్షించి ప్రవతలికి తీసుకువచ్చాడా? ఎంత మహానుభావుడు! ఇంక దేవతలంటే ప్రత్యేకంగా ఎక్కడున్నారు?" అని ఒక పెద్ద నిట్టూర్పు విడిచి పెట్టాడు. అచల పూర్వం మోస్తరుగానే ఏమీ మాట్లాడకుండా అల్లాగే కూర్చుండిపోయింది.

కేదారబాబు కొంతసేపు అల్లాగ నిశ్శబ్దంగా ఉండి చటుక్కుని మళ్లీ "అయితే మనం అతనికొక ఉత్తరం ముందు వ్రాసి అతనిని గతి అదీ కనుక్కోవడం మంచిది కాదూ? అతను ఇల్లాంటి ఆపత్తులో ఉన్నప్పుడు కూడా మనం మూతి బిగించుకుని కూర్చోడం మంచిదా?" అన్నాడు.

ఇప్పుడు మాత్రం అచల ముఖం ఎత్తి "అయితే ఆయన ఇప్పుడు ఎక్కడున్నారో మనకి తెలియదు నాన్నగారూ! అంది. కేదారబాబు" "ఆయన ఎక్కడున్నారో తెలియదూ? పైజాబాదు పట్టణంలో మహేశ్‌ని ఎరగని వ్యక్తి అంటూ ఉంటాడా? అప్పుడు నాకు కోపం వచ్చినమాట నిజమేగాని నేనిప్పుడా విషయం అంతా పూర్తిగా మరిచిపోయాను. ఇప్పుడే ఒక ఉత్తరం పంపించవచ్చు! అతన్ని గురించి నాకు చాలా బెంగగా ఉంది" అన్నాడు.

ఇదిగో! ఇప్పుడే ఉత్తరం పంపిస్తానని అచల గదిగుమ్మం దాటి ఇవతలికి వచ్చిందో లేదో ఇంతలో మహేశు గుమ్మం దగ్గర ఆమె కెదురుగుండా నిలబడ్డాడు!

హృదయంలో ఉండే గంభీర దుఃఖం వల్ల మనిషి ముఖం ఇంతలో ఇంత నిస్తేజస్క మైపోతుందన్న సంగతి అచలకి మొట్టమొదట ఈవేళే తెలిసింది. ఆమె అతన్ని చూస్తూనే నిర్ఘాంతపోయింది. కొంతసేపటిదాకా ఆ ఇద్దరికీ కూడా నోటమ్మట మాట రాలేదు. కొంతసేపు వున్న తరువాత

అచల తనంతటతనే “నాన్నగారు లోపలకూర్చుని ఉన్నారు. రండి! లోపలికి వెళదాం రండి. హైదరాబాదునుంచి ఎప్పుడు వచ్చారు? అంతా కులాసాగా ఉన్నారుగదా!” అంది.

తన మనస్సుకి తనకి తెలియకుండానే తన మాటల్లో ఎంత స్నేహార్ద్రమైన వేదన వ్యక్తమౌతుందో అచల ఎరగదు! కాని సుకేశుడికి ఆ మాటలలో కళ్లుతిరిగి సొమ్మసిల్లి పడిపోతూన్నట్టనిపించింది; కాని అతను ఇన్నాళ్లనించీ తనకి ఈవిషయాల్లో కలిగిన అనుభవం ఊరికే పోనియ్యలేదు. అతనికి ఆక్షణంలో ఆమె అంతఃకరణచరణాలదగ్గిర మోకరిల్లి తనుచేసిన దుష్కృత్యాల కన్నిటికీ క్షమాపణ వేడాలని ఒక తీవ్రమైన కోరిక కలిగింది; కాని ఆ కోరిక చంపివేసుకుని సగౌరవంగా “నేను హైదరాబాదు వెళ్ళినసంగతి మీకెల్లాగ తెలిసింది?” అని అడిగాడు.

అచల పూర్వంలాగా స్వతహానే స్నేహార్ద్రమైన కంఠస్వరంతో “నాన్నగారు ఇప్పుడే పేపరులో చదివి మీకు టెలిగ్రాము పంపించమని అన్నారు. మీసంగతి చదివి ఆయన చాలా కంగారుపడ్డారు! రండి ఒకసారి ఆయన్ని చూద్దురుగాని” అంది. ఆపైన అతన్నికూడా తీసుకువెళ్ళడానికి వెనక్కి తిరుగుతూఉంటే, సుకేశుడు “ఆయన నన్ను క్షమించిఉంటే ఉండవచ్చును; కాని మీరు నన్ను ఎల్లా క్షమించగలిగారు” అని అడిగాడు.

అచల పెదవులమీద ఒక్కచిరునవ్వు తళుక్కుమంది. ఆమె “నాకు క్షమించటానికేముంది? నాకు మీమీద ఒక్కనాడుకూడా కోపంరాలేదు. రండి! లోపలికిరండి!” అంది.

## ౧౩

“మహిముడు తనకి వివాహం జరుగుతుందని నాకుత్తరం రాశాడు. అదిచూసుకుని తొందరగా బయలుదేరి నేనిక్కడికి వచ్చాను” అని

సురేశుడు అనేటప్పటికి కేదారబాబు ఎంతో సిగ్గు తెచ్చుకున్నాడు; కాని అచల ముఖంమీద మాత్రము ఏ అభిప్రాయమూ వ్యక్తం కాలేదు!

సురేశుడు "మహిమానుడి వివాహం కొట్టి నాకు రాకతప్పిందికాదు! లేకపోతే ఇంకా కొంతకాలం హాస్పిటల్లో ఉంటే బాగానేఉండును" అన్నాడు.

కేదారబాబు ఆమాటమీద ఎంతో ఆశ్చర్యంతో "సురేశబాబూ! హాస్పిటలులో ఉండడం ఏమిటి? మీకేమన్నా—" అన్నాడు.

సురేశుడు "ఆఁ ఆరోగ్యం లేదండి! ఈమధ్యని కొంచెం ఒంట్లో బాగుండలేదు" అన్నాడు.

కేదారబాబు మళ్ళీ బాగాకదలిపోయి "ఈవిషయంలో పరమేశ్వరుడికి వెయ్యినమస్కారాలు! అచల పత్రిక తీసి అద్భుతమైన మీవ్యవహారం అంతాచదివి వినిపిస్తూంటే,—సురేశబాబూ! మీతో ఏం చెప్పను!— సంతోషంచేతా గర్వంచేతా నాకళ్ళమ్మట కన్నీళ్ళు ప్రవహించాయి. మనస్సులో "పరమేశ్వరా! ఇటువంటివ్యక్తి నామిత్రుడు కాబట్టి నీకనేకమైన కృతజ్ఞతానమస్కృతులు!" అనిఅనుకున్నాను అన్నాడు. అల్లాగ అతను మాట్లాడుతూంటే అతని రెండుచేతులూ శిరస్సుమీద కలుసుకుని పరమేశ్వరుడికి నమస్కరించాయి. మళ్ళీ కొంచెం సేపు ఆగి, "కాని ఒక్క మాటమాత్రము మీతో చెప్పక తప్పదు. సురేశబాబూ! మాటిమాటికీ ఇల్లాగ ప్రాణాపాయం తెచ్చుకుంటూ ఉండడం న్యాయమేనా? ఒకసామాన్యస్త్రీని రక్షించడానికి మీవంటి అద్భుతవ్యక్తి ప్రాణం పోగొట్టుకుంటే ప్రపంచకానికి అది ఒక పెద్దలోటుకాదూ? అన్నాడు.

సురేశుడు "ఆఁ! ఇందులో ప్రపంచకానికి పెద్దలోటేముంది? అని కొంచెం సిగ్గుపడుతూ ముఖం పక్కకితిప్పేటప్పటికి అతనికి అచల తదేక ధ్యానంతో తనకేసి చూస్తూన్నట్లు కనబడింది. అతను చూడగానే అచల తనదృష్టి చటుక్కుని కిందికివాల్చేసింది.

కేదారబాబు మాటిమాటికీ "తప్పు! అల్లాగ అనకూడదు! దీనివల్ల మీకు ఆత్మీయులైన వారికెంత బాధ కలుగుతుందో మీకేం తెలుస్తుంది!'' అన్నాడు.

సురేశుడు నవ్వుతూ "నాకు ఆత్మీయులు ఎవ్వరూ లేరు. కేదారబాబుగారూ! కేవలం ఒక్క పిన్ని మాత్రం ఉంది. నేను చచ్చిపోయానంటే ఆవిడ ఓ రోజు ఏడ్చి ఊరుకుంటుందంతే!'' అన్నాడు.

సురేశుడు నవ్వుతున్నా అతని నోట్లోనుంచి నాకు ఆత్మీయులు ఎవ్వరూ లేరనే మాట వినిపించేటప్పటికి, కేదారబాబుకి కళ్ళమ్మట నీళ్ళు గిర్రున తిరిగాయి. అతను "సురేశబాబూ! అదేమిటి అల్లాగ అంటున్నారు? మీ విషయంలో మీ పిన్ని ఒక్క ఆవిడేనా బాధపడేది! ఎప్పుడూ ఇల్లాంటి మాట అనవద్దు బాబూ! నేను కూడా కొంత బాధపడతాను నాయనా! పోనీ ఏది ఎల్లాగ అయితేనేం గాని, నేను బ్రతికి ఉన్నంత కాలమూ మాత్రము. మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకుంటూ ఉండండి! నేను కోరేది ఇంతే! అన్నాడు.

అప్పుడే ఇంచుమించుగా రాత్రి పదిగంటలైంది. సురేశుడు ఇంటికి వెళ్ళడానికి సంకల్పించి, చటుక్కుని కేదారబాబుకి నమస్కరించి "కేదారబాబుగారూ! నాదొక్క చిన్న మనవి ఉంది. మహిమ వివాహము మా యింటి దగ్గిరే చెయ్యడానికి నిశ్చయించాము. సరే! వివాహం ఎల్లుండి జరుగుతుంది గదా అందుచేత ఈ అథమాధముని గృహం మీ పాద ధూళిచేత పవిత్రం అయ్యేటట్లు చెయ్యాలి! లేకపోతే మీరు నన్ను మనసారా క్షమించారని నాకు నమ్మకం ఉండదు! నాకీమాత్రం భిక్ష పెడతానని అనండి! అంతే చాలు!'' అని చెప్పి అతను హఠాత్తుగా కేదారబాబు పాదాలు స్పృశించబోయాడు.

ఇంతలోనే కేదారబాబు చటుక్కుని అదిరిపడి అతన్ని అడ్డుకోగా

నక్ప్రయత్నిస్తూంటే అతనికి 'అమ్మా' అనిమూలుగు వినపడింది. ఆమూలుగువిని కేదారబాబు నిర్ఘాంతపోయి చూశాడు. ఒళ్ళుకాలడం చేత అతనివీపుమీద ఒకకట్టుకట్టిఉంది. అతను శాలువా కప్పుకోడం మూలాన్ని అది యింతవరకూ కేదారబాబు కంటపడలేదు! ఆ విష యము తెలియకపోవడంచేత కేదారబాబు అక్కడ చెయ్యివేశాడు. చటుక్కుని ఆకట్టు ఊడిపోయింది. కట్టూడిపోగానే గాయంచూసి కేదారబాబు అమ్మయ్యో అన్నాడు. అచల విద్యుత్ప్రతిముట్టు కున్నట్టు చటుక్కుని ఉలికిపడిలేచి, సురేశుడిదగ్గిరికి వెళ్ళి అతనికట్టు గట్టిగాపట్టుకుని "భయంలేదు! నేనుకట్టుసరిగ్గాకడతాను!" అనిచెప్పి సురేశుణ్ణి అక్కడేఉన్న ఒకసోఫామీద కూర్చోబెట్టి ఆకట్టుఅతిజా గ్రత్తగా ఉన్నచోటనే కడుతూకూర్చుంది.

కేదారబాబు తనకుర్చీమీదే కూర్చుని చటుక్కుని కళ్ళుమూసు కున్నాడు. కొంతసేపటిదాకా అతనినోటికింకేమి ఏమాటా రాలేదు. అచల సోఫావెనకాల ఆనుకుని నిశ్శబ్దంగా అతనికి కట్టుకడుతూంది. అతని అవస్థ చూస్తూంటే అచలకి కళ్ళమ్మటనీళ్ళు గిర్రునతిరిగాయి. ఒక్కనిమిషందాకా ఆమెకళ్ళవెంట కన్నీళ్ళన్నీ ముత్యాల్లాగ ప్రవహిం చాయి. సురేశుడికీవిషయమే తెలియలేదు! అతనికీధోరణే లేదు. అతను కేవలం కళ్ళుమూసుకుని కూర్చుని తనకత్యంత ప్రియురాలైన ఆమె కరుణాపూర్ణమైన హస్తస్పర్శ అనుభవిస్తూ ఆనందిస్తున్నాడు.

ఏదోవిధంగా కన్నీళ్ళుఆపుకుని. అచలమెల్లిగా "ఈవేళ నాఎదురు గుండా ఒకప్రతిజ్ఞచెయ్యాలి" అంది. సురేశుడు ఏదోధ్యానభంగం అయినట్లు ఉలికిపడి, మృదుస్వరంతో "ఏమిటాప్రతిజ్ఞ" అన్నాడు.

"ఈవిధంగా మీరింక ప్రాణాపాయకరమైన పనులేవీ చెయ్య కూడదు."

"నేను చెయ్యాలని యిలాంటిపను లెప్పుడూ చెయ్యను. ఒకళ్ళు

ఆపత్తులో ఉన్నప్పుడు కాక నాకు ఆ పెద్దలసంగతి ఏమీ తెలియదు."

అచల ఈమాటకి మళ్ళీ ఏమీ సమాధానం చెప్పలేదు; కాని వెంటనే వొకపెద్దబుట్టారప్ప పైకివిసురుకొనసీయకుండా ఆపివేసింది. ఈసంగతి మెల్లిగా సురేశుడు గ్రహించాడు. కట్టు కట్టడం పూర్తి అయిపోయిన తరవాత సురేశుడు లేచి "ఈడీనుడి గృహం వొకసారి మీపాదధూళిచేత పవిత్రంచెయ్యాలి అన్నాడు. అల్లాగ అంటూంటే అతనికంఠం గద్గదమైంది; కాని అతని స్వరంలో మాత్రం వ్యాకులభావం ఏమీ కనబడలేదు. అచల కిందికి చూస్తూ కొంచెం తలకదిపి, 'అల్లాగే' అంది.

సురేశుడు కేదారబాబుకి నమస్కరించి నవ్వుతూ "ఇదుగో! మీరు తప్పకుండా దయచెయ్యాలిసుమండీ!" అని మళ్ళీ అచలకేసి చూసి, ఆమెకొక మానవిజ్ఞప్తి చేసి, మెల్లిమెల్లిగా అక్కడినించి వీధులోకి వెళ్ళిపోయాడు.

మర్నాడుసరిగ్గా వేళకి సురేశుడిబండి వచ్చివీధులో ఆగింది. కేదారబాబు కుమార్తెతో కలిసి, సురేశుడి యింటికి బయలుదేరాడు.

సురేశుడియింటికి వచ్చి, ఆవీధిగుమ్మం చూసేటప్పటికి కేదారబాబుకి కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు! సురేశుడు చాలాగొప్పవాడని అతనికి తెలుసును; కాని నిజంగా అతనెంత భాగ్యవంతుడో నిశ్చయించడానికి కేదారబాబు కింతకాలంనించీ వీలులేకపోయింది. ఈవేళ నిస్సందేహంగా అతనికీవిషయం తెలిసిపోయింది!

సురేశుడు మర్యాదగా వారిద్దరినీ లోపలికి తీసుకువెడుతూ, నవ్వుతూ "మహిముడిమనస్సులో ఏముందో నాకీవేళకూడా తెలియలేదు! అతను ఏమైనా సరే, రేపుమధ్యాహ్నందాకా మాయింటికి రానన్నాడు." అన్నాడు.

కేదారబాబు ఆమాటకేమీ సమాధానం చెప్పలేదు. ముగ్గురూవెళ్ళి సావిడిలో కూచునేసరికి ఒకఆవిడ లోపలినించి తలుపుతీసుకొనివచ్చి

అచలచెయ్యి పట్టుకొని లోపలికి తీసుకువెళ్లిపోయింది. ఆమెకు సుమారు యాభైఏళ్ళుంటాయి. ఆమె అచలను తన గదిలోకి తీసుకువెళ్ళి పరిచివున్న ఒకరత్నకంబళిమీద ఆమెను సగౌరవంగా కూర్చోబెట్టి "వరసకి నీకు నేను అత్తగారిని అవుతాను. నేను మహిముడికి పినతల్లిని" అంది.

అచల ఆవిడకి నమస్కరించి, ఆమె పాదాలపై వాలి శిరస్సుమీద ఉంచుకుని ఎంతో ఆశ్చర్యంతో "మీరిక్కడికి ఎప్పుడువచ్చారు?" అని అడిగింది.

మహిముడికి ఒకపినతల్లి ఉన్నసంగతి అచల ఎరుగదు. ఆవిడ అచలఆశ్చర్యపడడం గమనించి "నేను ఇక్కడే ఉంటున్నానమ్మా! నేను మీ ఆయనకి పిన్నినవుతాను. నాకు మహిముడొకటి సురేనూ ఒకటేనా అంటే నేను మహిముడికికూడా పిన్నినే" అంది.

ఆపిన్నిమాట్లాడుతూంటే ఆమెమాటలు అచలకెంతో ఆప్యాయంగా వినబడ్డాయి. అందుచేత ఆమెప్యాయత కలిగివేసినట్లయింది. అచలకి తల్లి లేదు. లేకపోయినా, తల్లిలేని లోటు తీరకుండా కనిపెట్టేఆవిడకూడా ఎవ్వరూ ఇంట్లోలేరు. ఆమె చిన్నప్పటినించీ తండ్రి అదుపుఆజ్ఞల్లోనే పెరిగిపెద్దదైంది అయినాగాని తల్లి లేకపోవడంవల్ల జీవితంలో కలిగిన లోపమంతా ఆమెకిప్పుడు స్పష్టంగా తెలిసింది. ఈ వేళ ఒకపరాయి ఇంట్లో ఒకపరాయివ్యక్తి పినతల్లి "కోడలా" అనిపిలిచి ఎంతో ఆదరంగా దగ్గిర కూర్చోబెట్టుకుంది. మొట్టమొదటమాత్రం అచల ఈకొత్తరకం పిలుపువిని మనస్సులో కొంచెం సిగ్గుపడింది. కాని చివరికి ఆమాటలో ఉన్న మాధుర్యమూ, గౌరవమూ చాలాసేపటిదాకా ఆమెహృదయాంతరాళంలో ధ్వనిస్తూఉన్నాయి.

మాటలసందర్భంలో వారిద్దరిమనస్సులూ క్రమక్రమంగా ఏకమయిపోయాయి. అచలసిగ్గుపడుతూ "అత్తగారూ!" అయితేమీరు నన్నింత తొందరగా దగ్గిరగా కూర్చోపెట్టుకున్నారుగదా! బ్రహ్మానమాజస్థులంటేమీా కయిష్టంకాదూ?" అనిఅడిగింది.

ఆమె తనవేళ్ళతో అచలచిబుకం స్పృశిస్తూ ఒకముద్దుపెట్టుకుని "మీరంటే అయిష్టంఎందుకమ్మా!" అంది! ఆపైన ఒకచిరునవ్వు నవ్వి "నువ్వు బ్రహ్మసమాజస్థులపిల్లవే అనుకో! నిన్ను పక్కని కూర్చోబెట్టుకోడానికికూడా భయపడడానికి హిందువులంతమూర్ఖులూ, నీచులూ అనుకుంటున్నావా? ఇదేమిటమ్మా! మేము బొత్తిగా అల్లాంటి వాళ్ళం కాదు! అదీగాక అయిష్టంఏమిటి! ఇదెక్కడైనా ఉందా?" అంది.

అచల ఎంతో సిగ్గుపడి "నన్ను మన్నించండి! అత్తా? నేను తెలియక అల్లాగ అన్నాను. నాకు చిన్నప్పటించీకూడా బ్రహ్మసమాజస్థులతో నే గాని పై వాళ్ళతో ఎప్పుడూ పరిచయంకలగలేదు! హిందువు లందరికీ మేమంటే చాలాఅసహ్యంఅని మాత్రం విన్నాను. ఒట్టి అసహ్యమనేకాదు! మేము దగ్గరకూర్చుంటే వాళ్ళు స్నానాలుకూడాచేస్తారుట!" అంది.

పినతల్లి "అసహ్యం కాదమ్మా! అదిఒకఆచారం అంతే. మా పైపై ఆచారాలు చూస్తే మీకందరికీ అల్లాగే అనిపిస్తుం దనుకుంటాను. అసలు ఉన్నసంగతి చెబుతున్నాను! వినమ్మా! అసలుమేము ఎవళ్ళని కూడా అసహ్యంచుకోము! మాయింట్లో తక్కువకులంమనిషి ఒకావిడ ఉండేది. ఆవిడఅంటే నాకెంతఇష్టం అనుకున్నావు!" అంది. ఆపైనమళ్ళీ ఒక్కనిమిషం ఆగి, "సరే నిన్నొకవిషయం అడుగుతాను" నీ కీవిషయం నన్ను చూస్తే జ్ఞాపకంవచ్చిందా? లేకపోతే సురేశుణ్ణి చూస్తే జ్ఞాపకం వచ్చిందా?

సురేశుడిపే రెత్తేటప్పటికి అచల లోలోపలసిగ్గుపడి "చాలాకాలం పూర్వమే ఆయన ఒకసారి ఈవిషయంనాతోచెప్పా——————"అని ఏదో చెప్పబోయింది.

పినతల్లి మధ్యలోనే చటుక్కుని అందుకుని "అబ్బే! వాడెప్పుడు అంతే. మనస్సులో ఉన్న దేదో చటుక్కుని పైకి అనెయ్యవలసిందే; గాని

ఊరికే కూర్చోలేడు. ఎప్పుడూ బ్రహ్మసమాజం వాళ్ళని చూడలేడుకనక తనకి వాళ్ళంటే అసహ్యం అనుకున్నాడు. ఈమాటమీద మహిముడికీ మావాడికీ అనేకసార్లు దెబ్బలాటదాకా వచ్చింది. అయితే నేను చిన్నప్పటినించీ వాణ్ణి పెంచిపెద్దవాణ్ణి చేశానుగనక వాడిసంగతి నాకు బాగా తెలుసును! వాడికి ఎవరన్నా అసహ్యం లేదు. అసలు వాడికి ఒకళ్ళని అసహ్యించుకునే శక్తిలేదు.! అంతవరకెందుకమ్మా! మీరాయింటికివచ్చి మిమ్మల్ని చూసినప్పణ్ణించీ. ——" అని ఏమేమో చెప్పబోయింది; గాని ఆవాక్యమే పూర్తికాలేదు!

అచలకేసి చూసి ఆమె ఆవాక్యమే పూర్తిచెయ్యలేకపోయింది. తన విషయంలో సురేశుడి పినతల్లి కెంతవరకు తెలుసునో అచల ఎరుగదు; అయినా గాని కొద్దో గొప్పో ఆమెకి తెలిసిఉండి తీరుతుందని అచల అనుకుంది. ఒక్కక్షణకాలం మళ్ళీ వాళ్ళిద్దరూ మాట్లాడకూరుకున్నారు. అచలే ఎల్లాగోఅల్లాగ, తనసిగ్గు చంపుగుని "అత్తగారూ! అయితే మీరే చిన్నప్పణ్ణించీ సురేశబాబుని పెంచారా?" అని అడిగింది.

పినతల్లి గద్గదికతో "అవునమ్మా! నేనే చిన్నప్పణ్ణించీ పెంచి పెద్దవాణ్ణిచేశాను. పాపం! వాడికి రెండేళ్ళవయస్సులోనే తల్లీ తండ్రీ చచ్చిపోయారు! ఇప్పటికీకూడా ఇంకా వాడిభారం నానెత్తిమీదే ఉందమ్మా పాపం! వాడు ఎవళ్ళకేమికష్టంవచ్చినా చూసి ఊరుకోలేడు! ఆఖరికి తనప్రాణాలుకూడా లక్ష్యపెట్టకుండా వెళ్ళి వాడు నిప్పుల్లోనైనాఉరుకుతాడు. ఈవిషయం తలుచుకుంటేనాకు రాత్రింబగళ్ళు నిద్రకూడా పట్టడంలేదమ్మా! ఏంచెప్పను!" అంది.

అచల మెల్లిగా "పైజాబానుసంగతి మీరు విన్నారా?" అని అడిగింది.

పినతల్లి తలకదిపి "వినకేం అమ్మా! విన్నాను. అందుకనే నేను

ఎప్పుడూకూడా భగవంతుణ్ణిగురించి—భగవంతుడా! నేను బతికి ఉన్నంతకాలమూ కూడా, ఏ అశుభవార్తా వినకుండా చెయ్యవలిసిం దని ప్రార్థిస్తూఉంటాను! వాడికి ఎల్లాంటికష్టం వచ్చిందన్నా నేను వినిభరించలేనమ్మా!'' అంది. అచలకికూడా కళ్ళమ్మట నీళ్లుతిరిగాయి. ఆమె స్నేహార్ద్రకంఠంతో "అత్తగారూ! మీరిల్లాంటిపనులు చెయ్య వద్దని సురేశబాబుని ఎందుకు అడ్డుపెట్టరు!" అనిప్రశ్నించింది.

పినతల్లి కన్నీళ్ళతోనే ఒకచిరునవ్వు నవ్వి "అడ్డుపెట్టకేం! అడ్డుపెడుతూనేఉంటాను! కాని మావాడు నామాట వింటాడా ఏమన్నా నా? వాణ్ణికాస్త అదుపాజ్ఞల్లో ఉంచేపిల్ల ఎవరైనా దొరుకుతుందా? అని నేను కొన్నిపళ్ళవెంబడి వెతుకుతున్నాను! అయితే కాస్త అల్లాంటి పిల్లని నాకు భగవంతుడు ప్రసాదించకపోయిన తరవాత ఇంక నేనెక్కడ వెతగ్గలనమ్మా?'' అంది.

అచల కొంతసేపటిదాకా నిశ్శబ్దంగాఉండి, మళ్ళీమెల్లిగా "మీకు మనస్సుకి నచ్చినపిల్ల ఎక్కడా దొరకడమేలేదూ?" అని అడిగింది.

పినతల్లి "నేను నీతోచెప్పలేనమ్మా! భగవంతుడిదయలేనిదే ఏదీ కూడా మనకి లభ్యంకాదు! అయితే సురేశుడు ఎప్పుడూకూడా ఈగొడవే ఎత్తేవాడుకాడు! కాని వాడే ఒకనాడు స్వయంగా నాదగ్గిరికి వచ్చి "పిన్నీ! నీకు ఒకదాసీదాన్ని తీసుకువస్తున్నా" నన్నాడు! ఆమాట వింటే నేనెంత సంతోషించానో చెప్పలేనమ్మా! మనస్సులోనే వాణ్ణి దీవించి—నీకడుపుచల్లగా నీమాటనిజం అవాలిగదా! నాయనా! సంబంధం స్థిరపడ్డాక పిల్లని ఒకసారి ఇంటికి తీసుకురావాలనిఉంది. పిల్లని నన్నుకూడా ఒకసారి చూడనియ్యి నాయనా!'' అనిఅడిగాను; కాని వాడు దేనికీ ఒప్పుకోలేదు! ఒక్కనవ్వు నవ్వి "పిన్నీ దీవించడానికి నువ్వొకసారి అక్కడికి వెళ్ళినప్పుడు శుభముహూర్తంకూడా స్థిరపరిచి వొద్దువుగాని!'' అనిమాత్రం అన్నాడు. అప్పైన వాతోత్సుగా ఒకనాడు

నాదగ్గిరికివచ్చి "వ్యవహారం ఏమీ బాగాలేదు! పిన్నీ! నేను రాత్రిబండిలో బయలుదేరి పడమటి దేశం వెళ్ళి కొన్నాళ్లుండి తిరిగివస్తాను." అన్నాడు. అసలు జరిగినసంగతి ఏమిటిరా! నాయనా! అని నేను అనేక సార్లు గుచ్చిగుచ్చి అడిగాను! ఎంతఅడిగినా "ఏమీలేదు" అన్నాడుగాని, నాకేమీ సమాధానం చెప్పలేదు! ఆపైన ఆరాత్రే బయలుదేరి వెళ్ళిపోయాడు. ఆపైననేను. "మావాడు ఒక్కడూ అనుకుంటే ఏమీ లాభంలేదు. ఆపిల్లగూడా పూర్వజన్మంలో ఏదైనా గొప్పతపస్సు చేసిఉండాలి! అనుకున్నాను.—అవునా! కాదా! అమ్మా! చెప్పు" అంది.

అచల కిల్లిగా కలవరపడింది. ఆపిల్ల ఎవరో ఆమెకి తెలియలేదని ఆమె ఊహించింది. అందుచేత తత్క్షణమే ఆమెకుఒక పెద్దబరువేదో తొలిగిపోయిన ట్లయింది; కాని ఆఉత్తరక్షణంలోనే ఆబరువు అంతటి తేలికగా తొలిగిపోలేదనిన్నీ హృదయంలో అనేకచోట్లగాయపరిచి మరీ తొలిగిపోయిందనిన్నీ అనుకుంది.

వంట అయిందనగానే పినతల్లి అచలకి వేరుగా ఇంకొకచోట భోజనంపెట్టింది. ఆతరవాత అచలని స్వయంగా కూడా తీసుకువెళ్ళి, ఆయింట్లోఉన్న గదులూ, అందులోఉండే సామానులూ అవ్వన్నీ చూపించడం మొదలుపెట్టింది. అల్లాచూపిస్తూ, ఆమె ఒకపెద్ద నిట్టూర్పు విడిచిపెట్టి, "భగవంతుడిదయవల్ల ఈయింట్లో దేనికీ లోటు లేదు! కాని ఇదంతా లక్ష్మీదేవిలేని వైకుంఠంలాగ కనబడుతూంది. ఇవ్వన్నీచూస్తూంటే కళ్ళమ్మటనీళ్ళు ఎంత ఆపుగుందామనుకున్నా ఆపుగోలేకుండా ఉన్నానమ్మా!" అంది.

ఇంతలో నౌఖరు లోపలికి వచ్చి "కేదారబాబుగారు వీధులో మీకోసం కనిపెట్టుకునికూర్చున్నారు" అన్నాడు. అచల మళ్ళీ ఆమె పాదధూళి శిరస్సుమీదఉంచుకుని. వీధులోకి వెళ్ళబోతూంటే పినతల్లి ఆమెచెయ్యిపట్టుకుని. కొంచెం సందేహిస్తూ నెమ్మదిగా "నిన్నొక

మాట అడగాలని అనుకుంటున్నాను. నువ్వేమీ అనుకోవుగదా!'' అంది. అచల ఏమీ అనకుండా ఆమె ముఖంకేసి చూసి చిరునవ్వు నవ్వింది.

పినతల్లి "సురేశుడు నీగోడవా, మహిముడిగోడవా అంతా నాతో చెప్పేశాడమ్మా! మహిముడు! కొంచెం లేనివాడని, అతనికి నిన్నిచ్చి పెళ్ళిచెయ్యాలని, మీనాన్నగారికి ఇష్టంలేదనీకూడా తెలిసింది. కేవలం నువ్వు పట్టుపట్టడం—'' అని ఊరుకుంది.

అచల ఔనని అంగీకారసూచకంగా తలతిప్పి మృదుస్వరంతో "ఆమాట నిజమే! అత్తగారూ!'' అంది.

పినతల్లి ఆకస్మాత్తుగా పెద్దఆవేశంతో. అచల రెండుచేతులూ గట్టిగాచేత్తోపట్టుకుని "వివాహం అనేది తప్పకుండా ఇల్లాగేజరగాలమ్మా! ప్రేమముందు డబ్బూ దస్కమూ ఒకలెఖ్ఖా! అదీగాక యిల్లాంటివిషయంలో మనస్సులో ఏమీబాధ ఉండకూడదమ్మా! నేను మహిముణ్ణి బాగా ఎరుగుదునమ్మా! నువ్వు అతనికోసం ఎన్ని కష్టాలుపడినా అతనువాటికన్నిటికీ అర్హుడే అని నాఅభిప్రాయము! భగవంతుడిదయ ఉంటే ఎప్పటికైనా నీకష్టాలన్నీ గట్టెక్కే రోజు రాకపోదని నాఅభిప్రాయము! నువ్వింత గొప్పగా ప్రేమిస్తూన్నందుకు అతను దానికితగినట్టుగానే ప్రవర్తిస్తాడని నేననుకుంటున్నాను. ఈవిషయంలో నువ్వేమీ అనుమాన పడనక్కర లేదు!'' అంది.

అచల మళ్ళీ ఒకసారివంగి ఆమెపాదధూళి శిరస్సునధరించింది. పినతల్లి వేళ్ళతో ఆమెగడ్డంస్పృశిస్తూ బుగ్గమీద ముద్దుపెట్టుకుని "నీవంటిది నాకు కోడలై నేనుఇంటిపెత్తనం చలాయిస్తూంటే ఎంతో బాగుండునుకదా!'' అంది.

సురేశుడువచ్చి, ఇద్దరినీ బండిఎక్కించి ఏమీఅనకుండా ఊరికే నమస్కారంచేసి, తిరిగి వెళ్ళిపోయాడు బండి వెడుతూంటే ఒక్క

క్షణకాలం దీపకాంతి సురేశుడిముఖంమీద పడింది. ఆముఖం ఆచల దృష్టినాకర్షించింది. అతనిమనస్సులో ఏముందో పరమేశ్వరుడికే తెలి యాలి! కాని ఎంతఆపుగుందామని ప్రయత్నించినా ఆగకుండా ఒక పెద్దనిట్టూర్పు ఒకటి ఇవతలికి రాబోయింది. గబగబా ఒడికొడ్డు మీదికి వెళ్ళిపోయింది! రోడ్డుమీద జనప్రవాహంకూడా క్రమక్రమంగా పలచబడుతూంది. అల్లాగ నిలబడిచూస్తూంటే సురేశుడికి అదంతా ఒకపెద్ద స్వప్నంలాగ కనబడింది. అదిసుఖస్వప్నమో దుఃఖస్వప్నమో చెప్పడంకష్టం!

కేదారబాబు ఇంతవరకూ నిశ్శబ్దంగా కూర్చున్నాడు. బహుశః సురేశుడిఐశ్వర్యమూ అదీ చూసేటప్పటికి అతనిహృదయంలో చెయ్యి పెట్టి కలిచివేసినట్లుయివుంటుంది. ఒక్కసారిగా పెద్దనిట్టూర్పు విడిచి అతను “అబ్బా! అతను ఎంత భాగ్యవంతుడు” అన్నాడు. కాని అచల మాత్రం ఆమాటకేమీ సమాధానం చెప్పలేదు. ఆమెమనస్సులో నిరు త్సాహంగా ఉండడంచేత మిగిలిన కాస్సేపు ఆమె అల్లాగే కూర్చుండి పోయింది.

బండి క్రమక్రమంగా కేదారబాబుగారి ఇంటిఎదురుగుండా వచ్చి ఆగింది. సైసువాడు వచ్చి తలుపుతీసి పక్కగా నిలబడ్డాడు. అప్పటికి కేదారబాబుకి ఒంటిమీద స్మారకం వచ్చింది. ఆపైనఅతనొక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టి మనస్సులో “సురేశుడి సంగతి ఎవళ్ళమూకూడా కనిపెట్టలేక పోయాము. అతను కేవలమూ ఒకమహాపురుషు” డను కున్నాడు.

## ౧౪

ఈవేళ అచలకి వివాహము. వివాహమండపం దగ్గిర సురేశు డొకక్షణ కాలం కనబడ్డాడు. అంతే! ఆపైన అతనెక్కడికి వెళ్లాడో ఎవళ్ళకీ

తెలియదు! ఆర్పాతి కేదారబాబుగారింటికగ్గిర అతను మళ్ళీకనబడలేదు.

వివాహం అయిపోయింది. ఒకటిరెండురోజులుదాకా అచలహృదయంలోఏదోపెద్దకంగారుగాఉంది. ఆవేళను కేశవడిపినతల్లి చెప్పినమాటలు ఎంత మరిచిపోదామనుకున్నా మరచిపోలేకపోయింది. ఈ వేళతో ఆవిషయాలన్నీ ఒదిలిపోండంచేత ఆమె మనస్సెంతో తేలికగాఉంది.

మహిముడిగాంభీర్యం ఏమీ చెక్కుచెదరలేదు. అతని ముఖంలో ఆనందంగాని దుఃఖంగాని కొంచెమైనా పైకి కనబడలేదు. అయినాగాని అతన్ని ఆవివాహసమయంలో చూస్తూంటే అచలహృదయం ఆనందంతోనూ, మాధుర్యంతోనూ ఉప్పొంగిపోయింది. ఆమెమనస్సులో ఒక్కసారి భర్తపాదాలు స్మరించుకొని వాటిమీద తనశిరస్సుంచి "ప్రభూ! ఇప్పుడు నాకేమీ భయంలేదు. మీతో కలిసి ఎక్కడఉన్నా నాకది స్వర్గమే! ఈరోజు మొదలుచ్చుకుని నాకు మీకుటీరమే శుభరాజప్రాసాదము!" అని అనుకుంది.

అచల అత్తవారింటికి వెళ్ళేరోజున కేదారబాబు చోకాల అంచుతో కన్నీళ్లుతుడుచుకుంటూ "అమ్మా! నీభర్తతోకూడా దుఃఖమూ దారిద్ర్యమూ సమానంగా పంచుకొంటూ నీ విధులన్నీ నిర్వర్తించుకోమని నిన్నాశీర్వదిస్తున్నాను. భగవంతుడు నీకీవిషయంలో విఘ్నంరాకుండా చూడవలెననికూడా నేనాశిస్తున్నాను. పరమేశ్వరుడి కరుణవల్ల నీకు శుభం కలుగునుగాక!" అని కళ్లుతుడుచుకుంటూ పక్కగదిలోకి వెళ్ళిపోయాడు.

ఆతరవాత శ్రావణమాసం వచ్చింది. మేఘాలు వర్షించినతరువాత ఆకాశంఅంతా అలుముకున్నాయి. అల్లాంటివేళలో బురదబురదగాఉన్న పల్లెటూరిదారమ్మట పల్లకీమీద ప్రయాణంచేసి అచల ఒకనాడు అత్తవారింటికి చేరుకుంది. ఆదారమ్మటే అచలకి పెళ్ళి అంతం అంతా సగంపోయినట్టు కనిపించింది.

ఆమె ఇంతకిపూర్వం పల్లెటూళ్ళను గురించి పుస్తకంలోనే చదువుకుంది. ఆ పుస్తకాల్లో పల్లెటూళ్ళలో ఉండే సుఖదారిద్ర్యాల సూచనలున్నా, మొత్తంమీద అంతలో ఉన్నదంతా కవిత్వమే! అంతా భావనా సౌందర్యమే ఆమె పల్లకీదిగి ఆ ఇంటిలోకి వెళ్ళి నాలుగువైపులా చూడ్డం ప్రారంభించింది. కాని ఎక్కడచూసినా ఆమెకి కవిత్వవాసనకూడా కనబడలేదు! ఆమె ఊహాలోకంలో పల్లెటూరు ఒకవిధంగా ఉంటుందని అనుకుంది కాని కళ్ళారా పల్లెటూరు చూస్తే ఆమెకు తనుఅనుకున్న పల్లెటూరికీ దీనికీ చాలా తేడా ఉందని అనిపించింది. ఇక్కడి ఇళ్ళన్నీ చాలావరకు మట్టితో కట్టినవే! అవన్నీ ఎప్పుడూ తేమ్మగానూ, చీకటిగానూఉంటూంటాయి. వాటితలుపులూ కిటికీలూ గజిబిజిగా ఉంటాయి. పైనకప్పులన్నీ ఏదోచవకరకంగా తయారుచేసినవే! పల్లెటూరు సరిగ్గా ఇల్లాగే ఉంటుందని ఆమెస్వప్నంలోకూడా ఊహించుకోలేకపోయింది. ఇల్లాంటి పాడుకొంపలో ఒకదానిలో ఉండి జీవితం అంతాగడపాలని అనుకునేసరికి అచల గుండెబద్దలైపోయింది. భర్తృసుఖమూ, వివాహం వల్ల కలిగే ఆనందమూ ఇవన్నీకూడా ఆమెకళ్ళఎదుట ఎండమావుల్లాగ మాయమైపోయాయి. ఇంటిలో ఒకఅత్తగారుగాని ఆడబొడుచుగాని ఎవ్వరూలేరు. ఒకముసలావిడమాత్రం ఉంది. ఆవిడ ఏదోదూరపుభంధుత్వాన్నిబట్టి నాయనమ్మ అవుతుంది. ఆమె వధువుని ఇంటిలోకి తీసుకువెళ్ళడానికని ప్రత్యేకంగా ఆవీధినుంచి ఈవీధికి బయులుదేరి వచ్చింది. కాని వధువు సామాన్యంగా అందరూ ఉండేటట్టు పెళ్ళికూతురు వేషంలో కనబడకపోయేటప్పటికి ఆమె స్తంభములాగ అల్లాగే చూస్తూ నిలబడి పోయింది. చివరికి ఎల్లాగోఅల్లాగ ఆమె చెయ్యి పట్టుకుని కోడల్ని ఇంటిలోకితీసుకువెళ్ళి ఒకచోట కూర్చోబెట్టింది. ఇంక పెళ్ళికూతుర్ని చూడడానికి వచ్చిన పొరుగమ్మలంతా వధువువయస్సు విషయమై అంచనాలు వేసుకుంటూ ఒకళ్ళముఖం ఒకళ్ళు

చూసుకోవడం ప్రారంభించారు! కొందరు రహస్యంగా చూట్లాడుకోవడం ప్రారంభించారు. చివరికి వాళ్ళందరూ వెళ్ళిపోయేటప్పుడు వాళ్ళ సంభాషణలో అస్పష్టంగా భోత్రిగా ప్రహ్నసమాజం, శూరకత్వతం మొదలైన రెండుమూడు మధుర వాక్కులు కూడా అచల చెవిని పడ్డాయి!

ఒక్క క్షణంలో గ్రామంగ్రామంఅంతా మహిముడు తురక పిల్లనివివాహం చేసుకున్న మాట నిజమే నన్న సంగతి పాకిపోయింది! అసలు వివాహానికి పూర్వమే ఇల్లాంటి అపవాదు ఒకటి ఊరిలో వ్యాపించింది. దాని మీద గ్రామంలో కొన్ని గుసగుసలూ కొంత అందోళనా బయలు దేరింది. ఇప్పుడు పెళ్లికూతుర్ని చూసేటప్పటికి ఊరులో ఇంతకి పూర్వం వ్యాపించినది నిజమేనని అందరికీ అనిపించింది. ఆవిషయంలో అసలు ఎవరికీ సందేహమే కలగ లేదు!

ఇరుగుపొరుగువాళ్ళంతా వెళ్ళిపోయినతరువాత ముసలావిడ అచల దగ్గిరికి వచ్చి "అమ్మా! నేనువెళుతున్నాను! ఇల్లిక్కడికి చాలాదూరంగా ఉంది. నేలేకపోతే ఇంటిలో ఒక్కనిమిషం వేగదు! ఇంటిలో చిన్న మనమరాలు ఒక్కర్తేఉంది'' అని చెబుతూ ఉండమని బలవంతపెట్టడానికి ఏమీ అవకాశం ఇవ్వకుండానే అక్కడినించి వెళ్ళిపోయింది. కేవలం బంధుత్వం అవడంచేత తప్పనిసరిగా ఆవిడఇంతవరకూ తనదగ్గిరఉందని అచల గ్రహించింది. నిజమాలోచిస్తే ఇందులో ముసలావిడ తప్పేమీ లేదు. ఊరులో వ్యాపించిన అపవాదు నిజమేనని ఆవిడ అనుకుని ఉంటుంది. అందుచేత ఆమె అసలిక్కడ కాలు పెట్టడానికి కూడా భయపడింది. పల్లెటూరిలో ఉన్నాక ఇల్లాంటివాటిని లక్ష్యపెట్టకుండా ఉండడం చాలా కష్టం పల్లెటూళ్ళ చరిత్రలో అల్లాంటి మహాధైర్యవంతులు ఎక్కడా దొరకరు!

ముసలావిడ అంతర్ధానం అయిపోయినతరువాత ఇంక ఆయింటిలో యదుపనేనాఖరూ ఒకపరియూవంటబ్రాహ్మడు కేదారబాబుగారి ఇంటి

దగ్గిరినించి స్వయంగా అచలతోకూడా వచ్చిననారాయణమ్మ అనేదాసీదీ తప్ప ఇంకెవ్వరూలేరు. అందుచేత ఇల్లంతా బిక్కుబిక్కుమంటూంది. కొంతసేపటికి వర్షంఅంతా తగ్గిపోయింది. మళ్లీ ఒక్కొక్క చుక్క పడడంప్రారంభించింది. నారాయణమ్మ అచలదగ్గిరికివచ్చి మెల్లిగా "నే నెప్పుడూ ఇల్లాంటిఇల్లు చూడలేదమ్మా! చూద్దామన్నా ఇల్లాంటిఇల్లెక్కడా కనబడదుకూడాను?" అంది.

అచలతలవంచుకుని స్తబ్దులాగ కూర్చుంది. అప్పుడప్పుడుమాత్రం పరధ్యానంగా ఏదో కొంతకొంచెము ఊకొట్టింది.

నారాయణమ్మ మళ్ళీ "అల్లుడుగారెక్కడా కనబడడమే లేదు! అప్పుడొకసారిమాత్రం ముఖంకనబరిచారు. మళ్ళీ ఎక్కడికి వెళ్ళారో ఏమిటో!" అంది. అచల ఈసారికూడా ఏమీ సమాధానం ఇయ్యలేదు.

చుట్టూరా అడవులూ అవ్వీ ఉన్న ఈ పాడుపల్లెటూరు చూసేటప్పటికి నారాయణమ్మకి కంగారుపట్టుకుంది. అయినాగాని అది అచలని చిన్నప్పటినించీ పెంచి పెద్దదాన్ని చేసింది; కాబట్టిఏదోవిధంగా ఓదార్చాలని మనస్సులో నిశ్చయించుకుని "ఏవో కొన్నివస్తువులు వర్షంపడి తడిసి పోయినమాట నిజమే! అయితే అల్లుడుగారు రాగానే అన్నీ తిన్నబడతాయి! అందుకని నేను పెట్టితెరచి ఇస్తాను కొత్తచీర కట్టుకోండమ్మా" అంది.

అచల "ఇప్పుడెందుకులే అలాగే ఉండనీ నారాయణమ్మా!" అని చెప్పి అల్లాగే తలవంచుకుని కూర్చుంది. ఆమెకుజీవితంలో ఆనందమూ, సుఖమూ అన్నీ హరించిపోతూన్నట్టనిపించాయి.

వర్షం మళ్ళీ జోరుగాకురవడం మొదలుపెట్టింది. క్రమంగా వర్షధారలుకూడా లావెక్కాయి. ఆవర్షధారలో క్రమంగాసాయంకాలమెప్పుడయిందోకూడా కనిపెట్టడం కష్టమయింది. లేశమాత్రమైనా ఆనందం లేని ఆగృహంలో తడితడిగాఉన్న ఆసంజెచీకటి మూలమూలలనక్కి

క్రమంగా ఇల్లంతా వ్యాపించింది. యదువువచ్చి ఇంటిమధ్యన వాళ్ళ హరికేనులాంతరు వెలిగించి వెళ్ళిపోయాడు. నారాయణమ్మ యదువుని "అల్లుడుబాబు గారెక్కడ ఉన్నారు?" అని అడిగింది.

"నాకేం తెలుసు" అని చెప్పియదువు వెళ్ళబోయాడు. వాడునుక్త సరిగాచెప్పిన ఆమోటుసమాధానంవల్ల నారాయణమ్మకి కొంచెం అనుమానంకలిగి "నాకేం తెలుసు నేమిటి! ఆయనలేరా?" అని అడిగింది.

లేరని చెప్పి యదు వక్కడినించి వెళ్ళిపోయాడు. క్రొత్తగావచ్చిన వాళ్ళంటే వాడికిష్టం లేదని బోధవడిపోయింది. నారాయణమ్మకి ఎంతో భయంవేసింది. అదిమెల్లమెల్లగా అచలదగ్గిరికిజేరి భయంతో కంగారు పడుతూ "వ్యవహారం చూస్తే నాకేంబాగాలేదు! తలుపు గడియబిగించి రానా? ఏమిటి?" అనిఅడిగింది. అచల 'ఆశ్చర్యపడి తలుపుగడియ బిగించడం' ఎందుకు? అంది.

నారాయణమ్మ చిన్నప్పటినుంచీ దేశంవిడిచిపెట్టి కలకత్తాలోనే ఉంటూంది. అది మళ్ళీ ఎప్పుడూ తిరిగి తనపల్లెటూరు వెళ్ళలేదు! పల్లెటూరిలో కన్నవుదొంగలూ, బందిపోటుదొంగలూ ఉంటారనేమాట ఒక్కటీతప్ప మిగిలినవిషయాలన్నీ దానికి మనకమనకగా జ్ఞాపకం వచ్చాయి. అదివీధిలో చీకటికేసిఒణుకుతూ ఒణుకుతూ ఒకసారిచూసింది. ఆపైన అచలికి బాగాదగ్గిరిగా నిలబడి మెల్లిమెల్లిగా "ఇది మరీక్కుగ్రామం! మనంవచ్చినా చెప్పడానికి వీల్లేదు." అంది. అల్లాగ అంటూంటే దాని వళ్ళంతా భయంచేత గగుర్పొడిచింది.

సరీగ్గాఇదేసమయానికి వాకటిలోకి ఎవరోవచ్చి నాయనమ్మ ఎక్కడ వుంది? అనిఅడిగారు. అల్లాగఅంటూనే ఆఅడిగినవ్యక్తి లోపలికి వచ్చింది. ఆమెసుమారు ఇరవై ఏళ్లున్న ఒకబాలిక; సన్నంగానవళ్ళాకులాగ ఉంది, ఆమెఅప్పుడే స్నానంచేసివచ్చింది. అందుచేత నీళ్ళలోన్నానుతూ

ద్వారండగ్గిరిగా వచ్చి నాయనమ్మా! ముందునీకునమస్కారంచేసి మరీ బట్టలు మారుస్తాను అంది. ఆపైన అచల పాదాలమీద శిరస్సుంచి నమస్కారంచేసింది. ఆతరవాత లాంతరుఎత్తి అచల ముఖానికి దగ్గిరిగా పెట్టికొంతసేపటిదాకా తదేకధ్యానముతో ఆమెకేసిచూసి "తాతోయ్! ఓతాతా!" అనిగట్టిగా అరిచింది.

మహిముడు అందరినీ ఇంటిదగ్గిరదిగబెట్టి వెంటనేఎడ్లని తీసుకుని రావడానికి ఇంకొక పల్లెటూరువెళ్ళి ఇప్పుడేఇంటికివచ్చాడు. అతను ఆపక్క గదిలోంచి "ఏమిటే! మృణాలా!" అనిసమాధానం ఇచ్చాడు.

"ఇలాగరా! మరి! చెబుతాను!"

మహిముడు గుమ్మందాకావచ్చి "ఏమిటే!" అన్నాడు. మృణాల మళ్ళీఒకసారి లాంతరు వెలుతురులో అచలముఖంకేసి ఎగాదిగా చూసి, మొత్తంమీద నువ్వే నెగ్గావులే! నన్ను పెళ్లాడి మోసగిస్తావా!" అంది. మహిముడు అక్కడినించే గట్టిగా బెదిరిస్తూ "మృణాలా! నువ్వు నేనుచెప్పినమాట వినవూ? ఇంకాఅదే వేళాకోళమా! మానుతావా!" మానవా! అన్నాడు. మృణాల "సరిపోయింది. నేనువేళాకోళం ఆడుతున్నానా!" అనిమళ్ళీ అచలముఖం కేసి ఒకసారిచూసి చిరునవ్వు నవ్వుతూ ఎంతఒట్టుపెడితే అంతఒట్టమ్మా! వేళాకోళంకాదు! పోనీనువ్వే మీఆయన్ని అడుగు! ఒకప్పుడు నేనంటే ఈయన పడిచచ్చిపోయేవాడో లేదో నీకేతెలుస్తుంది! అంది.

మహిముడు "నువ్విల్లాగే వాగుతూఉండు! నేనువీధిలోకిపోతాను!" అన్నాడు. మృణాల "వెడితేవెళ్లు! నిన్నెవరన్నా పట్టుకున్నారా? అంది. ఆపైనఎంతోఆప్యాయంగా అచలగడ్డంపట్టుకుని కదుపుతూ "ఏమమ్మా నువ్వేచెప్పవమ్మా! పోనీ! దీనికి కడుపుమంటగా ఉంటుందా! ఉండదా? అసలు ఈఇంటి యజమానురాలిని నేను కావలిసిందన్న మాట! అయితే మాఅమ్మకళ్లారా చూడలేక మాతాతచెవిలో ఏమిటూదిందోగాని

మాటాలకి అప్పణ్ణించి నేనంటే విషమైపోయింది. "లేకపోతే—ఒరే! యదూ! ఘోషాల బాబుగారెక్కడికి వెళ్లారురా?" అంది.

"యదువు ఆయన చెరువులో కాళ్లూ చేతులూ కడుక్కోడానికి వెళ్లారండి. అన్నాడు. మృణాలముఖి భయంచేత ఒక్కసారిగా నల్లబడి పోయింది. ఆమె "అయ్యో! ఇంతఅర్థరాత్రివేళా" అంది. ఆపైన ఎంతో కంగారుపడుతూ "యదూ! ఒకసారి దీపంపుచ్చుకుని చెరువుదగ్గిరికి వెళ్ళిరా అసలే ముసలాయన మరి ఈకన్నూ కన్నూ కనపడని చీకటిలో అడుగుజారితే కాళ్లూచేతులూ విరిగిపోతాయి అంది.

ఆఉత్తర క్షణంలోనే అచలముఖంకేసి చూసి కొంచెంసిగ్గుపడుతూ "నేను ఏంపాపంచేసుకుని పుట్టానోగాని నాకుతొంభై యేళ్ళ తొత్తుకుని తీసుకువచ్చి కట్టబెట్టారమ్మా! ఆయనికిచాకిరీచేస్తూ ఆయన్ని జాగ్రత్తగా చూసుకుంటూ ఉండడంలోనే నాఆయుష్షు కాస్తా చెల్లిపోయేట్లాగ ఉంది. సరేనమ్మా దాసికెంగాని ముందుఆగదిలోకివెళ్ళి బట్టలుమార్చి వస్తాను. ఆపైని మళ్ళీ మాట్లాడుకుందాము. అయితే సవితి నవుతున్నానని నువ్వేమీ బాధ పడక్కరలేదు! నేను ముందే చెబుతున్నాను. నీకు కావలిస్తే మాముసలాయనలోకూడ సగంభాగం ఇస్తాను" అని ఆయిల్లంతా మారుమోగేలాగ నవ్వుతూ అక్కడినించి గబగబా ఇంకోగదిలోకి వెళ్ళిపోయింది.

అచల ఇల్లాంటివేళాకోళం ఇంతకుపూర్వం ఎప్పుడూకని విని యెరగదు. ఆవేళాకోళమూ, ఆధోరణీ అదంతాఅచలకి ఎంతో మోటగానూ అసభ్యంగానూ కనిపించింది. అందుచేత ఆమాటలువింటూంటే ఆమెకెంతో సిగ్గూ సంకోచమూ కలిగాయి. అసలుఇంతమోటుదనమూ ఇంతసిగ్గూ లజ్జా లేకపోవడమూ ఏస్త్రీదగ్గిరైనా ఉంటుందా అని! ఆమె ఆశ్చర్యపడింది. ఇంతేకాదు ఆమె చిన్నప్పటినించీ ఒకవిధమైన వాతావరణంలో పెరిగి పెద్దదైంది. అందుచేత ఆమెహృదయమూ

నికి ఇదంతా ఒక పెద్దఆఘాతంలాగ కనిపించింది. అయినాగాని ఆమెరావడం మూలాన్నీ, తనవాళ్ళను విడిచిపెట్టడంవల్లా కలిగినబాధ అంతా సగంవరకు పోయిందని అచల అనుకుంది. ఆపైన "ఈమెఎవరు! ఎక్కడినుంచి వచ్చింది? ఆవిడకీ మహిమునికీ బంధుత్వం ఏమిటి!" అని తర్కించుకుని ఈసంగతులన్నీ తెలుసుకోవడానికి లోలోపల ఎంతో తహతహలాడిపోయింది.

నారాయణమ్మ "ఈవిడ ఎవరమ్మా! మంచి కులాసామనిషిలాగ కనిపిస్తూందే!" అని అడిగింది. అచల ఊరికే తలఊగించి ఔను! అంది అంతే!

మృణాల తడిబట్టలు మార్చి మళ్ళీ గదిలోకివచ్చి "ఏమమ్మా! నీతో ఊరికే వేళాకోళంఆడి వెళ్ళిపోయానంతే! అసలు నేనెవరినో నీకింకావరకూ చెప్పనేలేదు! ఆచెప్పడం మాత్రం ఓపట్టాని తెములుతుందనుకున్నావా? మీఆయన ఉన్నారే! ఆయన మాఅమ్మకి తండ్రిఅవుతారు! అందుచేత నేనుఆయన్ని చిన్నప్పటినించీ తాతా! అని పిలుస్తాటాను" అంది. ఆపైని కొంచెంసేపు ఆగి మళ్ళీ "మీ మామగారూ మానాన్నగారూ చాలాదగ్గిరస్నేహితులు. ఒకనాడు హఠాత్తుగా మానాన్నగారిచెయ్యి బండికిందపడి విరిగిపోయింది. అప్పణ్ణించీకూడా మీమామగారు మమ్మల్నందర్నీ తమఇంట్లోనే అట్టేపెట్టుకున్నారు! ఆతరవాత కొన్నాళ్ళకి నేను పుట్టాను. తాతకి అప్పటికి ఎనిమిదిఏళ్ళు. తాత పుట్టగానే ఆయనతల్లి చచ్చిపోయింది. ఈయనకంటె పెద్దవాళ్ళు ఇద్దరు ఉండేవాళ్ళు. వాళ్ళిద్దరూకూడా డిఫ్తీరియావచ్చి చిన్నప్పుడే చచ్చిపోయారు. అందుచేత మాఅమ్మ ఇక్కడికివస్తూనే ఈఇంటి యజమానురాలైంది. ఆపైన కొంతకాలానికి మానాన్నగారుకూడా చచ్చిపోయారు! అప్పటినించీకూడా మేము ఇక్కడేఉంటున్నాము. ఆతరవాత చాలారోజులికి మీమామగారుకూడా చచ్చిపోయారు!

ఇంక అప్పణ్ణించీ ఈఇంట్లోనే పెరిగా మన్నమాట! ఆపైన తాత, పలాసీలోఉన్న "ఘోషాలు" గారికి నన్నిచ్చి పెళ్ళిచేశాడు. పెళ్ళి అయి ఇప్పటికంతా అయిదేళ్ళయిం దనుకుంటాను. మొత్తంమీద తాత నన్నిక్కడికంచి వెళ్ళగొట్టేశాడు. మాఅమ్మే బతికిఉంటే వద్దని ఎంతో బలవంతపెట్టి ఉండును!" అంది.

"పెద్దకోడలు ఈగదిలోనేనా ఉన్నది?" అనిఅడుగుతూ ఒక యాభై ఏళ్ళమనిషిలాగ కనపడేవ్యక్తి ఒకడు లోపలికివచ్చాడు. అతను పొట్టిగాఉన్నాడు. వచ్చునెరిసిపోయాయి. అతను లోపలికివచ్చి తలుపుదగ్గిర నుంచుండిపోయాడు.

మృణాల "రండి! రండి!" అంది. ఆపైన మళ్ళీఅచలకేసి చూసి కన్నుగీటి చిరునవ్వునవ్వుతూ "ఇదుగోనమ్మా! ఈయనే నాయింటి ఆయన! అయితేనువ్వే చెప్పు ఈయనపక్కనినుంచుంటే నేను ఎల్లాగ ఉన్నానో! యింతముసలాయనదగ్గిర నుంచుంటే నేనుబాగున్నానా! ఏముందమ్మా! ఈజన్మానికి ఈవయస్సూ, ఈఅందమూకూడా గంగ పాలైపోయాయికదా! అమ్మా!" అంది.

అచల దీనికి ఏమని సమాధానం ఇస్తుంది? అల్లాగే సిగ్గుపడి తలవంచుకుని కూర్చుంది.

ఈవచ్చిన పెద్దమనిషి పేరు భవానీఘోషాలుడు. ఆయననవ్వి "ఏముం డోయ్! ఇది చెప్పేమాట లేవీ నమ్మకండి! అన్నీ అబద్ధాలే! నన్నందరి ఎదటా చిన్నబుచ్చాలని ఇదిఎప్పుడూ ఇల్లాగ మాట్లాడుతూ ఉంటుంది. లేకపోతే నావయస్సు యాభై రెండో యాభైమూ——" అని ఇంకాఏదో చెప్పబోయాడు.

మృణాల చటుక్కుని మాటమధ్యని అందుకుని "చాల్లెండి! ఊరుకోండి! మాతాత నాకెంత అపకారం చేశాడో పరమేశ్వరుడికే తెలియాలి! అన్నివిధాలా నన్ను గంగలో కలిపేశాడు. ఈముస

లా కునకివ్వడం కంటె కాళ్లూచేతులూకట్టి నన్ను గంగలో పారేస్తే బాగుండిపోను! ఏమమ్మా! అవునా! కాదా! నిజంచెప్పు!" అంది.

అచల పూర్వంమోస్తరుగా మాట్లాడకుండా అల్లాగేకూర్చుంది. ఆమెముఖం సిగ్గుచేత బాగా ఎర్రబడిపోయింది.

ఘోషాలుడు మెల్లిమెల్లిగా లోపలికివచ్చి కొంతసేపటిదాకా ఏమీ అనకుండా మాట్లాడకూరుకున్నాడు. ఆపైన అమ్మయ్యా అని ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి "ఏమండోయ్! మీరీవేళ నాపరువు దక్కించారు! ఇవ్వాళ్ళకి దీనికి బాగా గర్వభంగం అయింది! తన అంశం చూసుకుని మురిసిపోవడంతప్ప దీనికిన్నాళ్ళనించీ మరో పని ఉందా!" అన్నాడు. ఆపైన మృణాలకేసితిరిగి "ఇంతకాలంనించీ అడివికి నక్కేరాజుగాఉంటూంది. పట్టణవాసం అందంఅంటేఏమిటో తెలుస్తుంది కొంచెం కళ్లుతెరిచి చూడు!" అన్నాడు.

ఆమాటమీద మృణాల "సరేదానికేంలెండి! నాగర్వంఅణిచే వాళ్ళని చాలామందినిచూశాను! అని భర్తకేసి ఒక వ్యంగ్యపూర్వక మైన కటాక్షం ప్రసరింప జేసింది. ఆక్రీగంటిచూపుమీద అచలదృష్టి పడింది.

ఘోషాలుడు నవ్వుతూ "విన్నారమ్మా! ఇక్కడినించి మీరు కొంచెం జాగ్రత్తగా ఉండాలన్నమాట! నేను డబ్భైరెండేళ్ళముసలి వాణ్ణినామాటకేంలెండి! నేను ఉన్నా ఒకటే! ఊడినాఒకటే! మాఆవిడ తనగర్వం అణిచేవాళ్ళు ఇంకకొత్తగా పుట్టుకురావాలన్నట్టు మాట్లాడు తూంది! ఇంక ఆసంగతేదో మీరూమీరూ చూసుకోవాలి" అన్నాడు.

"మృణాలా! నువ్వు రాత్రితెల్లవార్లూ ఇల్లాగే కబుర్లుచెబుతూ కూర్చుంటావా?"

"అయితే! ఇంకేం జెయ్యమన్నావుతాతా!"

"ఒకసారి అల్లాగ వంటింటికేసిఐనా వెళ్ళవూ?"

ఆమాటమీద మృణాల ఉలిక్కిపడి ఒక్కగంతేసి అయ్యయ్యో! ఎంతపొరబాటైపోయిందితాతా! వంటబ్రాహ్మణ్ణి నేను మొట్టమొదటే చూసిరావలసింది "సరే! మీరంతా వీధులోకివెళ్ళండి. మేము ఇంట్లోకి వెడతాము" అంది.

మహిముడు "మేమంటే ఎవరు?" అని అడిగాడు.

మృణాల "నేనూనాయనమ్మాను" అంది. ఆపైన అచలకేసి తిరిగి నేను మళ్ళీ వచ్చేదానుకాబట్టి ఈయింటిపెత్తనం అంతా నీకప్పగించి మరీ వెడతాను" అంది.

మహిముడూ భవానీఘోషాలుడూ వీధులోకి వెళ్ళిపోయారు. మృణాల మళ్ళీ అచలతో "నేనసలు రెండుమూడురోజులు ముందే రావలసిందమ్మా! మాఅత్తగారికి ఉబ్బసపుదగ్గు. అందుచేత ఇల్లువిడిచి పెట్టి రావడానికి వీల్లేకపోయింది. సరే! నువ్వు బట్టలుమార్చుకుని సిద్ధంగా ఉండవమ్మా! నేనిప్పుడే వచ్చి నిన్నుతీసుకువెడతాను! అని చెప్పి మృణాల గబగబా వంటయింటికేసివెళ్ళిపోయింది.

ఇప్పటికి వర్షం కొంచెంకొంచెం వెలిసింది. దట్టంగా కమ్ముకున్న మేఘాలు విడిపోయి తేలిపోవడంచేత నవమివెన్నెలపడి. ఆకాశం అక్కడక్కడ కొంచెంకొంచెం స్వచ్ఛంగా కనబడింది.

వంటపని అంతా పూర్తిచేసుకుని మృణాల మళ్ళీ అచలదగ్గిరికి వచ్చి కూర్చుని ఆమెచెయ్యి తనచేత్తోపట్టుకుని "ఏమమ్మా! నిన్ను నాయనమ్మా, అనిపిలవడంకంటే వదినా, అనిపిలవడమే బాగుంటుం దనుకుంటాను! ఔనా! వదినా!" అని అడిగింది. అచల ఆమాటకి అవునని మెల్లిగా సమాధానంచెప్పింది.

మృణాల "బంధుత్వాన్ని బట్టి నువ్వే పెద్దదానవయినా, వయస్సుని బట్టి నేనే పెద్దదాన్ని, అందుచేత నువ్వుకూడా నన్ను "మృణాలక్కయ్యా!" అనిపిలుస్తూ ఉండు! ఏంబాగుందా?" అంది.

అచల 'బాగుంది' అంది.

మృణాల "ఈవేళ నీకు వంటఇల్లు చూపిస్తాను. రేపుమాత్రం సామానులకొట్టు తాళంచెవి నీచీరచెంగుకి కడతాను. బాగుందా?" అంది. అచల "ఇప్పుడునాకు తాళంచెవి జరూరు ఏమీలేదమ్మా" అని సమాధానంచెప్పింది. మృణాల నవ్వి "తాళంచెవి జరూరు లేదూ? బాగుంది, ఇల్లాగ మాట్లాడుతున్నా వేమిటి? సామానుల కొట్టంటే సామాన్యం అనుకున్నా వేమిటమ్మా ఒదినా! ఏమిటంటున్నావు! ఇప్పుడునాకు తాళంచెవి అవసరంలేదనా? గృహిణీరాజ్యాని కది రాజ ధాని లాంటిది! సుమా!" అంది. అచల "అదిరాజధానే కాని ఆరాజ ధాని ఇప్పుడు నాకవసరంలేదు! కాని నువ్వు మాత్రం నాక్కావాలి! నిన్ను మాత్రం ఓపట్టాని వదలుకోలేను మృణాలక్కయ్యా!" అంది. మృణాల రెండుచేతులతోనూ అచలని దగ్గిరిగాలాక్కొని "సవితిని చీపురుగట్ట పుచ్చుకుని వీధులోకి గెంటివెయ్యాలి! దానికిబదులు నువ్వు గట్టిగాపట్టుకుంటా నంటా వేమిటి? అదేమి ఆలోచన ఒదినా!" అని అడిగింది.

అచలమెల్లిగా "నీవేళాకోళం నాకేమీ నచ్చడంలేదు అక్కయ్యా? ఇక్కడఅంతా ఇల్లాగే వేళాకోళం ఆడుతూ ఉంటారేమిటి?" అని అడిగింది.

మృణాల కిలకిలనవ్వుతూ "లేదమ్మా! లేదు! ఎవ్వరూ ఇల్లాగ వేళా కోళం చెయ్యరు! నేనొక్కత్తినే ఇల్లాగ వేళాకోళం ఆడుతున్నాను! అందరికీ కావాలంటే మాత్రం ఇదివొరుకుతుందా?" అంది. అచల "అసలు మాజిహ్వాలమ్మీట ఇల్లాంటిమాటలే ఉచ్చరించము! అసలు మాకలకత్తాలోఉన్న అనేకమందిస్త్రీలకి సంసారస్త్రీలు ఇల్లాంటి మాటలు అంటారన్నసంగతికూడా తెలియదు!" అంది.

మృణాల కొంచెంసిగ్గుపడింది; కాని మళ్ళీ అచలని గట్టిగా దగ్గిరిగా

లాక్కుంటూ "అయితే మీకలకత్తాలో నాకుమల్లే ఎంతో ఆప్యాయంగా కాగలించుకుని దగ్గిరికితీసుకునే స్త్రీలెంతమంది ఉన్నారో! చెప్పవమ్మా! ఒకనా! అందరూ అన్నిపనులూ చెయ్యగలరా ఏమిటి! అసలు ఈవిషయం ఆలోచించు! నిన్ను చూసి ఎంతకాలం అయిందో చెప్పు! ఇంతలోనే నాకెవ్వరూ చెల్లెళ్ళు లేరనిన్నీ, కొత్తగా నాకొకచెల్లెలు దొరికిందనిన్నీ అనిపించింది. ఇంతేకాదు! జన్మం ఉన్నంతకాలమూకూడా ఈమాట నెగ్గించుకోవాలి! మరిచిపోకుండా జ్ఞాపకం ఉంచుకో;— ఈవిషయంలో మాత్రం వేళాకోళం పనికిరాదు సుమా!" అంది.

అచల చదువుకున్నపిల్ల. అందుచేత ఆఇంట్లో ఎల్లాగ జీవితం గడపాలో తెలుసుకుంది. అందుకని ఈతరుణం పోనియ్యకూడదని నిశ్చయించి వేళాకోళంమానేసి గంభీరంగా "మృణాలక్కయ్యా! నిజంగా నువ్వు బతికిఉన్నంత కాలమూ ఇప్పుడన్నమాట నెగ్గించుకుంటావా! అంది.

మృణాల "మేము పట్టణవాసస్థులం కాదమ్మా! అందుచేత అన్నమాట చెల్లించితీరాలి! ఆకారణంచేత నీదగ్గిరఅన్నమాట తిరగడానికి వీల్లేదు!" అంది.

అచల ఈవిషయాన్నిగురించి అట్టే ఆలోచించకుండా మరొక ప్రసంగంలోకిదింపుతూ, నవ్వి "మళ్ళీ గబగబా మీయింటికి పరిగెత్తుకు పోవుగదా! ఆమాటేమన్నా ఉంటే తొందరగా చెప్పు!" అంది.

మృణాలనవ్వి "నన్ను వెర్రిదాన్నికింద కట్టేసేసి నాచేత ముందుగా మాటఅనిపించాలని చూస్తున్నావా? కాని నేనుమాట ముందుగానే చెబుతున్నాను. నీకు ఇల్లంతా జాగర్తగా అప్పగించందే నేను వెళ్ళిపోనులే!" అంది. అచల అందుకు ఒప్పుకోనట్టు తల అడ్డంగాతిప్పి, "ఇప్పుడు నాకీ ఇంటిపెత్తనం అంతా నెత్తిమీద పెట్టుకోవాలనే యావ! పిసరంతైనా లేదు!" అంది. మృణాల "అచ్ఛే అల్లాగ అంటే

వల్లగాదు! నేనునీచేత ఇంటిపెత్తనం చేయించిమరీవెడతాను; అయితే నేను ఇల్లువిడిచిపెట్టి చాలారోజులుదాకా ఇక్కడ ఉండడానికి వీల్లేదు తల్లీ! నామీద ఎంతసంసారభారం ఉందో నీకుతెలుసునా? అంది.

అచల తల అడ్డంగాతిప్పి అబ్బే నాకు తెలియదు!'' అంది. మృణాల ఎంతో ఆశ్చర్యపడి "అయితే తాత నీతో నాసంగతి మొట్టమొదట చెప్పనేలేదూ?'' అంది. అచల "అబ్బే! ఎప్పుడూ చెప్పలేదు! ఆయన తమఇంటికి సంబధించినవిషయాలన్నీ నాతో చెప్పారు; కాని అన్నిటి కంటే ముందుచెప్పవలిసిన నీమాటమాత్రం నాకెన్నడూ చెప్పలేదు. మృణాలక్కయ్యా! ఇదంతాచూస్తే నాకు చాలాఆశ్చర్యంగా ఉంది సుమా!'' అంది.

మృణాల పరధ్యానంగాఉన్నట్టు "అయితే అయిఉండవచ్చును!'' అంది.

అచల మళ్ళీ కొంతసేపు నిశ్శబ్దంగా ఉండి నవ్వుతూ, మృదుస్వరంతో "అయితే నీకూ ఈయనకీ పెళ్ళి స్థిరపరచారా ఏమిటి?'' అని అడిగింది. మృణాల ఇప్పుడుకూడా ఏదో పరధ్యానంగా ఆలోచించుకుంటూకూర్చుంది. అందుచేత ఊకొట్టింది. కాని అల్లాగ ఊకొట్టినవెంటనే ఆమాటవెళ్ళి మృణాలచెవిలో బల్లెంలాగ గుచ్చుకుంది. ఆమె కళ్ళెత్తి అచలముఖంకేసి చూసి "అల్లాగ అయ్యేయోగం లేదు. అందుచేత కాలేదు''

అచల మళ్ళీ "సంబంధం స్థిరపడడానికి ఏమైనా అడ్డంకులు వచ్చాయా? లేకపోతే ఆయనకి నువ్వంటె నిజంగా ఇష్టంఉండేదికాదా? ఆమాట అల్లాగ ఉండనీ! చిన్నప్పటినించీ ఏర్పడ్డ ప్రేమానుబంధం ఉపేక్ష చెయ్యడంమాత్రం భావ్యమా!'' అంది.

అచలప్రశ్నించే ధోరణినిబట్టి మృణాల ఆశ్చర్యపడి ఒకక్షణకాలం

అచల కేసి నిశ్చలంగాచూసి "ఏమిటమ్మా ఒదినా! ఇవ్వన్నీ నువ్వెందుకోసం అడుగుతున్నావు? చిన్నప్పట్నించీ కలిగినప్రేమకి పర్యవసానం ఇదేనా! అదీ గాక వివాహంచేసుకోడానికీ, చేసుకోకపోవడానికీ మనిషిలో ఏముంది! వివాహంఅనేదిఒక్క ఈజన్మకేసంబంధించినది కాదమ్మా ఒదినా! అది కేవలం జన్మాంతరాల సంబంధం! నేను జన్మజన్మాంతరాల నించీ ఎవరిదాసీనో వారికే నన్ను పరమేశ్వరుడు సమర్పించాడు. మన ఇష్టానిష్టాలనిబట్టి ఏంజరుగుతుందమ్మా!" అంది.

ఆమాటలమీద అచల ఎంతోసిగ్గుపడి "నువ్వుచెప్పినమాట నిజమే మృణాలక్కయ్యా! అందుచేతనే నేను అడిగేదేమిటంటే"— అని సగం సగం అని ఊరుకుంది.

ఇంక ఆపైన ఆమె ఆమాట పూర్తి చెయ్యలేకపోయింది. ఆమె ముఖం అంతా సిగ్గుచేత ఎర్రబడిపోయింది. మృణాలకూడా ఆసంగతి కనిపెట్టేసింది. ఆమె ఎంతో ఆప్యాయంగా అచలచెయ్యి తనచేత్తో పట్టుకుని "ఒదినా! నీకు భర్త ఈమధ్యనే దొరికాడు; కాని నేను నాభర్తగారికి అయిదేళ్లనించి సేవచేస్తున్నాను! ఇదంతా ఎందుకు! నేను ఒక్కమాట చెబుతున్నాను వినమ్మా! ఈవిధంగా స్వబుద్ధిబలంవల్ల భర్తని వెతుక్కోడంఅనేది ఎప్పుడూ మంచిదికాదు ఇంతకంటె శుభ్రంగా మోసంచెయ్యడంమంచిది! అయితే ఆవిధంగా ఒదిగి ప్రయోజనం ఏముంది?" అంది.

యదువు వచ్చి "బాబుగారు భోజనంచేసే వేళయిందండి!" అన్నాడు.

"సరే! అయితే నేను వస్తున్నాను" అనిచెప్పి మృణాలచటుక్కుని అచలముఖం దగ్గిరగాలాక్కుని, చటుక్కుని ఒక్కముద్దుపెట్టుకుని గబగబా అక్కడినించి వెళ్ళిపోయింది.

# ౧౫

"ఓ వదినోయ్!"

అచల కంగారుపడి పక్కనున్న గదిలోంచి చటుక్కున ఆ గదిలోకి వచ్చింది. మృణాల నడుముకి చీరబిగించి కట్టి, తనొక్కత్తే ఒక చిన్న మేజాబల్ల ఇవతలికిలాగి మళ్ళీ యథాప్రకారంగా అక్కడే సర్దేసింది. అచల లోపల అడుగుపెట్టగానే ఆమె మండిపడుతూ, గట్టిగా "ఏమిటమ్మాయ్! నువ్వు నవాబుగారికూతురులాగ కాలుమీద కాలు వేసుకుని కూర్చున్నావు! నేనొక్కత్తినీ నీపడకగది అంతా సర్దుతున్నాను! ఇదుగో నేను చెబుతున్నా! చీపురు పుచ్చుకుని ఆమూలాలతుడు!" అని అరిచింది ఆపైన నవ్వాపుకోలేక విరగబడినవ్వింది.

ఈగొడవంతా విని నారాయణమ్మకూడా మెల్లి మెల్లిగా అక్కడికి చేరుకుంది. ఆపైన "ఇదేమిటమ్మా ఇల్లాంటిపని చేస్తున్నారు? అచలమ్మగారు ఎప్పుడైనా చేత్తో చీపురుపట్టుకుని ఎరుగుదురా? ఆవిడ ఇప్పుడు పల్లెటూరువాళ్ళలాగ చీపురుగట్టపుచ్చుకుని ఇల్లుతుడుస్తుందా? కావలిస్తే మేమంతా లేమా! అమ్మ" అనిచీపురుగట్ట చేత్తోపుచ్చుకుని స్వయంగా ఇల్లు శుభ్రం చెయ్యబోయింది. ఇంతలో మృణాల లేనికోపం తెచ్చుకుని చటుక్కుని చాల్లే! నువ్వెవరుకోవో? ఆవిడేతరపున వకాలితీ పుచ్చుకోడానికి వచ్చావుగాని నువ్వావిడికి నాకంటెకూడా దగ్గిరదానివా!" అని బలవంతంగా అచలచేతులో చీపురుగట్టపెట్టి నారాయణమ్మకేసి చూసి నవ్వుతూ "ఏమే మీఅచలమ్మగారికి ఇష్టం అయితే పల్లెటూరివాళ్ళవల్లా చెయ్యలేనిపనికూడా చేస్తుందిలే!" అంది. ఆపైన అచలకేసి చూసి "నడవవమ్మా వదినా! వెళ్ళి ఆమూలాల అంతా శుభ్రంగా తుడు!" అంది.

అచల చీపురుపుచ్చుకుని ఇల్లు తుడవబోతూ "మృణాలక్కయ్యా!

నీకు మంత్రాలు తంత్రాలు ఏమన్నా వచ్చునా?'' అని అడిగింది.

మృణాల "ఏం ఎందుచేత?" అంది.

అచల "ఎందుచేతేమిటి! ఈఇల్లు తుడవటానికి నా అంతటనేను చీపురుగట్ట చేతబట్టాను? ఇది మంత్రతంత్రాలవల్ల కాకపోతె ఎట్లా జరుగుతుంది!'' అంది.

మృణాల "నువ్వు ఇల్లుతుడవకపోతే ఇంకెవరు తుడుస్తారు! నీఇల్లు తుడవటానికని పనికట్టుకొని పరాయివాళ్ళెవళ్ళైనావస్తారా? కబుర్లుచెప్పి కాలక్షేపంచెయ్యకు. వెళ్ళు సాయంత్రంకూడా అవుతూంది.'' అంది.

అచల పనిచేస్తూ చేస్తూ ఒకనవ్వునవ్వి "మృణాలక్కయ్యా! నీమట్టుకి నీవు ఒక్కక్షణమైనా కూర్చోవు! నాకూడా ఊపిరి ఆడకుండా చేస్తున్నావు! అబ్బ ఈనాలుగైదు రోజులనించీ నాచేత ఎంత చాకిరీ చేయించావమ్మా! తేయాకుతోటల యజమానులు తమ కూలీలచేతనైనా ఈవిధంగా పనిచేయించరమ్మా!'' అంది.

మృణాల అచలదగ్గిరిగావచ్చి ఆమెగడ్డంమీద వేలితో ఒకదెబ్బ కొట్టి "ఇల్లాచేస్తే ఇంటిలో లక్ష్మి కలకల్లాడుతూ ఉంటుంది ఒసినా! నువ్వేదో పెద్దశ్రమ పడిపోతున్నానంటున్నావు! కాని ఊపిరివిడవ డానికైనా కాళీలేకుండా పిల్లలతో సంసారం ఈదుకుంటూన్నప్పుడే ఆడదానికి జన్మసార్థక మయిందన్నమాట! నిన్ను కొద్దిరోజుల్లో అల్లాంటిదాన్నిగా చెయ్యమని నేను పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాను. అసలునువ్విప్పుడు పడేది ఒకశ్రమలో లెఖ్ఖా'' అనిఆమె ఒకపెద్దనవ్వు నవ్వబోయింది; కాని నవ్వుకిబదులుగా ఆమె పెదవులు వొణకడం మొదలెట్టాయి.

ఆమాటలమీద నారాయణమ్మ బొరుమనిఏడ్చి "ఇల్లాగే దీవించండమ్మా! ఇల్లాగేదీవించండి!'' అంది. అల్లాఅంటూంటే దానికి అచలతల్లిసంగతి అంతా జ్ఞాపకంవచ్చింది. ఆమహాయిల్లాలు చచ్చి

పోతూ చచ్చిపోతూ అచలని నారాయణమ్మకి అప్పగించి చచ్చి పోయింది. అల్లాంటిపిల్లయిప్పుడు భర్తతో కాపరంచేసేటంత పెద్దది యిందిగదా! అనిన్నీ, ఆతల్లి లేకపోయిందే అనిన్నీ దానికిప్పుడొక పెద్దయేడుపువచ్చింది!

మృణాల దాన్ని చీవాట్లుపెడుతూ "ఏమిటేనువ్వు మాటిమాటికీ కూనిదీర్ఘాలు తీస్తూంటావు! ఎందు కేడుస్తావు!" అంది.

నారాయణమ్మ కళ్ళుతుడుచుకుంటూ "నేను ఎందుకు ఏడుస్తున్నాననిఅడుగుతున్నావా? అమ్మా! మీమాటలు వింటూంటే ఎంతఆవు గుండా మనకన్నా ఏడుపుఆగడంలేదమ్మా! నిజంగా మీరే రాక పోతే మాకీయింట్లో ఒక్కరాత్రైనా నిద్రపట్టకపోనమ్మా! ఇక్కడ వ్యవహారం ఏమీబాగుండలేదు!" అంది.

మృణాల ఇక్కడికివచ్చి అప్పుడే ఆరురోజులయింది. ఆమె వచ్చినప్పటినించీ ఇల్లంతా దుమ్మూ అదీ దులిపి బాగుచేయడం పనిలోనే మునిగిపోయింది. అచలకి ఆమెపనిపాటలూ వేళాకోళాలూ అన్నీ బాగానేఉన్నాయి; కానిఆమె మాటిమాటికీ ఇంటికి వెళ్ళిపోతాననడమే బాధగాఉంది. ఆమె మృణాలని ఒకవిధంగా విడిచిపెట్టి ఉండలేకపోవడమే దానికికారణము. మృణాలమాటల్లోనూ వేళాకోళాల్లోనూ, పనులలోనూ ఒకస్వతస్సిద్ధమైన వైశాల్యం కనిపిస్తూ ఉంటుంది. అచల ఆవైశాల్యచ్ఛాయలో నిలబడి సంసారపుగుట్టుమట్టులన్నీ సులభంగా తెలుసుకోగలిగింది. అసలు అన్నిటికంటేకూడా ఆమెకు మృణాలనిగురించి బాగా తెలుసుకోవాలని ఒక కుతూహలం కలిగింది. పాపం! మృణాల సంసారపరిస్థితు లేమీకూడా బాగాలేవు. ఆవిషయం అలంకారవిహీనములైన ఆమెహస్తాలకేసి చూస్తే తెలుస్తూంది. ఒకపక్కని మృణాలభర్త ధోరణి ఏమీబాగాఉన్నట్టు లేదు! అతనిప్పుడూ రోగాలతో తీసుకుంటూనేవాడిలాగ కనబడ్డాడు. అచలదృష్టిలో

అతను మృణాలకి తగినవాడిలాగే కనబడలేదు. అప్పైన ఆమెసంసారపు గొడవలూ. ఎంతచేసినా తరగనిపని ఉన్నాయి. ఈ రెండింటిచేతా మృణాలనలిగిపోయింది. అప్పైన ముసలిఅత్తగారు అయినదానికీ కాని దానికీ తిట్లకొట్లకి అంతులేదు! ఆముసలావిడ అసలు ఈవేళో రేపో అన్నట్టుగాఉంది. అయినాగాని ఆమెపెట్టేబాధ ఇంతాఅంతా అని చెప్పడానికి వీల్లేదు. అన లీవిషయాలన్నీ మృణాలే వొకనాడు అచలతో చెప్పింది. ఇన్నికష్టాలు పడ్డీనాగాని, ఏమీాలక్ష్యపెట్టకుండా మృణాల ఏదోవిధంగా కాలక్షేపం చేసుకుంటూ వస్తూంది. అసలు తనగొడ వేదో తనుచూసుకోవడంతప్ప, ఆమెకు బాహ్యాపరిస్థితులతో సంబంధమే ఉన్నట్టు కనబడలేదు! ఇదే పల్లెటూరిలోఉండే ఆమూర్ఖ స్త్రీస్వభావము! బురదలో మొలిచిన తామరపువ్వు బురదతోనూ, నీటితోనూ ఏవిధమైనసంబంధమూ లేకుండానే నిలబడిఉంటుంది. ఆవిధంగానే చదువూ సంధ్యాకాని ఈదరిద్రకుగ్రామ నివాసిని ఐన ఈలక్ష్మి రాత్రింబగళ్ళు దుఃఖంతోనూ దారిద్ర్యంతోనూ కుంగిపోతున్నా, బాధలన్నీసహించి సుఖంగా కాలక్షేపం చెయ్యగలుగుతూంది! ఎంత చూసినా ఆమెశరీరానికి ఆయాసం ఉన్నట్లుగాని మనస్సుకి బాధ కలిగినట్లుగాని కొంచెమైనా కనబడలేదు! దీనివల్ల అచలకూడా తనకి బొత్తిగా అలవాటులేని పనులలో కలగజేసుకోవడం ప్రారంభించింది. అయితే అచలకి ఇల్లాంటిపనులు చెయ్యడం బొత్తిగా అలవాటులేదు! అయినాగాని, నాకు చేతకాదని ఓమూలకూర్చోడం బొత్తిగా బాగుండదని ఆమెఅనుకుంది. ఇల్లాగవున్నాగాని మృణాలకి ఒకచోట కూర్చుని తనకష్టసుఖాలనుగురించి ఆలోచించుకోడానికైనా అవకాశం కలగలేదు! ఆమెపొద్దస్తమానమూ వేళాకోళాలతోనూ, చిన్న చిన్న చిలిపి కజ్జాలతోనూ కాలక్షేపంచేస్తూంది! మొత్తంమీద మృణాలతో అచలకి కులాసాగా కాలక్షేపం అయిపోతూంది. అందుచేత మృణాల

వెళ్ళిపోతుంటే నేనసలికి అచలకి ఆ పుట్టికొంప అంతా పేకముక్కలతో కట్టిన మేడలాగ చటుక్కుని కూలిపోతుందేమోనని అనిపించింది. మృణాలక్కయ్య వెళ్ళిపోతే తను అక్కడ ఒక్కనిమిషమైనా ఉండలేనని ఆమె అనుకుంది.

ఒకనాడు సాయంత్రం అయినతరువాత "మృణాలక్కయ్యా! ఏమిటమ్మా అస్తమానం నువ్వు వెళ్ళాలో వెళ్ళాలో అని కూర్చుంటావు! పుట్టింటికి వచ్చాక ఇంత తొందరగా ఎవరైనా వెడతారా! ఏమైనాసరే నేను కలకత్తా తిరిగివెళ్ళేదాకా నువ్విక్కడనుంచి కదిలివెళ్ళడానికి వల్లకాదు!" అంది.

మృణాల "ఏంచెయ్యనమ్మా వదినా! ఆ ముసలావిడ చచ్చిపోనూ చచ్చిపోదు! నన్నొక్క నిమిషమైనా నిలవానివ్వదు. నేనావిడితోటి "ఏమమ్మా! నీకొడిక్కి అప్పుడే అరవై ఏళ్ళు వచ్చాయి. నీకొడుకునిగూడా మింగేస్తేనేగాని నువ్వు వెళ్ళ దలచుకోలేదా! ఏదో ఆయనచేతుల మీదుగా వెళ్ళిపో!" అని చెబుతూనే ఉన్నాను. ఏంచెయ్యనమ్మా! రాత్రింబగళ్ళు ఇల్లాగ ఎముకలు పిండిఅయిపోతున్నా ఊపిరి విడవడానికికూడా వ్యవధిలేక చచ్చిపోతున్నాను" అంది.

అచలనవ్వి "ఆవిడ నిన్ను రెండుకళ్ళా చూడలేదనుకుంటాను" అంది.

మృణాల "అవును నిజమే!" అంది. అచల "ఆవిడంటే నీకూ అంతేనా!" అంది. మృణాల "అవును! నాకూ అంతే! ముసలావిడ శీఘ్రంగా మూటకట్టేస్తే అయిదు శేర్ల ఆవునెయ్యి దీపారాధనచేస్తానని మొక్కుకున్నాను" అంది.

అచల అంగీకరించనట్టు తలఊపుతూ "నువ్వన్నమాట నేను నమ్మలేను మృణాలక్కయ్యా! నీమాటల్నిబట్టి నీకెవరంటే ఇష్టమో, ఎవరంటే ఇష్టంలేదో చెప్పడం చాలాకష్టం బహుశః అందరికంటేగూడా ఆ ముసలావిడ అంటేనే నీకెక్కువఇష్టం అని నా అభిప్రాయము!" అంది.

మృణాల నవ్వు మొఖంతో "అందరికంటేకూడా ఆముసలావిడ అంటే ఎక్కువఇష్టమా? బాగానేఉంది!" అనిఏదో పనిఉందనిచెప్పి తొందరగా అక్కణ్ణించి ఇంకొకచోటికి వెళ్ళిపోయింది.

"ఇదిగో వెడుతున్నాను! అదుగో వెడుతున్నా!" నని చెబుతూ మృణాల అల్లాగే కొంతకాలం ఉండిపోయింది. వెళ్ళాలి వెళ్ళాలి అని ఎంతఅంటూన్నా ఆమెకి నిజంగా వెళ్ళడాని కిష్టంలేదని అచల ఒకనాడు కనిపెట్టింది. అచల ఇన్నాళ్ళనించీ మృణాలఆశ్రయచ్ఛాయలో ఉండి తనసంసారజీవితం అంతా ఒకప్రత్యేకదృష్టితో అవగాహన చేసుకుంది. ఇప్పుడు ఆ ఆశ్రయచ్ఛాయలోనించి ఇవతలికివచ్చి చూస్తే, ఆమెకి ఆజీవితం ఆవిధంగా కనబడడం మానేసింది. అచల భర్తగారింటికి వస్తూనే మహిముణ్ణి మృణాల వేళాకోళం, చెయ్యడం చూసింది. మొట్టమొదట అది ఆమెగుండెల్లో బాకులాగ దూసుకుపోయింది. క్రమక్రమంగా ఇప్పుడావేళాకోళాలన్నీ ఆమెకు సూదిపోటుల్లాగ కనిపించాయి. మొట్టమొదట రోజుల్లో కొన్నాళ్ళపాటు ఆమె వాళ్ళవేళాకోళాల్లో ఏమీలేదనిన్నీ కేవలం మనస్సు పాడుచేసుకోవడం తప్ప, ఇల్లాగ అనుకోవడంవల్ల ప్రయోజనం ఏమీ ఉండదనిన్నీ, అసలు ఉన్న కాలుష్యంఅంతా, తనమనస్సులోనే ఉంది అనిన్నీ అనుకుంది. అల్లాగఅనుకుని మనస్సు కుదుటబరుచుకుంటూ ఉన్నకొద్దీ, ఆవిపరీతాభిప్రాయాలన్నీ, మరింతతీవ్రంగా తలెత్తడంప్రారంభించాయి. ఆమెకు మహిము డీవిషయంలో మరింతగంభీరంగా ఉన్నట్టు కనిపించాడు. నిజంగా లోపల ఏమీలేకపోతే వేళాకోళం మాటకి వేళాకోళంగా సమాధానంచెబితే ఏంపోయింది? వేళాకోళం చేసినప్పుడు మళ్ళీవేళాకోళంగా సమాధానంచెప్పక నవ్వుతూకూర్చున్నా, ఆవేళాకోళంవల్ల కలిగే ఆనందం అనుభవించవచ్చును. మృణాల రహస్యంగా మాట్లాడాలని దగ్గిరికి వచ్చేటప్పటికి మహిముడు సిగ్గుపడి చటుక్కుని అక్కడి

నించి తప్పించుకుని పారిపోతున్నాడు. అందుచేత వాళ్ళల్లో వాళ్ళకి ఏదో ఉండకపోతే, ఇల్లాగ ఉండదని, ఆమె అనుకోకుండా ఉండలేకపోయింది. అచల "మృణాల ఇంత పెద్దదయినా, వివాహంవిషయంలో ఇంత బాధపడు తున్నా, మహిముణ్ణి విడిచిపెట్టి ఉండలేకపోతూంది కదా! ఇల్లాం టప్పుడు, ఇంత కాలంనించీ మృణాలతో కలిసి ఒక ఇంటికింద ఉంటూన్న మహిముడుమాత్రం ఆమెను ప్రేమించకుండా ఎల్లా ఉండగలడు? మహిముడన్నమాటేమిటి 'అసలు ఏపురుషుడైనా మృణాలని ప్రేమించ కుండా ఉండగలడా?" అని మృణాలతో కలిసి పనిపాటలు చేస్తు న్నప్పుడుకూడా అనుకోకుండా ఉండలేకపోయింది!

మృణాల వచ్చీరావడంతోనే, వంటబ్రాహ్మణుడు వంటచెయ్యడం మానేస్తూంటా డన్న సంగతికూడా అచలకి తెలిసిపోయింది. ఇప్పుడు కూడా ఆవంటబ్రాహ్మణుడు పనీపాటా మానేసి ఊరమ్మట తిరుగు తున్నాడు. మృణాలకి మహిముడికి స్వయంగా వంటచేసిపెట్టి వడ్డిం చడం అంటే, ఎంతో ఆప్యాయం అన్నసంగతి కూడా అచల గ్రహిం చింది. అచల ఈవేళ ప్రొద్దున్నే లేచి "మృణాలక్కయ్యా నీకీవేళ శెలవు!" అంది.

మృణాలకి ఆమాట బోధపడలేదు. ఆమె "సెలవెందుకు?" అంది. అచల "వంటికి! ఈవేళ నేనే వంటచేస్తాను." అంది. మృణాల "అయ్యయ్యో! ఎంతదురదృష్టము! నువ్వెందుకు చెయ్యడం వంట?" అంది. అచల "ఏం? నేనుచెయ్యలేనా? ఏమిటి? ఇంటిదగ్గిర నేను ఎన్ని సార్లు చెయ్యలేదు! పోనీలే! మృణాలక్కయ్యా! దానికేంగాని ఈవేళ నేనే వంటచేస్తాను" అంది. అచల పట్టుదల చూసేటప్పటికి మృణాల ముఖం వాడిపోయింది. ఆమె "ఇంల్లాటిది ఎక్కడైనా ఉందా? నేను ఉండగా నువ్వు పొయ్యిదగ్గిరికి వెళ్లి ఆపొగలో బాధపడడం ఎందుకు" అంది. అచల ఆమె ముఖభావంగ్రహించి గట్టిగా పట్టుపట్టుతూ

"అయితే వంటబ్రాహ్మడు ఉండగా నువ్వు కష్టపడడం ఎందుకు? ఏమైనా సరే ఈవేళనేను వండితీరతాను" అంది.

మృణాలకి అచల ఇంతగట్టిగా పట్టుపట్టడానికి కారణం ఏమిటో తెలిసిందికాదు! అందుచేత ఆమె వచ్చేనవ్వాపుకుంటూ ఎంతో అభిమానం అభినయిస్తూ "ఆహా! ఏమిచిత్రమైనదానివమ్మా! నువ్వు నాదగ్గిర ఉన్నవన్నీ ఒక్కొక్కటే లాక్కుపోవాలని చూస్తున్నావా? అన్నీలాక్కోడంఅయిపోయింది. ఒక్కనాలుగైదురోజులు వంటచేసిపెట్టి వెడదా మనుకొంటున్నాను. ఇదికూడా రెండుకళ్ళా చూడలేకుండా ఉన్నావా? ఇంకనవితిని నానాబాధా పెడితేగాని నీకుతోచదులా వుంది." అంది.

మళ్ళీ అచల హృదయానికి ఒక పెద్దఆఘాతం తగినట్లయింది. అందులోనూ మృణాలఅన్న ఆ ఆఖరిమాటలు ఆమెహృదయంలో అంతకుపూర్వమే ఉన్న అనూయాగ్నిని భగ్గుమని ప్రజ్వలింపజేశాయి. ఆమె తక్షణం ఎంతోగాంభీర్యముతో ముక్తసరిగా కాదమ్మా! ఈవేళ నేనే వంట చేస్తాను" అంది.

ఇప్పుడు మృణాల అచలకి బాగా కోపంవచ్చేసిందని గ్రహించింది. అందుచేత ఇంక ఆవిషయమై వాదోపవాదాలు పెంచడంమానేసి మూతిముడుచుకుని ఊరుకుంది. ఆపైన "అయితేసరే! బాగానే ఉంది. వెళ్ళి నువ్వే వండు! నడు! నీ కావంటఇంటిలో ఎక్కడెక్కడ ఏవస్తువుందో చూపిస్తాను!" అంది.

మహిముడు ఇంతవరకూ ఇంటిదగ్గిరే ఉన్నాడు. ఈసంగతి ఈఇద్దరికీ కూడా తెలియదు. హఠాత్తుగా అతన్నిచూసి ఇద్దరూ నిర్ఘాంతపడి నించున్నారు. మహిముడు అచలకేసి తిరిగి మెల్లిగా "మృణాల ఉన్నంతకాలమూ దాన్ని వంటచెయ్యనియ్యకూడదూ?" అన్నాడు. మహిముడికి మృణాల దీనికింత ఎందుకు పట్టుపడుతోందో తెలుసును? కాని

ఆమాటమాత్రం పైకిచెప్పడానికి వీల్లేదు. మహీంద్రుడన్న మాటమీద అచల మరింత మండిపడిపోయింది. కాని ఆకోపం లోలోపల అణుగుని "కాదు! నేనే వండుతాను!" అని ఆ పైన వాదవివాదాలకి ఏమీ అవకాశం ఇవ్వకుండా చటుక్కున వంటింటి కేసి వెళ్ళిపోయింది.

అచల పంతంమీద వంటచెయ్యడం ప్రారంభించింది. వంట చెయ్యడంలో ఆమె ఎవరికీతీసిపోదు. అయితే ఈవాళమాత్రం ఆమెకు వంట చెయ్యడానికి ఉత్సాహంగా లేదు. వెనక జరిగిన సంగతులన్నీ లోలోపల మెదిలి ఆమెహృదయంలో గుచ్చుకోవడం ప్రారంభించాయి. బహుశః మహీంద్రుడు తనని అంతగా ప్రేమించలేదేమోనని ఆమెకనిపించింది. వివాహానికిపూర్వం జరిగినసంగతులూ ఇప్పటిసంగతులూ ఆలోచిస్తే మహీంద్రుడెప్పుడూ తటస్థుడుగానే ఉన్నాడని ఆమెఅనుకుంది. ఇంతే గాదు. తండ్రిగారికి ఇష్టంలేక సంబంధం పోసిగిపోయిందన్నప్పుడుకూడా అతనల్లాగే ఉన్నాడు. ఎంతఆలోచించినా అతని ఔదాసీన్యంవిషయంలో ఆమెకు పిసరంతైనా అనుమానం కలగలేదు!

ఇక్కడికి వచ్చినప్పటినించీ మృణాలా అచలా కలిసేభోజనంచేస్తున్నారు. రెండుఝాము లయ్యేసరికి నారాయణమ్మని కబురుపంపించి అచల ఆమెకోసం ఎదురుచూస్తూ కూర్చుంది. అది తిరిగివచ్చి "అమ్మా! మృణాలమ్మగారికి జ్వరం వచ్చినట్టుందిటండి. అందుచేత భోజనం చెయ్యనన్నారు" అంది. అచల మారుమాట్లాడకుండా తిన్నగా మృణాలపడుకున్న గదిలోకి వెళ్ళింది. మృణాల కళ్ళుమూసుకుని పరుపుమీద పడుకునిఉంది. అచల దగ్గిరికివెళ్ళి "రావమ్మా! మృణాలక్కయ్యా! భోజనం చేద్దువుగాని!" అంది.

మృణాల మెడతిప్పి ఆమెకేసి చూచిఒకచిరునవ్వు నవ్వి, "నాకు ఒంట్లో బాగుండలేదు; ఈవేళకి నువ్వు భోజనంచేసెయ్యి!" అంది. అచల కొంతనిర్ఘాంతపోయి, 'ఏం! జ్వరంగా ఉందా?' అని అడిగింది.

మృణాల "అవును. అల్లాగేఉంది. ఈవేళ లంఖణంచేస్తే రేపటికి ఒళ్లు నళాకులాగ ఉంటుంది" అంది. అచల కొంచెంవంగి, మృణాల నుదుటి మీద చెయ్యివేసి "నేనంత తెలివితక్కువదాన్ని కాదు! లే! కాస్త ఎంగిలిపడుదువుగాని!" అంది. మృణాల మెడతిప్పి, "నీతోఒట్టు ఒదినా! నా కాకలిగా లేదు! నువ్వింత శ్రమపడి ఇక్కడికి రావడం ఎందుకు లేకపోతే, దా! నీఎదురుగుండా కూర్చుంటాను" అంది.

అచల కఠినంగా "ఆకలివేస్తున్నా అన్నంతినని బంధువుల్ని ఎదురుగుండా కూర్చోబెట్టుకుని భోజనంచెయ్యడం మాకలవాటు లేదు అక్కయ్యా!" అంది. మృణాల మళ్ళీ నవ్వడానికి ప్రయత్నిస్తూ "ఒకవేళ వాళ్లుభోజనం చెయ్యడానికి మరింక ఏమీ ఉపాయంలేకపోతేనో!" అంది.

అచల అల్లాగే కఠినంగా "ఆఁ! ఆకలి లేకపోవడం ఏమిటి? నాకు తెలియదూ? నీకసలు జ్వరం లేనేలేదు! వచ్చిందల్లా కోపం! అంతకంటె ఏమీ లేదు! నీకు! అన్నంమానేసి నన్నుకూడా పస్తుపడుకోబెట్టాలని ఉంటే, చెప్పు! ఇంక నిన్నాట్టే బలవంతపెట్టను!" అంది. మృణాల చటుక్కునిలేచి కొంచెం ముందుకివంగి, "మాఆయనతో ఒట్టమ్మా వదినా! నాకు పిసరంతైనా కోపంలేదు! కాని నాకు ఏమీ ఆకలిలేదు! నడు! నిన్ను నాఒళ్ళో కూర్చోబెట్టుకుని అన్నంతినిపిస్తాను" అంది.

అచల "అయితే జ్వరం గిరం ఏమీలేదన్నమాట! ఇదంతా నాటకమేనా!" అంది. మృణాల ఆమాటమీద మాట్లాడకూరుకుంది. అచలకూడా అల్లాగే కొంతసేపు నిశ్శబ్దంగా నిలబడిపోయి, ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టి మెల్లిగా "సరేలే! ఇప్పుడు తెలిసింది. మృణాలక్కయ్యా! ఉన్నదున్నట్టు ముఖంమీద చెబుతానువిను! నీకు నాచేతి అన్నం తినడం ఇష్టంలేదు! అల్లాంటప్పుడు, అన్యాయంగా నిన్ను బల

వంతపెట్టి నీమనస్సూ కష్టపెట్టకపోదును! నేనూ బాధపడకపోదును! పోనీలే అక్కయ్యా! నాతప్పు క్షమించు! పాలకి అంటులేదని విన్నాను! ఒక గ్లాసుడుపాలు పట్టుకు రానా? తాగుదువుగాని! యదువు బజారుకి వెళ్ళి కొంచెంమిఠాయి పట్టుకువస్తాడు! ఏం?" అంది.

మొట్టమొదట ఆమాటలువిని మృణాల నిర్ఘాంతపడి పోయింది. ఆతరవాత ఆమె కొంతసేపటిదాకా ఏమీ మాట్లాడలేకపోయింది. ఊరికే నేలకేసి చూస్తూకూర్చుంది. అచలమళ్ళీ గట్టిగా "ఏం? ఏమంటావు?" అంది. మృణాల చీరచెరగుతో కన్నీళ్ళుతుడుచుకుంటూ "ఇప్పుడేమీ వద్దమ్మా!" అంది అచల ఆపైన కొంతసేపు అల్లాగే నిలబడి, అక్కడినించి మెల్లిమెల్లిగా వెళ్ళిపోయింది.

మృణాల ఏమీఅనలేదు! ఆఖరికి తలైనా ఎత్తలేదు! ఆమె తన ముసలి అత్తగారికి స్వయంగా అన్నం వండిపెడుతుంది. ఆముసలావిడ అగ్నిహోత్రంకూడా కడిగే పూర్వకాలంమనిషి! ఆవిడికి "మృణాల అచలవండినఅన్నం తింది" అని తెలిస్తే ఇంక మృణాల చేతినీళ్ళుకూడా ముట్టదు. అందుచేత మృణాల లోలోపల ఎంతో బాధపడుతూ, అచల కీసంగతి పిసరంతైనా తెలియనిచ్చింది కాదు!

అచల వంటఇంటిలోకి వెళ్ళి, పనిపాటలన్నీ పూర్తిచేసుకుని, చేతులూ కాళ్ళూ కడుక్కుని తనగదిలోకి వెళ్ళిపోయింది. కేవలం ఆచారం భయంవల్ల మృణాల తనచేతిఅన్నం తినకపోవడం నిజం కాదనిన్నీ, దానికి ఏదైనా మరొకకారణం ఉండవచ్చుననిన్నీ ఆమె అనుకుంది. అందుచేత మృణాలమనస్సు కష్టపెట్టినందుకు లోలోపల బాధపడింది. అసలుకారణం ఏమిటో అచలకి తెలిసిఉంటే ఆమె ఏమీ అనకపోయిఉండును. ఈవేళ ఉదయం వారిద్దరి దెబ్బలాటతోనూ ప్రారంభంఅయింది. అందుచేత మధ్యాహ్నం అవుతూన్నా, ఆవేళ ఆయింట్లో ఎవరికీకూడా ఇంత అన్నందొరికేయోగ్యత లేకుండి

ఆ ఇద్దరూ అనుకున్నారు.

మధ్యాహ్నం రెండుఝాములు దాటేటప్పటికి ఒక రెండెడ్లబండి వచ్చి గుమ్మంఎదురుగుండా నిలబడింది. మృణాల అచలఉన్న గదిలోకి వెళ్ళి "ఒదినా! మాఇంటికి వెళ్ళిపోతున్నాను. అందుకని నీకు నమస్కారం చెయ్యడానికి వచ్చాను. ఎప్పుడైనా రావలిసిన అవసరం వస్తే ఒకసారి కబురుపంపించు! అప్పుడు వస్తాను" అంది. ఆపైన ఒక్కనిమిషం ఆగి "వెళుతూంటే నాతో ఆఖరికి ఒక్కమాటైనా మాట్లాడవా?" అని ఆమెకేసి క్షణకాలం ఔత్సుక్యంతో చూసింది.

అయినాగాని అచల ఒక్కమాటైనా మాట్లాడలేదు. అల్లాగే తలఒంచుకుని కూర్చుండిపోయింది. అచల గదిలోంచి ఇవతలికి వచ్చేటప్పటికి మృణాలకి మహిముడు కనబడ్డాడు. ఆమె "తాతా!. ఒక్క నిమిషం ఆగు! నీకూడా నమస్కారంచేస్తాను" అంది.

మహిముడు మృణాలకేసి చూసి "భోజనంచెయ్యకుండానే వెళ్ళిపోతావా! మృణాలా! పోనీ ఈవేళరాత్రికి ఉండి రేపుపొద్దున్నే వెడుదువుగాని!" అన్నాడు.

మృణాల కొంచెంనవ్వి "కాదు! తాతా! యతను అప్పుడే బండి తీసుకువచ్చేశాడు; ఈవేళకి వెళ్ళిపోనీ! నన్ను మళ్ళీ ఇంకొకసారి తీసుకు వద్దువుగాని!" అని చెప్పి, చీరచెరగు మెడమీదనించి తిప్పి కుడిచేత్తో పట్టుకుని, మహిముడికి నమస్కరించి, అతనిపాదధూళి శిరస్సుమీద ఉంచుకుంది. ఆపైన "నన్ను మళ్ళీ తీసుకురావడం మరిచిపోగూడదు సుమా! తీసుకురాకపోతే నన్ను చంపుకుతిన్నట్టే! అంది.

ఈమాటలకి మహిముడు నవ్వి "పిచ్చిదానా! నీకు స్వభావం మారిపోదా!" అన్నాడు. మృణాల "నేను చచ్చిపోయాక పోతుందేమో! అంతేనేగాని ఈలోగాపోదు!" అని మళ్ళీ ఒక్కనవ్వు నవ్వి బండి ఎక్కింది. మృణాల ఇంత హఠాత్తుగా వెళ్ళిపోతుందని, అచల కల్లోనైనా

అనుకోలేదు. తనగదిలోకి వెళ్ళినతరవాత కూడా అచల "మృణాల, తనూ భోజనము చెయ్యలేదు. నన్నూ భోజనం చెయ్యనివ్వింది కాదు! దీనికి తగినశాస్తి చెయ్యడం ఎల్లాగ?" అని ఆలోచిస్తూ కూర్చుంది. ప్రేమించేవ్యక్తికి నువ్వు నన్ను అసహ్యించుకుంటున్నావు అనడం కంటె పెద్ద శాస్తిలేదు. అందుచేత మృణాలకి ఇల్లాంటి పెద్దశిక్షే విధించాలని అచల లోలోపల నిశ్చయించుకుని కూర్చుంది. "నేను బ్రహ్మసమాజస్థురాలి నని నన్నిల్లాగ నీచంగా చూస్తున్నావు" అని ఉట్టంకించి ఆమె మీద తనకసి తీర్చుగోవా లనికూడా ఆమె నిశ్చయించుకుంది. అయితే మృణాల వెళ్ళిపోతూఉండడంచేత అది అంతా వ్యర్థమైపోయింది.

అయితే మృణాళ భోజనంచెయ్యకుండానే తనదగ్గిర సెలవుతీసుకుని వెళ్ళిపోవడం చూసేసరికి అచలకి కళ్ళవెమ్మట నీళ్ళు గిర్రున తిరిగాయి; కాని వీధులోంచి నవ్వునవ్వుని చప్పుడు వినిపించేసరికి, బాగా కాలిఉన్న భూమిమీదపడిన వర్షబిందువులులాగ ఆ కన్నీళ్ళు ఎక్కడివి అక్కడ ఇంకిపోయాయి. ఆపైన తలుపువెనకాల నిలబడి వాళ్ళిద్దరూ ఒకళ్ళొకళ్ల దగ్గిర సెలవుపుచ్చుకోవడం చూసి, ఆమె పిడుగుపడ్డచెట్టులాగ భగ్గున మండి నిలువునా నుసిఅయిపోవడం ప్రారంభించింది.

ఆతరవాత కొంతసేపటికి మహిముడు గదిలోకి వచ్చాడు. అప్పటికప్పుడే అచల లోలోపల చిక్కబట్టుగున్న ధైర్యం కాస్తా సన్నగిల్లిపోయింది; కాని చిన్నప్పటినించీ చదువుకొని కాస్త అదుపులజ్జల్లో పెరగడంచేత ఆమె మరీనైచ్యానికి సిద్ధపడలేకపోయింది అందుచేత కొంత కష్టంమీదలోలోపల తమాయించి, ఒక్క కటికినవ్వు నవ్వి "పట్టణవాసంవాళ్ళు పల్లెటూళ్ళోఉండడం అంత పెద్దబాధ అదేగాని ఇంకేమీఉండదు!" అంది.

మహిముడు తనభార్యముఖంకేసి చూసి కొంచెంసేపు మాట్లాడక కూర్చుని "నువ్వు నిజంగనేనా చెబుతున్నావు! నాకు తెలుసును!

మొట్టమొదట నీకు ఇబ్బందిగానే ఉంటుంది; కాని మృణాలకీ నీకూ పడదన్నసంగతి కలలోనైనా అనుకోలేకపోయాను! ఎంచేతంటే—దానితో ఎప్పుడూ ఎవరూ దెబ్బలాడలేదు!" అన్నాడు. అచల "అయితే వాడవాడఅంతా అన్నమూనమూ నాతోనే దెబ్బలాడుతున్నా రన్న మాట! ఈసంగతి మీకెవరు చెప్పారు?" అంది. మహిముడు మెల్లిగా "నువ్వు ఈవేళ పొద్దుటినించీ ఏమీ భోజనం చెయ్యలేదు!—ఈగొడవలన్నీ ఇప్పుడెందుకులే! పోనిద్దూ!" అన్నాడు. అచల అంతకి వదిలెట్లు ఎక్కువ మండిపడుతూ "మృణాలక్కయ్య వచ్చిరుంచిసిల్లెనా నోట్లో పోసుకోకుండా, అత్తవారింటికి వెళ్ళిపోతూంది. ఆవిడితో నవ్వుతూ కేరింతాలు కొట్టడానికిమాత్రం మీకేమీ అభ్యంతరంలేదు!" అంది. మహిముడు నిర్ఘాంతపోయి "ఏమిటి అచలా! ఈమాటలన్నీని" అన్నాడు.

అచలహఠాత్తుగా పెద్దగొంతుకపెట్టి, "అనడాని కేముంది? నే నేం తప్పుచేశానని నన్నిల్లా అవమానపరచడం? నామనస్సు కష్టపెడితేనేగాని మీకు తృప్తికలగదా!" అంది. మహిముడికి ఏమీతోచక మరింత ఆశ్చర్యంతో "ఏమిటి అచలా? నా కేమీ బోధపడడంలేదు! నీఅభిప్రాయం ఏమిటి?" "అభిప్రాయం ఏమిటా? నేను మీ కేమి అపకారంచేశానని నన్నీవిధంగా చిన్నబుచ్చుతున్నారు?" అని అడిగింది. మహిముడికి మతిపోయినట్టయింది. అతను 'నేను నిన్నవమానపరిచానా?' అన్నాడు. అచల 'అవును! మీరే అవమానపరిచారు!' అంది. మహిముడు 'అబద్ధం' అని ఎదురుసమాధానం చెప్పాడు.

అచల ఒక్కక్షణకాలం స్తంభంలాగ అల్లాగే నిలబడిపోయింది. ఆపైన కంఠస్వరం కొంతతగ్గించి "నే నెప్పుడూఅబద్ధం ఆడను! పోనీ! దాని కేం లెండి! మీకు నిజంచెబుతానని పట్టుదల ఉంటే నే నడిగిన వాటికి నిజంసమాధానాలు చెబుతారా?" అని అడిగింది, మహిముడు

ఆమెకేసి కేవలం ఆశ్చర్యంగా చూస్తూనుంచున్నాడు.

అచల "ఈవేళ మృణాలక్క చేసినదాన్ని పల్లెటూరులో అవమానపరచడం అనిఅంటారా? అనరా?" అంది. మహిముడు అయితే ఈప్రశ్నవల్ల నువ్వు అడగదలుచుకున్నదేమిటి?" అన్నాడు. అచల ముందు నే నడిగినప్రశ్నకి సమాధానం చెప్పండి! దాన్ని ఏమంటారు అంది. మహిముడు "సరే! పోనీ అల్లాగే"—అని సగంసగంలో ఊరుకున్నాడు. అచల చటుక్కుని మధ్యని అందుకుని "పోనీ ఏమిటి? నేనడిగినదానికి తిన్నగా సమాధానంచెప్పండి!" అంది. మహిముడు "అవును! దీన్ని పల్లెటూరులో అవమానంచెయ్యడంఅనేఅంటారు" అన్నాడు.

అచల "అంటారా? అయితే అన్నీ తెలిసికుండే నాకీవిధంగా అవమానం చేయించారు! ఆవిడ నాచేతిఅన్నం తినదని మీకుతప్పకుండా తెలిసేవుంటుంది. అవునా? కాదా?" అని, మహిముడికేసి గుండెల్లోకి దూసుకునిపోయేటట్లు చూసింది. మహిముడు పూర్వం మోన్తరుగానే మతిపోయినట్లు అల్లాగే చూస్తూనుంచున్నాడు. అతని నోటమ్మట ఒక్కమాటైనా ఊడిపడలేదు!

సరీగ్గా ఈసమయానికి "మహిమా! ఎక్కడున్నావోయ్" అని సురేశుడు గట్టిగా వేసిన కేక వినబడింది.

౧౬

"ఇదేమిటోయ్! సురేశా! ఎప్పుడు వచ్చావు! లోపలికిరా! అంతా కులాసాగా ఉన్నారా! అనే మహిముడిస్వాగతవాక్యాలు పూర్తికాకమునుపే సురేశుడు లోపలికివచ్చి నుంచున్నాడు. ఆపైన చేతిలో ఉన్న సంచి కిందపెట్టి "ఆ ఆ! అంతా కులాసాగాఉన్నారు! అయితే ఆదేమిటి! ఒంటరిగా నుంచున్నావు! అచల ఒక్కక్షణంలో నచల

అయి ఇంతట్లోనే అంతర్థానం అయిపోయిం దేమిటి? ఆవిడ రహస్యపుమాటలు నాకు నడివీధిలోకే వినబడ్డాయి! అందుచేతే నాకు మీ యిల్లు తెలిసింది!" అన్నాడు.

అసలు అచల చిట్టచివర గట్టిగాఅన్న మాటలు వీధులోకి వినబడ్డాయి. ఆమాటలు సురేశుడి చెవిని పడ్డాయి. అంచేత సురేశుడు "మహిమా! చదువుకున్న పిల్లని పెళ్లాడ్డం వల్ల ఎన్ని ఉపయోగా లున్నాయో తెలిసిందా! నాలుగురోజు లయిందో లేదో, అప్పుడే పల్లెటూరివాళ్ళ సరాగాలపద్ధతి గ్రహించింది. ఇప్పుడు పల్లెటూరివాళ్ళుగూడా ఈవిడకి ఈవిష్యంలో సరిపో రనుకుంటాను!" అన్నాడు.

వల్లమాలినసిగ్గువల్ల మహిముడి ప్రాణం చచ్చిపోయింది. అతను కిక్కురుమనకుండా మాట్లాడకూరుకున్నాడు. సురేశుడు గదిలోకి చూసి అచలని ఉద్దేశించి మళ్ళీ "ఒదినా! మంచి అసమయంలో వచ్చి రసభంగం కలిగించాను! ఇందుకు నన్ను క్షమించాలి! ఏమిటి? మహిమా! అల్లాగ నిలబడిపోయావు! కాస్త కూర్చోడానికి ఎక్కడైనా చోటుందేమో కూర్చుందామురా! అదేపనిగా నడవడం మూలాన్ని కాళ్ళు లాక్కుపోతున్నాయి. వెతికి మంచిచోట కట్టావులే! ఇల్లు. నడు! కలకత్తాపోదాము!" అన్నాడు.

మహిముడుకూడా 'రా' అనిచెప్పి కూర్చోడానికి అతనితో కలిసి వీధిసావిట్లోకి వెళ్లాడు. సురేశుడు అక్కడకూర్చుంటూ "ఏం ఒదిన నాకుకనబడదా? ఏమిటి! అప్పుడే పరదాపద్ధతి మొదలుపెట్టిందా?" అన్నాడు. మహిముడు జవాబుఇచ్చేలోపుగానే పక్కతలుపు తెరుచుకుని అచల లోపలికివచ్చింది. ఆమె ముఖంమీద దెబ్బలాటనగుర్తే కనబడలేదు. ఆమె నమస్కరించి నవ్వుముఖంతో ఈవేళ మీరు రావడంవల్ల మాకెంతో సుదినం అన్నమాట! ఇంతఅకస్మాత్తుగా

ఎల్లావచ్చారు?" అంది.

నవ్వుతో కలకల్లాడుతూన్న ఆమెముఖం చూసేటప్పటికి అతనికి అచల ఎంతో సుఖపడుతూందని అనిపించిది అల్లాగ "ఆమెమహిముడితో సుఖంగా కాపరం చేస్తూంది" అని అనుకునేసరికి అతని మనస్సులో అసూయాగ్నిహర్మ్యత్రం భగ్గుమని మండింది. అతను చెయ్యెత్తి ప్రతినమస్కారంచేసి "ఇల్లాగ అకస్మాత్తుగా రావడం మంచి పని కాదని ఇప్పుడు నా కనిపిస్తోంది. అయితే ఏమిటీ ఇదంతాను? ఇదే మొట్టమొదటి దెబ్బలాటా? లేకపోతే వచ్చినప్పటినించీ ఇల్లాగే ఉన్నారా?" అనిఅడిగాడు.

అచల ఆవిధంగానే నవ్వుతూ "ఏదివింటే మీకు కోవసంతోషంగా ఉంటుంది? రెండోదేనా? అల్లాఅయితే ఆవిధంగానే సమాధానం చెప్పాలి" ఇంటికి వచ్చిన అతిథిమనస్సు కష్టపెట్టడం మంచిది కాదు అంది. ఆమాటమీద సురేశుడిముఖంలో గంభీరభావం కనబడింది. అతను ఎరవన్నారు!—మనస్సు కష్టపెట్టాకూడదని! గృహిణికి కలిగే అనుభవమే అది. అందుచేత ఇదే ఆమెచేసేపని" అన్నాడు. అచల నవ్వుతూ "గృహమే లేనప్పుడు గృహిణి ఎక్కడినించి వస్తుంది? మా లాంటి దురదృష్టవంతుల ఇంట్లో మీకీరాత్రి ఎల్లాగడుస్తుందా? అని నేను బాధపడుతున్నాను. అయితే ఇవన్నీ తెలిసిఉండీకూడా మీ రిక్కడికివచ్చారు? చాలా అదృష్టవంతులు!" అంది. ఆపైన భర్తముఖం కేసి చూసి "అయితే ఒకసారి నయనబాబుగారిచేత చెప్పిస్తే చంద్ర బాబుగారిఇంట్లో కాస్త ఈవేళరాత్రి పడుకోడానికి ఏర్పాటు చేయించ వచ్చునా! వారియిల్లు శుభ్రమైనఇల్లు. కాస్త కూర్చోడానికీ పడుకో డానికీకూడా అక్కడ బాగా విశాలంగా ఉంటుంది. ఏవిధమైన ఇబ్బందీ ఉండదు!" అంది.

స్నేహపూర్వకంగా వాళ్ళిద్దరూ మాట్లాడుకొంటూన్న మాటల వల్ల మహిముడికెంతో కష్టంకలిగింది. అయితే ఈసంభాషణ

ఆపడం ఎల్లాగో అతనికి బోధపడలేదు! పాపం! అతను ఇల్లాగ అను కుంటూంటే సురేశుడే దానికి ఎల్లాగో అల్లాగ దారిచూపించాడు. సురేశుడు రెండుచేతులూ జోడించి "ఒదినా! నేనొక పొరబాటుచేశాను. శాస్త్రలోపల ఇంత టీ పడినతరవాత మీరు నన్ను నయనబాబుగా రింటికి పంపించినా సరే! చంద్రబాబుగారింటికి పంపించినా సరే! సరే, దానిసంగతి అనలు అల్లాగ ఉండనీయుండి! మహిమా! ఈఇంటిమీద ఇంత ఇష్టంఉన్నప్పుడు, సంతోషంకూడా తప్పకుండా ఇక్కడుంటేనే కలుగుతుంది" అన్నాడు.

ఆమాటకి మహిముకిబదులు అచలే సమాధానం చెప్పింది. ఆమె నవ్వుతూ "సంతోషపడడం పడకపోవడం అనేది మనిషిచేతుల్లోనే ఉంది. అదీగాక ఇది మా మామగారిఇల్లు, దీనిమీద యిష్టంలేకుండా మరో జమిందారుఇంటిమీద ఇష్టం కలగడం అస్వాభావికము. సరేలెండి! ముందుశాస్త్ర టీ పడితేనేగాని వ్యవహారం నడిచేట్లాకనబడడం లేదు. ఆశాస్త్రటీ, తాగితే ఒంట్లో శాస్త్ర కులాసాగా ఉంటుంది. ఆపైన మిగిలినసంగతులు చూసుకోవచ్చును. నేను ఇప్పుడే టీకి నీళ్లు పెట్టమని చెప్పివచ్చాను. ఇంక ఒక్క అయిదునిమిషాల్లో మీకు టీ తయారుచేసి యిస్తాను. అంతవరకూ ఒకచోట కూర్చుని శాస్త్రవిశ్రాంతి తీసుకోండి" అనిచెప్పి నవ్వుతూ అక్కడినించి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళివెళ్ళడంతోనే సురేశుడిహృదయంలో అగ్నిజ్వాల భగ్గుని మండినట్లయింది. ఇన్నాళ్ళనించీ సురేశుడు "నాకు చాలా మానసిక దౌర్బల్యం ఉంది. నాబుద్ధికూడా చాలాచంచలమైనది" అని అనుకుంటూ ఉండేవాడు. అల్లాగ అనుకోడంమూలాన్ని అతని మనస్సుకెప్పుడూ సంకోచంగాని బాధగాని కలగలేదు. చిన్ననాటిస్నేహితులు అతన్ని మహిముడితోపోల్చి "సురేశుడెప్పుడూ భావనాలోకంలో నివసించే మనిషి" అని అంటూండేవారు. అల్లాంటప్పుడు సురేశుడు లోలోపల

ఎంతో ఆనందించి "పిళ్ళందరూ అనేమాటలు నిజమే. నేను అనుకున్న పని ఒకటీ చివరదాకా నెగ్గించలేను మనస్సు ఎల్లాగ తీసుకువెడితే అల్లాగే నెడుతూంటాను. కాని నామనస్సు చాలామంచిది. పిచ్చపని నేనెప్పుడూ చెయ్యలేను. ఆదాయాన్ని బట్టి ఖర్చు పెట్టుకోవడం ఎల్లాగో నాకు తెలియదు. దానంచేసేటప్పుడుకూడా నేను పాత్రాపాత్రవిచారణ చెయ్యలేను. మనస్సులో జాలిపడితే కట్టుకున్న బట్టలు ఇచ్చివెయ్యడానికికూడా సందేహించను" అని అనుకుంటూ ఉండేవాడు అతన్ని గురించి ఎవరు ఏవిధంగా అన్నా అతను ఒకర్ని ద్వేషించాడనిమాత్రం ఎవరూ అనలేరు. ఇంతేకాదు అతను కేవలం స్వార్థంకోసం చెయ్యగూడనిపని చేశాడనికూడ ఎవరూ అనలేదు. హృదయానికిసంబంధించిన వ్యవహారాల్లో బద్ధకస్థుడని అతన్ని అందరూ అంటూంటారు. ఆవిషయంకూడా నిజమేనని అతనినమ్మకము. అల్లాంటిసురేశుడు అచలవిషయంలో చివరిక్షణంలో తనకికలిగిన ఆత్మనిగ్రహం తలచుకుని ఎంతో ఆనందించాడు. తనకింత శక్తి ఉందని అనుకునేటప్పటికి అతనికెంతో గర్వంకూడా కలిగింది. అచలవివాహం అయిన రెండుమూడు రోజులతరువాత అతను నేను కేవలం ఇంద్రియనిగ్రహం లేనివాణ్ణే అని అనుకున్నాను; గాని అవి పెద్దపొరబాటు అవసరంవస్తే నాస్నేహితుడూ అతని భార్యాకూడా "స్నేహధర్మంలో ఉండే మహత్త్వమూ, ఒకస్నేహితుడు మరొకస్నేహితుడికోసం చేసే ఆత్మత్యాగమూ ఎల్లాంటివో తెలుసుకోవాలి" అని అనుకున్నాడు.

కాని ఆత్మ వంచన ఆట్టేకాలందాకా నిలబడదు. అతను తనకి ఆత్మనిగ్రహం ఉందని అనుకోవడం కేవలంభ్రమ! అతనికి ఉన్నది ఆత్మవంచన ఒక్కటే! అచల వివాహం అయి ఒకవారంరోజులు గడిచిందో లేదో అప్పుడే అతనిహృదయంలోంచి ఆ ఆత్మనిగ్రహం కాస్తా ఎగిరి చక్కాబోయింది. ఆ ఆత్మవంచనకి ఫలితం ఆది. అతని హృదయం క్రమక్రమంగా సంకుచితమయింది. అతనికి మాతృ

మాటికీ ఈ స్వార్థత్యాగంవల్ల నాకేమిటిలాభం? నేను ఇన్నాళ్ళనుంచీ దీన్ని పట్టుకుని ఊరికే వేళ్ళాడుతున్నాను!" అనిఅనుకున్నాడు. ఒకసారి అతనికనతల్లి "నాయనా! ఈపాటికి నువ్వో కోడలిని తీసుకువస్తేనే గాని నేను ఈసంసారం ఈదలేను!" అంది.

బ్రహ్మసమాజానికి వెళ్లి వచ్చేదారిలో ఒకనాడూ సురేశుడూ కేదారబాబూ కలుసుకున్నారు. ఈవేళ కేదారబాబు తనుచేసినపని మంచిది కాదన్నసంగతి ఒప్పుకున్నాడు. మహిముడికి పిల్లనిచ్చి పెళ్ళిచెయ్యడం తన కిష్టం లేదనిన్నీ, సురేశుడు మాట్లాడ కూరుకోడం వల్ల అల్లా చెయ్యవలసి వచ్చిందనిన్నీ చెప్పి కేదారబాబు బాధ పడ్డాడు. ఇంటికి వచ్చినతరవాత సురేశుడికి మనస్సులో "ఈవివాహంవల్ల ఎవ్వరూ సుఖపడకూడదనిన్నీ, తనపరిస్థితులు గమనించకుండా వివాహంచేసుకొన్నందుకు మహిముడికికూడా తగినశాస్తి కావాలనిన్నీ, అచలకూడా దీనివల్ల యమయాతన అనుభవించాలనిన్నీ అనిపించింది. దీన్నిబట్టి సురేశుడిమనస్సు నీచమయిందని మనంఊహించుకోకూడదు. ఇల్లాంటి దుష్టాలోచనలు కలగకుండా అతను తన కనేకసార్లు బుద్ధిచెప్పుకున్నాడు. కానియమయాతన అనుభవిస్తూన్న అతనిహృదయం ఏమిచేసినా దారికిరాలేదు. మంకుపట్టిన పిల్లవాడిలాగ అస్తమానమూ అసంగతే రెట్టిస్తూ కూర్చుంది. ఈవిధంగా అతనొక్క నెలరోజులు గడిపాడు. చివరికి ఒకనాడతనికి మహిముడూ అచలా ఎల్లా ఉన్నారో చూడాలని బుద్ధిపుట్టింది. ఎంతప్రయత్నించినా ఆ కుతూహలం ఆపలేక చివరికి అతనొకసంచీలో బట్టలూ అవీ సర్దుకుని మహిముడిఇంటికి వచ్చాడు.

సురేశుడు స్నేహితుడుకేసి చూసి "మహిమా నే నన్నసంగతి నిజం అవునో కాదో నీ కిప్పుడు బాగా తెలిసిందా?" అన్నాడు. మహిముడు "నువ్వనేది ఏసంగతి?" అన్నాడు. సురేశుడు సర్వజ్ఞుడిలాగ

"నేను పల్లెటూరివాణ్ణి కాదు! కాని ఇక్కడివ్యవహారాలన్నీ నాకు తెలుసును! పల్లెటూరివాళ్ళతో నీకొక పెద్దచిక్కే గాదా వస్తుందని నేను మొట్టమొదటనించీ చెప్పడంలేదూ?" అన్నాడు. మహిముడు అతిశాంతంగా "అవును! చెప్పావు కాని అల్లాంటిదేదీ రాలేదే!" అన్నాడు. సురేశుడు "పెద్దదెబ్బలాట ఏంకావాలి! నీకింట్లో ఎవరైనా విస్తరివేశారా? ఇదిఒక పెద్దతలవంపు కాదూ!" అన్నాడు మహిముడు "నేనెవర్నీ భోజనానికే పిలవలేదు" అన్నాడు. సురేశుడు "పిలవేలేదా! సరే పోనీ ఆఖరికి నన్నైనా గృహప్రవేశానికి పిలవలేదేం!" అన్నాడు. మహిముడు "అసలది జరగలేదు! అందుచేత నిన్ను పిలవలేదు!" అన్నాడు. సురేశుడు ఆశ్చర్యంతో "గృహప్రవేశం జరగలేదూ? సరే! అయితే మీఅందరికీ ఇక్కడ—ఈవిధంగా ఈబాధలన్నిటినించీ ఎంతకాలం తప్పించుకోగలవు మహిమూ! మంచివస్తూంటుంది, చెడ్డవస్తూంటుంది, పిల్లలకి కార్యాలూ, కరాలూ వస్తాయి. సంసారంఅన్నాక ఏదోఒకటి వస్తూనేఉంటుంది. నేనుచెప్పేదేమిటంటే—" అనిఇంకా ఏదో అనబోయాడు.

ఇంతటిలో యమున చేతిలో టీసామానులన్నీ పెట్టి తనచేత్తో ఒక చిన్నకూజా పట్టుకుని అచల అక్కడికివచ్చింది. సురేశుడు చివర అన్న మాటలు ఆమెచెవిని పడ్డాయి; కాని ఆమెముఖచిహ్నాలనిబట్టి ఆమెకీ మాటలేవీ వినబడలేదనుకున్నాడు. స్నేహితు లిద్దరూ టీతాగి ఆపైన మంచినీళ్ళు తాగారు. మహిముడు ఒకదుప్పటీ మెడమీద వేసుకుని ఎక్కడికో వెళ్ళడానికి సిద్ధంగానిలబడ్డాడు. ఆపల్లెటూరి జమిందారు ఒక మహమ్మదీయుడు. మహిముడు ఆజమిందారుకొడుక్కి ఇంగ్లీషు చెబుతున్నాడు. జమిందారు అట్టే చదువుకున్నవాడు కాదు. అయినా స్వతస్సిద్ధంగా ఆయనఉదారుడు. మహిముడిమీదకూడా అతనికి చాలామంచి అభిప్రాయముఉంది. అందుచేత పల్లెటూళ్లో ఉన్నవాళ్ళెవళ్ళకీ అతన్ని ఇబ్బందిపెట్టడం సాధ్యంకాకపోయింది.

అచల "ఈవేళ పాఠంమానెయ్యడానికి వీల్లేదా?" అని అడిగింది. మహిముడు "ఎందుకు? అన్నాడు. అచల హృదయం నిర్మలమైనదే! కాని ఇంతకుపూర్వం జరిగినదాన్ని బట్టి ఆ మనస్సుకి కొంచెం సంకోచం కలగడంలో ఆశ్చర్యంలేదు! ఈమాత్రం సంకోచం ఏస్త్రీకైనా కలిగితే! అచలకి సురేశుడిసంగతి బాగా తెలుసును! సురేశుడు మహానుభావుడే కావచ్చును! కాని ఆవేశం వచ్చినప్పుడుమాత్రం అతన్ని నమ్మడానికి వీల్లేదని అచల ఎరుగును! అందుచేత ఒకవిధంగాఅతనంటే ఆమెకిభయమే! ఆ కారణంవల్ల మహిముడు సాయంత్రం వేళ తనని ఒక్కత్తినీ విడిచివెడతాడంటే ఆమె ఎంతో కంగారుపడింది. కాని ఆభయం ఏమీ పైకి కనబడనియ్యకుండా ఆమె "బాగుంది! ఇల్లాంటిది ఎక్కడైనా ఉందా? ఇంటికివచ్చిన స్నేహితుణ్ణి ఒంటరిగా విడిచిపెట్టి—" అని ఏదో అనబోయింది. మహిముడు దీనివల్ల అతిథి సత్కారాని కేమీ లోపంరాదు. అదీగాక, నువ్వు ఉండనే ఉన్నావు—" అని నగంలో ముగించాడు.

అచల కొంచెం సందేహిస్తూ "నేను కూర్చోడానికి వీల్లేదు" అంది. ఆపైన సురేశుడికేసి తిరిగి "మావంటబ్రాహ్మడు చాలా గట్టివాడు. ఆయనతో అస్తమానమూ కూడా కూడా తిరిగి వంట చేయించాలి! లేకపోతే ఒక్కవస్తువైనా మనం నోట్లోపెట్టుకోలేము! నేను చెబుతున్నాను. అయినా నామాట—అని ఏదో చెప్పబోయింది. మహిముడు "వీల్లేకు! ఈవేళ పాఠంమానడానికి వీల్లేదు? అంతాకలిసి రెండుగంటలకంటె ఎక్కువపట్టదు?" అని అక్కడే మూలనున్న ఒకచేతికర్ర తీసుకుని, వీథిలోకి వెళ్ళిపోయాడు.

మహిముడికి ఒక్కరోజు పాఠం మానినంతమాత్రాన్ని కొంప మునిగిపోయే దేమీలేదు. అందుచేత ఇంత చిన్నవిషయాన్ని గురించి మాటిమాటికీ బలవంతపెట్టడానికి అచలకి సిగ్గేసింది. ఇల్లా మాటి

మాటకీకి బలవంతపెడితే ఉన్నవిషయంపమిటో సురేశుడికి తెలిసిపోతుం దేమోననిన్నీ, ఆమె భయపడింది.

మహిముడు పూర్తిగా వీథులోకి వెళ్ళిపోయేదాకా ఆని సురేశుడు నవ్వుతూ "మీారననవసరంగా ఎందుకు బాధపడతారు? నేనతన్ని మొదటి నించీ ఎరుగుదును. అతనెప్పుడూ ఒకళ్ళమాట చెవినిపెట్టడు. మీారు నాకోపుస్తకం పంపించి మీావనిమీాద మీారు వెళ్ళండి. నేనది చదువు కుంటూ కులాసాగా కాలక్షేపంచేస్తాను" అన్నాడు.

ఆమాటలు వింటూంటే అచల మనస్సుకెంతో కష్టంగావుంది. నిజం చెప్పవలిసివస్తే ఆమెమాట మహిముడెప్పుడూ వినలేదు. అది మహిముడిలోపమేకావచ్చును. లేకపోతే అపఅతని సుగుణంకావచ్చును. ఏమైనా సురేశుడీమాటలనడంవల్ల అచలమనస్సు కెంతోబాధ కలి గింది. ఆమె సురేశుడన్నమాటకి ఏమీా సమాధానంచెప్పకుండా తనగదిలోకి వెళ్ళి, యుంచువుచేత సురేశుడికి ఒకపుస్తకం పంపించింది.

ఎంతోరాత్రి గడిచినతరవాత మహిముడింటికివచ్చి, నిద్రపోవ డానికి వెడుతూ అచలతో "సురేశుడు ఎంతకాలం ఉంటాడో నీతో చెప్పాడా?" అన్నాడు. అసలే అచలకి పొద్దుటినించీ అనేకకారణాల వల్ల మహిముడిమీాద కోపంగావుంది. ఆపైన ఆమె అతనువేసిన ప్రశ్నకి పెడర్థం తీసింది. అందుచేత అతనిమీాద భగ్గుని మండిపడి కలినంగా "అంటే మీాఅభిప్రాయం ఏమిటి?" అంది. మహిముడా మాటమీాద స్తబ్ధాంతపడిపోయాడు. అనలు అతను ఏదురుద్దేశ్యం తోనూ ఈప్రశ్న అడగలేదు! ఊరికే సామాన్యంగానే అడిగాడు. మహిముడింతసేపటినించీ స్నేహితుడితో ఏవేవో కబుర్లుచెబుతూనే ఉన్నాడు. కాని అతన్ని ఈవిషయం అడగలేకపోయాడు. సురేశుడు కూడా అతనిదగ్గిర ఆప్రస్తావన ఎత్తలేదు; కాని సురేశుడు తప్పకుండా ఈవిషయం అచలతో చెప్పిఉంటాడని అతననుకున్నాడు.

మహిముడు మాట్లాడకూరుకోవడం చూసి అచల చటుక్కుని “ఈప్రశ్నకి అర్థం ఏమిటో సులభంగానే తెలుస్తూంది. మీరు చెప్పలేకున్నారేమో! సురేశబాబు మనస్సులో ఏదో పెట్టుకుని ఇక్కడికి వచ్చారనిన్నీ, ఆపని పూర్తికావడానికి ఎన్నిరోజులు పడుతుందో నాకు తెలుసుననిన్నీ మీరనుకుంటున్నారు! ఇంతేనా?” అంది. మహిముడు ఆతరవాత కొంతసేపటిదాకా ఏమీఅనకుండా ఊరుకుని మృదువుగా “నా మనస్సులో ఏమీలేదు. అయితే మృణాల మాటల మూలాన్ని పొద్దుటినించీకూడా నీమనస్సు బాగాలేదు. ఏమాటన్నా నీకు తిన్నగా బోధపడడంలేదు! ఈవేళకి నిద్రపో! ఈవిషయాలన్నీ రేపు మాట్లాడుకోవచ్చునులే!” అని చెప్పి,అతను పరుపుమీద పడుకుని, పక్కకితిరిగి నిద్రపోవడానికి ప్రయత్నించాడు.

అచలకూడా పడుకుంది; గాని ఆమెకి ఎంతకీ నిద్రపట్టలేదు! ఈవేళ పొద్దుటినించీ ఆమెకు మహిముడిమీద, విరక్తిభావం కలిగి, క్రమ క్రమంగా వృద్ధిపొందింది. ఏదైనా సామాన్యమైన కారణంవల్ల గట్టిగా దెబ్బలాడడానికి అవకాశం దొరికివుంటే ఆమె మనస్సుకి శాంతి కలిగి ఉండును; కాని ఆమెకల్లాంటిఅవకాశం ఏమీ దొరకకపోవడంమూలాన్ని మాట్లాడ కూరుకోవలసివచ్చింది. అందుచేత ఆమె ఆకోపంపట్టలేక లోలోపల రాజుకుంది. ఆపైన చదువూసంధ్యాలేని సామాన్య స్త్రీలలాగ ఏదో గిల్లికజ్జాపెట్టి లోపల ఉన్నదంతా వెళ్ళబుచ్చుకుంటే బాగానేఉండును! కాని ఆమెఅల్లాంటి నైచ్యానికి ఒడిగట్టలేకపోయింది. అందుచేత ఆమెమనస్సులో తనభర్తనొకప్రతికక్షిగా నిలబెట్టి ఆతనితో నువ్వంటే నువ్వని దెబ్బలాడినట్లు భావించుకుంది. ఆకారణంచేత ఆమెకు చాలారాత్రి గడిచినదాకా నిద్దరేపట్టలేదు! ఆబాధ భరించలేక ఆమె పరుపుమీద అటూఇటూ దొర్లింది.

ఆమె కొంతసేపు అల్లాగ ఉండి, కళ్లుతెరిచి, రుసరుసలాడుతూ

లేచింది. ఇవతలికి వచ్చి, చూసేటప్పటికి యదువు టీకాచేగిన్నె చేత్తో పుచ్చుకుని వంటఇంటివైపు వెడుతున్నాడు. వాణ్ణి దగ్గిరికిపిలిచి "బాబుగారేమైనా చెప్పివెళ్ళారా;" అనిఅడిగింది. యదువు "గ్రామపొద్దెక్కినతరవాత ఇంటికి వస్తామని చెప్పివెళ్ళారండి." అన్నాడు. మహిముడు సామాన్యంగా చీకటి తోటే లేచి పొలం పనులు చూసుకోడానికి వెడుతూఉంటాడు. ఒక్కొక్కప్పుడు అతను తిరిగి వచ్చేటప్పటికి రెండుఝాములుకూడా అవుతూ ఉంటుంది.

అచల "కొత్తగావచ్చిన బాబుగారు లేచారా!" అనిఅడిగింది. యదువు "లేవకపోవడ మేమిటి అమ్మా! నన్నాయనే టీ చెయ్యమన్నారండి" అన్నాడు.

అచల తొందరగా స్నానంచేసి చీరకట్టుకుని వీథిసావిడిదగ్గిరికి వెళ్లింది. అప్పటికప్పుడే సురేశుడు స్నానంచేసి ఆఇంటి కిటికీలూ తలుపులూ తెరిచి నిన్నటి పుస్తకం పుచ్చుకుని ఆ తెరిచిన తలుపుదగ్గిరగా కుర్చీమీద కూర్చుని చదువుకుంటున్నాడు. అచలకాళ్ళచప్పుడువిని అతను కళ్ళెత్తి అచల కేసిచూశాడు. ఆమె ముఖంమీద రాత్రిఅంతా మేలుకున్న చిహ్నాలన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆమె కళ్లకింద నల్లని రేఖలు కనిపించాయి. చెంపలు తెల్లగా సఫేదులాగ మారిపోయాయి. దవుడలు కూడా నల్లబడ్డాయి. అల్లా చూస్తూఉన్నంతసేపూ అతనికళ్ళల్లో ఈర్ష్య అగ్నిజ్వాలలా భగ్గునమండింది. అత నెంతకీ ఆముఖంమీదనించి కళ్ళని కిందకి దింపలేకపోయాడు. అతనిచూపులవాలకం చూసి అచల ఎంతోఆశ్చర్య పడింది. కాని ఆచూపుల కర్థమేమిటో తెలుసుకోలేకపోయింది. ఆపైన "ఎప్పుడు లేచారు! నే నీవేళ లేవడం కొంచెం ఆలస్యం అయింది" అంది.

"అవునల్లాగే కనిపిస్తూంది" అని చెప్పి, సురేశుడు ముఖం పక్కకి తిప్పుకున్నాడు. ఆపక్కగోడమీద చాలాకాలంనాటి అద్దంఒకటి

వెళ్ళాడుతూంది. సరిగ్గా అప్పుడే అచలదృష్టికూడా దానిమీదపడింది. ఇప్పుడామెకు ఒకక్షణంలో సురేశుని చూపుల కర్థమేమిటో తెలిసిపోయింది! తనముఖం వెలవెలబోతూన్నట్లుగాని తెలుసుకొని. ఆమె చిన్న బుచ్చుకుంది. తనముఖం అతనికి కనబడకుండా చెయ్యటం ఎల్లాగా అని పరిపరివిధాల ఆలోచించింది. ఎంతసేపటికీ ఏమీతోచక చటుక్కునిఇవతలికి వచ్చేసింది. వస్తూ, వస్తూ "ఇదుగో! నేనువెళ్ళి మీకు టీ పట్టుకువస్తాను" అంది. దానికి సురేశుడేమీ సమాధానంచెప్పలేదు. ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి ఆకాశంకేసి చూస్తూ అల్లాగే కూర్చుండిపోయాడు. ఒకపదినిమిషాలతరవాత టీసామానులు పట్టుకుని అచల తిరిగివచ్చేటప్పటికి, సురేశుడు కాస్త మనస్సు కుదుటబరుచుకున్నాడు. అచల తెచ్చియిచ్చిన టీ తాగుతూ తాగుతూ సురేశుడు మీరు తాగలేదూ!" అన్నాడు. అచలనవ్వుతూ "నేనిప్పుడు తాగను" అంది.

"ఎందుకు తాగరు?

"ఈవేళ ఒంట్లో బాగుండలేదు. అదీగాక ఇది చాలా వేడిప్రదేశము. టీ తాగితే నిద్రపట్టదు నిన్న ఇంచుమించుగా రాత్రిఅంతా నిద్రపట్టలేదు." అని, ఆపైన మళ్ళీనవ్వి "ఒకరాత్రి నిద్రపట్టకపోయేటప్పుడికి ముఖంఅంతా మొద్దుబారినట్లుంటుంది. నలుగురికీ కనబడడానికికూడా సిగ్గుగాఉంటుంంది" అంది. ఆపైన సిగ్గుపడుతూ మెల్లిమెల్లిగా నవ్వింది. సురేశుడు కొంతసేపటిదాకా మాట్లాడకూరుకుని "అయితే మీకు చిన్నప్పటినించీ టీతాగేఅలవాటుందిగా! సుహాసుడు మిమ్మల్ని తాగమని బలవంతపెట్టడూ!" అన్నాడు. అచలనవ్వి "బలవంతపెడితే మాత్రం వినే వారెవరు! అదీ గాక ఈ కాస్తటీ తాగకపోతే రోజు వెళ్ళదా!" అంది.

సురేశుడు ఆమెనవ్వులో ఏదో బాధ ఉందని కనిపెట్టాడు. ఆపైన మళ్ళీ ఒక్కనిమిషం ఆగి ఏదోప్రస్తావన మొదలుపెట్టి "ఉపోద్ఘాతం

చెప్పి ఆపైన "మాట్లాడటం నాకు చేతకాదని మీకు తెలుసును గదా? అందుచే మిమ్మల్ని ఒకటిరెండు విషయాలు అడగాలని అనుకుంటున్నాను. మీకేం కోపం రాదుగదా?" అన్నాడు. అచల నవ్వు ముఖంతో "బాగానే ఉంది! నాకు కోపం ఎందుకు వస్తుంది? అంది. సురేశుడు "సరే! అయితే అడుగుతాను. మీకిక్కడ సుఖంగా ఉందా?" అన్నాడు.

అచల నవ్వు ముఖం ఎర్రబడింది. ఆమె "ఇల్లాంటి మాట అడగడం మీకు న్యాయం కాదు!" అంది.

"ఎందుకు కాదు?"

అచల మెడతిప్పి "మీ మనస్సులో నేను సుఖపడటం లేదని అనుకోవటం కూడా—" అని సగం సగం అని ఊరుకుంది. సురేశుడు మాడిపోయిన ముఖంతో ఒక చిన్న నవ్వు నవ్వి "మనస్సులో ఆలోచన బయలుదేరినప్పుడు న్యాయాన్యాయ విచారణ జరుగుతుందా? ఒక్క రెండునెలల పూర్వం ఈ విషయాలన్నీ ఆలోచించడానికి నేనే అర్హుణ్ణి! ఇంతేగాదు! ఆ విషయాలనిగురించి ఆలోచించడానికి నాకొక్కడికే అధికారం ఉండేది. ఇప్పుడు రెండునెలలయ్యేసరికి ఆ అధికారం అంతా ఎగిరిపోతే పోనియ్యండి! నేను దానికి ఏమీ అనను? ఇప్పుడు నాకు అసలు సంగతేమిటో తెలుసుకోవాలని కోరిక కలిగింది! అంతే నేనిక్కడికి వచ్చినప్పటినించీ ఒక్కొక్కప్పుడు నేను ఓడిపోయా ననిపిస్తుంది. ఒక్కొక్కప్పుడు నేనే జయించా ననిపిస్తుంది! నా విషయం మీకు తెలియనిది ఏమీ లేదు గదా! అసలు సంగతేమిటో ఒక్కసారి చెప్పండి!" అన్నాడు.

అచలకి కన్నీళ్లు లోలోపలనుంచి పైకి పొంగివచ్చాయి. అయినా తన శాయశక్తులా వాటిని ఆపుకుని చటుక్కుని మెడపక్కకితిప్పి "నేను సుఖంగానే ఉన్నాను." అంది. సురేశుడు "అయితే బాగానే ఉంది" అన్నాడు. ఆతరవాత ఇద్దరికీ కూడా మాట్లాడడానికి ఏమీ కనపడలేదు. ఒక్క నిమిషం ఉన్నతరవాత సురేశుడు ఒక్కసారిగా ఉలిక్కి

పడి "అన్నట్టు ఇంకో ప్రశ్న ఉంది. మీకోసం నేనెంత బాధపడ్డానో మీ కెప్పుడైనా—" అని సగం సగం అనిఊరుకున్నాడు. అచల రెండు చెవుల్లోనూ వేళ్లుపెట్టుకొని "క్షమించండి! ఈవిషయాలేవీ నన్నడగ వద్దు!" అంది.

సురేశుడు ద్వారానికి రెండుచేతులూ అడ్డంగాపెట్టి "కాదు! నా వల్ల కాదు! నేను క్షమించలేను. నేనుచెప్పేమాటలు మీరు వినితీరాలి!" అన్నాడు. అచల ఇంతకుపూర్వము అతని కళ్లల్లో ఒకవికృతమైనదృష్టి చూసి ఎంతో భయపడింది. ఆమెకుమళ్లీ ఇప్పుడతనికళ్ళల్లో ఆచూపే కనబడింది. అందుచేత అచల కొంచెంభయపడి వెనక్కితగ్గి "అయితే అడగండి!" అంది. సురేశుడు "మీ రేమీ భయపడనక్కరలేదు. మీవంటిమీద నేను చెయ్యివెయ్యను. ఇంతవరకూ నా కామాత్రం జ్ఞానం ఉంది! అన్నాడు! ఆతరవాత వెనక్కివెళ్లి ఒకకుర్చీమీద కూర్చుని మీమీద నాకధికారం అంతాపోయినా నా మీదమాత్రం మీ కధికారం పోలేదు. ఈమాటవక్కటీ జ్ఞాపకం ఉంచుకోండి!" అన్నాడు.

అచల ఆమాటకి అంగీకరించక "ఈమాట జ్ఞాపకం ఉంచుకోవడం వల్ల నా కేమీలాభంలేదు. కాని—" అనిఅతనికేసి చూసింది. ఆమాట అనగానే అతనిముఖం ఒక్కక్షణంలో నల్లబడిపోయింది. అందుచేత అతనికికూడా ఎంతో పశ్చాత్తాపం కలుగుతుందని ఆమెగ్రహించుకుంది. ఆపైన ఆవిధంగా ఒక్కనిమిషంఉండి మృదువైన కంఠస్వరంతో "సురేశబాబూ! ఈమాటలన్నీ వినడం నాకుపాపము. మీకు కూడా ఇల్లాంటి ప్రశ్నలడగడం ధర్మంకాదు! ఈవిషయాల్ని గురించి ప్రస్తావించి నన్నెందుకు బాధపెడతారు!" అంది. సురేశుడామెముఖం కేసినిశ్చలంగా చూసి 'మీరునిజంగా బాధపడుతున్నారా!' అన్నాడు. ఆమాట మీద అచలనోటిలోనించి "నేనేం నల్లరాయినా!" అనేమాట ఛటుక్కుని జారింది.

సురేశుడుమాత్రం అచలముఖంమీదనించి తనదృష్టి మరల్చలేక పోయాడు. అచల నేలకేసి చూస్తూకూర్చుంది. సురేశుడు ఒక్కనిమిషం ఉండి మెల్లిగా "చాలు! నాజన్మ సార్థకమైంది. ఇంతకంటె నేనేమీ ఎక్కువకోరను" అన్నాడు. ఆపైన ఒక్కనిమిషంఉండి మళ్ళీ "నాది ఇంకొక ప్రార్థనఉంది. మీరునల్లరాయిని కానన్నారు గనక నాకీభిక్ష కూడా పెట్టాలి. మిమ్మల్ని సుఖపెట్టేభారం ఎవరిమీద ఉన్నా సరే నా కవసరంలేదు. మీవల్ల నేను దుఃఖం అనుభవిస్తూ ఉన్నాను గనక మీదుఃఖభారంకూడా ఇక్కడనుంచి నామీదే మోపండి. నాకీఒక్కవరం మాత్రం దయచేయించండి" అన్నాడు. అతనల్లాగ ఆ మాటంటే అతనికంఠస్వరం గద్గదమయింది. గడిచిన రాత్రినించీ అచల హృదయంలో పేరుకున్న వేదనకూడా కన్నీళ్ళ రూపంగా ప్రవహించడం మొదలుపెట్టింది.

సరిగ్గా ఈసమయానికి వీధిలోంచి జోళ్ళచప్పుడు వినబడింది. ఆ ఉత్తరక్షణంలో మహిముడు లోపలికివచ్చి ఏమోయ్, సురేశా! కాస్త టీ, గీ, ఏమన్నా తాగావా!" అన్నాడు. సురేశుడు ఆమాటకి చటుక్కుని సమాధానం చెప్పలేకపోయాడు. అతను ఏదో ఒకవంకని ముఖం ఇంకొకపక్కకి తిప్పి కండువా కొంగుతో కన్నీళ్లు తుడుచుకున్నాడు. అచలకూడా చీరచెంగుతో ముఖంకప్పుకుని మహిముడిపక్కనించి తప్పుకుని చటుక్కుని అక్కణ్ణించి వెళ్ళిపోయింది. మహిముడు ద్వారంఇవతల ఒకకాలూ, అవతలఒక కాలూ ఉంచి నిర్ఘాంతపోయి నుంచున్నాడు.

## ౧౭

మహిముడు తనమనస్సు కుదుటబరుచుకుని లోపలికి వెళ్ళి ఒక కుర్చీ లాక్కుని దానిమీద కూర్చున్నాడు. మానవహృదయం

ఒక్కొక్కప్పుడు అబద్ధాలాడి ఎల్లాంటి పరిస్థితుల్లోనుంచైనా అతి సులభంగా తప్పించుకుంటుంది. సురేశుడి అవస్థకూడా ఇప్పుడు సరిగ్గా అల్లాగే ఉంది. అతను చటుక్కుని చేత్తో కన్నీళ్లు తుడుచుకుని ఎంతో ఔదార్యంతో "ఈమధ్యని నాలో ఈదౌర్బల్యం చాలా ఎక్కువైపోతూంది." అనుకున్నాడు. మహిముడుమాత్రం పైకి ఏవిధమైన ఉద్వేగమూ కనబరచలేదు. ఇంతే కాదు ఆఖరికి "ఇల్లా కళ్లమ్మట నీళ్లురావడానికి కారణం ఏమిటి!" అనేనా అడగలేదు.

సురేశుడప్పుడు తనకథ చెప్పడాని కుపక్రమించి "ఎవరేమన్నా సరే గాని ఈవిషయం ఉన్నదున్నట్టు చెబుతున్నాను. మహిమా! అదేమిటో గాని ఈవిడకళ్ళమ్మట నీళ్లుపెట్టుకుంటే నాకూడా కళ్ళమ్మట నీళ్లు వస్తున్నాయి. ఎంతఆపుకుందా మనుకున్నా ఆగడం లేందే! నేను వెళ్ళకపోతే ఈగొడవ నాకూడా తెలియకపోను! కానిముసలాయన మాత్రం బొత్తిగా కోపిష్ఠిమనిషి అయిపోతున్నాడు! చూడు! ఆయనకి మీరొక్కరేగదా! ఈమాత్రం కబురు తెలియజేయనక్కర్లేదూ? పెళ్ళిఅయినప్పటినుంచీ ఆమహానుభావుడు మూతిముడుచుకునే కూర్చున్నాడు. నాటికీ నేటికీ ఆకోపం అల్లాగే ఉంది! కొంచెమైనా శాంతించడంఅనేదిలేదు! నేనన్నానుగదా! అయిందేదో అయిపోయింది మరిఇంక—"అని సంగంచెప్పాడు.

మహిముడు మధ్యలో "టీతాగావా!" అన్నాడు. సురేశుడు మెడ తిప్పి "ఆతాగాను. అయితే తండ్రి ఇల్లాంటివాడంటే ఎవరికి కళ్ళమ్మట నీళ్ళురావు చెప్పు! మొగాళ్ళే ఇల్లాంటివి సహించలేరు. ఇంక ఆడవాళ్ళయితే చెప్పేదేముంది!" అన్నాడు. మహిముడు "సరే బాగానే ఉంది. రాత్రినీకు పడుకోడానికి ఏమీఇబ్బందిగాలేదుగదా! బాగా సుఖంగా నిద్రపట్టిందా? కొత్తచోటు—"అని ఏదో చెప్పబోయాడు. సురేశుడు, చటుక్కుని "అబ్బెబ్బే! కొత్తచోట నిద్రపోడానికి నాకేమీ

కష్టంగాలేదు. నరేగాని మహిమా! కేదారబాబుగారుకి జబ్బుచేసిన
సంగతి బొత్తిగా తెలియనియ్యకపోవడం ఆశ్చర్యంగాలేదూ?" అన్నాడు.

మహిముడు చెక్కు చెదరకుండా అల్లాగే ప్రశాంతస్వరంతో
"ఆశ్చర్యమేముంది!" అన్నాడు. ఆపైన ఒక చిరునవ్వునవ్వి మళ్ళీ "కాస్త
కాళ్లూ చేతులూ కడుక్కుని ఎక్కడికైనా షికారుకి బయలు దేరతావా
ఏమిటి? అయితే లే! గబగబా తయారవు! నేనుమళ్లీ ఒక గంటసే
పున్నాక వీధులోకి వెళ్ళిపోవాలి! ఇంతవరకూ నాపొద్దున్నపని పూర్తే
కాలేదు" అన్నాడు. సురేశుడు తనపుస్తకంమీద ఎక్కువ ఆసక్తి కన
బరుస్తూ "కథచాలాతమాషాగా ఉంది. ఈకథ కాస్తా పూర్తిచేసే
స్తాను." అన్నాడు. మహిముడు అయితే అల్లాగే చేద్దువుగాని నేనొక
రెండుగంటల్లోపుగానే మళ్ళీ తిరిగివచ్చేస్తాను!" అనిఅక్కడినించి లేచి
వెళ్ళిపోయాడు. అతనల్లాగ వెడుతూంటే సురేశు డతనికేసి కళ్ళెత్తి
చూశాడు. ఏదోఒకఅదృశ్యమైనహస్తం ఒక్కసారిగా అతనిముఖంనిండా
నల్లరంగు పూసినట్లయింది. అభిమానంచేత అతనిప్రాణంచచ్చిపోయింది!

సురేశుడు మహిముడువెళ్ళిన దారికేసిచూస్తూ అల్లాగేబొమ్మలాగ
కూర్చుండిపోయాడు. మహిముడు అడగకుండా తనంతట తను చెప్పిన
కథఅంతా వ్యర్థమైపోయినందుకు అతనికి పెద్ద అభిమానంతో కలి
సిన కోపంవచ్చింది! ఆకోపంవల్లా, ఆ అభిమానంవల్లా అతనికిశరీరం
అంతా వెయ్యితేళ్లుకుట్టినట్లయింది. అచల ఆఇద్దరు స్నేహితులూ
మాట్లాడుకునే మాటలన్నీ తలుపువెనుకాల నుంచునివింటూంది. మహి
ముడు బట్టలుమార్చుకోడానికి లోపలికిరాగానే ఆమెకూడా అతని
వెనకాలే లోపలికి వచ్చింది. మహిముడు ఆమెకేసి చూడగానే
అచల సహజమైన మృదుస్వరంతో "మానాన్నగారు మీవిషయంలో
ఏదైనా గొప్పఅపరాధం చేశారా?" అనిఅడిగింది.

హఠాత్తుగా అచలవేసినప్రశ్నకి అర్థంఏమిటో తెలియక మహిముడు

అదేమిటో తెలుసుకోవాలనేదృష్టిలో అచలకేసి చూస్తూనుంచున్నాడు. అచల మళ్ళీ "నేను అన్నమాటకి అర్థంమీకు తెలియలేదు కాదూ?" అని అడిగింది. మహీముడు "అబ్బే! తెలియకపోవడంఏమిటి? నువ్వన్నమాటలు కొంచెం మనస్సుకి కష్టంగా తోచినా పైకిమాత్రం స్పష్టంగానే ఉన్నాయి. అయితేవాటిఅర్థం తెలుసుకోవడంమాత్రం కొంచెంకష్టం. అందులోనావంటివాడికి మరీకష్టంఅన్నాడు.

అచల లోలోపలికోపాన్ని ఎల్లాగోఅపుగుని "నేనన్నమాటలో మీకర్థంకానిమాట ఏదీలేదు. కాని ఆమాట ఔనని అంగీకరించడం మాత్రం చాలాకష్టం. అయితే మిమ్మల్ని నేనొక్కమాట అడుగుతున్నాను. స్పష్టంగా సమాధానంచెప్పండి. "మానాన్నగారికి ప్రాణం మీదికి వచ్చే జబ్బుచేసిందని చెప్పినా మీకేమీ లక్ష్యంలేకుండా ఉంది కదా! మానాన్నగారు మీకు ఇంతలోనే ఇంతనీచులయిపోయారా?" అంది.

మహీముడు "నాకీమాత్రం తెలియకపోలేదు. అవసరంలేనిచోటదాన్ని గురించి ప్రస్తావిస్తే ఏమిలాభం?" అన్నాడు.

అచల "ఎక్కడ అవసరంలేదో నేనుకాస్త వినవచ్చునా?" అనిఅడిగింది.

మహీముడు తనభార్య ముఖంకేసి కొంతసేపు నిశ్శబ్దంగా చూసి కఠినంగా "ఎక్కడ అవసరంలేదో కావాలా! ఇదిగో అప్పుడే సురేశుడిదగ్గిర చెబితే ఏంలాభంఉంది? నాచేత నువ్వింత కఠినంగా మాట్లాడిస్తేమాత్రం ఏంలాభంవుంది? పోనీలే దానిమాట అల్లావుండనీ బురదబాగా అడుక్కిజేరుకున్నా నీళ్లుకలచడం అట్టే తెలివైనపని కాదని నాఅభిప్రాయము" కాని అచల అంతటిలోనే చటుక్కుని ఎదురుగుండావచ్చి అతనిదారి కడ్డంగానిలబడింది. ఆతరవాత ఆమెఒక్కక్షణం పళ్ళతో పెదవులు గట్టిగా కొరుక్కుంది. దానిని బట్టి చూస్తే ఆమె లోపలనుంచి పొంగిపొంగివస్తూన్న కోపాన్ని బలవంతంగా అపుగున్నట్టుకనపడింది. ఆతరవాత ఆమె "మీకిప్పుడేమైనా తొందరపని

ఉందా? ఒక్క రెండునిమిషాలు ఆగలేరా?" అంది.

మహిముడు "సరే! అయితే ఆగుతాను." అన్నాడు. అచల "ఈ మాటేదో స్పష్టంగా తేలిపోవాలి. నీరు ప్రవహించిపోగానే బురద ఎక్కడున్నదీ తేలిపోతుంది. ఇంతేనా మీ అభిప్రాయము?" అంది. మహిముడు "అవునంతే" అన్నాడు. అచల "ఊరికే పుణ్యానికి నీళ్లు కలచివెయ్యడం అనేది నేనూ ఒప్పుకోను కాని ఈభయం మనస్సులో పెట్టుకుని అసలు నీళ్ళే పరిశుభ్రం చెయ్యకుండా ఊరుకోవడమే మంచిదా? అందుచేత పరిశుభ్రం చెయ్యవలసివస్తే పూర్తిగా పరిశుభ్రం చేసేసెయ్యాలి. ఇంక బురద బాధ లేకుండా పోతుంది ఏమంటారు!" అంది.

మహిముడు కఠినంగా "అల్లా చెయ్యడానికి నాకేమీ అభ్యంతరం లేదుగాని నాకిప్పుడు అంతకంటేకూడా జరూరైనపని ఇంకొకటిఉంది. నాకిప్పుడు దీనితో కూర్చోడానికి వీల్లేదు" అన్నాడు. అచలకూడా అతనిమోస్తరుగానే "మీజరూరుపని పూర్తి అయిపోగానే కాస్త అవకాశం దొరుకుతుందిగా! అంతవరకూ నేనిక్కడే కూర్చుంటాను" అని అతికఠినంగా సమాధానంచెప్పి పక్కకితప్పుకుని నుంచుంది. మహిముడు గదిలోంచి వీధులోకి వెళ్ళిపోయాడు. అచల అతనికేసి చూస్తూ నుంచుంది. ఆపైన తలుపు వేసేసుకుంది.

ఆపైన ఒకగంట ఉన్నతరవాత స్నానం చెయ్యడానికి లెమ్మనమని చెప్పడానికని సురేశుడి గదిదగ్గిరకి వెళ్ళింది. సురేశుడు ఆమె ముఖాన్నిబట్టి ఉన్నసంగతి అంతా కనిపెట్టేశాడు. ఈలోగా మహిముడికీ ఆమెకూ మధ్యని ఏదో జరిగిఉంటుం దని ఊహించి ఏమనడానికీ పాలుపోక మాట్లాడక కూరుకున్నాడు. అదీగాక ఏమిటని అడగడానికికూడా అతనికి ధైర్యం కలగలేదు. అచల కొంతసేపల్లాగ నిశ్శబ్దంగా నుంచుని 'ఏమిటి ఇది అంతాను!' అంది. సురేశుడు

విడిచిన బట్టలన్నీ ఒక్కొక్కటే సూటుకేసులో పెట్టుకుంటూ "ఒంటిగంటకి బండివొకటి ఉంది. ఎందుకేనా మంచిదని ఇప్పటినించీ సద్దుకుంటున్నాను" అన్నాడు. అచల ఆశ్చర్యపడి "మీరీవేళ వెళ్ళిపోతున్నారా!" అంది. సురేశుడు ముఖం ఎత్తకుండా "ఔను" అన్నాడు.

అచల "ఏం? ఎందుచేత?" అని అడిగింది. సురేశుడు ఆవిధంగానే సూటుకేసు కేసి చూస్తూ "ఇంక ఉండీమాత్రం ఏంచెయ్యను! ఏదో మిమ్మల్ని అందరినీ ఒకసారి చూడాలని వచ్చాను. చూడ్డం అయిపోయింది" అన్నాడు. అచల ఆపైన కొంతసేపటిదాకా నిశ్చలంగా ఉండి "అయితే అక్కడినించి లేచి ఇల్లాగరండి! ఇవ్వన్నీ ఆడవాళ్ళు చెయ్యవలసిన పనులుగాని మీలాంటివాళ్ళు చెయ్యవలసిన పనులుకావు నేనవ్వన్నీ సద్దిపెడతాను" అని ముందుకివచ్చింది. ఆవిడ ముందరికి రావడంచేత సంకోచపడి సురేశుడు "అబ్బే! మీరీపను లేమీ చెయ్యవద్దు! ఇందులో ఏముంది? అది నాకు సామాన్యమైన--" అని ఏదో చెప్పబోయాడు.

కాని అచల అతనిమాట పూర్తికాకుండానే చటుక్కుని అతని చేతులో సూటుకేసు లాక్కుని అదిబోర్లించి బట్టలన్నీ ఒక్కొక్కటీ అందులో సద్దడం ప్రారంభించింది. సురేశుడు ఆమెపక్కనే నిలబడి, ఎంతో చిన్నబుచ్చుకుని "అయ్యో! మీరుచెయ్యడం ఎందుకు? ఈ పని నేనే చేసుకుందునే!" అని నాలుగైదుసారు లన్నాడు.

అచల చాలాసేపటిదాకా అతనిమాటలకి వేటికీకూడా సమాధానము చెప్పలేదు! మెల్లి మెల్లిగా ఆబట్టలన్నీ సద్దుతూ "మీకు భార్యగాని చెల్లెలుగాని ఉంటే మిమ్మల్ని ఇల్లాగ సద్దుకో నిస్తారా? ఆపని వాళ్లే చేసిఉందురు. ఒకవేళ మీస్నేహితులు తిరిగివస్తేమాత్రం ఏం? ఇది ఆడవాళ్ళు చేసేపనేగా!" అంది. సురేశుడు అల్లాగే మాట్లాడకుండా

నుంచున్నాడు. ఇంతకు పూర్వం మహీముడికీ అచలకీ మధ్యనడిచిన మాటలేవీ అతనికి తెలియవు. అందుచేత ఆ ప్రసంగం ఎత్తి అచలమనసు కష్టపెట్టడం అతని కిష్టం లేకపోయింది. అదీగాక మహీముడువచ్చి ఇదంతా ఎక్కడ చూసిపోతాడో అని అతనికి భయంగాకూడా ఉంది.

సూటుకేసు అంతా జాగర్తగాసద్ది అచల మెల్లిగా "నాన్నగారి జబ్బుసంగతి. అసలు చెప్పకుండాఉంటేనే బాగుండిపోను! ఆయనకి ఈమాట చెబితే ఏదో అవమానం చేసినట్లయిందే! అంతేనేగాని, ఆయన కీమాటంటే లక్ష్యమేలేదు!" అంది. సురేశుడు అదిరిపడి "మీా కీమాట ఎవరుచెప్పారు? మహీముడా?" అన్నాడు. అచల ఆప్రశ్నకి సూటిగా సమాధానం చెప్పకుండా పక్కనున్న తలుపుకేసి చూపిస్తూ "నే నక్కడనుంచుని అన్నీ స్వయంగా విన్నాను"అంది.

సురేశుడు ఆమాటమీాద సిగ్గుపడి "ఈవిషయంలో నన్ను మీారు క్షమించాలి" అన్నాడు. అచల ముఖం ఎత్తి నవ్వుతూ "ఎందుకు?" అని అడిగింది. సురేశుడు పశ్చాత్తాపపడుతూ "కారణంఏమిటో మీాకు తెలియనే తెలుసును. ఈవేళ నేను నాతప్పుచేత మీాఇద్దరినీకూడా అవమానించాను! అందుచేత మిమ్మల్ని ప్రత్యేకంగా క్షమించమని కోరుతున్నాను" అన్నాడు.

అచల ఒక్కసారి ముఖంఎత్తి అతనికేసి చూసింది. అప్పుడామెకు అతని మనస్సులో ఉన్నఉద్వేగం అంతా ప్రత్యక్షమయింది. ఆతరవాత అచల "సురేశబాబూ! ఈవేళ మీారు ఏమిచేసినా నాకోసమే చేశారు. నేను చిన్నబుచ్చుకోవలసిన పరిస్థితి రాకుండా చేసి మీారిప్పుడు చిన్నబుచ్చుకుంటున్నారు.! అయినా గాని మీారు నన్ను క్షమాపణ కోరాలని అనుకుంటూనా! నేను అల్లాంటి రాక్షసిని అనిమాత్రం అనుకోకండి? అసలు మీారు సిగ్గుపడడం ఎందుకు? మీారుచేసిన దంతా బాగానేచేశారు!" అంది.

సురేశు డామాటవిని ఆశ్చర్యంతో నిర్ఘాంతపోవడం చూసి, అచల అతని కామాటంటే అట్టే ఇష్టం లేదన్న సంగతి గ్రహించింది. అందుచేత కొంచెము సేపు మాట్లాడక కూచుని "ఈవేళ వెళ్ళిపోకండి సురేశబాబూ! ఇప్పుడు మనస్సులో చిన్న బుచ్చుకుంటున్నారంటే ఇదంతా నామూలాన్నేగా! లేకపోతే ఈగొడవంతా మీకు అవసరమే లేకపోను! ఈయిల్లు మీస్నేహితులుకి ఒక్కరిదే అనుకోకండి! నాకూడా ఇంటులో కొంతఅధికారం ఉంది. ఆ అధికారం ఉపయోగించి నేనీవేళ మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాను! మీరు నాకు అతిథిగా కొన్నిరోజులుండి వెళ్ళండి!" అంది.

సురేశుడు ఆమెసాహసం చూసి పిల్లి అయిపోయాడు. ఒక్కక్షణ కాలం అతనికి ఏమిఅనడానికీ తోచిందికాదు! అందుచేత ఏదోఆలోచించి చెబుదామని అనుకుంటూండగానే మహిముడు తనపని అంతా పూర్తిచేసుకుని లోపలికివచ్చాడు. సురేశుడు మహిముడురావడం గమనించకుండా అచల చటుక్కుని ఏమిమాట అనిపోతుందో అనే భయంచేత, ఎంతోసంకోచంతో "ఆఁ, వచ్చావా! మహిమా! నీపని అంతా పూర్తిఅయిపోయిందా!" అన్నాడు. మహిముడు ఆ! అయిపోయింది? అనిచెప్పి లోపలికి వచ్చి గదిలోకి అడుగుపెడుతూనే అచల అల్లాగ ఉండడం చూసి "ఇదేమిటి! ఇదంతా?" అన్నాడు.

అచల మెడతిప్పి వెనక్కిచూసింది ; కాని మహిముడన్నమాటకి సమాధానం చెప్పకుండానే సురేశుణ్ణి ఉద్దేశించి ఆవెనక ప్రసంగం ఎత్తుకుని "మీరు నాకూ స్నేహితులే ! స్నేహితులే అన్నమాటేమిటి? మాకు చేసిన ఉపకారాన్ని బట్టి మీరు ఎంతో ఆత్మీయులనికూడా అనవలసి ఉంటుంది. మీరిల్లాగ వెళ్ళిపోతే నాకెంతో చిన్నతనంగానూ బాధగానూకూడా ఉంటుంది. ఏమైనాసరే! మిమ్మల్ని ఈవేళ వెళ్ళనివ్వదలుచుకోలేదు !" అంది.

సురేశుడు లేనినవ్వు తెచ్చుకొని "ఈవిడ అంటూన్న మాటలు వింటున్నావా! మహిమా! నేను మిమ్మల్ని అందరినీ ఒకసారి చూడాలని ఇక్కడికి వచ్చాను; చూశాను; అనుకున్న పనికాస్తా అయిపోయింది. ఇల్లాంటప్పుడు ఈఅడివిలో నన్ను ఇంకా కొన్నిరోజులు ఉంచితే మీాకేమిటి లాభం? నేను మాత్రం ఇక్కడ ఈఇబ్బందులన్నీ పడుతూఉండడం ఎందుకు? చెప్పు!" అన్నాడు.

మహిముడు ధైర్యంగా "బహుశః నువ్వు మనస్సులో కపటం పెట్టుకుని వెళ్ళిపోతున్నావుగా ఉంది. ఇల్లావెళ్ళడం ఈవిడికి ఇష్టంలేదు" అన్నాడు.

ఆమాటమీాద అచల తీవ్రంగా "అయితే మీాకాయన వెళ్ళడం ఇష్టంలాఉంది" అంది. సురేశుడు ఈమాటమీాద మనస్సులో ఎంతో కంగారుపడి ఈప్రసంగం ఎల్లాగైనా మార్చివెయ్యాలనే ఉద్దేశ్యంతో ఎంతో ఉత్సాహంగా ఉన్నట్టు నటించి నవ్వుతూ "నామీాదఅన్యాయంగా అపవాదు ఎందుకువేస్తావు మహిమా! అదీగాక నాకుకోపం ఎందుకు వస్తుంది! నువ్వు చాలాగట్టివాడవే! సరే బాగానేఉంది! నీకంతగా పట్టుదలగా ఉంటే ఇంకా కొంతకాలం ఉంటాను! ఓదినా! ఇంక బట్టలు సర్దవలసినపనిలేదు! బట్టలన్నీ ఇవతలికి తీసెయ్యి! మహిమా! రా, ఈవేళ మీాచెరువులో స్నానంచేస్తాను! ఆతరవాత అంతగా అవసరం అయితే కొన్ని క్వినైనుమాత్రలు మింగవచ్చునులే!" అన్నాడు. మహిముడు, 'అయితే పదు' అనిచెప్పి బట్టలుకూర్చుకోడానికి గదినించి ఇవతలికివచ్చాడు.

౧౮

కొంతమంది కొత్తచెప్పులు గట్టిగా కరుస్తూఉన్నా సహించి కులాసాగా నడిచివెళ్ళిపోతూ ఉంటారు. సురేశుడుకూడా సరిగ్గా ఆవిధంగానే

ఆరోజంతా నవ్వుతూ కేరింతాలుకొడుతూ కాలక్షేపంచేసేశాడు. కాని రెండో రోజునిమాత్రం అతనింక ఆబాధ సహించలేకపోయాడు. మహిముడు మాత్రం ఏమీ చలించకుండా అల్లాగే ఉన్నాడు. అచల అతని ఆగాంభీర్యంముందు తనకుటిలప్రవర్తనా, తన అమర్యాదా తలుచుకుని ఎంతోబాధపడి ఇంతకంటె చచ్చిపోతే మంచికని అనుకుంది. ఆమెహృదయందాకా అతన్ని గ్రహించుకోలేక పోయింది. కానిబుద్ధిబలంవల్ల గ్రహించగలిగింది. ఆమె అతనిబుద్ధి చాలా నిశితమైనదనీన్నీ ఎంతమాత్రమూ తొణకని ఈవ్యక్తిముందు తనఅభినయమంతావ్యర్థమైపోతూందనీన్నీ అందుచేత తను మాటిమాటికీ ఎంతో చిన్నబుచ్చుకోవలసివస్తూందనీన్నీ గ్రహించింది.

ఈవేళ తెల్లవారినతరవాత మహిముడు ఇల్లువిడిచిపెట్టి వీధులోకే వెళ్ళలేదు. తెల్లవారింది మొదలుకొని సాయంత్రందాకా రోజురోజల్లా అతను ఇంచుమించుగా ఇంటిదగ్గిరే ఉండిపోయాడు. అచల చాలా రాత్రిదాకా పరుపుమీద పడుకుని ఇటూఅటూ దొర్లింది; కాని ఎంతసేపటికీ నిద్రపట్టలేదు. ఆపైన మెల్లిగా "రాత్రి తెల్లవార్లూ దీపంవెలిగించుకుని కూర్చుంటే ఇంక మిగతావాళ్ళకీ నిద్రేపట్టదు. నామీద కొంచెమైనా దయ దలచకూడదూ?" అంది. ఆమెకంఠస్వరాన్నిబట్టి మహిముడు కొంచెంకంగారుపడి తొందరతొందరగా దీపంవత్తి తగ్గించి "చాలా పొరపాటుజరిగిపోయింది. క్షమించాలి" అనిచెప్పి పుస్తకం మూసేసి పరుపుమీదకి వచ్చిపడుకున్నాడు.

తను అడిగితేనేకాని తనకేమాత్రం ఉపకారం చెయ్యకపోవడం మూలాన్ని అచలఏమీ మాట్లాడలేదు. అయితే దీనిమూలాన్ని ఆమెకు కొంచెమైనా నిద్రరాలేదు. అంతకంతకి అల్లాగ సమయం గడిచిపోతూన్నకొద్దీ ఆ అంధకారం అంతా బాధతో మిశ్రితమై ఆమెకు ఎంతో దుస్సహమైపోయింది. అల్లాగే కొంతసేపుండి ఇంక

భరించలేక మెల్లిగా "తెలిసో తెలియకో ఒకపొరపాటు పని చేసిన తరవాత దానివల్ల వచ్చేఫలితం అనుభవించి తీరవలసిందే! ఏం! అంతేనా!" అంది. మహిముడు ఏమీ చెక్కుచెదరకుండా "అవును పెద్దపెద్ద అనుభవజ్ఞులంతా ఇల్లాగే అంటారు" అన్నాడు.

అచల ఆతరవాత కొంతసేపూరుకుని "మనం ఇద్దరమూ చేసిన పొరపాటుకి అప్పుడే ఫలితం అనుభవిస్తున్నాము. అసలు దీనిఫలితం మొట్టమొదటినించీకూడా కనబడుతూనేఉంది. చివరికి ఇదిఏమవుతుందో మీరేమన్నా ఊహిస్తున్నారా!" అంది. మహిముడు 'లేదు' అన్నాడు. అచల "నేనూ ఊహించలేకపోతున్నాను. కాని ఆలోచించగా నాకు ఒకవిషయం మాత్రం స్పష్టంగా కనిపిస్తోంది. మిగిలినవిషయాలన్నీ విడిచిపెట్టివేసినా ఇందులోపొరబాటుచేసినవారు ఒకస్త్రీ, ఒకపురుషుడున్నూ కాబట్టి దీనివల్ల వచ్చేశిక్ష పురుషుడుఎక్కువగా అనుభవించాలని అనుకుంటున్నాను." అంది. మహిముడు "ఇంకాకొంచెం లోతుగా ఆలోచించావంటే ఇందులోస్త్రీ అనుభవించవలసిన శిక్ష పిసరంతైనా తక్కువకాదు అనిఅనిపిస్తుంది. అయితే ఆపురుషుడెవరు? నేనా సురేశుడా!" అన్నాడు. ఆమాటమీద అచలఉలిక్కిపడింది. అక్కడబాగా చీకటిగాఉన్నా మహిముడా సంగతి గ్రహించాడు. ఒక్కక్షణకాలం నిశ్శబ్దంగాఉండి అచల మళ్ళీ మెల్లిగా "మీరునా ముఖం ఎదురుగుండా నన్నవమానపరచడం ప్రారంభించారని నాకు తెలుసును. మీరిల్లాగ మొదలుపెట్టాక ఇదిఎంతవరకూ వెడుతుందోకూడా నేనెరక్కపోలేను. అయితే దెబ్బలాడుతూ కూర్చోవడం నాచేతకాదు. మీతోఇల్లాగ దెబ్బలాడుతూ కూర్చోడానికికూడా నేను పెళ్ళిచేసుకోలేదు. రేపో ఎల్లుండో నేను మానాన్నగారింటికి తిరిగివెళ్ళిపోతాను." అంది.

మహిముడు "దీనికి మీనాన్నగారు చాలా ఆశ్చర్యపడతారు"

అన్నాడు. ఆమాటమీాద అచల "ఆయన ఆశ్చర్యపడరు. ఇదిఇల్లాగ జరుగుతుందని ఆయనకి మొట్టమొదటినుంచీ తెలుసును. అందుచేత జాగర్తగా ఉండమని మొట్టమొదటినుంచీ నాతో అంటూ వచ్చారు. పల్లెటూరిలో ఆత్మీయులని అందరినీ విడిచిపెట్టి ఒక్క భార్యతో ఉండడం కష్టమేమోగాని కలత్తాలో ఎగల్లాడున్నా గడిచి పోతుంది. అదీగాక అసలు ఏమయినా మానాన్నగారు ఆశ్చర్య పడడం అనేది జరగనేజరగదు" అంది.

మహీముడు "అయితేనువ్వు ఆయన మొదటినుంచీ చెబుతూన్న మాట ఎందుకువినలేదు!" అన్నాడు. అచల లోలోపలనుంచి పొంగి వస్తూన్న కన్నీళ్ళు బలవంతంగా ఆపుకుని "మీారేపనిచేసినా ఆలోచించకుండా చెయ్యరని అనుకున్నాను" అంది.

"ఆ అభిప్రాయం ఇప్పుడు కలగడంలేదా?"

"లేదు."

"అందుచేత ఉమ్మడివ్యాపారంవల్ల లాభంలేదని ఇంకదుకాణం ఎత్తి పెట్టి లేచిపోదామని అనుకుంటున్నావా?"

"అవును"

ఆపైన మహీముడు ఒక్కక్షణందాకా ఏమీాఅనకుండా ఊరుకుని "ఇల్లాఅయితే వెళ్ళిపో. ఒక్క విషయంమాత్రం ఉంది. ఇదంతా మనకి వర్తకం లాంటిదని అనుకుంటే మాత్రం ఇంక సీకూనాకూ సరిపడదు. అదీగాక మనోకవిషయం ఏంవర్తకం చెయ్యాలనుకున్నా కొంత అనుభవం సంపాదిస్తేగాని లాభంలేదు. నీపొరబాటేదో నీకు తెలిసినతరవాత ఉత్తరంరాస్తే నేను వచ్చి నిన్ను తీసుకువస్తాను" అన్నాడు.

అచలకళ్ళమ్మట కన్నీళ్లు ముత్యాల్లా దొర్లాయి. ఆమె చేత్తో కన్నీళ్లు తుడుచుకుని ఒక్కనిమిషం నిశ్శబ్దంగా ఉండి కంఠస్వరం

తిన్నబరుచుకుని "మనిషికి పొరబాటు మాటిమాటికీ వస్తూ ఉండదు. బహుశః మిమ్మల్ని ఇబ్బందిపెట్టవలసిన అవసరం ఉంటుందని అనుకోను" అంది.

మహిమూడు "ఇప్పుడు మనకాసంగతి తెలియదు; కనక నే దాన్ని భవిష్యత్తని పిలుస్తున్నాము. ఆ భవిష్యత్తుసంగతి ముందు ఆలోచించుకొందాము. ఈవేళ నన్ను క్షమించు. ఇంక నేను ఇల్లా వాగుతూ కూర్చోలేను" అన్నాడు. అచల ఆమాటకి ఎంతో బాధపడి "నే నేమన్నా వేళాకోళం ఆడుతున్నానని అనుకుంటున్నారా అయితే మీరు చాలాపొరబాటు పడుతున్నారన్నమాట. నేను తప్పకుండా రేపో ఎల్లుండో వెళ్ళిపోదామని అనుకుంటున్నాను" అంది. మహిమూడు "నేనుకూడా నిజంగా నిన్ను వెళ్ళనివ్వ దలచుకోలేదు!" అన్నాడు.

అచల ఒక్కసారిగా పెద్దఆవేశంతో "నాఇష్టంలేకుండా నన్నిక్కడ బలవంతంగా అట్టిపెట్టేస్తారా! మీరెప్పటికీ ఇల్లా చెయ్యలేరు తెలుసునా!" అంది. మహిమూడు చెక్కుచెదరకుండా ప్రశాంతంగా "సరే బాగుంది. ఈవేళ రాత్రే వెళ్ళిపోవడంలేదు గదా! రేపోఎల్లుండో వెళ్ళవలసివచ్చినప్పుడు ఆలోచించుకోవచ్చును. ఇంకా చాలా వ్యవధిఉంది. ఈవేళకి ఇల్లాపోని" అనిచెప్పి అతను తలకింద తలగడాతిప్పి ఆ ప్రసంగం అంతటితో బలవంతంగా ఆపేసి నిశ్చింతగా పడుకున్నాడు. బహుశః ఆవుత్తరక్షణంలోనే అతను నిద్రపోయిఉంటాడు.

ఆమర్నాడు టీతాగేటప్పుడు సురేశుడు అచలతో "మహిమూడు పొలంపనిచూసుకోడానికి పొద్దున్నే లేచి వెళ్ళిపోయాడనుకుంటాను" అన్నాడు. అచల "ప్రపంచం తల్లకిందులైనాసరే ఆయనపనికి విఘ్నం కలగడానికి వీల్లేదు" అంది. సురేశుడు టీకప్పుబల్లమీద పెడుతూ "ఒక్కవిధంగా ఆలోచిస్తే అతను మనకంటెగొప్పవాడే! అతనిపనులన్నీ యంత్రంలో చక్రాల్లాగ యథావిధిగా నడిచిపోతూం

టాయి." అన్నాడు. అచల "అల్లాగ యంత్రంలో చక్రంలాగ ఉండడం మంచిది అంటారా!" అంది. సురేశుడు "నేనల్లాగే అంటాను. కారణ మేమంటే—అతనికిమల్లె ఉండడం నాకు సాధ్యంకాదు. మానసిక దౌర్బల్యంవల్ల కలిగేఆపత్తులన్నీ నాకు తెలుసును. అందుచేత చెక్కు చెదరకుండా ధైర్యంగా ఉన్నమనుష్యుల్ని చూస్తే నేను పొగడ కుండా ఉండలేను; దానికేంగాని నాకీవేళ సెలవు దయచెయ్యండి. నేను వెళ్ళిపోతాను" అన్నాడు. అచల దానికి అంగీకరిస్తూ "వెళ్ళండి నేనుకూడా రేపు కలకత్తా వస్తున్నాను" అంది. సురేశుడు ఆశ్చర్యపడి "మీరెక్కడికి వెడుతున్నారు!" అన్నాడు.

"కలకత్తా"

"ఇంత హఠాత్తుగా కలకత్తా రావడం ఎందుకు? నిన్నటిదాకా ఈమాట ఏదీ రాలేదే!"

"నాన్నగారికి ఒంట్లో బాగుండలేదు. అందుచేత ఒకసారి చూడ డానికి వెడుతున్నాను"

సురేశుడిముఖంమీద మళ్ళీఒక ఆవేశచ్ఛాయకనబడింది అతను. "తండ్రిగారికి జబ్బుచేసినప్పుడు చూడడానికి వెళ్ళడం ఒక ఆశ్చర్యకరమైన విషయంకాదు కాని నాభయం ఏమిటంటే నామూలాన్ని మీలో మీరు దెబ్బలాడుకుని ఎక్కడ —"అని సగంసగం చెప్పి ఊరుకు న్నాడు. అచల ఈమాటకేమీ సమాధానం చెప్పలేదు ఆసమయాన్ని యదువు వాళ్ళఎదటనించి వెడుతూంటే సురేశుడు వాణ్ణిచూసి "మీ బాబుగారు పొలంవెళ్ళి తిరిగివచ్చారా!" అని అడిగాడు. యదువు "ఆయన పొలంవెళ్ళేలేదండి. గదిలో పడుకుని నిద్రపోతున్నారండి!" అన్నాడు.

అచల చటుక్కుని అక్కడనుంచి వెళ్ళి ఆగదిగుమ్మంలోనించి తొంగిచూసింది. మహిముడొక కుర్చీమీద పడుకుని ఎదురుగుండా

ఉన్న ఒకబల్లమీద కాళ్లుపెట్టుకుని నిద్రపోతున్నాడు. రాత్రిళ్ళుగా నిద్రపట్టకపోతే పగలు నిద్రపోవడం ఒకపెద్దఆశ్చర్యంకాదు. కాని తను రోజూ చేసుకునేపని మానేసి మహీము దీర్ఘంగా నిద్రపోవడంచూస్తే అచల ఆశ్చర్యానికి అంతులేకపోయింది. ఎదురుగుండా తెరిచిఉన్న కిటికీలోంచి సూర్యకాంతి అప్పుడప్పుడే లోపల ప్రవేశించి కొంచెం కొంచెం అతనిముఖంమీద పడింది. ఆమెఇంత అశ్చర్యకరమైన విషయము నంతకిపూర్వం ఎప్పుడూ చూడలేదు. ఆమెకి అతనల్లా నిద్రపోతూంటే చూడడానికి అదే మొదలు. రోజూ ప్రశాంతంగా కనబడుతూన్న అతనిముఖంమీద అచలకీవేళ అశాంతరేఖ కనబడింది. ఈవేళ అతనినుదుటిమీద కొన్నిముడతలు కనబడ్డాయి. ఒకఏడాదికిపూర్వం అక్కడ ఒకగీతైనా కనబడలేదు. అతనిముఖంకేసి చూస్తే అతనేదో పైకిచెప్పడానికి వీల్లేని దుఃఖంవల్ల యమయాతన అనుభవిస్తూన్నట్టు కనబడ్డాడు. ఆమెనిశ్శబ్దముగా లోపలికివెళ్ళి మళ్ళీ ఏమీ చప్పుడుచెయ్యకుండా ఇవతలికి వచ్చెయ్యాలని చూసింది; కాని కాలికి పీకిడానతగిలి చప్పుడైంది. అందుచేత మహీముడికి మెళుకువ వచ్చి అతనుచటుక్కుని కళ్లుతెరిచి చూశాడు. అచలసిగ్గుపడి "ఇప్పుడు నిద్రపోతున్నారేమిటి? ఒంట్లో బాగుండలేదా" అంది. మహీముడు కళ్లు నులుముకుంటూ "ఏమో తెలియదు. జ్వరం రాకపోతే ఆశ్చర్యపడవలసిందే" అన్నాడు. అచల ఇంక ఏమీ అడగకుండా అక్కడినించి వెళ్ళిపోయింది.

ఫలహారంచేసి టీ తాగినతరవాత సురేశుడు వెళ్ళిపోడానికి తయారవుతున్నాడు. మహీము డతనికి దగ్గరగా ఒకకుర్చీమీదే కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుతున్నాడు. అచల తలుపుదగ్గిరిగా వచ్చి, చటుక్కుని "రేపు, నేనుకూడా కలకత్తా వచ్చేస్తున్నాను. మీకువీలుంటే ఒకసారి మానాన్నగారిని కలుసుకోండి" అంది. సురేశుడు ఆశ్చర్యపడి "ఇదేమిటి ఇల్లాఅంటున్నారు" అన్నాడు. ఆపైన మహీముడికేసి కళ్ళెత్తి

చూసి "సుహిమా! ఒదినగారిని నువ్వు రేపే కలకత్తా పంపించివేస్తున్నావా?" అన్నాడు.

భార్య ఆకస్మికంగా చూపించిన ఈ విరోధభావానికి సుహిముడి హృదయం భగ్గుమని మండింది; కాని అతను ముఖంలో ప్రసన్నంగా ఉండేట్టు నటించి, చిరునవ్వు నవ్వుతూ "ఉబ్బే! మరేమీ ఇబ్బంది లేదు! మాపల్లెటూరి సంసారాల్లో నాటకాల్లో ఉన్నట్టు ఉండదు. రేపే అన్నమాటేమిటి? ఈవేళే నీతో పంపించివేస్తాను" అన్నాడు. సురేశుడిముఖం సిగ్గుచేత ఎర్రగామారిపోయింది. అచల ఆసంగతి గ్రహించి బలవంతంగా నవ్వుతూ "సురేశబాబూ? మనం పట్టణ వాసస్థులము. ఇందులో సిగ్గుపడవలసిం దేమీలేదు! జబ్బుగాఉన్న తండ్రిని చూడడానికి వెళ్ళడం పల్లెటూరిమర్యాద కాకపోతే, ఇంతకంటె పట్టణవాసపు నాటకమే నయం అనినే నను కుంటున్నాను. పోనీ లేకపోతే మీరు ఈవేళకి ఆగండి! రేపు మనంఇద్దరమూ కలిసి వెడదాము" అంది.

సురేశుడు అచల ఇల్లాగ హద్దుమీరి మాట్లాడడం చూసి తెల్లబోయి తలఒంచుకుని "అబ్బెబ్బే! నే నింక ఆగడానికి వీల్లేదు! రావలసి ఉంటే మీరు రేపురండి! నేను ఈవేళే వెళ్ళిపోవాలి. అనిచెప్పి, ఎంతో ఆవేశంతో సూటుకేసు చేత్తోపుచ్చుకుని లేచినుంచున్నాడు. అతని ఆవేశంచూసి అచలకూడా ఒక్కసారిగా కంపించిపోయింది. ఆపైన ఎంతో కంగారుపడుతూ "బండిరావడానికి ఇంకా చాలాఆలస్యం ఉంది సురేశబాబూ! అప్పుడే వెళ్ళిపోతారా! నే నొకటిరెండు మాటలు చెబుతాను. దయచేసి అవి విని వెళ్ళిపొండి" అంది. ఆర్తనాదం లాంటి ఆమె కంఠస్వరం విని ఇద్దరు శ్రోతలూ ఒక్కసారిగా అదిరిపడ్డారు. అచల ఇంక వెనకాముందూ చూడకుండా "సురేశ బాబూ! మిమ్మల్ని నే నింక పూర్వం ఎందులోనూకూడా

సహాయం అడగలేను; కాని ఆపత్తులో అడ్డుపడేవారు మీకంటె నాకింక ఎవరున్నారు? మీరు నాన్నగారిదగ్గిరికి వెళ్ళి "వీళ్లు నన్నిక్కడికి కదలనివ్వడం లేదనీ, అస్తమానమూ గదిలో పెట్టి తలుపు తాళం వేస్తున్నారనీ చెప్పండి; ఇక నేనిక్కడ బతకలేను! మీరు నన్నిక్కడినుంచికూడా తీసుకువెళ్ళండి! ప్రేమలేని మనిషితో నేనింక సంసారం చెయ్యలేను" అంది. మహిముడు పిడుగు మీదపడ్డవాడిలాగ అల్లాగే చూస్తూనుంచున్నాడు. సురేశుడు చటుక్కుని మహిముడికేసి తిరిగి, సగర్వంగా చూస్తూ "మహిమా! నీకు ఈవిడ బ్రహ్మసమాజస్థురాలని తెలుసునా? స్త్రీ అయినంతమాత్రాన్ని నువ్వు ఈవిడ మీద పశుబలం ప్రయోగించడానికి వీల్లేదు" అన్నాడు.

మహిముడు ఒక్కక్షణం అల్లాగే నిలబడ్డాడు. ఆపైన కొంతశాంతించి "అచలా! దేనికోసం ఏంచేస్తున్నావో కొంచెంఆలోచించి మరీ చెయ్యి!" అన్నాడు. మళ్ళీ సురేశుడికేసి తిరిగి "నేనింతవరకు ఎవరిమీదాకూడా పశుబలంగాని మనుష్యబలంగాని ప్రయోగించలేదు. సరే! అంతా బాగానేఉంది! నువ్వు ఉండగలిగితే ఈవేళకూడా ఉండి, రేపు ఈవిణ్ణి నీతోకూడా తీసుకువెళ్లు! నేను వచ్చి స్వయంగా బండిలో కూర్చోబెడతాను. ఇల్లాగ చేస్తే చూసేవాళ్ళకికూడా అట్టే ఎబ్బెట్టుగా ఉండదు" అన్నాడు. ఆపైన మళ్ళీ ఒక్కనిమిషం ఆగి "నాకిప్పుడు కొంచెం తొందరపని ఉంది. నేనిప్పుడు వీధిలోకి వెళ్ళిపోతున్నాను. ఈవేళ ఎల్లాగా ప్రయాణం లేదుకాబట్టి, బట్టలూఅవీ పెట్టెలోంచితీసి ఇవతలపెట్టుకో! నేను ఒకగంటసేపటిలో తిరిగివచ్చేస్తాను" అని చెప్పి మెల్లిమెల్లిగా గదిలోంచి వీధిలోకి వెళ్ళిపోయాడు.

అచల ద్వారబంధం చేత్తోపట్టుకుని బొమ్మలాగ అల్లాగే నిలబడిపోయింది. సురేశుడు ఒక్కక్షణకాలం తలవంచుకుని నుంచుని, ఆపైన ఒక్కసారిగా పకపక నవ్వి "వహవ్వా! ఒకగొప్పనాటకంలో

ఒక అంకం అభినయించి వెళ్ళిపోయాడు! మీరూ ఏమీ తక్కువ చెయ్యలేదు! నేనుమాత్రం తక్కువ చేసుచేశాను? ఒకడింటికి వచ్చి అతని భార్యపక్షం వహించి అతనిమీద కళ్ళెర్రజేశాను! ఇంతకంటె ఇంక ఏమికావాలి? స్నేహితుడుకూడా తియ్యని కబుర్లుచెప్పి ఒక నవ్వు నవ్వి ఇక్కడినుంచి వెళ్ళిపోయాడు. నేను పందెంవేసి చెబుతున్నాను; అతను కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుకోవడంకోసం, ఏదో పనిఉందని వంకబెట్టి, ఇక్కడినుంచి వెళ్ళిపోయాడు! పోనీలెండి! ఒదినా! అద్దంఒకసారి ఇల్లాతెచ్చిపెట్టండి! అద్దంలో నాముఖం ఎల్లాఉందో చూసుకుంటాను" అనిచెప్పి అతను అచలముఖంకేసి చూశాడు. ఆమెముఖాన్ని కత్తివాటువేసినా రక్తంచుక్క లేదు! ఆమె ఏమీ సమాధానంచెప్పలేదు! ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి మెల్లిమెల్లిగా అక్కడినించి వెళ్ళిపోయింది.

## ౧౫

ఈ వేళ అచల మహిముడి పరుపుమీద పక్క వెయ్యడానికి వెళ్ళింది; కాని ఆమెకు ఆపనిఅంటే ఎంతో అసహ్యం వేసిఉండాలి. అయితే ఆపని చెయ్యడానికి ఆమె ఎల్లాగ వెళ్ళగలిగింది? ఆప్రశ్న మానవ హృదయంతో పరిచయం ఉన్నవారందరికీ తోచిఉంటుంది. ఆమె కేవలం ఒకయంత్రంలాగ తను రోజూచేసేపని పూర్తిచెయ్యడానికి వెళ్ళింది. ఆమె ఆపనిచేసి తిరిగివస్తూంటే ఆమెదృష్టి చటుక్కుని అక్కడఉన్న ఒకబల్లమీద పడింది. ఆమె కాబల్లమీద ఒకచీటీ కనబడడం — ఆచీటీచదవడం ఇదంతా ఒక్కనిమిషంలో పూర్తిఅయి పోయింది. ఆచీటీమీద ఒక్కపంక్తిమాత్రమే ఉంది. దానిమీద వారంగాని తారీఖుగాని కనబడలేదు. అది మృణాల రాసి పంపించిన చీటీ. దానిలో "అన్నయ్యా! ఏంచేస్తున్నావు? నీకోసం నాకళ్లు

వాచిపోతున్నాయి. నీకోసం రోజురోజూ ఎదురుచూస్తున్నాను" అని ఉంది.

ఆచీటీ చదివిన చాలాసేపటివరకూ అచలకి కనురెప్ప పడలేదు! కేవలం రాతిబొమ్మలాగ ఆమె ఆచీటీకేసి చూస్తూనుంచుంది. "ఆమె ఇది ఎప్పుడు ఎవరు రాశారో తెలుసుకోవాలి" అని ప్రయత్నించింది; కాని ఎంతప్రయత్నించినా ఏమీ లాభంలేకపోయింది. మృణాలఇల్లు ఎక్కడ ఉంది? అక్కడికి వెళ్ళడంఎల్లాగ? ఆమె మహిమ కోసం అంతఆత్రంతో నిరీక్షిస్తూ ఉండడానికి కారణంఏమిటి? ఈమొగలైన విషయాలన్ని తెలుసుకోడానికి ఆమె కేమీ ఉపాయం కనబడలేదు. ఆచీటీకేసి చూస్తే "మొన్నటిదాకా ఒక వ్యక్తి మహిమకోసం కళ్ళు నాచిపోయేటట్లు ఎదురుచూస్తూఉంది" దనిమాత్రం తెలిసింది.

అప్పుడప్పుడే చీకటిపడుతూఉంది. ఆచీటీకేసి చూస్తూంటే ఆమెకళ్ళకి నెప్పిపెట్టింది. ఆనల్లనల్లని అక్షరాలు మొట్టమొదట అస్పష్టంగా కనిపించాయి. ఆపైన నల్లగాఉన్న చిన్న చిన్న పురుగుల్లాగ ఆకాగితంమీద గజిబిజిగా తిరగడం మొదలుపెట్టాయి. అయినా గాని ఆమె అల్లాగే రాయిలాగ నిలబడిఉంది. ఇంతవరకూ ఆమెకు తెలియకుండానే, ఆమెహృదయంలో ఒకపెద్ద దుఃఖప్రవాహం స్తంభించిఉంది. అది ఇప్పుడు గట్టు తెగిపోయిన ప్రవాహంలాగ గట్టిగా గర్జిస్తూ ఇవతలికి ఉరికింది. అచల ఆ దుఃఖావేగంవల్ల చటుక్కుని ఉలిక్కిపడింది. వెంటనే ఆమెకు తనబంటిమీద స్పృహకలిగింది. ఆమె తలుపుఅవతలికి తొంగిచూసింది. అప్పుడే కొంచెం చీకటిపడింది; యదువు ఒక హరికేనులాంతరు వెలిగించి వీధివైపునఉన్న గదిలో పెట్టడానికి వెళుతున్నాడు. అచల వాణ్ణిపిలిచి "యదూ! బాబుగారు వచ్చారా?" అని, అడిగింది. యదువు "లేదమ్మా! ఇంతవరకూ తిరిగిరాలేదు" అన్నాడు.

రెండుఝాముల వేళ ఆవిధంగా ఆఅంకం అభినయించి మహిముడు వీధులోకి వెళ్లిపోయాడనిన్నీ, ఇంతవరకూ తిరిగిరాలేదనిన్నీ ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. మహిముడు రోజూ పొలంవెళుతూ ఉండడం అచల గమనించక పోలేదు! అసలు సురేశుడు వచ్చినప్పటినించీ ఈఇంట్లో దెబ్బలాట ఎడతెరపిలేకుండా సాగుతూ ఉంది. అచల ఆగొడవల్లో మిగిలిన అన్ని విషయాలూ కూడా మరిచిపోయింది. అసలు ఆమె భర్తని ప్రేమించడం లేదు. కేవలం పొరపాటుపడి వివాహం చేసుకుంది. ఒకసారి పొరపాటుపడితే దాని ఫలితం జన్మం ఉన్నంత కాలమూ అనుభవించవలసిందేనా? అని ఆమె మనస్సులో ఒక జిజ్ఞాస కలిగింది. ఆపైన దానివల్ల ఒక పెద్ద విప్లవం బయలుదేరింది. ఆమె మృణాల చెప్పిన మాటలు అప్పుడే మరిచిపోయింది! కాని మృణాలరాసిన ఆ ఒక్క పంక్తి ఆమెహృదయంలో ఒక పెద్ద అగ్నిజ్వాల ప్రజ్వలింప జేసింది. ఆసమయంలో ఆమె తనభర్త మరిఒక స్త్రీని ప్రేమిస్తున్నాడేమో అనే అనుమానం కూడా తనహృదయాన్ని అన్నిటికంటే ఎక్కువగా దహింపచేస్తూఉం" దని గ్రహించింది.

ఆమె ఆచీటీ మళ్లీ ఒకసారి చదవాలని దాన్ని కళ్ళదగ్గిరికి తీసుకురావాలని ప్రయత్నించింది; కాని ఆ అక్షరాలమీద ఉండే అసహ్యభావంచేత ఆమె తనచెయ్యిపైకి ఎత్తలేకపోయింది! ఆచీటీ ఎక్కడపడిఉంతో అక్కడే ఉంచి, ఆమె ఆగదిలోంచి ఇవతలికివచ్చి వరాండాలో వున్న ఒక స్తంభానికి జేర్లబడి రాతివిగ్రహం లాగ నుంచుంది.

ఆమెకు ఒక్కసారిగా సమస్తమూ మిథ్యఅని తోచింది. ఈఇల్లూ ఈద్వారబంధాలూ, ఈభర్త, ఈసంసారమూ, ఈభోజనం చెయ్యడమూ, ఈముస్తాబవడమూ—ఇవ్వన్నీ అసత్యాలే! వీటిలో దేనికోసమూ కూడా మనిషి శ్రమపడవలసిన అవసరంలేదు! కేవలమూ మానసికమైన అజ్ఞానంవల్లనే మనిషి నానాబాధలూపడి మరణిస్తున్నాడు. లేకపోతే ఆపట్టణం ఏమిటి? ఈపల్లెటూ రేమిటి? ఈ పూరిఇళ్ళు ఏమిటి? ఈరాజ

భవనాలు ఏమిటి? భార్యాభర్తా, తల్లీదండ్రీ అనే ఈ మొక్కైన సంబంధా లన్నీ అసలు ఎక్కడఉన్నాయి! అసలు ఈ దెబ్బలాటల్లోనూ, ఈతగా దాలలోనూ, ఈపడుపుల్లోనూ పడి మనిషి ఇల్లాగ చావడం ఎందుకు? ఆదీగాక రెండుఝాములవేళ భార్యతో దెబ్బలాడి గంటలతరబడి హాయిగా వీధుల్లో తిరిగేమనిషి మనస్సులో ఏమిఉందో కనుక్కోడానికి ఇంత తలబద్దలుకొట్టుకోవడం ఎందుకు? ఇదంతా కేవలం మిథ్య! కేవలం కపటం! అంతా మృగతృష్ణ!

ఆమె ఒక్కసారి మృణాలరాసిన ఆచీటీ జాగ్రత్తగా పరిశీలిస్తే ఈసంసారం ఇంతనిస్సారంగా కనిపించకపోయిఉండును! అంతవర కెందుకు? మృణాలనిగురించికూడా కొంచెంలోతుగా ఆలోచిస్తే ఇంత గొడవ లేకపోను! ఇంతేకాదు! అస్తమానమూ నవ్వుతూ కేరింతాలు కొడుతూఉండే ఆమృణాలకీ ఇతరస్త్రీలకీ ఉండే తేడా కొంచెంగమనిస్తే, ఆరాతచూసి ఇంతగా బాధపడవలిసిన అవసరం లేకపోను!

యదువు తిరిగివచ్చి "బాబుగారు టీ కాచడానికి పెట్టిననీళ్ళు కాగాయా? అని అడుగుతున్నారండి" అన్నాడు. అచల నిద్రపోయి చటు క్కునిలేచినట్లు "ఏబాబుగారు?" అంది. యదువు తొందరగా "మన బాబుగారేనండి! ఆయన అప్పుడే వచ్చారండి! మీరు టీకి నీళ్లుపెట్టి చాలాసేపు అయిందమ్మా! ఈపాటికి మరుగుతూ ఉంటాయమ్మా!" అన్నాడు. 'నువ్వు వెళ్ళు!' నేను వస్తాను" అని చెప్పి, అచల వంటయింటి కేసి వెళ్ళింది. కొంచెంసేపున్నతరవాత ఆమె మంచినీళ్ళూ టీ, నౌఖరు చేతిలో పెట్టి ఇవతలికి వచ్చింది. మహిముడు. ఆచీకటిలో ఆవరాండాలో పచారుచేస్తున్నాడు. సురేశుడు లాంతరుదగ్గిరగా కూర్చుని పేపరు చదువు కుంటున్నాడు. ఆవేళ వాళ్ళిద్దరికీ ఒకళ్ళునచ్చినసంగతి ఒకళ్ళకి తెలిసినట్టే కనపడలేదు! అచల చిన్నప్పటినించీ స్నేహితులయిన వీళ్ళి ద్దరికీ మధ్యన ఇంత అభిప్రాయభేదంకలగడానికి కారణం ఏమిటని

ప్రశ్నించుకుంది. ఆకారణం గ్రహించగానే అచలకింక కాళ్లాడలేదు.

మహిముడు ఆమె తిరిగి రావడంతోనే అదిరిపడి "సురేశుడికి టీఇవ్వ డానికి ఇంత ఆలస్యం ఎందుకయింది" అనిఅడిగాడు. అచల నోటమ్మాట ఏసమాధానమూ రాలేదు. ఆమె కొంచెంసేపు తలఒంచుకుని అల్లాగే నిలబడింది. ఆపైన మెల్లిమెల్లిగా కదిలొంచి ఇంటిలోకి వెళ్ళిపోయింది. యదువు టీగిన్నెలూ అవ్వీ బల్లమీద పెట్టి తిరిగి వెళ్ళిపోతూంటే సురే శుడు "మహిముడెక్కడ ఉన్నాడు? అతనింతవరకూ తిరిగిరాలేదా" అని అడిగాడు.

ఆమాట వినీవినడంతోనే మహిముడు లోపలికివచ్చి ఒకకుర్చీలా క్కుని దానిమీదకూర్చున్నాడు; కాని తను పదినిముషాలనించి ఆవ రండాలో పచారుచేస్తూన్నట్టు చెప్పాలనేసంగతి అతనికి తోచనేలేదు. ఆపైన ఎవ్వరూ ఏమీఅనలేదు. అంతానిశ్శబ్దమే. అచల తలఒంచుకుని ఏమీమాట్లాడకుండా ఆరెండుకప్పులనిండా టీచేసి ఒకటి సురేశుడి దగ్గిరా ఇంకొకటి మహిముడిదగ్గిరా పెట్టింది. ఆపైన అక్కడినించి వెళ్ళిపోతూ మహిముడిపిలుపు విని చటుక్కునిఆగింది. మహిముడు "కొంచెంసేపు ఆగు" అనిచెప్పి తలుపుగడియవేసి వచ్చాడు. సురేశుడికి ఆసమయాన్ని మహిముడి దగ్గిరఉన్న ఆరుబారుల పిస్తోలు జ్ఞాపకం వచ్చింది. అతనిచెయ్యి ఒణికింది. టీకొంచెం తొణికి నేలమీద వొలికింది. అతనిముఖం శవముఖంలాగ తెల్లబడిపోయింది. అతను తలుపులు వేస్తున్నావెందుకు?" అనిఅడిగాడు.

అతనికంఠస్వరమూ ఆముఖంవైఖరీ అవ్వన్నీ చూసేటప్పటికి అచలకి కూడా ఆపిస్తోలుసంగతి జ్ఞాపకంవచ్చి భయంచేత వొళ్ళంతా గజ గజఒణికింది. ఆమెగట్టిగా కేకవేద్దామని అనుకుంది; కాని చివరికి అల్లాగ కేక వెయ్యలేకపోయింది. మహిముడు ఒక్కక్షణకాలం అచలకేసి చూశాడు. అతనికి ఒక్కనిముషంలో సంగతి అంతా

బోధపడిపోయింది. ఆపైన అతను సురేశుడిపైపుతిరిగి "నాకరు లోపలికి రాకుండా ఉండడంకోసం వేశావు! అంటే నాపిస్తోలు పెట్టిలోఉండేదో ఇప్పుడూ ఆపెట్టిలోనేఉంది. మీరింత భయపడేవాళ్ళని తెలిస్తే అసలు తలుపులే వెయ్యకపోదును!" అన్నాడు.

సురేశుడు టోపీ బలవంతంగా పెట్టి లేనినవ్వు తెచ్చిపెట్టుకుని "వహావా! భయపడడ. ఎందుకు? నువ్వు నామీద పిస్తోలు పేలుస్తావా? బాగుంది! భయమేమి? నాకా! ఎప్పటికైనా నామూశాపాళి బాగానే—" అని ఏదో చెప్పబోయాడు. మహిమడు అతను అసంబద్ధంగా చెబుతూన్న అసంగతి పూర్తిచెయ్యకముందే చటుక్కుని "నిజమే నువ్వు భయపడుతూంటే నేనెప్పుడూ చూడలేదు. నీకు ప్రాణాలమీద మమకారం లేదన్నసంగతి నాకు తెలియకపోలేదు సురేశా! ఈవేళ నాకువచ్చిన దుఃఖానికేంగాని నువ్వు అపమార్గంలో పడిపోతున్నావన్న సంగతి తెలుసుకుంటే నాకెక్కువ బాధగావుంది. నీవంటివాడు చెయ్యగూడని పనికూడా నువ్వు—వీల్లేదు. సురేశా! నువ్వింక తప్పకుండా మీయింటికి వెళ్ళిపోవాలి నువ్వింక ఏదోవంకపెట్టి ఇక్కడ ఆలస్యంచేస్తూ కూర్చో డానికివీల్లేదు!" అన్నాడు.

సురేశుడు ఏదోసమాధానం చెప్పడానికి ప్రయత్నించాడు ; గాని ఈసారిమాత్రం ఏమీసమాధానం చెప్పలేకపోయాడు. ఆఖరికి కంఠం కూడా సరిచేసుకోలేకపోయాడు. ఈమాట వినగానే ఆతను లోలోపల కుంగిపోయాడు. "మహిముడు నువ్వు లోపలికి వెళ్ళిపో అచలా!" అనిచెప్పి, తలుపు గడియతీసి, ఆచీకటిలో వీధులోకి వెళ్ళిపోయాడు. ఇప్పుడు సురేశుడు తలపైకెత్తి బలవంతంగా లేనినవ్వు తెచ్చిపెట్టుకొని నవ్వుతూ "విన్నారా ఆమాటలు? అబ్బో! నేను చిన్నప్పటి నించీ ఇల్లాంటిపిస్తోళ్ళూ, తుపాకులూ చాలాచాలా పేల్చాను! ఇప్పుడు తను ఏదోఒక పాతపిస్తోలు పట్టుకువచ్చి పేలిస్తే నేను భయపడిపోతానని

అనుకుంటున్నాడులా ఉంది! ఇంకేం! తలుచుకుంటూంటే నవ్వు ఆగడంలేదుగా! బాబూ!" అన్నాడు. ఆపైని లేనినవ్వు తెచ్చిపెట్టుకుని బలవంతంగా కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వాడు. అతని నవ్వు వినడానికి ఆగదిలో అచలతప్ప మరెవ్వరూ లేరు! కాని ఆమె ఇంతసేపటినించీ ఏవిధంగా తలఒంచుకుని నిలబడిఉందో, ఆవిధంగానే ఇంకా కొంచెంసేపు నిలబడి, ఆతరవాత ఆపక్కనున్న తలుపు తెరుచుకుని మెల్లిమెల్లిగా లోపలికి వెళ్ళిపోయింది.

ఆపైన మళ్ళీ ఒకగంటసేపటికి మహీముడు ఇంటికివచ్చాడు. అతను తనగదిలోకివెళ్ళి చూశాడు. అక్కడ అతనికెవరూ కనబడలేదు. ఆపక్కగదిలోకి వెళ్ళిచూశాడు. అక్కడ ఒకచాపమీద అచల పడుకునిఉంది. భర్త లోపలికిరావడం చూసి, ఆమె లేచికూర్చుంది. అతను అక్కడఉన్న ఒకమంచంమీద కూర్చుని "ఏం? రేపు నువ్వు మీఇంటికి వెళ్ళిపోవడం నిశ్చయమేనా?" అన్నాడు. అచల తలఒంచుకుని కూర్చుంది. అంతేనేగాని ఏమీ సమాధానం చెప్పలేదు. మహీముడు ఆపైన కొంచెంసేపు మాట్లాడకూరుకుని, మళ్ళీ "నేను నీకుభర్తనే! కాని నీ కిష్టంలేనివాడితో కాపరం చెయ్యమనిమాత్రం చెప్పను. ఇల్లాంటి అన్యాయపుపని నేనెప్పుడూ చెయ్యలేను" అన్నాడు.

కాని అచలమాత్రం అల్లాగే రాతిబొమ్మలాగ నుంచుంది. అదిచూసి మహీముడు మళ్ళీ ఇల్లాగ అన్నాడు. "నేను ముఖ్యంగా ఇంకోవిషయం చెప్పవలసిఉంది. నాస్వభావం ఎల్లాంటిదో నువ్వెరుగుదువు పెళ్ళయింతరవాతేకాదు! అంతకి పూర్వంనించీ నాకొక అలవాటుంది. సుఖం వచ్చినా దుఃఖమువచ్చినా, దొరికినదానితో తృప్తిపడి ఉండడమేగాని, అంతకంటె అధికంగా కావాలని నేనెప్పుడూ కోరుకోలేదు. ఒకవేళ అధికంగావచ్చినా, నేనుదాన్ని తీసుకోలేను. ప్రేమ బలవంతపెడితే రాదు అచలా! ప్రేమించినవ్యక్తి లభించకపోతే బాధగానే ఉంటుంది;

కాని అల్లాగ లభించలేదని సిగ్గుపడవలసిన అవసరంలేదు. అయినా, ఇన్నాళ్ళనించీ అనవసరంగా నువ్వు ఎందుకు బాధపడుతున్నావు? నేను నిన్ను నిర్బంధిస్తున్నానని అనుకుంటున్నావు; గాని ఒక్కసారి నాతో ఆలోచిస్తే అల్లాగ అనుకోవలసిన అవసరం లేకపోను! నేనుఎప్పుడూ ఏవిషయంలోనూకూడా నిన్ను నిర్బంధించలేను. అతను నిన్నుద్ధరిస్తానని అంటున్నాడు; కాని నాన్నగారితో చెబితే నేను ఏఉపాయమైనా చెప్పి ఉందునుగా! స్త్రీప్రాణాలవిలువ అతనికెక్కడికే తెలుసును?"

అచల గద్గదమైన కంఠస్వరం సాధ్యమైనంతవరకు సరిచేసుకుని మెల్లిగా "అసలు మీరు నన్ను ప్రేమించడమే లేదు" అంది. మహిముడు ఆశ్చర్యపడి "ఈసంగతి నీకెవరు చెప్పారు? నేను ఎప్పుడూ అనలేదే!" అన్నాడు. అచలకి చటుక్కుని ఎంతో ఆవేశంవచ్చింది. ఆపైన "ఒక్కమాటలవల్లే అంతా తేలిపోతుందా? ఒక్క నోటిమాటే నిజం అన్నమాట! మిగిలినవన్నీ అబద్ధాలన్నమాట! కోపంవచ్చినప్పుడు ఏదో ఒకమాట నోటమ్మట జారుతుంది! ఇంక ఆమాటపట్టుకుని నన్నింటికి పంపించివేద్దామని అనుకుంటున్నారా! మీకుమల్లే తూచితూచి మాట్లాడలేనివాళ్ళని ఇంక పాతాళలోకంలోకి తొక్కివెయ్యడమేనా?" అంది. అల్లా మాట్లాడుతూంటే ఆమె కంఠస్వరం చాలావరకు గద్గదమైంది. మహిముడికి ఏమీ బోధపడలేదు; అందుచేత అతను "అంటే నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడు.

అచల ఉబికిఉబికి పైకివస్తూన్న ఏడుపు ఆపుకుని "మీకు తెలివితేటలు ఉన్నాయిగదా! అని అబద్ధాలాడితే దాటిపోవచ్చునని అనుకోకండి! మీకుకూడా కొన్నికొన్ని పొరబాటులు వస్తూనేఉంటాయి. కావలిస్తే ఒకసారి మీబల్లమీద ఏమిఉందో చూడండి! మాకొక్కళ్ళకే——" అని ఏదోచెప్పబోయి ఊరుకుంది. మహిముడికి మతిపోయినట్లయి "నాబల్లమీద ఏమిఉంది?" అన్నాడు. ఆపైన

అచల నోట్లో చీరచెంగు కూరుకుని అక్కడఉన్న ఒకచాపమీద ఉండగ చుట్టుకు పడిపోయింది. ఆమెదగ్గిరినించి ఇంకఏవిధమైన సమాధానమూ రాలేదు. అందుచేత మహిముడు మెల్లిగా లేచి తనబల్లమీద ఏమి ఉందో చూడడానికి వెళ్ళాడు.

అతను చదువుకునే గదిలో బల్లమీద కొన్నిపుస్తకాలు పడి ఉన్నాయి. ఇంచుమించుగా పదినిమిషాలదాకా అతను ఆపుస్తకాలన్నీ తిరగవేసి వెతిగాడు ; కాని వాటిల్లో ఎక్కడా అచలచేసిన నిందా రోపణకి కారణం కనబడలేదు. ఆపైన అతను మతిపోయినవాడిలాగ తిరిగి తనపడకగదిలోకి వెళ్ళాడు.

ఆగదిలో అడుగు పెట్టే టప్పటికి అతనికి అక్కడ ఒకచిన్నబల్ల మీద పడిఉన్న మృణాల చీటీ కనబడింది. అతను చటుక్కుని ఆ చీటీతీసి చదువుకున్నాడు. దానితోటి అతనికి అంధకారంలో ఒక్క సారిగా మెరుపుమెరిసి దారికనబడినట్లయింది. అతనికి అనలుసంగతే మిటో అంతా బోధపడిపోయింది. అచల ఆవిధంగా ఎందుకుమాట్లాడిందో కూడా అతనికిబోధపడిపోయింది. మహిముడాచీటీ చేత్తోపుచ్చుకుని శూన్యదృష్టితో నిశ్శబ్దంగా అంధకారంకేసి చూస్తూకూర్చున్నాడు. అతనికి మృణాలరావడమూ, మాటిమాటికీ నవితి, నవితి అని వేళా కోళం ఆడడమూ, తిరిగిఇంటికి వెళ్ళిపోవడమూ ఇవ్వన్నీ ఒక్కొక్కటే వరనగా జ్ఞాపకంవచ్చాయి. సామాన్యంగా పల్లెటూరివాళ్ళ వేళా కోళాలతో పరిచయంలేని స్త్రీకి ఆవేళాకోళాలన్నీ బాకుల్లాగుచ్చు కుంటాయి. మహిముడు ఒక్కనాడైనా అచలకి మనసువిప్పి అన్ని విషయాలూ చెప్పలేదు. పైగా మృణాల వేళాకోళంగా మాట్లాడు తూంటే మహిముడు తనభార్యఎదురుగుండా సిగ్గుపడి మృణాలని అల్లాగ అనవద్దని అంటూండేవాడు. ఆసిగ్గుపడడం అంతా ఆచదువు కున్న అచల మనస్సుకి కష్టం కలిగించిందంటే అందులో ఆమె తప్పే

ముంది. మహిముడీ వేళ ఆమె హృదయంలో బాధ అంతా ఎల్లాగ పోగొట్టగలడు? ఆ అంధకారం కేసి చూస్తూంటే అతనికి అనేక సత్యాలు గోచరించాయి. అచల క్రమక్రమంగా దూరమైపోతూంది. అతనితో కలిసి ఉండడమే ఆమెకు విషమైపోయింది. ఆఖరికి భర్త గృహమే ఆమెకొక ఖైదు అయిపోయింది. మహిముడికి ఈ విషయాలన్నీ ఇప్పుడు స్పష్టంగా కనిపించాయి. ఈ బాధ లన్నిటిలోంచి తప్పించు కోడానికి అచల సురేశుణ్ణి హృదయపూర్వకంగా ప్రార్థించిన విషయం కూడా మహిముడికిప్పుడు బోధపడిపోయింది. అసలు మహిముడు అచలని హృదయపూర్వకంగా ప్రేమించాడు. అచల ఇన్నాళ్ళ నించీ ఇంత బాధపడుతూ ఉన్న ఆసంగతి కనిపెట్టలేకపోయాను గదా అని మహిముడు ఎంతో బాధ పడ్డాడు. సరే అయిన దేదో అయిపో యింది. ఇంక ఇల్లాగ జరగడానికి వీల్లేదు. అయితే మళ్ళీ నేను నా భార్య మనస్సు నావైపు ఆకర్షించుకోగలనా? అని అతను అనుకున్నాడు. అల్లాగ అనుకోడం కూడా అతనికెంతో కష్టమయింది. మహిముడు ఒకప్పు డనేక విఘ్నాలు వచ్చినా లక్ష్యపెట్టకుండా అచలని సంరక్షించు కున్నాడు. ఆవిధంగానే ఈ వేళ కూడా ఎన్ని అవమానాలైనా సహించి ఆమెను సంరక్షించుకోవాలని అనుకున్నాడు. అసలు తను చేసిన పొరపాటులన్నీ ముందుగా ఆమెతో చెప్పాలనికూడా నిశ్చయించు కున్నాడు. మహిముడు మెల్లిగా లేచి అచల పడుకున్న గదితలుపు తట్టాడు. దానికి లోపల గడియ వేసి ఉంది. అతను ఒకటి రెండు సారులు పిలిచాడు. అయినా ఆమె పలకలేదు. బలవంతంగా తలుపుకొట్టి లేపడం అతనికిష్టంలేదు. ఇంతే కాదు, భార్య విషయంలో ఒక అతికఠిన సమస్య ప్రస్తుతం ఎదురుకోవలసిన అవసరం లేకపోయిందికదా అని అతను లోలోపల ఎంతో సంతోషించాడు.

మహిముడు తిరిగివచ్చి పరుపుమీద పడుకున్నాడు. కాని ఆమె

తిండీతిప్పలూ లేకుండా ఆపక్కగదిలో నేలమీద పడిఉంది. అని అనుకునేటప్పటికి అతనికి నిద్రపట్టడం మానేసింది. వెళ్ళి అచలని లేపడమూ లేపకపోవడమూ అని ఆలోచిస్తుంటే చాలా రాత్రిగడిచి పోయింది. మొత్తంమీద ఆ ఆలోచనల మధ్యని అతనికొక చిన్నకునుకు పట్టింది. ఇంతలో మూసుకున్న అతనికళ్ళల్లోనించి ఒకపెద్దవెలుతురు కనబడినట్లయింది. అతను చటుక్కుని కళ్లుతెరచి చూశాడు. తలవైపున తెరిచిఉన్నకిటికీలోంచి ఒకపెద్దమంట కనబడింది. అప్పుడే ఇల్లంతా పొగతోనిండిపోయింది. ఆపైన దగ్గరగా ఒకపెద్ద చప్పుడయింది. ఆచప్పుడు వినేటప్పటికి మహేశుడికింక కాళ్ళూచేతులూ ఆడలేదు. అతనికి ఆమంటఎక్కడనించి వస్తూందో తెలిసింది; కాని కొంతసేపటిదాకా అతనికి ఏంచెయ్యాలో తెలిసిందికాదు. ఆఒక్కక్షణంలోనే అతనిహృదయంలో ఒకపెద్దప్రళయం జరిగింది. అతను చటుక్కుని లేచి తలుపుతెరిచి ఇవతలికి వచ్చి చూశాడు. వంటఇంటిమీదా, అచల పడుకున్న గదిమీదా అప్పుడే చిన్నచిన్న అగ్నిజ్వాలలు కనిపిస్తున్నాయి. అప్పుడేవాసాలుకూడా అంటుకున్నాయి. పల్లెటూరిలో ఒకపూరిఇల్లు అంటుకున్నప్పుడు ఆర్పాలని అనుకోవడం ఒక పెద్దవెర్రి! ఇల్లాంటిప్రయత్నం ఎవళ్లూ చెయ్యరు! ఇంక ఇరుగుపొరుగు వాళ్లల్లో కొంతమంది తమదూడల్నీ సామానుల్నీ జాగ్రత్తపెట్టుకోవడంకోసం ఇటూ అటూ పరుగెడుతూఉంటారు. ఇంకొకొంతమంది ఆడవాళ్లు ఒకచోటా మగవాళ్లుఒకచోటాచేరి అయ్యో! అయ్యో! అని అరుస్తూంటారు. ఆపైన ఎన్నివస్తువులు కాలిపోయాయో ఎల్లాగ కాలిపోయాయో అసలుకొంపలు ఎల్లాగ అంటుకొన్నాయో అనిసావకాశంగా చర్చిస్తూఉంటారు. అంతేనేగాని ఒకళ్లూకలగచేసుకోరు. ఈలోగా ఇళ్ళన్నీ భస్మమైపోతాయి. ఆపైన ఆప్రేక్షకులంతా ఇళ్ళకి వెళ్ళి పరుపులమీద పడుకుని సుఖంగా నిద్రపోతారు. ఆపైనపొద్దున్న

చెరువుగట్టుకి బయలుదేరతారు. ఆపైనస్నానంచేసి భోజనంచేస్తారు. ఒకడి ఇల్లు తగులడిపోయింది అనేవిషయం ఇంకొకడి జీవితంలో ఏమాత్రమూ మార్పుగలిగించదు.

మహీముడు కల్లైటూరిలో ఉన్నమనిషి కాబట్టి ఈవిషయాలన్నీ అతనికి బాగా తెలుసును. అందుచేత అతను అనవసరంగా కేకలుపెట్టి ఇరుగుపొరుగు వాళ్ళకి నిద్రాభంగం కలిగించలేదు! అసలు అల్లాగ కేకలు పెట్టడంవల్లకూడా ఏమీ ప్రయోజనంలేదు. అదీగాక అతని ఇంటిచుట్టూరా ఉన్న [illegible]తోటపాటి మంటలు మిగిలిన ఇళ్లమీదికి వెళ్ళడానికి అవకాశంలేదు. సురేసుడు పడుకున్న గదికి నిప్పంటుకోడానికి ఇంకాచాలాఆలస్యంఉంది. అచలపడుకున్న గదిమాత్రం చాలా అపాయకరమైనస్థితిలో ఉంది. అందుచేత మహీముడు అచలపడుకున్న గదిదగ్గిరికి వెళ్ళి గబగబా తలుపుకొట్టి 'అచలా' అనిపిలిచాడు.

అచల మేలుకొనేఉన్నట్లు ఎందుకు అనిసమాధానం ఇచ్చింది. మహీముడు "తలుపుతీసి ఇవతలికిరా!" అన్నాడు. అచల అలసిపోయిన కంఠస్వరంతో "ఏం! నేనుకులాసాగానే ఉన్నాను." అంది. మహీముడు "త్వరగా ఇవతలికిరా! ఆలస్యంచెయ్యకు. ఇల్లుఅంటుకుంది" అన్నాడు. అచలదానికిసమాధానంగా ఒకపెద్ద వెర్రికేకపెట్టింది. అంతే ఆపైన మళ్ళీ ఏమీ వినబడలేదు. మహీముడు మళ్ళీ ఎంతో కంగారుపడుతూ గట్టిగాపిలిచాడు. కానిసమాధానమేమీ రాలేదు. చివరికి మహీముడు అనుకున్నట్లే జరిగింది. అచలకి ఇల్లు అంటుకోడం అంటేఏమిటో తెలియదు. బహుశః ఆమెఇంతవరకూ కళ్లు మూసుకుని సమాధానంచెప్పిఉంటుంది. కానిచటుక్కుని కళ్ళుతెరచి ఒక్కసారిగా ఆమంటలు చూసి స్పృహతప్పి పడిపోయింది. మహీముడుకూడా ఇల్లాగే జరిగిఉంటుందని ఊహించాడు. అందుచేత అతను ఒకతలుపు ఊతకఎత్తి లోపలప్రవేశించాడు. లోపల మూర్ఛపడిఉన్న

భార్యనుఎత్తుకుని వీధిలోకివచ్చి నిలబడ్డాడు.

ఆపైన అతను ఇంటిలోఉన్నవాళ్ళ నందరినీ లేపడానికి ఒక్కొక్కళ్ళనే పేరుపెట్టిపిలిచాడు. సురేశుడు అప్పుడే వీధిలోకివచ్చి నుంచున్నాడు. యదువూ మొదలైననౌకరులుకూడా తలుపులు తెరుచుకొని వీధిలోకి పరుగెత్తుకొనివచ్చారు. ఆపైన మళ్ళీ ఒకపెద్దచప్పుడు అయింది. ఆధ్వనికి అచలకి మెలకువ వచ్చింది. ఆమె కళ్ళు తెరచి చటుక్కుని భర్తకంఠం కౌగలించుకుని వెక్కివెక్కి ఏడవడంమొదలు పెట్టింది.

మహీముడు అందరినీ లేపి వీధిలోకి వచ్చి నిలబడేటప్పటికి నడికొప్పు అంటుకుంది. అతనికి చటుక్కుని, అచలనగలూ మొదలైన విలువైనవస్తువులన్నీ ఆగదిలోనే ఉన్నాయన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. ఇంక ఒక్క నిమిషం ఆలస్యంచేస్తే ఆవస్తువులు దక్కవు! అచలకి క్రమంగా తెలివి వచ్చింది. ఆమెచటుక్కుని భర్తచెయ్యి పట్టుకుని "నామీద పగతీర్చుకోడానికి ఇదేసమయం అనుకుంటున్నారా! అట్లా జరగడానికి వీల్లేదు! ఏమైనాసరే! మిమ్మల్ని లోపలికి వెళ్ళనివ్వను. పోనీలెండి! అన్నీ తగులబడి పోనివ్వండి! వెళ్ళడానికి వీల్లేదు." అంది.

మహీముడు "వెళ్ళకుండా ఉండడానికి వీల్లేదు అచలా!" అని చెప్పి బలవంతంగా చెయ్యి విడిపించుకుని, దట్టంగా కమ్ముకొంటూన్న పొగలో ప్రవేశించాడు. యదువుకూడా గట్టిగా కేకలు పెడుతూ అతనివెంట పడ్డాడు. సురేశు డింతవరకూ మతిపోయిన వాడిలాగ చూస్తూ నుంచున్నాడు. చటుక్కుని మళ్ళీఅతనికి తెలివి వచ్చినట్లయింది. అతను దేనికోసమో లోపలికి పరిగెత్తబోయాడు; కాని అచల చటుక్కుని అతనికండువాఅంచు చేత్తోపట్టుకుని అతికఠినంగా "మీరెక్కడికి వెడుతున్నారు?" అంది. సురేశుడు తనకండువాలాక్కుంటూ "మహీముడే వెళ్ళాడు. మరి—" అని ఏదోఅనబోయాడు. అచల కఠినంగా "ఆయన

తనసామానులకోసం వెళ్ళారు? ఊరికేందుకు? ఏమైనాసరే! మిమ్మల్ని వెళ్ళనివ్వను!" అంది ఆమె కంఠస్వరంలో స్నేహం కొంచెమైనా కనబడలేదు. కేవలం సంబంధంలేని మనిషిని అనవసరంగా కలగజేసుకోవద్దని చెప్పినట్లే ఉంది.

రెండుమూడు నిమిషాలతరవాత మహిముడు తలమీద ఒకపెట్టె పెట్టుకుని రెండుచేతులతోనూ రెండుపెట్టెలూ పట్టుకుని, ఆపొగలోంచి ఇవతలపడ్డాడు. ఆపైన అతను ఒకపెట్టె అచల కాళ్ళదగ్గిర పెట్టి, "నీనగల పెట్టె జాగ్రత్తగా చూసుకో! మరచిపోయిమరి అక్కడా ఇక్కడా పెట్టకు! ఇంక నీపుస్తకాలూ అవీ—" అన్నాడు.

అచల నోటమ్మట ఏసమాధానమూ రాలేదు. ఆమెగుప్పిట్లో ఇంకా సురేశుడికండువా ఉంది. మహిముడు ఒక్కక్షణం ఆకండువాకేసి చూసి యాదవుని తీసుకుని మళ్ళీ ఇంకోచోటికి వెళ్ళాడు.

## ౨౦

తెల్లవారింది. ప్రాతఃకాల కాంతిపడిన భర్తముఖం చూసేటప్పటికి అచలకి లోలోపల ఎంతో బాధకలిగింది. ఎంతప్రయత్నించినా ఆమె దుఃఖం ఆపుకోలేకపోయింది. ఇదేమిటిల్లా అయిపోయింది! మహిముడి తలనిండా దుమ్ముపడింది. ఒళ్ళంతా దుమ్ముపడి నల్లగా అయిపోయింది! ముఖం అంతా మంటవేడికి కమిలిపోయింది! ఎంతో అందంగా ఉండే మహిముడు ఒక్కరాత్రిలో ముసలివాడయిపోయాడు. పల్లెటూరివాళ్లు నాలుగు వైపులా మూగి, ఏవేవో మాట్లాడుకుంటున్నారు. కొందరు "పాత్ర సామానులూ అవీ పూర్తిగా కరిగిపోయాయి. ఒకట్రంకుపెట్టెతో నగలూ, బట్టలూ తీసుకువస్తే మాత్రం ఏమవుతుంది; అని ఈవిషయంలో ఒక పెద్ద చర్చఒకటి ప్రారంభించారు. మహిముడు ఆరిపోతూన్న అగ్ని పర్వతంలాగ అవన్నీ చూస్తూ నుంచున్నాడు. మహిముడు వాళ్ళందరూ

అనేమాటలన్నీ వింటూనేవున్నాడు. అతనికి వాళ్ళుండిరూ ఏమను కుంటున్నారో వినాలనే కుతూహలంమాత్రం ఇంకా పోలేదు. ఆపక్క వీధిలో బెనర్జీఅనే ఒక సన్యాసి ఉన్నాడు. ఆయనంటే అందరికీ ఎంతో గౌరవం. ఆయనకీమధ్యన ఒళ్ళంతా సీకుపట్టింది. అందుచేత ఇంతవరకూ ఇక్కడికి రాలేకపోయాడు. ఆయన ఒక కర్రమీద ఆనుకుని తనబం ధంతో కలిసి మెల్లిమెల్లిగా అక్కడికి జేరుకున్నాడు. మహిముడు ఆయున్ని చూసి కొంచెందగ్గరగా వెళ్ళాడు. బెనర్జీ చాలా సేపు విచా రించి. మహిముడితో "మహిమా! మీనాన్నగారు పోయి అప్పుడే చాలారోజులైంది. పాపం! ఆయునదీ నాదీ ఒక్కటేప్రాణం!" అన్నాడు మహిముడు ఆయనకేసి తిరిగివింతో భయభక్తులతో "చిత్తం; సందేహం ఏమిటండి!" అన్నాడు. బెనర్జీ "ఇల్లాగ జరుగుతుందని నేను మొట్టమొ దటినించీ అనుకుంటూనేఉన్నాను" అన్నాడు. మహిముడికి ఆమాట అర్థంకాక ఆయనఅభిప్రాయం తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో ఆయన కేసి చూస్తూనుంచున్నాడు.

అచలకొన్నిసామానులు చేత్తోపుచ్చుకుని, ఆపక్కనేఉన్న దడి పక్కగా నుంచుంది. ఆమెకికూడా బెనర్జీ ఏమిఅంటాడో వినాలని ఎంతో ఆసక్తికలిగింది. బెనర్జీ ఈమాత్రం ఉపోద్ఘాతం చెప్పి, ఆపైన "భగ వంతుడికి కోపంవస్తే ఊరికేపోతుందా; బాబూ? కాస్త మాలాంటి వాళ్ళతో ఒక్కమాటైనా చెప్పావుకాదు! ఇంతగొప్పవంశంలో పుట్టి, చివరికి ఎల్లాంటి చండాలపుపని చేశావు!" అన్నాడు. మహిముడికి ఆయన అభిప్రాయం ఏమిటో ఇంతవరకూ బోధపడలేదు. బెనర్జీ తను అంటూన్న విషయం ఇంకా వివరించి చెప్పవలసిందనే అభిప్రాయంతో తన అనుచరులకేసి చూస్తూ "తప్పకుండా ఏదోఒకపెద్ద ఉపద్రవం వచ్చితీరుతుందని మేమందరమూ అనుకుంటూనే ఉన్నాము! ఇంత వరకు నయమే! ఇంకమిగిలినవాళ్ళ ఎవళ్ళమీదా భగవంతుడికి

దయతప్పలేదు! బాబూ! బ్రహ్మసమాజం అన్నా క్రిస్తానీమతం అన్నా ఒకటే! తెల్లవాళ్ళయితే క్రిస్తానీవాళ్ళంటారు! బంగాళీ వాళ్ళయితే బ్రహ్మసమాజిస్టు లంటారు! శాస్త్ర శాస్త్రజ్ఞానం ఉన్న మాలాంటివాళ్ళకి మాత్రం తెలియకపోలేదు బాబూ! అన్నాడు. ఆయన మాటలు ఆ అనుచరులంతా ఎంతో ఉత్సాహంతో ఆమోదించారు. బెనర్జీ ఆపైన మరింత ఉత్సాహంతో "ఏంచేసినా చెయ్యకపోయినా ప్రాయశ్చిత్తం మాత్రం తప్పదు బాబూ! ఆపైని ఈవిణ్ణి విడిచి—" అని ఏదో అనబోయాడు.

ఆ మాటలమీద మహిముడు చటుక్కుని చెయ్యెత్తి "ఆగండి! మిమ్మల్ని అగౌరవపరచడం నాకిష్టం లేదుగాని, మీరు ఇష్టంవచ్చినట్లు మాట్లాడడానికి వీల్లేదు. నా భార్య అదృష్టం ఉంటే ఈ జబ్బు నిలబడుతుంది. లేకపోతే ఇంకో పదిసార్లు తగులబడిపోయినా నేను సహించి ఊరుకోవలసిందే!" అని చెప్పి చటుక్కుని ఇంకో చోటికి వెళ్ళిపోయాడు. బెనర్జీ అనుచరులతో సహా నోరు తెరుచుకుని అల్లాగే నిలబడిపోయాడు! ఆపైన కర్ర ఆడించుకుంటూ గబగబా ఇంటికి వెళ్ళిపోయాడు. ఆయన ఇంటికి వెళ్ళిన తరవాత అనుకున్నవన్నీ ఇక్కడ రాయడం అట్టే మంచి పని కాదు!

అచల ఆ మాటలన్నీ వింది. వినగానే ఆమె రెండు కళ్ళల్లోనించీ బొటబొటమని కన్నీళ్ళు రాలాయి. ఆ తరవాత యదువు వచ్చి "అమ్మా! బాబుగారు మిమ్మల్ని అడిగి సవారీ తేవడానికి వెళ్ళమంటున్నారు. వెళ్ళనా అమ్మా!" అన్నాడు. అచల చీరచెరగుతో కన్నీళ్ళు తుడుచుకుని "ఆయన్ని ఒకసారి ఇక్కడికి రమ్మనమన్నానని చెప్పు!" అంది. యదువు "అమ్మా! మరి సవారీ" అన్నాడు. అచల "సరేలే! వాని మాట అల్లా ఉండనీ!" అంది.

మహిముడు దగ్గిరగా వచ్చి నుంచున్నాడు. అతన్ని చూడగానే

ఆమెకు మళ్ళీ కళ్ళమ్మటనీళ్లు గిర్రునతిరిగాయి. ఆమె చటుక్కుని ఒంగి అతనిపాదాలకి నమస్కరించింది. మహిముడెంతో ఆశ్చర్యపడి కంగారు పడ్డాడు. బహుశః ఆమె చెయ్యిపట్టుకుని అతన్ని దగ్గిరగా కూర్చో పెట్టుకోవాలని అనుకుని ఉంటుంది! ఆమె ఏమనుకుందో పరమేశ్వ రుడికే తెలియాలి! అప్పటికప్పుడే తెల్లవారిపోతూ ఉంది. నాలుగు పక్కలా జనం తిరుగుతున్నారు; అందుచేత అచల అనుకున్న దేమీ చెయ్యకుండా మనస్సు శాంతింపజేసుకుని అయితే సవారీ ఎందుకు?" అని అడిగింది. మహిముడు "తొమ్మిదిగంటలబండి దొరికితే బాగుండును. ఒంటిగంట అయ్యేటప్పటికి ఇంటికివెళ్ళి స్నానంచేసి భోజనం చెయ్య వచ్చును. నిన్నరాత్రికూడా నువ్వేమీ తినలేదు" అన్నాడు. అచల "అయితే మీరో!" అంది. మహిముడు కొంచెంసేపు ఆలోచించి "నాకు ఏదోవిధంగా కాలక్షేపం అయిపోతుంది" అన్నాడు.

"అయితే నాకూ అవుతుంది! నేను వెళ్ళను."

"నీ కెల్లా అవుతుంది చెప్పు!"

అచల ఈప్రశ్నకి సమాధానం చెప్పలేకపోయింది. కాని, "నాకు అడివిలో చెట్లకిందైనా కాలక్షేపం అయిపోతుంది" అనేమాట ఆమె నాలికచివరదాకా వచ్చింది; కాని అసలు నిజంగా ఇల్లాగ జరగడానికి అవకాశం ఏమీలేదు! ఇంక పొరుగింటి వాళ్ళ ఇంట్లో ఉంటే ఎంత శోభస్కరంగా ఉంటుందో, ఆమె కిప్పుడిప్పుడే తెలిసింది! మృణాల సంగతి ఆమెకి జ్ఞాపకం రాకపోలేదు! చాలాసార్లు జ్ఞాపకంవచ్చింది, అయితే సిగ్గుచేత ఆమె ఆప్రస్తావన ఎత్తలేకపోయింది. ఆపైన కొంచెం సేపూరుకుని "మీరుకూడా నాతోరండి!" అంది.

మహిముడు ఎంతోఆశ్చర్యపడి "నేనుకూడా రానా? వస్తే లాభం ఏమిఉంది?" అన్నాడు. అచల "లాభంసంగతీ అదీ నేను చూసు కుంటాను లెండి! ఇక్కడమీకు ఇష్టులు ఆక్షేపమంది లేరు; ఆసంగతి

నేనెరుగుదును. అదీగాక, తెల్లవారేటప్పటికి మీ ముఖం ఎల్లామారి పోయిందో మీకేం తెలుసును? నన్ను చంపినా సరే! నేను మిమ్మల్ని ఇక్కడ విడిచిపెట్టి ఒంటరిగా వెళ్ళలేను" అంది. మహిముడిమనస్సులో ఒక పెద్దప్రళయమే బయలుదేరింది. అతను ఆపైన ధైర్యంచిక్కబట్టుకుని ఉండలేకపోయాడు. అచలమళ్ళీ "మీరు దీనికోసం ఇంత ఆలోచించడం ఎందుకు? నాదగ్గిర నగలున్నాయి. పడమటిదేశం వెడితే ఈనగలుపెట్టి ఎక్కడోఅక్కడ ఒక చిన్నఇల్లు కొనుక్కోవచ్చును. మీరు నన్ను ఎక్కడికి వెళ్ళినా పోషించగలరుకదా? మీరింక ఎల్లాగా ఆప్రయత్నంలో ఉంటారు. ఇక్కడినుంచి మీకష్టసుఖాలన్నీ నామీద పడవెయ్యమని నేనింతకిపూర్వమే చెప్పానుగా!" అంది.

యదువువచ్చి "సవారీ తీసుకురావడానికి వెళ్ళనా అమ్మా!" అని అడిగాడు. అచల దానిసమాధానంకోసం ఎంతో ఆసక్తితో భర్త ముఖంకేసిచూస్తూకూర్చుంది; కాని మహిముడు దానికేమీసమాధానం చెప్పలేదు; కాని ఆతరవాత ఒక్కనిమిషం ఉండి యదువుతో సవారీ తెమ్మనిచెప్పి "అయితే నేనుమాత్రం ఇప్పుడురాలేను" అన్నాడు. ఆమాట వినేసరికి అచలమనస్సుకి ఎంతోశాంతీ తృప్తీ కలిగాయి. ఆపైన హృదయంకొంత శాంతింపజేసుకుని ఆమె "సరే అయితే బాగానేఉంది మీరు నుంచున్నపడంగా బయలు దేరడానికి ఎల్లాగా వీలు లేదు; కాని సాయంత్రంబండికి బయలుదేరడానికి వీలుపడుతుందిగా! చెప్పండిమరి, లేకపోతే మీకోసం భోజనంచెయ్యకుండా కనిపెట్టుకుని కూర్చోవలసివస్తుంది ఆపైన—"అని ఏదో చెప్పబోయింది.

ఆమాటమీద మహిముడొక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టాడు. దాన్నిబట్టి అచలకి అతనిమనస్సులో ఉన్నఅభిప్రాయం తెలిసిపోయింది. ఆపైన ఆమెకొంత ఔదాసీన్యం వహించి భయపడుతూ "అయితే సాయంత్రం బండికికూడా రాలేరా! అయితే అర్ధరాత్రిఅంతా ఎవరింట్లో"?

"అని సగంసగం చెప్పిఊరుకుంది. ఆమె ఆపైన ఇంక మాట్లాడలేక పోయింది. మహీముడికి ఎవరింటికి వెళ్ళడానికి వీలుందో అచలకి తెలుసును. ఆసంగతి తలచుకునేసరికి ఆమెముఖంలో గాంభీర్యమూ, ఔదాసీన్యమూకూడా కనిపించాయి. బహుశః ఆమె మనస్సులో ఉన్న అభిప్రాయము మహీముడికి తెలిసిఉండదు. అతను "కలకత్తాలో నన్నెక్కడ ఉండమంటావు?" అనఅడిగాడు. అచల తత్క్షణమే "ఏం! మా నాన్నగారి ఇంట్లోనే" అంది. మహీముడు తలఅడ్డంగాతిప్పుతూ "అక్క-డికిరాను" అన్నాడు. అచల "ఏం మీకది స్వగృహంకాదా" అని అడి-గింది. మహీముడు మళ్ళీపూర్వంమోస్తరుగానే తలఅడ్డంగాతిప్పి 'కాదు' అన్నాడు. అచల "పోనీ అల్లాగ కాకపోతే మనంఅక్కడ రెండుమూడు రోజు లుండి పడమటిదేశం వెళ్ళిపోదాము" అంది.

"అల్లాగ వీల్లేదు"

అచలకి అతను పట్టినపట్టు విడవడని తెలుసును. అందుచేత ఒక్క-నిమిషం ఆలోచించి "అయితే నడవండి, ఇక్కడినించే తిన్నగా పడమటి దేశం వెళ్ళిపోదాము. నేను కూడాఉంటే మీకేఇబ్బందీ రాదు; కాని నగలుమాత్రం అమ్మక తప్పదు. అల్లాంటప్పుడు కలకత్తా వెళ్ళకపోతే ఎల్లాగ?"అంది. మహీముడు ఆమె కేసి చూడకుండా ఇంకొక వైపుచూస్తూ మాట్లాడకూరుకున్నాడు. అచల అతను మాట్లాడక ఊరుకోవడం చూసి ఇంకభరించలేక "పడమటిదేశంలో చాలాపెద్దపెద్ద పట్టణా-లున్నాయి. కావలిస్తే అక్కడ నగలు అమ్ముకోవచ్చునుగా! నాపెట్టెలో ఇప్పుడు సుమారు రెండువందల రూపాయలున్నాయి. ఆడబ్బు మన ప్రయాణాలకి సరిపోతుంది. ఏం మాట్లాడక ఊరుకున్నారేమిటి? తొందరగా సమాధానం చెప్పండి!" అంది.

మహీముడు ఆమెముఖంకేసిచూడలేక అల్లాగే ముఖం ఇంకొక పక్కకి తిప్పి "నీనగలు నేనుపుచ్చుకోలేను అచలా!" అన్నాడు. ఆమాట

ఆమెగుండెల్లో ఒకబాకులా దిగింది. అందుచేత ఆమె ఒకఅడుగు వెనక్కి తగ్గి "ఏం! ఎందుకు పుచ్చుకోలేరు!" అని అడిగింది.

మహీముడు దీనికేమీ సమాధానం చెప్పలేకపోయాడు. ఆపైన కొంచెంసేపటిదాకా వాళ్ళిద్దరూ అల్లాగే మాట్లాడకూరుకున్నారు. ఆపైన అచల హఠాత్తుగా "ప్రపంచకంలో మీరొక్కరే భర్తగా ఉన్నారా! ఆపత్తు వచ్చినవాళ్లందరూ ఏమిచేస్తున్నారు? అసలు ఆడదానికి నగలుఅంటూ ఉండడంఎందుకు అయితే ఇంతాకష్టపడి, ఈనగలన్నీ ఆనిప్పుల్లోంచి ఎందుకు తీసుకువచ్చారు?" అని ఆపక్కనున్న ట్రంకుపెట్టె మీద చేత్తో ఒకదెబ్బకొట్టింది. ఆపైన మళ్ళీ "ఆపద వచ్చినప్పుడు సహాయపడకపోయినతరవాత ఈనగలన్నీ ఇల్లాగ మోసుకుంటూ తిరగడం ఎందుకు! ఇంకా మంట మండుతూనేఉంది. ఈనగలన్నీ ఆమంటలో పడవేసి హాయిగా నాదారినినేనుపోతాను. ఆపైన మీకెల్లాగ తోస్తే అల్లాగ చెయ్యండి" అంది. ఆపైన చీరచెరగుతో ముఖంకప్పుకుంది.

ఆపైన రెండుమూడు నిమిషాలున్నతరవాత మహీముడు మెల్లిగా "అచలా! నే నీవిషయాలన్నీ ఆలోచించాను. నేను ఏవిషయంలోనూ తొందరపడను. మరొకళ్ళు తొందరపడితేకూడా నేను అంగీకరించను. నువ్వు ఇచ్చేవస్తువులు నాస్వంతవస్తువులే. అవి తీసుకోగలిగితే నేనెంతో ఆనందించిఉందును; కాని ఏవిధంగాకూడా నేనావస్తువులు నీదగ్గిరనించి తీసుకోలేకుండా ఉన్నాను. నాకష్టం చూసి ఎవళ్లైనా నాకు సహాయం చెయ్యాలని అనుకున్నారనుకో! నీదయకూడా సరిగ్గాఅల్లాంటిదే! దానికీ దీనికీ ఏమీ తేడాలేదు. ఈదానంమనఉభయులకీకూడా క్షేమకరంకాదని నే ననుకుంటున్నాను" అన్నాడు.

అచల ఇంక ఆమాట సహించలేకపోయింది. ఏడవడంమానేసి ఇంక మహీముడితో తీవ్రంగా వాగ్వాదం చేద్దామని అనుకుంది. అందుచేత ఆమెకళ్ళు గర్వంవల్ల బాగా ఎర్రబడిపోయాయి. కాని మహీముడు

ఇంతట్లో ఇంకోపక్కకి చూశాడు; అచలకూడా అతనుచూస్తూన్న పక్కకే చూసింది. అక్కడికి కొంతదూరంలో సహాయముగానే ఒకచెరువు ఉంది. ఆచెరువుగట్టుమీద ఒకచక్కని తోపకూడా ఉంది. సురేశుడు చెట్టుకిందకట్టిన ఒక వేదికమీద తనచెయ్యి ఆనుకుని ఆకాశంకేసి చూస్తూకూర్చున్నాడు. అతన్ని చూసేటప్పటికి అచలకి నోట్లోనుంచి మాట నోట్లోనే ఉండిపోయింది. పైకి ఎత్తిపోయిన తల పైకెత్తకుండానే కిందకివాల్చేసింది.

ఆపైన సుహాసముకు కొంచెం ధ్యానంగా పైకివినబడేటట్లు తనలో తను "నిన్నింక అస్తమానమూ బాధపెడ్తూ ఉంటానని అనుకోకు! మొట్టమొదటినుంచీ మనఇద్దరిమధ్యనా ఇల్లాంటిది ఎప్పుడూ రాలేదు" అన్నాడు. ఆపైన మళ్లీ కొంతసేపుఆగి "అచలా, తనకి తోచినధర్మం చెయ్యడంలో అనేకమైన ఇబ్బందులున్నాయి. తొందరపడి ఏదేనా ఒకపని చేస్తే దానివల్ల వచ్చేఫలితం జన్మఉన్నంతకాలమూ అనుభవించవలసిఉంటుంది. ఒక్కపొరబాటు చెయ్యడంవల్లనే నువ్వు మనస్సులో ఎంతో బాధ పడుతున్నావు. ఆ సంగతి నాకు తెలుసును! ఇప్పుడుమళ్ళీ ఇంకోపొరబాటు చేస్తే దానివల్ల నీకూనాకూకూడా సుఖముండదు. అదీగాక ఈకష్టాలన్నీ భరించగల సహనశక్తికూడా నీదగ్గరలేదు. ఈవిషయాలన్నీ నువ్వు ఈవేళ ఆలోచించకపోయినా రేపైనా ఆలోచించక తప్పదు. అందుచేత నేనునీదగ్గిరనించి ఏమీ తీసుకోలేకపోతున్నాను" అన్నాడు.

ఈమాటలన్నీ వెళ్లి అచలగుండెల్లో బాకుల్లాగ గుచ్చుకున్నాయి. భర్త తనని బాగా పరాయి దాన్నిగా చూస్తున్నాడని ఆమెకి తెలిసింది. ఈసంగతి ఆమెకింత స్పష్టంగా ఇంతకిపూర్వం ఎప్పుడూ తెలియలేదు. దీనికితోడు ఆమెకు మృణాలసంగతికూడా జ్ఞాపకంవచ్చింది. దాంతో ఆమెశోకానికి అంతూదరీ లేకపోయింది. అందుచేత ఆమెకూడా

అతికష్టంగా "మీరింకా కటినించీ చెబుతూన్న మాటలు నాకూ తెలుసును. బహుశః మీరన్నమాటలన్నీ నిజమే అనుకుంటాను. మిమ్మల్ని చూస్తే జాలేసి నాదగ్గిరడబ్బంతా మీకు ధారపోద్దా మనుకున్నాను. బహుశః పెళ్ళైనతరవాత దీన్నిగురించి నేను పశ్చాత్తాపపడతానేమో! అయితే ఆనమ్మను. అంతా బాగానేఉంది; కాని ఒక్కమాట. ఒకళ్ల మనస్సులోఉన్న సంగతులు గ్రహించేశక్తి మీదగ్గిర ఎక్కువగానే ఉంటున్నట్టుంది. అల్లాగే ఇతరులు కూడా మీమనస్సులోఉన్న సంగతులు గ్రహించగలరనేమాట మరిచిపోకండి. స్త్రీదగ్గిర వస్తువులు బలవంతంగా తీసుకోడమనేమాట అల్లాఉండనీయండి. అసలు ఆ ఉద్యోగానికి ఉండవలసిన అర్హతఅయినా మీదగ్గిర ఉందా? ఇప్పటికి నేను మీదగ్గిరకి తగాదాకోసం రాలేదు పోనియ్యండి. మీకు ఈమాత్రం అయినా మంచిచెడ్డలు తెలుసుకునేశక్తి కలిగినందుకు నాకెంతో సంతోషంగాఉంది; కాని ఒక్కమాట; ఎప్పటికైనా మీకు అసలువిషయం తెలియకపోదులెండి. తప్పకుండా తెలిసితీరుతుంది." అని చెప్పి చేతులతో కళ్లుమూసుకుని పొంగిపొంగి వస్తూన్న దుఃఖం ఆపుకుంది.

సురేశుడు తొమ్మిదిగంటలబండీమీద ఇంటికి వెళ్లిపోతున్నాడు. గడిచినరాత్రి జరిగినసంఘటనచేత అతనిమనస్సంతా అదోవిధంగా అయిపోయింది ఆఖరికి అతనికి ఇతరులతో మాట్లాడడానికి శక్తికూడా లేకపోయింది. ఇంక బండిరావడానికి ఎంతోఆలస్యంలేదు. సురేశుడు మహిముణ్ణి స్టేషనులో ఒకమూలకి తీసుకువెళ్లి కొంచెంసేపు నిశ్శబ్దంగా ఉన్నతరవాత "మహిమా! ఇల్లు తగులబడిపోవడంలో నీకు నామీద ఏమన్నా అనుమానం కలిగిందా?" అని అడిగాడు. మహిముడు అతని రెండుచేతులూ పట్టుకుని "ఛీ" అనిమాత్రం అన్నాడు. అంతే సురేశుడికి కళ్లమ్మటనీళ్లు వచ్చాయి. అతను గద్గదస్వరంతో "నాకీ భయంచేత నిన్నటినించీ మనస్సుకి శాంతిలేదు" అన్నాడు.

మహిముడు సురేశుడిచెయ్యిపట్టుకుని ఊరికేగట్టిగా నొక్కాడు. ఆతరవాత "సురేశా! ఒకనిజమైన తప్పుచేస్తే ఇంతకిపూర్వం చేసిందికూడా చెడ్డకింద మారుతుంది. అదిఅల్లాగ ఉండనీ కష్టంలో ఉన్నప్పుడు నువ్వు ఎల్లాంటిపనిఅయినా చేస్తావుగాని ఇల్లాంటిదారుణంపనిమాత్రంఎప్పుడూ చెయ్యవు. ఈవిషయంలో నాకుఇప్పటికీ నమ్మకంఉంది" అన్నాడు. ఆపైన మళ్లీ కొంచెంసేపు ఆగి "సురేశా! నీకు భగవంతుడంటే నమ్మకం లేదు; కాని నమ్మకం ఉన్నవాళ్లనమ్మకం పోగొట్టవద్దని మాత్రం నావంటివాళ్లెప్పుడూ ప్రార్థిస్తూఉంటారు" అన్నాడు.

ఇంతలో బండివచ్చేసింది. మహిముడు అచలనీ, ఆమెదాసీదాన్నీ ఆడవాళ్లపెట్టెలో ఎక్కించి సురేశుడిదగ్గిరకి వచ్చాడు. సురేశుడు అతన్నిచూసి కిటికీలోంచి చెయ్యిచాపి అతనికుడిచెయ్యి పట్టుకుని "నీకు కలిగిన ఆపత్తుకి నేనేదైన సహాయం చేస్తానని విన్నంతో బతిమాలాను కాని నువ్వు దానికి అంగీకరించలేదు. పోనీ నీభగవంతుడే నీప్రార్థన మన్నిస్తాడులే!" అని చెప్పి ముఖం ఇంకోపక్కకి తిప్పి వేసుకున్నాడు.

అచల ఇంకోపెట్టెలోంచి ఇవతలికిచూస్తూ యెదురుతో ఏదో మాట్లాడుతూంది. మహిముడు దగ్గిరకిరాగానే ఆమె "మృణాలఅక్కయ్య భర్త పోయారా!" అని అడిగింది. మహిముడు ఆమెకేసి చూస్తూ "అవును ఈమాట నాకు ఇప్పుడే ఒకగంటపూర్వం తెలిసింది" అన్నాడు. అచల "ఇంచుమించుగా ఆయన పదిపదకొండు రోజులనించి న్యూమోనియాతో బాధపడ్డారుట! ఈమాత్రంమాట నాతోచెప్పాలని మీకుతోచలేదూ!" అని అడిగింది. మహిముడు సమాధానంచెప్పాలని అనుకున్నాడు. కాని ఎల్లాచెబితే బాగాఉంటుందో అని ఆలోచించు కుంటూ ఉంటే కూతకూసి బండి కదిలిపోయింది.

## ౨౧

ఇంతవరకూ కేదారబాబుకి పూర్వంమోస్తరుగా ఆరోగ్యం కలగలేదు. అతను భోజనంచేసి వరండాలో ఒకపడకకుర్చీమీద పేపరు చదువుకుంటూ కునికిపాట్లు పడుతున్నాడు. ఇంతలో అతనికి గుమ్మందగ్గిర గుఱ్ఱపుబండి ఆగినట్లైంది, బండిలోంచి సురేశుడూ, అచలా, దాసీమనిషీ దిగారు. కేదారబాబుకి ఒక్కనిమిషంలో బద్ధకంఅంతా ఎగిరిపోయింది. అతనిమనస్సులో ఒకపెద్దఅనుమానం కలిగింది. అతను చటుక్కుని వాళ్లకేసి తొంగిచూసి “అచలా! మీరిద్దరూ ఎక్కడినించి వస్తున్నారు! నారాయణమ్మా! ఏమిటీవిశేషాలు! ఏమిటి! ఇదంతా! నాకేమి బోధపడకుండా ఉంది!” అన్నాడు.

అచల పైకివచ్చి తండ్రిపాదాలు స్పృశించింది. సురేశుడు నమస్కారంచేసి “మీకు మహిముడిచ్చిన టెలిగ్రాము అందలేదూ?” అని అడిగాడు. కేదారబాబు కంగారుపడుతూ “అబ్బే” అన్నాడు. సురేశుడు ఆపైన ఒకకుర్చీలాక్కుని దానిమీద కూర్చుని “బహుశః టెలిగ్రాము ఇవ్వడం మరిచిపోయిఉంటాడు; లేకపోతే, ఇంతవరకూ టెలిగ్రాము అందలేదేమో!” అన్నాడు. కేదారబాబు “టెలిగ్రాము మాట అల్లాఉండనిచ్చి, అసలు జరిగినసంగతేమిటి చెప్పండి! మీరు వీళ్ళనిద్దరినీ ఎక్కడినించి తీసుకువస్తున్నారు!” అన్నాడు. సురేశుడు “నిన్నరాత్రి నిప్పంటుకుని మహిముడిఇల్లు తగులడిపోయింది.” అన్నాడు. కేదారబాబు “ఇల్లు అంటుకుపోయిందా? ఏమంటున్నారు? పూర్తిగా కాలిపోయిందా? ఎల్లాగ అంటుకుంది? మహిము ఎక్కడ ఉన్నాడు? వీళ్ళని మీరు ఎక్కడ కలుసుకున్నారు?” అని ఇల్లాగ ఒకగుక్కలో ఎన్నో ప్రశ్నలువేసి, చటుక్కుని పడకకుర్చీలో కూలబడిపోయాడు. సురేశుడు “నేను వీళ్ళని అక్కడినించే తీసుకువస్తున్నాను! మరినేను అక్కడే ఉన్నానుకాదూ!” అన్నాడు.

కేదారబాబుకి ఈమాట రుచించలేదు. అతను గంభీరంగా "మీరు అక్కడఉన్నారా? ఎప్పుడు వెళ్ళారు? నాకీసంగతి తెలియనేలేదే! అయితే అతనెక్కడ ఉన్నాడు?" అన్నాడు. సురేశుడు "మహిముడు రాలేకపోయాడు; అందుచేత—" అని ఇంకావేదో చెప్పబోయాడు. ఆమాటమీద కేదారబాబుముఖం బాగా నల్లబడిపోయింది. ఆపైన అతను తలఅడ్డంగాతిప్పుతూ "అబ్బెబ్బే! ఇది మంచిపనికాదు! చాలా అసందర్భంగాఉంది! ఇదేమిటీ అన్యాయం! ఈమాటలేవీ నేను నమ్మను" అని కుమార్తెముఖంకేసి చూస్తూకూర్చున్నాడు.

అచల ఇంతవరకూ ఒకకుర్చీమీద చెయ్యివేసి నిశ్శబ్దంగా నుంచుంది. తండ్రికి కలిగిన ఈఅనుమానానికి ఆమెమనస్సులో ఎంతో బాధపడింది. తమరిద్దరూ బయలుదేరడానికి చెప్పినకారణం ఆయన నమ్మడంలేదని గ్రహించింది. ఈమాట అనుకునేటప్పటికి ఆమెకెంతో సిగ్గూ విరక్తీ కలిగాయి; అందుచేత ఆమెముఖం సఫేదులా తెల్లబడిపోయింది. కేదారబాబు ఆమెముఖం చూసి పొరబాటుపడ్డాడు. ఆమె తెల్లతెల్లబోవడం చూసేటప్పటికి అతని అనుమానం మరింత ఎక్కువైంది. ఆపైన కుర్చీలో చటుక్కుని కూలబడి పేపరు తనముఖానికి అడ్డంగా పెట్టుకుని ఉస్సుని నిట్టూర్పువిడిచిపెట్టి "మీఇద్దరికీ ఏమితోస్తే అదిచెయ్యండి; నేను రేపుపొద్దున్నే ఈఇల్లు విడిచిపెట్టి మరెక్కడికైనా వెళ్ళిపోతాను" అన్నాడు.

సురేశుడికి ఆశ్చర్యమూ కోపమూ ఒక్కసారిగా వచ్చాయి. అతను "కేదారబాబుగారూ! మీరు ఇల్లాగ అంటున్నారేమిటి? మీరు ఇల్లువిడిచిపెట్టి వెళ్ళిపోవడం ఎందుకు? ఇంతకీ ఏంజరిగింది?" అని అచలకేసీ కేదారబాబుకేసీ చూస్తూకూర్చున్నాడు; కాని ఇద్దరి ముఖాలూ కూడా అతనికి పూర్తిగా కనబడలేదు. కేదారబాబు దగ్గర నించి ఏసమాధానమూ రాకపోవడంమూలాన్ని సురేశుడు ఛటుక్కుని

లేచినుంచుని "ఇదిగో ! మహీంద్రుడు నామీాద పెట్టిన ఈబరువుపని కాస్తా అయిపోయింది. ఇంక మీాకందరికీ ఎల్లాగతోస్తే అల్లాగ చెయ్యండి. నేనింతవరకూ స్నానమూ భోజనమూకూడా చెయ్యలేదు ! ఇదుగో ! నేను వెళ్లిపోతున్నాను." అని తలుపుదగ్గిరికి వెళ్ళిపోయాడు. కేదార బాబు అతను వెళ్ళిపోతూఉండడం చూసి, కంగారుపడుతూ "ఇదేమిటి? వెళ్ళిపోతున్నారేమిటి ? అసలుసంగతి ఏమిటి ? వింటాను చెప్పండి ! ఇంతకీ ఇల్లు ఎల్లాగ అంటుకుంది ?" అని అడిగాడు. సురేశుడు అతికఠినంగా "అదినాకు తెలియదు" అన్నాడు.

"మీారక్కడికి ఎప్పుడు వెళ్ళారు ?"

"అయిదారు రోజులకి పూర్వము" అనిచెప్పి అతనుమళ్ళీ గబగబా వెళ్ళబోయాడు. అదిచూసి కేదారబాబు "బాబూ ! మీారెవరూ భోజనంచేసినట్టు కనబడదు. స్నానాలుకూడా అవలేదనుకుంటాను. ఏదో కాస్త స్నానంచేద్దురుగాని ! నౌకరుకూడా ఉన్నాడు. అచలా ! కాస్త వంటబ్రాహ్మణ్ణిపిలు ! అమ్మా ! ఏమిటి అల్లాగ నిలబడి పోయావేమిటి ? సురేశబాబూ ! కూర్చోండి ! అసలు జరిగినసంగతి ఏమిటో కాస్త వివరంగా చెప్పండి ! వింటా !" అన్నాడు.

సురేశుడు తిరిగివచ్చి కూర్చున్నాడు. ఆపైన ఒక్కనిమిషం ఊరుకుని "నేను రాత్రిపడుకుని నిద్రపోతున్నాను. ఇంతట్లో మహిముడి కేకలు వినిపిస్తే లేచిచూశాను. అప్పటికప్పుడే అంతా భగభగామండిపోతూ ఉంది ! ఆర్పివెయ్యడానికి ఏమీా ఉపాయం కనబడలేదు. అందుచేత అంతా మాట్లాడక కూరుకున్నారు. ఆ పూరిఇల్లంతా పూర్తిగా మండి నుసి అయిపోయింది. అంతే ! అంతకంటె ఏముంది ?" అన్నాడు. కేదారబాబు అదిరిపడి "ఏమిటి అంటున్నారు ! అంతా భగభగా మండి నుసి అయిపోయిందా ! ఆఖరికి అచలనగలైనా తియ్యడానికి వీలవ లేదూ ?" అన్నాడు.

"ఆనగలూ అవ్వీ తియ్యడానికి వీలైందా?"

కేదారబాబు "అయితే నగలూ అవ్వీ తియ్యడానికి వీలయిందన్న మాట!" అని ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి ఆతర్వాత లోపల కూర్చున్నాడు. ఆపైన ఒకనిమిషం ఊరుకుని "అయితే ఇల్లు ఎల్లాగ అంటుకొంది" అని అడిగాడు. సురేశుడు "దానిసంగతి తెలియలేదని ఇప్పుడే కాదూ మీతో చెప్పాను! అయితే ఒక్కసంగతి ఉంది. ఆఊళ్ళో అతని కెవరూ ఇష్టులు లేరని తెలిసింది" అన్నాడు.

"ఎవ్వరూ లేరూ?"

"ఎవ్వరూ లేరు!"

ఆపైన కేదారబాబు ఇంకేమీ అడగలేదు. అటుతరవాత చాలా సేపటిదాకా ఏమీ అనకుండా ఊరుకుని వీధికేసి చూసి ఒక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టి లేచినుంచున్నాడు. ఆతరవాత "రండి! సురేశ బాబూ! మీరు స్నానంచేసి భోజనం చెయ్యండి! ఇంకమరి ఆలస్యం చెయ్యకండి! కాస్త వెళ్ళి వంటఎందాకా వచ్చిందో చూస్తాను" అని చెప్పి సురేశుణ్ణికూడా తీసుకువెళ్ళాడు.

భోజనం చేసిన తరవాతకూడా కేదారబాబు సురేశుణ్ణి ఒదిలి పెట్టలేదు. అతను ఒక పడకకుర్చీమీద కునికిపాట్లుపడుతూ కూర్చు న్నాడు. అచల తనగదిలోకి వెళ్ళి లోపలగడియవేసుకుని పడు కుంది. ఇంక ఆమెసంగతి తెలియలేదు. ఇంక ఏవిధమైన విశ్రాంతి లేనిదీ ఒక్క కేదారబాబుకే. ఇంతవరకూ రాని టెలిగ్రాంకోసం అత నూరికే కంగారుపడుతున్నాడు. ఆపైనఅచలికి సాయంత్రంవేళ నిద్ర పోవడం మంచిదికాదనిన్నీ, తనదగ్గిరికి ఒకసారి రావలిసిందనిన్నీ కబురుపంపించాడు. ఆమెరాగానే "నువ్వు టెలిగ్రాము పంపించారు, టెలిగ్రాము పంపించారని అనడమేగాని ఆటెలిగ్రాము ఇంతవరకూ రాలేదు. మీఅంతట మీరు రైలుమీద వచ్చేశారు. ఇంతవరకూ

శాలిగ్రామము జాడే లేదు. సరేలే కొంచెంసేపు ఆగు అని స్లిప్పరులు తొడుక్కుని అచలనోటమ్మాట సమాధానం రాకుండానే చటుక్కుని వీధిలోకి వెళ్ళిపోయారు. అతనుకిందికి వెళ్ళిపోయిన కొంతసేపటికి కిందనించి అతను గట్టిగా మాట్లాడిన మాటలు వినిపించాయి. అతను అచల దాసీని ఏదో గుచ్చిగుచ్చి అడుగుతున్నాడు. ఆదాసీది అతనిమాటలకి ఎంతో ఆశ్చర్యపడి గట్టిగా తిరిగి సమాధానం చెబుతూ ఉంది. అది "అదేమిటి! బాబూ అల్లాగ అంటారు. తలుపులూ ద్వారబంధాలూ అన్నీశుభ్రంగా మండిపోయాయి. బాబూ! నేను స్వయంగా నాకళ్ళతో చూశాను. ఇంత చెప్పినా మీరుఇల్లు అంటుకోలేదు అంటున్నారు. ఇల్లుఅంటుకోకపోతే తలుపులూ ద్వారబంధాలూ ఎల్లాగ అంటుకుంటాయో చెప్పండి బాబూ!'' అంది.

సురేశుడు ఈమాటలన్నీ వింటూనేఉన్నాడు. అతను తలఎత్తి చూశాడు. అచల ఆపక్కనేఉన్న గుమ్మానికి పక్కగానుంచుంది. ఆమెముఖంమీద కత్తిపోటువేస్తే నెత్తురుచుక్కలేదు. ఆమెప్రతీమాటా ఎంతో జాగ్రత్తగా వింటూంది. అతను లేనినవ్వు తెచ్చుకొని "ఏమిటి మీనాన్నగారుఇల్లాగ మారిపోయారు. దీనికికారణం మీకేమైనా తెలుసునా'' అన్నాడు. అచలఉలిక్కిపడి అతనికేసిచూసి 'తెలియదు' అంది.

సురేశుడు "ఆయనకి నమ్మకం కలగలేదని నాకుబాగా తెలుసును. ఆయన ఇల్లు అంటుకోవడం మనం కల్పించినదని అనుకుంటున్నాడు. తరవాత కొంతసేపుఆగి "నిజం ఏదో అబద్ధం ఏదో కొద్దిరోజులికి ఎల్లాగా తెలుస్తుంది. అసలు నేనిక్కడికి రావడం బొత్తిగా బాగుండలేదని ఆయన అభిప్రాయము'' అన్నాడు. ఆపైన అచల తెలతెల్లబోతూ "అయితే ఇంక మీరిక్కడికిరారా?'' అంది. సురేశుడు లేచి నుంచుని "బహుశః వీలుండదనుకుంటాను. నాకక్కడా కొంత ఆత్మ

గౌరవంఅంటే ఏమిటో తెలుసును. కాస్త నూటుకేసుమాత్రం ఎవరి చేతైనా పంపించండి" అన్నాడు. అచల సరే అంది. అంతేనేగాని అతను మళ్ళీరావడంవిషయంలో ఏమీమాట్లాడలేదు "అయితే రేపు పొద్దున్నే పంపించండి. అందులో నాకు చాలా అవసరమైన వస్తువులున్నాయి. అనిచెప్పి అతనింక కేదారబాబుకోసం ఆగకుండా వెళ్ళిపోయాడు. కేదారబాబు తిరిగివచ్చి ఎంతో ఆశ్చర్యపడిఉంటాడు. మనస్సులోకూడా బాధపడిఉంటాడు. కాని ఏమీజరిగిందో తెలియదు.

అచల రాత్రి చాలాసేపటిదాకా పరుపుమీద పడుకుని దొర్లుతూనేఉంది. చివరికి కొంతసేపటికి లేచికూర్చుని దారమ్మట వస్తూ పోతూ ఉండేవాళ్ళని చూస్తుకూర్చుంటే బాగుండునని అనుకుంది. ఆపైన తనగదికి వరాండా వైపునున్న తలుపు తెరిచి వరాండాలోకి వచ్చింది. ఆమెకు అక్కడనించి చూస్తే నలుగురూకూర్చునే సావిడిలో దీపంవెలుగుతూన్నట్లు కనపడింది. మొట్టమొదట ఆమె నౌఖరు దీపం తగ్గించివెయ్యడం మరిచిపోయిఉంటాడని అనుకుంది; కాని ఇంకా కొంచెం ముందుకి వెళ్ళి చూసేటప్పడికి ఆమెకు తండ్రికంఠస్వరం వినబడింది. ఆపైన ఆమెకి కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు. సామాన్యంగా కేదారబాబు పదిగంటలు కొట్టేకొట్టడంలో పడుకునేవాడు. ఈవేళ పదిన్నరఅయినా ఇంకామేలుకునే ఉన్నాడు. ఆ ఉత్తరక్షణంలో దాసీదాని కంఠస్వరం వినపడింది. అది "ఈమధ్యన మృణాలగారి భర్తగారు పోయారండి. ఆవిడ మరిప్పుడు అత్తగారింటిలో ఉన్నారో లేరో నాకు బాగా తెలియదండి. అల్లుడు బాబుగారికీ ఆవిడకీ ఎల్లాంటి బంధుత్వమోకూడా నాకు బాగా తెలియదండి. అంది. కేదారబాబు దానికిసమాధానంగా ఊరికే ఊకొట్టి మాట్లాడకూరుకున్నాడు.

అచల వీళ్ళిద్దరూ చాలాసేపటినించీ మాట్లాడుకుంటూ ఉండవచ్చునని గ్రహించింది. మృణాలని గురించీ, తననిగురించీ, తనభర్తనిగురించీ

ఎన్నెన్నో విషయాలు మాట్లాడుకుంటున్నా రనికూడా ఆమె నిశ్చయించింది. తనని గురించి ఎల్లాంటిమాట వినబడుతుందో అనేభయంచేత ఆమె వచ్చినదారినే మెల్లిగా వెళ్ళిపోవాలని చూసింది; కాని ఆమె కాళ్ళు గొలుసులువేసి కట్టివేసిన ట్లయిపోయాయి! ఆమె అక్కడినించి కదిలి వెళ్ళలేకపోయింది. కేదారబాబు కొంతసేపూరుకుని "అయితే ఇద్దరికీ పడ లేదన్నమాట ! అంతేనా ?" అన్నాడు. దాసీది "అబ్బే! బొత్తిగా పడలేదు బాబూ ! బొత్తిగా పడలేదు ! ఇద్దరికీ ఒక్కనాడైనా పొత్తుకుదరలేదండి !" అంది. అచల ఇన్నాళ్ళనించీ 'ఈదాసీది ఒట్టి తెలివితక్కువమనిషి' అని అనుకుంది. ఈవేళ ధోరణి బట్టిచూస్తే అది ఎవరికీ తీసిపోయేమనిషి కాదని తెలిసింది.

కేదారబాబు మళ్ళీ ఒక్కనిమిషం ఊరుకుని "అయితే నిన్న రాత్రి ఆఖరికి ఎవళ్ళూ భోజనం కూడా చెయ్యలేదన్నమాట ! సురేశుడు వచ్చినప్పటినించీ తగాదాలతోటే వెళ్ళిపోతూందన్న మాట!" అన్నాడు. ఆపైన దాసీదానిమాట వినబడలేదు ; కాని అచల తండ్రిఅభిప్రాయం ఏమైఉంటుందో సులభంగానే ఊహించుకో గలిగింది. కేదారబాబు ఆపైన ఒక్కనిమిషంసేపు మాట్లాడక ఊరుకుని ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టి "నాకు మొట్టమొదటినించీకూడా ఇది ఇల్లాగ జరుగుతుందని తెలుసును. ఈరోజుల్లో పిల్లలు ఎవళ్ళూ తల్లిదండ్రులమాట వినిపించుకోవడం లేదు. లేకపోతే నేనంతా సానుకూలపరిచి ఉందును. నేను అనుకున్నట్టు జరిగితే ఈవేళ ఇంతగొడవే లేకపోను !" అని మళ్ళీ ఒక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టాడు. ఆ నిట్టూర్పు స్పష్టంగా వినబడింది.

దాసీది సంపూర్ణంగా సానుభూతి కనబరుస్తూ "బాగాఅన్నారు బాబూ ! అన లావిడ ఏమాట వినిపించుకున్నారు ! లేకపోతే ఎక్కడపల్లెటూరు ! ఎక్కడపూరిఇల్లు ! చివరికి అదీ మిగలలేదు ! అల్లుడుబాబుగారుమాత్రం——" అని ఏదో చెప్పబోయి,

ఆమాట పూర్తిచెయ్యకుండానే ఒకనిట్టూర్పు విడిచిపెట్టింది. "ఏం చెప్పను! దురదృష్టం" అని కేదారబాబు ఒకటిరెండు నిమిషాల దాకా మాట్లాడకూరుకున్నాడు. ఆపైన లేచికూర్చుని దాసీదానితో "సరేలే! నువ్వువెళ్లు" అనిచెప్పి, నౌకరినిపిలిచి దీపంతగ్గించమని చెప్పాడు.

ఆతరవాత అచల మెల్లిమెల్లిగావెళ్లి తనగదిలో పరుపుమీద పడుకుంది. తండ్రి ఔదార్యంమీద గాని, గౌరవప్రపత్తులమీదగాని అచలకి మంచిఅభిప్రాయం ఎప్పుడూలేదు; కాని అతను దాసీదానితో ఏకాంతంగా ఇల్లాగ మాట్లాడతాడని ఆమె ఎప్పుడూ అనుకోలేదు. ఆమెకీవేళ తనహృదయం అంతా ధూళిలో పొర్లాడుతున్నట్లు కనిపించింది. ఇంతేకాదు! ఆమెకు తనతండ్రి తనదాసీది తనభర్త—అందరూధూళిలో దొర్లుతూన్నట్లే కనిపించారు. ఇల్లాంటప్పుడు ఆమె ఎవరిఆసరా తీసుకుని ఈధూళిలోంచి మళ్లీ లేవడానికి ప్రయత్నిస్తుంది. ఆమె కెటుచూసినా ఏమీ ఆశకనపడ లేదు.

## ౨౨

కేదారబాబు దగ్గిర సామాన్యంగా అందరిదగ్గిరా ఉన్నట్టు మంచిగుణాలూ, చెడ్డగుణాలూ కూడా ఉన్నాయి. మొట్టమొదట ఆయన కుమార్తె వివాహవిషయంలో అల్లుడు కాస్త బియ్యే పాసయినవాడయితేచాలు ననుకున్నాడు. మహిముడు చాలాయోగ్యుడు; ఆపైన ఎమ్మేపరీక్షకూడా పాసయ్యాడు; అతనికి పల్లెటూరిలోఉన్న ఆస్తివల్ల అన్నవస్త్రాలకి లోటులేకుండా కాలక్షేపం అయిపోతుంది; అందుచేత అల్లాంటిఅల్లుడు దొరకడం తనకెంతో అదృష్టం అనుకున్నాడు; కాని సురేశుడు అకస్మాత్తుగా ఒకనాడు బండి ఎక్కివచ్చి ఇదంతా తల్లకిందులు చేసేశాడు. పైగా తనే అచలని వివాహంచేసుకోడానికి సిద్ధ

పడ్డాడు. అప్పుడు కేదారబాబు ఆఇద్దరిలోనూ సురేశుడే ఎక్కువ డబ్బున్నవాడనిగమనించి అతనికే పిల్లనివ్వాలని నిశ్చయించుకున్నాడు. అల్లాగ నిశ్చయించడంలో అతనికేమీా అభ్యంతరం కనబడలేదు. సామాన్యంగా వివాహవిషయంలో ప్రేమ ఆక్టేలెక్కలోనిది కాదని అతనిఅభిప్రాయము. ఒంటినిండా నగలుపెట్టి మంచిమంచిచీరలుకొని పెట్టేభర్త ఉంటే స్త్రీలజీవితం సుఖంగా వెళ్లిపోతుందని అతననుకున్నాడు. ఆపైన కూతుర్ని సుఖపెట్టడం తండ్రికి విధాయకంకాబట్టి ఆక్టేశముపడకుండా వచ్చిన ఇంతమంచిసంబంధం దాటిపోనియ్యకూడదని అతనొక నిశ్చయం చేసుకున్నాడు. ఈవిషయంలో అతను ఆక్టేలోతుగా ఆలోచించలేదు.

ఇంతేకాదు; అప్పనేమిషపెట్టి అతను తన కాబోయేఅల్లుడిదగ్గిర అయిదువేలరూపాయలు తీసుకున్నాడు. ఇల్లాతీసుకోవడం అతనికి కొంచెమైనా తప్పనిపించలేదు.

ఆపైన ఇల్లు ఎల్లాగైనా అల్లుడికే మిగిలిపోతుంది కాబట్టి అతని అప్పుతీర్చడంకూడా అవసరం లేదనుకున్నాడు! కాని ఎంత ఆలోచిస్తే ఏముంది? ఆకూతురు దురదృష్టవంతురాలు! ఆమె అతను అనుకున్నవన్నీ ధ్వంసం చేసిపారేసింది. ఎంతచెప్పినా వినిపించుకోలేదు! చివరికి ఎల్లాగయితేనేమి అతనికి కూతుర్ని మహిముడికిచ్చి వివాహంచెయ్యడం తప్పిందికాదు. ఈదురదృష్టంవల్ల అతను లోలోపల ఎంతో బాధపడ్డాడు. ఆపైన సురేశుడిదగ్గిర తీసుకున్న అప్పు ఎల్లాగోఅల్లాగ తీర్చివెయ్యడం తప్పదని అతననుకున్నాడు. అయితే ఆతీసుకున్న ఋణానికి రాతా కోతా ఏమీాలేదు. ఆఋణం తీర్చడంకూడా ఒకపట్టాని సామాన్యమైన పనికాదు. అందుచేత ఈవిషయంలో అతనంతగా శ్రద్ధ చూపించలేదు. అయితే అతనిమనస్సులో ఈసమస్య అప్పుడప్పుడు బయలుదేరుతూనే ఉండేది; కాని దాని సమాధానంమాత్రం అతనికేదో

మసకమసకగా ఉన్నట్లుండేది.

ఆతరవాత అచలు అత్తవారింటికి వెళ్ళిపోయింది. ఆపైన సురేశుడు చనువుగా వస్తూపోతూండడం కేదారబాబుకి అట్టే ఇష్టంలేకపోయింది. ఒకవేళ ఎప్పుడైనా సురేశుడు వస్తే "ఇంటిదగ్గిర లేడు" అని చెప్పించి అతన్ని కలుసుకోకుండా కాలక్షేపం చేసేవాడు. కాని కూతురుసంగతి తలుచుకుని అతను లోలోపల ఎంతో బాధపడుతూ ఉండేవాడు.

ఈవిధంగా కొన్నిరోజులు గడిచిపోయాయి. ఒకనాడు అతనికి బాగా జబ్బుచేసింది. సురేశుడువచ్చి అతనికి మందూమాకూ ఇచ్చి కుమారుడికంటే ఎక్కువగా పరిచర్య చేశాడు. కేదారబాబుకి జబ్బు బాగా నయమయింది. ఒకనాడు కేదారబాబు స్వయంగా ఋణంసంగతి ఎత్తాడు; కాని సురేశుడు "నేను ఆడబ్బు స్నేహారీత్యా ఇచ్చాను గాని అప్పు ఇవ్వలేదని నవ్వుతూ సమాధానం చెప్పాడు. ఆరోజు నించీ కేదారబాబుకి సురేశుడిమీద అభిమానం ఎక్కువకావడం మొదలుపెట్టింది. ఒక్కొక్కప్పుడు ఆ అభిమానంవల్ల అతనికి కూతురు మీద అయిష్టం కలిగి "ఇది చాలా దురదృష్టవంతురాలు. రత్నం లాంటి వరుణ్ణి తిరస్కరించింది. ఎప్పుడో అప్పుడు దానికి తగినఫలం అనుభవించి తీరుతుంది" అని అనుకుంటూఉండేవాడు.

ఈపరిస్థితులవల్ల కేదారబాబుకి మహిముడంటే విష్మైపోయింది. కాని అంతమాత్రంచేత తనకుమార్తె భర్తని విడిచిపెట్టి ఇంటికి రావాలని అతనెప్పుడూ అనుకోలేదు. అందుచేత భర్తని విడిచి పెట్టేవిషయంలో సహాయంచేసిన వ్యక్తిమీద అతను మండిపడడం ఆశ్చర్యంకాదు. ఇంక కుమార్తెసంగతి ఆలోచిద్దాము. ఆమెకి మొదటి నించీ తండ్రిమీద ఎటువంటి అభిప్రాయం ఉన్నా సురేశుడి డబ్బు వ్యవహారం జరిగినప్పటినించీ తండ్రిఅంటే గౌరవం తగ్గిపోయింది. అందులోనూ అప్పుతీర్చడానికి శక్తిలేకపోయినా అయిదువేలు ఋణం

తీసుకోడంవల్ల ఆమె తండ్రిని మరిమిక్కిలి బెదిరించినా హీనంగా చూడడం మొదలుపెట్టింది. అప్పైన ఆమె నిన్నరాత్రి తండ్రి తనవిషయంలో దాసీదాసిని అడిగిన ప్రశ్నలన్నీ వింది. అందుచేత ఆమెకి అతని మీద మరింత అసహ్యాభావం కలిగింది.

అయితే అచల తనసంగతికూడా అంత ఆలోచించక పోలేదు. ఆమె భర్తముఖంమీద "నేను నిన్ను ప్రేమించడంలేదు" అని చెప్పింది. ఆసంగతితలచుకున్నప్పుడల్లా ఆమెకి ఒళ్లంతా కంపరం ఎత్తింది. ఆక్షణం నించీ ఆమె ప్రపంచకంలో తనకున్న స్త్రీమర్యాదఅంతా తుడిచి పెట్టుకు పోయినట్టు కనబడింది అందుచేత ఆమె ఈవేళ భర్త దృష్టిలో మర్యాదలేనిమనిషి అయిపోయింది. ఆఖరికి దాసీదాసికికూడా నీచురాలై పోయింది. అందుచేతనే సురేశుడీవేళ ఆమెకేసి లాలసా పూర్ణమైన దృష్టితో చూస్తున్నాడు. ఇప్పుడు అతను అల్లాగ చూస్తున్నాడంటే ఇందులో అతనితప్పేముంది; కాని నిజంగా ఆమె అల్లాంటివ్యక్తేనా? ఒకనాడామె ప్రేమకోసం సమస్తమూ విడిచిపెట్టి అందరితోనూ విరోధం పెట్టుకోలేదూ? ఆవిషయం అప్పుడే అందరూ మరిచిపోయారా? మహిముడు సురేశుడితో అచలని పంపించి నప్పటినించీ ఒక్కఉత్తరమైనా రాయులేదు. ఈవిధంగా భర్త తనకి చేసిన అవమానం తలుచుకుని ఆమె రాత్రితెల్లవార్లూ అట్టుడికి పోయినట్టు ఉడికిపోయింది.

ఆమె మర్నాడు లేచేటప్పటికి అప్పుడే చాలాప్రొద్దెక్కింది. లేత ఎండ తెరిచిఉన్న కిటికీగుండా గదిలో ప్రవేశించింది. ఆమె మెల్లిగా లేచి పరుపుమీద కూర్చుని వీధికేసి చూసింది. అప్పుడే ఎంతో మంది జనం వీధులో గబగబా వెడుతున్నారు.

అది కలకత్తాలో ఒకపెద్దవీధి. ఆవీధులో అటూఇటూ వెళ్లే జన ప్రవాహానికి అంతూదరీ ఉండదు. కొందరు ఏవేవో తొందరపనుల

మీాద వెడుతున్నారు. మరికొందరు తమపనులు ముగించుకుని ఇంటికి తిరిగి వెళ్ళిపోతున్నారు. కొందరుకులాసాగా గాలిలో షికార్లు కొడుతున్నారు. వాళ్ళనందరినీ చూస్తూ అచల "ఎవ్వరికీకూడా ముఖంచూపించలేకపోడానికి నేను ఏమంత పెద్దఅపరాధం చేశాను. నేనేన్యాయంగా నన్ను జైలులోపెట్టుకోవడం ఎందుకు? నే నేమైనా తప్పుచేసిఉంటే ఆయనవిషయంలో తప్పుచేశాను. దానికి శిక్షిస్తే ఆయనశిక్షిస్తారు. అంతేనేగాని ఏమీఆలోచించకుండా పైవాళ్లు శిక్షిస్తే అది నేనెందుకు భరిస్తాను!" అనిఅనుకుంది.

ఆపైన ఆమె చటుక్కునలేచి తనబద్ధకమూ బాధా అంతా ఒక్కసారిగా విదిలించివేసుకుని ఇంటిలోకివెళ్ళి కాళ్ళూ చేతులూ ముఖమూ కడుక్కుని బట్టలు మార్చుకుంది. ఆపైనచటుక్కుని నలుగురూ కూర్చునేసావిడిలోకివచ్చి కూర్చుంది. కేదారబాబు పడకకుర్చీమీాద కూర్చుని పేపరుచదువుకుంటున్నాడు. అచల రాగానే అతనొక్కసారి ముఖంఎత్తి చూసి ఆపైన మళ్ళీ పేపరుచదువుకుంటూ కూర్చున్నాడు. ఆపైని ఒక్కనిమిషం ఉన్నతరవాత వంటమనిషివచ్చి టీసామానులూ వేణ్ణీళ్ళూ బల్లమీాదపెట్టి వెళ్ళిపోయాడు. కేదారబాబులేచి స్వయంగా తనకోసం ఒకకప్పుతో తయారుచేసుకొన్నాడు. ఆతరవాత ఆకప్పుచేత్తోపుచ్చుకుని మళ్ళీ తనపడకకుర్చీలో పేపరు చదువుకుంటూ కూర్చున్నాడు.

అచలతలదించుకునే కూచుంది. అయినా ఆమెకి తండ్రిచేసినపని అంతాకనబడింది. అయినాగాని ఆమెకి టీ తయారుచేసిపెట్టడానికి గాని ఏదైనా మాట్లాడడానికిగాని కొంచెమైనాధైర్యంలేకపోయింది. అల్లాగ చెయ్యడానికి ఆమెకీవేళ కష్టంకూడాలేకపోయింది.

అయితే ఒక్కగదిలో కూర్చున్నప్పుడు చాలాసేపటిదాకా మూతి ముడుచుకుని కూర్చోవడం కష్టం. అదీగాక "ఈజటిల సమస్యలన్నీ

సావకాశంగా ఆలోచించుకోడానికి తండ్రితో కలిసి ఈవిధంగాఉంటే వీలవుతుందా? కాదా? దీనికి ఏడుపాయము చేస్తే బాగుంటుంది. అనిఆలోచించుకోవాలని అనుకుంది. అంతట్లో ఆమెకు ఎదురుగుండా సురేశుడు కనపడ్డాడు. ఆమె అతనికేసిచూసి నిర్ఘాంతపడిపోయింది. సురేశుడు వస్తూనే కేదారబాబుకి నమస్కరించాడు. కేదారబాబు అతనికేసి చూసి తలపంకించాడు! ఆపైన మళ్ళీ తనపత్రిక చదువుకుంటూకూర్చున్నాడు.

సురేశుడు అక్కడికి దగ్గిరిగా ఉన్నఒక కుర్చీలాక్కుని దానిమీద కూర్చున్నాడు. ఆతరవాత టీసామానులు చేత్తో పట్టుకుని వంట మనిషిలోపలికివచ్చాడు. సురేశుడు అతన్నిచూడగానే "నానూటుకేసు ఎక్కడవుంది. అదితీసుకువచ్చి నాబండిలో పెట్టు. నిత్యకృత్యాలలో వాడుకునే సామానులన్నీ అందులోవుండిపోయాయి. ఆలస్యంచెయ్యకు! నేనుతక్షణం వెళ్ళి పోవాలి." అన్నాడు. ఆవంటవాడు చిత్తంబాబూ! అని లోపలికి వెళ్ళిపోయాడు. మళ్ళీఆగదిఅంతా నిశ్శబ్దంగా ఉండి పోయింది. కొంచెంసేపు ఉన్నాక సురేశుడు చటుక్కుని "మహిముడిసంగతి ఏమైనా తెలిసిందా?" అని అడిగాడు. కేదారబాబు తలఎత్తకుండానే 'లేదు' అన్నాడు. సురేశుడు "చాలాఆశ్చర్యంగాఉందే!" అన్నాడు. ఆపైన మళ్ళీ అంతా నిశ్శబ్దమే! వంటమనిషి తిరిగివచ్చి 'సూటుకేసు బండిలోపెట్టానండి' అన్నాడు. సురేశుడు "అయితే నేను వెడతాను. "మహిముడి దగ్గిరనుంచి ఏమైనా ఉత్తరంవస్తే కాస్తనాకు కబురుచెయ్యండి." అని అక్కడినించి లేవబోయాడు. ఇంతలో కేదారబాబు తనుచదువుకునే పేపరు చటుక్కుని అక్కడ పెట్టి "సురేశబాబూ! మీరొక్కనిమిషం ఆగండి. నేనివ్వుడేవస్తాను. అనిచెప్పి అతని ముఖంకేసి చూడకుండానే స్లిప్పర్లు తొడుక్కుని చటుక్కుని అక్కడినించి వెళ్ళిపోయాడు.

అచల ఇంతవరకూ తలవంచుకునే కూర్చుంది. కేదారబాబు వెళ్ళిపోగానే సురేశుడు ఎంతో ఆశ్చర్యపడి యథాలాభంగా పక్కకిచూశాడు. అతనికి ఎంతో బాధఅనుభవిస్తూండడంవల్ల బాగా వెల్లబడిపోయిన అచల ముఖం కనబడింది. అతడు ఆ మాట 'ఏమిటి విశేషాలు' అన్నాడు. అచల తలవంచుకుని ఏమీలేదన్నట్లు ఊరుకుంది. సురేశుడు "మీ నాన్నగారు నన్నింత పాపిష్ఠుణ్ణి నీచుణ్ణి అనుకుంటారని కలలో నైనా ఊహించలేకపోయాను" అన్నాడు. నేరారోపణకి అచలఏమీ సమాధానం చెప్పలేదు. పూర్వ మాస్త్రరుగానే నిశ్చలంగా కూర్చుంది. సురేశుడు మళ్ళీ "నేనొకటి చెయ్యాలని అనుకుంటున్నాను. మహిముని దగ్గిరికి వెళ్ళి అతనితో—" అని ఏదో అనబోయాడు. కాని ఆమాట పూర్తికాకుండానే కేదారబాబు లోపలికివచ్చాడు. కేదారబాబుచేతులో ఒక కాగితంఉంది. కేదారబాబు ఆకాగితం సురేశుడికి ఎదురుగుండా ఉంచి "ఇవాళ్ళనించి మీదగ్గిర పుచ్చుకున్నసొమ్ముకి రశీదుకూడా ఇవ్వలేకపోయాను మీరిచ్చిన అయిదువేలరూపాయలకి ప్రోమిసరీనోటు రాశాను. ఇప్పటికీ వడ్డీ ఏమీ ఇవ్వలేకపోయాను. ఇల్లుఉంది కాబట్టి మీకు అసలుకి ఏమీమోసం రాదు." అన్నాడు. సురేశుడొక్క క్షణంసేపటిదాకా నిశ్చేష్టుడైపోయాడు. ఆపైన "కేదారబాబుగారూ మిమ్మల్ని నేనెప్పుడూ ప్రోమిసరీనోటు రాసిఇమ్మని అడగలేదే" అన్నాడు.

కేదారబాబు 'మీరు అడగనిమాట నిజమే! కాని నేను ఇవ్వాలి కదా! అసలు ఇంతవరకూ నేను ఏమీ చెయ్యలేకపోయాను. ఇదే ఒకపెద్దతప్పు! అందుచేత కాగితం మీజేబులో ఉంచండి. నేను పెద్దవాణ్ణి అయ్యానుగదా! ఎప్పుడైనా 'హరీ!' అంటే సొమ్ము విషయంలో తగాదా రావచ్చును. ఆమాటమీద సురేశుడు ఎంతో ఆవేశంతో "కేదారబాబూ! నేనెల్లాంటివాణ్ణి అయినా కావచ్చును;

కాని డబ్బువిషయంలో తనదాకొస్తే మనిషిమాత్రం కాను. అదీ గాక ఈసొమ్ము నాకక్కరలేకపోయినా, నేను కేవలం స్నేహశీలత్వా ఇచ్చానన్నది మీకు తెలుసును" అన్నాడు.

కేదారబాబు "అయితే మీరా సొమ్ము మీస్నేహితుడికే ఇవ్వండి. నేను నాదగ్గిర తీసుకున్నసొమ్ము ఋణంగానే తీసుకున్నాను" అన్నాడు. ఆమాటలు వినగానే సురేశుడు "బాగుంది; అయితే నేనది నాస్నేహితుడికే ఇచ్చివేస్తాను" అని చెప్పి, ఆకాగితం, తీసుకుని, అచలకి ఎదురుగుండా నిలబడ్డాడు. అంతలో కేదారబాబు అగ్నిపర్వతంలాగ మండిపడి "సురేశ్‌బాబూ! ఆగండి! నిన్నరాత్రినించీ మీరు నన్ను అనేకవిధాలుగా అవమానించారు. నేనవ్వన్నీ మాట్లాడకుండా సహించాను. మీరు నాకళ్ళెదుటగుండా మాఅమ్మాయికి డబ్బిచ్చారంటే నేనది హర్షించను" అనివణుకుతూ పడకకుర్చీలో కూలబడి పోయాడు.

మొట్టమొదట సురేశుడు ఎంతో ఆశ్చర్యపడ్డాడు. ఆపైన కేదారబాబుకేసి కనురెప్ప వెయ్యకుండా చూస్తూఉన్నాడు. అతనిముఖం కాగితంముక్కలాగ తెల్లబడిపోయింది. తరవాత అతను అచలకేసి చూశాడు. ఆమె రాతివిగ్రహంలాగ నిలబడిపోయింది. అతను ఎంతో ప్రయత్నంచేసి ఏదో మాట్లాడబోయాడు. ముఖంలోనించి ఏదో అవ్యక్తమైనధ్వని పైకివచ్చింది; కాని ఒక్కమాటైనా పైకి ఊడిపడలేదు. కేదారబాబు రెండుచేతులతోనూ ముఖం పట్టుకొని అల్లాగే కుర్చీలో పడిపోయాడు. ఆపైన సురేశుడు ఇంకేమీ మాట్లాడ దలుచుకోలేదు. స్తంభంలాగ అల్లాగే రెండుమూడు నిమిషాలదాకా నిలబడి, మెల్లిగా ఆగదిలోనించి ఇవతలికి వచ్చేశాడు. సురేశుడు వెళ్ళిపోయాడు. తండ్రీ కూతుర్లుమాత్రం కొంతసేపటిదాకా అల్లాగే కూర్చుండిపోయారు. ఆగది గోడకి తగిలించిన గడియారపు ధ్వనిమాత్రం ఆతరవాత వినిపిం

చింది; అంతే! ఇంక ఆగదిలో అంతా నిశ్చలమైన నిశ్శబ్దమే!

సురేశుడి గుర్రపుబండికి రబ్బరుటైర్లున్నాయి. అందుచేత బండి గబగబా వెళ్ళిపోతూన్న సంగతి గుర్రపుడెక్కల ధ్వనివల్ల తెలిసింది. ఆడుత్తర క్షణంలో వంటమనిషి లోపలికివచ్చి "బాబుగారూ!" అనిపిలిచాడు. కేదారబాబు కళ్ళుతెరచి చూశాడు. ఆవంటవాడి చేతులో చిరిగి పోయిన కాగితపుముక్కలు కనబడ్డాయి. కేదారబాబు ఆపైన వాణ్ణి ఏమీ మాట్లాడనియ్యకుండా గట్టిగా "ఆముక్కలు నాకంటికి కనబడకుండా దూరంగా తీసుకుపో! చెబుతున్నాను! నామాట వివిను. వెళ్లు! నాఎదురుగుండా నిలబడకు! వెళ్ళిక్కడనించి—" అని ఏదో అనబోయాడు. పాపం ఆనౌకరు హడిలిపోయి అక్కడినించి పరిగెత్తాడు. వీడు వెళ్ళిపోయినతరవాత కేదారబాబు మండిపడుతూ అచలకేసి చూసి "ఈలుచ్ఛా ఇంక నాఇంట్లో అడుగుపెడితే పోలీసువాళ్ళకి అప్పజెప్పుతాను! అచలా! నీ కీసంగతి చెబుతున్నాను! జాగర్త!" అన్నాడు.

అచల తనపేరు వినగానే నిస్తేజస్కమైన ముఖంఎత్తి, ఎంతో బాధపడుతూ తండ్రికేసి నిశ్శబ్దంగా చూస్తూకూర్చుంది. కేదారబాబు "రూపాయలు విరజిమ్మి నాకంట్లో దుమ్ముపోద్దామని చూస్తున్నాడులా ఉంది ఈదుర్మార్గుడు! ఈదెబ్బతో నాసంగతి జ్ఞాపకంఉంటుంది!" అన్నాడు. అచల మళ్ళీ అల్లాగే నిశ్శబ్దంగా కూర్చుండిపోయింది. దుఃఖమలినమైన ఆమెదృష్టిలో క్రమంగా కాఠిన్యం ఆవహించింది; కాని ఈసంగతి కేదారబాబు గ్రహించలేదు. అతను పూర్వపు ధోరణిలో చూపుడువేలు కదుపుతూ "నోటు చింపేసి నాకు లంచమిస్తే వ్యవహారం నడిచిపోతుందని అనుకుంటున్నాడులాఉంది! ఇల్లాజరిగితే మాటదక్కదని తనకి తెలిసివచ్చేదాకా వదిలిపెట్టను! ఈఇల్లు నేనే అమ్మేసి అప్పతీర్చేస్తాను! ఆపైన ఎక్కడికి వీలయితే అక్కడికి

పోతాను. దానికి నన్నెవరు అడ్డగించగలరో చూస్తాను !" అన్నాడు.

దీనికి అచల సమాధానం చెప్పింది. మొట్టమొదటమాత్రం ఆమెకి కొంచెం సంకోచం కలిగింది ; కాని మనస్సు కుదుటబరుచుకుని ధైర్యంగా "నాన్నగారూ ! ఋణంతీర్చడం మానేసి ఇల్లు నాకుంచమని నేనడిగానా ? అసలు మీరు చెయ్యకపోతే నేనైనా చెయ్యకతప్పదు" అంది. కేదారబాబు ఆమాటలమీద మరింత మండిపడుతూ "మీరు చేసినదాన్ని బట్టి నేను నలుగురిలోనూ ముఖంఎత్తుకొని, తిరగలేకుండా ఉన్నాను. తెలిసిందా ?" అన్నాడు. అచల పూర్వం మాదిరిగానే కొంచమైనా చలించకుండా "తెలుసులెండి ! మీరు నలుగురిలోనూ ముఖం ఎత్తుకోలేనిపని ఏదైనాచేస్తే ఇంక నాముఖం చూపించకనబడదు. ఆ దేశంలో ఏమిలేకపోయినా, మునిగిచావడానికి కావలసినన్ని చెరువులున్నాయి" అంది. ఆపైన ఆమె కంఠస్వరం గద్గదమైపోయింది. ఆతరవాత ఆమె ముఖంమీద చీరకొంగుకప్పుకొని, ఉబికిఉబికి పైకిపొంగివస్తున్న ఏడుపు ఎల్లాగో అల్లాగ ఆపుకుని గబగబా అగదిలోనించి వెళ్ళిపోయింది.

కేదారబాబుకి ఒక్కసారిగామతిపోయినట్లయింది, ఈ బాధపడడానికీ ఈకోపానికీ ఈతగాదాలకీ అన్నిటికీకూడా కూతురు అమర్యాదగా ప్రవర్తించడమే కారణమని అభిప్రాయము కాని అచల హఠాత్తుగా తనకిఎదురుగుండా నిలబడి తనని దూషించి అవమానించి అభిమానంతో ఒకపెద్దపనువు పడిపి, ఈవిధంగా వెళ్ళిపోతుందని అతను కలలోనైనా అనుకోలేదు! అందుచేత అతను చాలా సేపటిదాకా మతిపోయినవాడిలాగ అల్లాగే నిలబడిపోయాడు. ఆతరవాత నెమ్మదిగాకూర్చొని నుదుటిమీద చెయ్యిపెట్టుకుని "ఎంత రంధి జరిగిందో" అనుకున్నాడు.

ఆపైన ఏడెనిమిది రోజులు గడిచిపోయాయి. ఈ ఏడెనిమిది రోజులూ తండ్రీకూతురూ ఎల్లాగఉన్నారో పరమేశ్వరుడికే తెలియాలి. అచల తనగది విడిచిపెట్టి ఇవతలికి రానేలేదు. ఆఖరికి నౌఖర్లకికూడా

ఆమెముఖం చూపించలేకపోయింది. ఆమె పూర్వం మోస్తరుగా వీధికేసి చూస్తూ కాలక్షేపం చెయ్యవచ్చునుగదా" అని ఈవేళ వరాండాలోకి వచ్చింది.

అది శీతాకాలము. మధ్యాహ్నం కాగానే ఆకాశంలోనించి బయలుదేరిన ఒకనల్లనినీడ భూమిఅంతా ఆవరించుకుంటూన్నట్టు కనబడింది. అచలకికూడా ఏదో అల్లాంటినీడ ఒకటి తనజీవితం అంతా ఆవరిస్తూన్నట్టు కనబడింది. ఇంతేకాదు, తనఅల్పాయుర్దాయం క్రమక్రమంగా ఆఖరైపోతూన్నట్టుకూడా కనిపించింది. ఆమె చూస్తూనేఉంది; కాని అలవాటుప్రకారం ఆసమీపంలో ఉన్న వస్తువులు ఆమెకి కనిపిస్తూన్నాయేమోగాని ఆమెదృష్టిమాత్రం శూన్యంగానే ఉంది. అప్పుడే క్రమక్రమంగా సూర్యాస్తమానం కావచ్చింది. ఇంతలో ఆమెకి కొంచెం దగ్గిరగా సురేశుడిబండి కనబడింది ఒక్కనిమిషంలో ఆమెముఖంఅంతా సఫేదులా తెల్లబడిపోయింది. పోలీసునిచూసి దొంగ పారిపోయినట్లు ఆమె ఒక్కసారిగా పరుగెత్తుకువెళ్లి తనమంచంమీద పడుకుంది. ఒక ఇరవై నిమిషాలతరవాత ఆమెకి తలుపుకొట్టిన చప్పుడైంది. ఆతరవాత "అమ్మా అచలా మేలుకునే ఉన్నావా!" అని ఎంతో మృదువుగా అడిగిన ప్రశ్న వినబడింది.

అచల దగ్గిరనించి ఏసమాధానమూ రాకపోవడం చూసి తండ్రి మళ్లీ మరింతమృదువుగా "సాయంత్రం అయిపోతూందమ్మా లే సురేశుడిపిన్నిగారు నిన్నుతీసుకు వెళ్లడానికి వచ్చారు. మహిముడికి చాలా జబ్బుగాఉందట" అన్నారు. అచలలేచి తలుపు తెరచీతెరవడంతోనే సురేశుడి పినతల్లి లోపలప్రవేశించింది. అచల ఒంగి ఆమెపాదాలు స్పృశించింది. ఆతరవాత కేదారబాబు గదిలోకివచ్చి మంచానికి ఒక చివరగా కూర్చుని అచలని ఉద్దేశించి "మీరు వచ్చేసినతరవాత మహిముడికి విపరీతంగా జ్వరంవచ్చిందట. అసలే ఆరాత్రిఅంతా బాగా

మంచంలో తడిసిఉంటాను. ఆపైన మనోవ్యాధివల్లా హైరాణవల్లా బాగా జ్వరం వచ్చి ఉండవచ్చును" అన్నాడు. ఆపైన సురేశు పినతల్లిని ఉద్దేశించి "పిల్లలు ఇద్దరూ వచ్చేసిన తరవాత అతని దగ్గిరనించి ఏమీ కబురు రాలేదేమని నేనెంతో బెంగా పడుతున్నాను. సురేశ్ బాబు వెళ్లి తన చాకచక్యం ఉపయోగించి అతన్ని తీసుకురాకపోతే ఏమి జరిగిఉండేదో పరమేశ్వరుడికే ఎరుక. భగవంతుడి అనుగ్రహంవల్ల సురేశుడు దీర్ఘాయుష్మంతుడు కావాలి!" అన్నాడు. అల్లాగ అంటూంటే స్నేహపూర్ణమైన పశ్చాత్తాపంచేత కేదారబాబు కంఠం గద్గదమైపోయింది.

అచల తలవంచుకుని అల్లాగే నిలబడిఉంది. ఆమె ఏమీ అడగలేదు. ఆఖరికి ఆమెలో ఏవిధమైన కదలికాకూడా కనబడలేదు. సురేశు పినతల్లి అచల భుజం మీద చెయ్యివేసి ఎంతో ఆదరణతో "ఇందులో పెద్ద భయపడవలసింది ఏమీ లేదమ్మా! రెండుమూడు రోజులలో జ్వరంతగ్గిపోతుంది" అంది. అచల దానికి ఏమీ సమాధానం చెప్ప లేదు. మళ్లీ సురేశు పినతల్లికి నమస్కరించింది. ఆపైన చిలక కొయ్యకి తగిలించిఉన్న బట్ట ఒకటితీసుకుని ప్రయాణానికి తయారయింది.

ఆ సాయంత్రంవేళ ఆ చలిలో ఆమె ఉన్నదుస్తు లేపి ధరించలేదు. ఆఖరికి కాళ్ళకి జోడైనా తొడుక్కోలేదు. అది చూసేటప్పటికి కేదార బాబుకి గుండె తరుక్కుపోయింది. కాని ఆపక్కనే నుంచున్న ఆవితంతువు వేషం చూసి అతనికి అంతగా బాధ అనిపించలేదు. "అతను నడు అమ్మా! నేనుకూడా వస్తున్నాను." అనిమాత్రం అన్నాడు. ఆపైన స్లిప్పర్లుతొడుక్కుని అందరికంటే ముందునడిచి గబగబా మేడమెట్లు దిగాడు.

## ౨౩

తను స్త్రీ అయిఉండీకూడా మహిముడి కష్టసుఖాలలో పాల్గొనలేక పోయానుగదా అని అచల ఎంతో బాధ పడింది.

చిన్నప్పటినించీ సురేశునికీ మహిముడికీ అసలు ఈవిషయంలో తగాదా వచ్చేది. కానిదానివల్ల ఫలితం ఏమీ కలగలేదు. మహిముడు తనకష్టసుఖాల విషయంలో లోభి డబ్బు ఖర్చుపెట్టేటప్పుడు ఆలోచించేటట్లు ఆలోచించేవాడు. అతనికష్టసుఖాలలో ఇతరులు పాల్గొనడంమాట అల్లాగ ఉండనిద్దాము. అసలు పైవాళ్ళకి అతను కష్టపడుతున్నాడో సుఖపడుతున్నాడోకూడా తెలిసేదికాదు. అతనుఏవిషయంలో బాధపడుతున్నాడో అది అంతకంటే తెలిసేదికాదు.

తాతముత్తాతలనాటినించీ వస్తూన్న ఇల్లు పూర్తిగా భస్మమవడం చూసేటప్పటికి మహిముడిగుండె బద్దలైపోయింది. అచల ఆసమయంలో అతనిదగ్గిర ఉన్నా ఈసంగతి గ్రహించలేకపోయింది. మృణాల భర్త పోయినప్పుడుకూడ అతనెంత బాధపడ్డాడో తెలుసుకోవడానికి వీలు అయిందికాదు. ఇంతేకాదు. ఆనాడు అచల "నీమీద నాకు ప్రేమలేదు!" అని స్పష్టంగా అతనిముఖం ఎదుట అనేసింది. ఆ వేళకూడ ఆమె అతనెంత బాధపడుతున్నాడో తెలుసుకోలేకపోయింది. అదీగాక అతను అల్లాగ చలించకుండా ధైర్యంగా ఉన్నంతమాత్రాన మనస్సులో బాధపడకుండా ఉన్నాడా! అచల అది అంత సులభంగా నమ్మివేసేటంత వెర్రిదికాదు! అందుచేత ఆవేళ స్టేషనుదగ్గిర అతని గాంభీర్యంచూసి ఆమె "ఈగాంభీర్యంఅనే బురఖా తీసివేస్తే ఈయన ముఖం ఎల్లాగఉంటుందో" అని అనుకుంది. ఆవేళ దారిపొడుగునా ఆమెకు అదేఆలోచన!

ఈవేళ కేదారబాబువచ్చి ఏమీ కంగారుపడకుండా సహజమైన

ప్రశాంతభావంతో "మహిమడికి ఇల్లాగ జబ్బుచేసిందంటే నేనేమీ ఆశ్చర్యపడడంలేదు. అసలు ఇంత ఆపత్తువచ్చిన తరవాత ఇల్లాంటి దేదో వస్తుందని నేను అనుకుంటూనే ఉన్నాను" అన్నాడు. ఆమాట వినగానే ఆ కోలముఖంమీద ఒక్క క్షణకాలం ఒకవిధమైన భావోద్వేగం కనబడింది. కాని ఆభావోద్వేగంలో కొంచెమైనా ఎదుర్దా ఉందో లేదో సందేహమే!

సురేశుడి గుర్రపుబండి రబ్బరుటైర్లమీద జరుగుస జారిపోయింది. సురేశుడి పినతల్లి తనవైపున ఉన్న తలుపుమూసుకుని మాట్లాడకుండా కూర్చుంది. అచలకూడా ఆమెపక్కని రాతివిగ్రహంలాగ అల్లాగే కూర్చుండిపోయింది. తనకెవ్వరూ ఉత్సాహంగా సమాధానం చెప్పక పోయినా కేదారబాబుమాత్రం అదేపనిగా వాగుతున్నాడు. అతను మాటిమాటికీ "సురేశుడులాంటి బుద్ధిమంతుడూ సమర్థుడూ జాలిగుండె గలవాడూ ఇంకే ప్రపంచకములో ఎవ్వడూ ఉండడు మహిముడి తిక్క చూస్తే నాకు జుగుప్సేం వేస్తూంది. అపల్లెటూరులో ఒకవైద్యుడన్న వాడు ఎవ్వడూ కనపడడు. అక్కడఉన్నవాళ్ళంతా దొంగలే! నక్కలూ కుక్కలూమాత్రం బాగాసమృద్ధిగాఉంటాయి. అల్లాంటి పల్లెటూళ్ళోకి వెళ్ళిఉన్నందుకు తగినశాస్తి కాకుండాపోతుందా? అని సంబంధముఉన్నవీ లేనివీ ఏవేవో ఏకరువు పెడుతున్నాడు. ఈమాటలన్నీ వెళ్ళి మాట్లాడకుండా కూర్చున్న అచలచెవిలో పడుతూనే ఉన్నాయి. కాని ఆమెవీటికి అట్టే లక్ష్యపెట్టలేదు.

కేదారబాబు ఈవేళ ఇల్లాగ కొంచెం కులాసాగా ఉండడానికి ఒక కారణం ఉంది. అసలుఅతను స్వతస్సిద్ధంగా అట్టే లోతుగుండెగల వాడుకాడు. ఆపైన అతను తనకి కలిగిన సంతోషం పట్టలేక పోయాడు. ఇన్నాళ్ళనించీ అతనికి ప్రియమిత్రుడైన సురేశుడితో దెబ్బ లాట వచ్చిందని ఎంతోబాధగాఉంది. ఆపైన సురేశుడూ అచలా

కలిసివచ్చారని ఒకపెద్ద అనుమానం బయలుదేరింది. ఈరెండు కారణాలవల్లా అతనికి ఇంత కాలంనించీ హృదయంమీద ఉన్నపెద్దబరువు మోపినట్లయింది. కాని తలవనితలంపుగా సురేశుడి పినతల్లి రావటం చేత అతనికిఆ బాధ అంతా ఒక్క క్షణంలో చేత్తో తీసివేసినట్లయింది. మహిముకి జబ్బునుగురించి కేదారబాబు అట్టే ఎక్కువగా ఆలోచించ లేదు. ఆ ఇల్లు కాలిపోయినరాత్రి వానలో తడవడం మూలాన్ని కొంచెం జ్వరం వచ్చిఉంటుంది. అసలు సురేశుడిపినతల్లి ఈజ్వరం రెండుమూడురోజులలోతగ్గిపోవచ్చునని కూడా చెప్పింది. రెండుమూడు రోజులు అక్కరలేకుండా ఆ జ్వరం తగ్గిపోతే రేపుఉదయానికే తగ్గి పోవచ్చును. మహిముకిజబ్బు విషయంలో కేదారబాబు ఆలోచించింది అంతే! అసలు విషయం ఇంకొకటికూడా ఉంది. సురేశుడు స్వయంగా వెళ్ళి మహిముణ్ణి తీసుకువచ్చాడు. ఆపైన ఏదో వంకమీద అతని భార్యని అతనిదగ్గిరికి తీసుకురావడానికి తనపినతల్లిని పంపించి ఉండ వచ్చును. అల్లుడికీ కూతురికీ మనస్సులలో కలవలేదన్న సంగతి దాసీదానివల్ల తెలిసింది. ఆసంగతి అతను మరిచిపోలేదు. అందుచేత ఈఇబ్బందుల కన్నిటికీ కారణం భార్యాభర్తల కలహమే అని ఋజు వయిపోయింది. ఇలాంటప్పుడు అతను ఏముఖంపెట్టుకుని సురేశుడితో మాట్లాడగలడు? ఇంక అచల ఇల్లాగే రాతివిగ్రహంలాగ కూర్చుండి పోయింది. ఆమెకూడా జ్వరంఅట్టేఎక్కువగా వచ్చిఉండదని అనుకుంది. కాని సురేశుడుమహిముణ్ణి ఎల్లాగ ఒప్పించగలిగాడు? ఎంత ఆలో చించినా ఆమెకి ఈప్రశ్నకి సమాధానం దొరకలేదు. "ఆమె ఇన్నాళ్ళ నించీ నాభర్తసంగతి నాకు తెలిసిందే కాదు" అని అనుకుంది.

అప్పుడే సాయంత్రం అయిపోయింది. దారిలోగానులైట్లు వెలుగు తున్నాయి. బండి ఆవరణదాటి లోపలికి వెళ్ళి గుమ్మానికిదగ్గరగా నిలబడింది. కేదారబాబు బండిలోనించి ముఖం ఇవతలికిపెట్టి, కంగారు

పడుతూ "ఇక్కడ రెండుబళ్లు నిలబడిఉన్నాయి ఎందుకు?" అని అడిగాడు.

వెంటనే అచలకూడా భయపడుతూ భయపడుతూ ఆబళ్ళకేసి చూసింది. ఒకలాంతరు చేత్తోపట్టుకుని సురేశుడు ఒకఆంగ్లవైద్యుణ్ణి బండిఎక్కిస్తున్నాడు. ఆంగ్లేయుడిపక్కని పాశ్చాత్య—వేషం వేసుకున్న ఒకబంగాలీడాక్టరుకూడా ఉన్నాడు. వాళ్ళిద్దరూ ఆకొత్తగావచ్చినవాళ్లు డాక్టర్లని అచల ఒక్కక్షణంలో గ్రహించింది. వాళ్ళిద్దరూ వెళ్ళిపోగానే అచలా కేదారబాబూ ఎక్కివచ్చినబండి ఆసమీపంలోనే ఆగింది. సురేశుడు ఆపక్కనే నుంచుని ఉన్నాడు. కేదారబాబు అతన్ని చూస్తూనే చటుక్కుని "మహిముడు ఎల్లాఉన్నాడు సురేశబాబూ! జ్వరంకాస్త తగ్గిందా?" అన్నాడు. సురేశుడు "నింపాదిగానే ఉన్నాడు. లోపలికిరండి" అన్నాడు. కేదారబాబు మరికొంచెకంగారుపడుతూ "అసలుజబ్బు ఏమిటి? ఆమాట చెప్పండి?" అన్నాడు. సురేశుడు 'రోగంపేరు చెబితే మీకు తెలియదు. జ్వరం తగిలింది. ఆపైన గుండెల్లో శ్లేష్మంగాఉంది. సరేగానికేం! మీరుదిగి ఆశీర్వదించండి!" అన్నాడు.

కేదారబాబు దిగడానికి కొంచెమైనా ప్రయత్నించకుండా "గుండెల్లో శ్లేష్మంగాఉందా? ఈమాత్రానికి మీరుమాత్రం వైద్యం చెయ్యలేరా? సురేశబాబూ! నేను బొత్తిగా కుర్రవాణ్ణి అనుకోకండి! ఈమాత్రం నాకూ తెలుసును! అసలు ఇద్దరుడాక్టర్లు ఎందుకు రావడం? ఆపైన దొరని పిలవవలసిన అవసరంఏమికలిగింది?" అన్నాడు. అల్లాగ అంటూంటే అతని కంఠస్వరం గద్గదమయింది. "సురేశుడు స్వయంగా వచ్చి కేదారబాబుని దింపాడు ఆపైన పినతల్లితో "పిన్నీ! అచలని నువ్వు లోపలికి తీసుకువెళ్లు! నేను ఇప్పుడేవస్తాను" అన్నాడు. అచల ఎవ్వర్నీ ఏమీ అడగలేదు. ఆచీకటిలో ఆ మహిముడి ముఖభంగిమ ఎల్లాఉందో

కూడా ఎవ్వరికీ కనబడలేదు. ఆమె పంజీలోనుంచి ముక్కాలిపీటమీద అడుగువేసి దిగుతూంటే కాళ్లువణికాయి. ఇదికూడా ఎవ్వరికీ కనబడలేదు. ఆపైన అచల సురేశుడిపినతల్లితో కలిసి ఇంతకి పూర్వంమోస్తరుగానే మాట్లాడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

కొంతసేపు ఉన్నతరవాత ఆమె తెరతొలగించి మెల్లిగా మహిముడు పడుకున్నగదిలోకి వెళ్ళింది. అసహాయాన్ని సహింపుడు తనఇంటి విషయంలో ఏదోమాట్లాడుతున్నాడు. ఆమాటలు ఆమెచెవిని పడేసరికి ఆమెకు అదంతా ఏదో సంఘవేలాపన అయివుంటుందని అనిపించింది. దాన్నిబట్టి ఆమె రోగి చాలా విషమస్థితిలో ఉందనికూడా, గ్రహించింది. ఆతరవాత ఆమె ఒక్క క్షణం గోడకానుకుని నిలబడి మనస్సుకి స్థైర్యం తెచ్చుకుంది.

రోగి శిరస్సువైపున కూర్చుని ఒకస్త్రీ తలమీద మంచుగడ్డ కడుతూఉంది. అచలని చూడగానే ఆమె చటుక్కునిలేచి నెమ్మదిగా ఆమెకి నమస్కారంచేసి, అల్లాగే నిలబడిపోయింది. ఆమెధరించినది వైధవ్య వేషము. తలవెంట్రుకలు లేవు సామాన్యంగా వితంతువుల ముఖాలమీద కనబడే వైరాగ్యంఅంతా ఆమెముఖంమీద మూర్తీభవించినట్లుంది. ఆసన్నటిదీపకాంతిలో ఆమె మృణాలఅని అచల మొట్టమొదట గ్రహించలేకపోయింది. ఒకరికొకరు ఎదురుగుండా నిలబడిన వాళ్ళిద్దరూ ఒక్కక్షణంలో నిశ్చేష్టు లయిపోయారు. ఆపైన అచల శరీరంఅంతా ఒక్కసారిగా గజగజవణికింది. ఆమె ఏదో మాట్లాడబోయింది. కేవలం పెదవులు కదిలాయిగాని మాట ఊడిపడలేదు. ఆఉత్తరక్షణంలో ఆమె మొదలునరికిన తరువులాగ మృణాల పాదాల దగ్గిర లుంగచుట్టుకు పడిపోయింది.

ఆపైన తెలివివచ్చినతరవాత అచలకళ్లు తెరిచి చూసింది. ఆమెకు తనుఒకమంచంమీద పడుకున్నట్లునూ, తనతల తండ్రిబడిలో ఉన్న

ట్టునట్టు కనబడింది. ఒకదాసీది పక్కగా నుంచుని అచలముఖంమీద పన్నీరుచల్లుతూంది. సురేశుడు ఇంకొకపక్కని నుంచుని విసినికర్రతో మెల్లిమెల్లిగా విసురుతున్నాడు. అసలు జరిగినసంగతి ఏమిటో తెలుసుకోవడానికి అచలకి కొంతసేపుపట్టింది. సంగతి బోధపడేటప్పటికి ఆమె కెంతో సిగ్గువేసి ప్రాణం చచ్చిపోయినట్లయింది. ఆపైన ఆమె చటుక్కుని లేచికూర్చోడానికి ప్రయత్నించింది; కాని? కేదారబాబు ఆమెను అడ్డుకుని "కొంచెంసేపు ఆయాసం తీర్చుకో! అమ్మా! నువ్వు ఇంతతొందరగా లేవక్కర్లేదుకే!" అన్నాడు. అచల ఆమాట మీద మృదువుగా "లేదు నాన్నగారూ? నాకు ఒంట్లో బాగానే ఉంది!" అని మళ్ళీ లేవబోయింది; కాని కేదారబాబు ఆమెను బలవంతంగా పట్టుకుని ఆపి, ఎంతో కంగారుపడుతూ "నువ్వు ఇప్పుడు లేవక్కరలేదమ్మా! కొంతసేపు కళ్ళుమూసుకుని నిద్రపో!" అన్నాడు. సురేశుడుకూడా అస్పష్టమైన కంఠస్వరంతో ఈమాటే మళ్ళీఅన్నాడు. అచల ఏమీఅనకుండా ఒక్కసారి సురేశుడికేసి చూసింది. ఆపైన తండ్రిచెయ్యివిడిపించుకుని చటుక్కునిలేచి నుంచుని "నేనిక్కడికి నిద్రపోవడానికి రాలేదు నాన్నగారూ! నాకు ఒంట్లో బాగానేఉంది. నే నాగదిలోకి వెడతాను" అనిచెప్పి, ఎవరి సమాధానంకోసమూకూడా ఎదురుచూడకుండా ఇవతలికివచ్చేసింది.

ఈఇంట్లో ఉన్నగదులూ అన్నీ ఆమెకు బాగా తెలిసినవే! రోగిగది ఎక్కడఉందో తెలుసుకోవడం ఆమెకింతగా కష్టంఅనిపించలేదు. ఆమె లోపలికిరాగానే మృణాల ఆమెకేసి చూసి "ఒదినా! కాస్తఇల్లా వచ్చి ఇక్కడకూర్చో! నేనిప్పుడే వస్తాను. మంచుగడ్డ కట్టుమాత్రం జారిపోనివ్వకు! జాగర్త" అనిచెప్పి, అచలని తనుకూర్చున్నచోట కూర్చోపెట్టి మెల్లిగా ఇవతలికివచ్చేసింది.

# ౨౪

నన్ని పాతరోగం నయంఅవడానికి ఎల్లాగైనా కొన్నిరోజులు పడు తుంది. అంచేతందరూకూడా మహిముడు రోజురోజూ కోలుకుంటు న్నాడనిన్నీ ఇంక అతనికి ప్రాణాపాయం లేదనిన్నీ నమ్మారు. అతని సంధీ పేలాపనా కూడా క్రమక్రమంగా తగ్గడం మొదలెట్టాయి. అప్పుడే ఒకపదిరోజులు గడిచిపోయాయి. మహిముడు ఈవేళ మధ్యాహ్నం గుర్రుపట్టి సుఖంగా నిద్రపోతున్నాడు. ఈసంవత్సరం అన్ని చోట్లా చలి ఎక్కువగానే ఉంది. అంతులోనూ ఈమధ్యని కొంచెం వర్షంగూడా కురిసింది. రోగిమంచానికి దగ్గరగా ఒకబల్లవేసుకుని అందరూ సుఖంగాదానిమీద కూర్చున్నారు. అందరిముఖాల్లోనూ ఒకవిధమైన సంతోషమూ తృప్తీ తాండవిస్తున్నాయి. సురేశుడిపినతల్లి మాత్రం ఏదోఇంటిపనులతొందరలో ఉంది. కేదారబాబు ఈవేళ ఇంకా తనగదిలోనించి ఇవతలికి రానేలేదు.

మృణాల సురేశుడివైపు తిరిగి రెండుచేతులూ జోడించి "ఇకమీరు నాసెలవుకరఖాస్తు మంజూరు చేయించాలి. ఇంక నేను కాశీఊరు వెళ్ళిపోవాలి. నాకీచలిలో మామామసలిఅత్తగారు చచ్చిపోతుందేమో నని భయంగాఉంది" అంది. సురేశుడు "మీరు ఆవిడ ఇంకాబతకా లనే అంటారా? అబ్బే! మీరు ఆవిడకోసం వెడతానంటే నేను ఒప్పుకోను" అన్నాడు. ఆమాటమీద మృణాల ఒకపెద్దనిట్టూర్పు విడిచిపెట్టి, ఆపైన నవ్వుతూ "సురేశబాబూ! ఈమాట మీకు అనవసరంలేదు. దీన్నిగురించి నేనూ ఆలోచించాను. ఆవిడ ఈపడంగా వెళ్ళిపోతే అదృష్టవంతురాలే! కాని చావుబతుకులమీద ఆపరమేశ్వ రుడూ అధికారిగాని మనంకాముగదా! ఆపరమేశ్వరుడికి ఇంకా ఆవిడ సంగతి జ్ఞాపకంరాలేదు మరి!" అంది.

ఇంతవరకూ అచల ఏమీమాట్లాడలేదు. మృణాలచెప్పిన మాటల వల్ల ఆమెకి మృణాలభర్త మరణం జ్ఞాపకంవచ్చింది. అది మనస్సులో పెట్టుకొని ఆమె "మానవహృదయంలో అంతర్యామిగా ఉండే పరమేశ్వరుడికి మానవుడు ఎన్ని కష్టాలువచ్చినా మృత్యువుకోరడని తెలుసును. అందుచేతనే మృత్యువు ప్రసాదించలేదు" అంది. ఇప్పుడు మృణాలముఖం మీద ఇంతకాలంనించీ నిగూఢంగాఉన్న ఒకవేదన గోచరించింది. ఆమె "కాదు ఒదినా! ఈమాట నేనంగీకరించను. మనిషి ఒక్కొక్కప్పుడు స్వయంగా చావుకోరుకునే పరిస్థితికూడా ఏర్పడుతుంది. ఇది ఆవేళ జరిగినసంగతి. "అప్పటికప్పుడే చాలారాత్రి గడిచిపోయింది. నేను లేచిచూసేటప్పటికి మాఅత్తగారు మంచంమీద కనబడలేదు. దేవతార్చనగదితలుపు కొంచెం తెరిచిఉంది. నేనువెళ్ళి మెల్లిగా ఆపక్కని నిలబడ్డాను. మాఅత్తగారు భగవంతుడికి ఎదురుగుండానిలబడి మరణభిక్ష పెట్టమని భగవంతుణ్ణి ప్రార్థిస్తూఉంది. నాకు ఆవిడ అన్నమాటల్లో "పరమేశ్వరా! నేను మనోవాక్కాయకర్మలతో ఒకనాడైనా నిన్ను సేవించిఉంటే నాకీవిషయంలో సిగ్గుపడవలసిన అవసరంలేకుండా చెయ్యి. నాకు ముక్తి అక్కరలేదు! స్వర్గం అక్కరలేదు! సిగ్గుపడవలసిన అవస్థపట్టకుండా చూడమనిమాత్రమే నిన్ను ప్రార్థిస్తున్నాను. ఇంక ఈపరిస్థితుల్లో నాముఖం నేను నాకోడలికి చూపించలేను'' అన్న మాటలుకూడా వినిపించాయి.'' అంది. ఇల్లాగ చెబుతూఉంటే మృణాలకళ్ళమ్మట కన్నీళ్ళు జలజలా ప్రవహించాయి.

ఈతల్లిప్రార్థించే ప్రార్థనలో ఉన్నగంభీరవేదన అందరికీ బోధపడిపోయింది. సురేశుడికామాటలువినేటప్పటికి కళ్ళమ్మట నీళ్లువచ్చాయి. సామాన్యంగా ఎవళ్ళకష్టాలు విన్నా అతనెంతోబాధపడతాడు. అందులోనూ ఉన్నఒక్కకొడుకూకూడా చచ్చిపోయిన వృద్ధురాలి యాతన సంగతి వినేసరికి అతనిహృదయంలో ఒకపెద్దతుపాను రేగింది. అతను

కొంతసేపటిదాకా విశ్శేష్టుడై తలవంచుకున్నాడు. ఆపైన చటుక్కున ముఖంఎత్తి "సరేనమ్మా! మీరువెళ్ళండి! మీ ముసలిఅత్తగారికి పరిచర్యచేస్తూ మీ కర్తవ్యం నిర్వర్తించండి! ఇంక మిమ్మల్ని అడ్డుపెట్టను. దౌర్భాగ్య దేశానికి ఇంకా మీవంటివాళ్ళవల్లనే కాస్త గౌరవం కలుగుతూంది. బహుశః మీవంటి స్త్రీలు ఇంత దేశంలోనూ ఉండరు. అని ఆపైన ఒకవిధమైన జిజ్ఞాసాదృష్టితో అచలముఖం వైపు చూశాడు. ఆమెకిటికీలోంచి కనురెప్పవెయ్యకుండా ఒక మేఘంకేసి చూస్తూ ఉంది. అందుచేత అతనుఅన్నమాటకి సమాధానం ఏమీరాలేదు.

కాని మృణాల ఈమాటలకి ఎంతో సిగ్గుపడి సంభాషణ మరొక విధంగా మార్చివేసే ఉద్దేశ్యంతో బలవంతంగా ఒకనవ్వు నవ్వి "లేరూ? అల్లాగా? మీకుఅన్ని దేశాలసంగతీ తెలుసునా? సరే! దానికేం గాని మీరు మహిముడుఅన్నయ్యకంటె పెద్దవారా? చిన్నవారా?" అనిఅడిగింది. ఈవిచిత్రమైన ప్రశ్నవినేసరికి సురేశుడికి నవ్వువచ్చింది. ఆపైన అతను "ఏం! ఎందుకు అల్లాగ అడుగుతున్నారు?" అన్నాడు. మృణాలచటుక్కుని అతనిమాటకి అడ్డుతగిలి "మీరునన్ను మన్నించకండి! నేనువరసనిపట్టి పెద్దదాన్నిఅయినా వయస్సులో మీకంటే చిన్నదాన్నే! అందుచేత మీరునాకుపెద్దన్నయ్య అవుతారా! లేకపోతే చిన్నన్నయ్యఅవుతారా! లేకపోతే బుల్లిఅన్నయ్య అవుతారా? ఏమవుతారో త్వరగా చెప్పండి!" అంది.

అచల ఆకాశంకేసి చూడడంమానేసి ఇప్పుడు వీళ్ళద్దరివైపుకి చూసింది. ఆమెకు మృణాల మొట్టమొదట ఒదినా అనిపిలిచినరోజు జ్ఞాపకం వచ్చింది. కాని సురేశుడికి ఈగొడవలేవీ తెలియవు. అందుచేత అతను ఆమెకేసివిచిత్రంగా చూస్తూ ఒకనవ్వునవ్వి "నేనుచిన్నన్నయ్యనే! మహిముడికంటే నేను ఏడాదిన్నర చిన్నవాణ్ణి" అన్నాడు.

మృణాల "చిన్నన్నయ్యా రేపుమీరు నాతోకూడా ఒకమనిషిని పంపించేఏర్పాటు చేయించండి! నేను రేపు పొద్దున్నబండికి వెళ్ళిపోతాను" అంది. సురేశుడు వెళ్ళిపోడానికి ఇప్పుడేఅంగీకరించాడు. కాని అతను తను రేపుపొద్దున్నే వెళ్ళిపోతానంటుందని అనుకోలేదు. అందుచేత అతను ఒకక్షణకాలం మౌనంగా ఉండి గంభీరంగా "ఇంకొక రెండుమూడురోజులుండి వెళ్ళకూడదా! ఇన్నాళ్ళనించీ మహేశుడిబరువంతా నీమీద పడవేసి మేమంతా నిశ్చింతగా ఉన్నాము. ఇరవైనాలుగు గంటలూ మేలుకుని ఇంతబాగా పరిచర్య చెయ్యడం నేను హాస్పిటలులోకూడా చూడలేదు. ఏమంటావు అచలా?" అన్నాడు. అచలదానికి సమాధానంగా ఊరికే తల ఊగించింది అంతే!

మృణాల సురేశుడిమనస్సులో ఉన్నసంగతి కనిపెట్టి నవ్వుతూ "మీరు ఈవిషయంలో అట్టే బెంగపెట్టుకోకండి.! మాఅన్నయ్య ఎవరివాడో వారికే అతన్ని అప్పగించి వెళ్ళిపోతున్నాను. లేకపోతే అసలు నేనువెళ్ళే లేకపోదును. మనంఅంతా ఎంతతొందరగా బయలుదేరి వచ్చామో మీకుజ్ఞాపకం ఉండేఉంటుంది. అందుచేత నేను ఇంటిదగ్గిర సర్దుకోకుండా బయలుదేరి వచ్చాను. ఈసారికి నాకు సెలవిప్పించండి. మళ్ళీ మీరెప్పుడు రమ్మంటే అప్పుడు వస్తాను." అంది. సురేశుడు కొంతసేపుమౌనంగా ఉండి చటుక్కుని "సరే నమ్మా! ఆపల్లెటూళ్ళో ఆముసలావిడికి అల్లాగ పరిచర్య చేస్తూ కూచుంటే మీకు కాలక్షేపం ఎల్లాగ అవుతుందా!" అని అనుకుంటున్నాను" అన్నాడు.

ఆమాటమీద మృణాల ఎంతోబాధపడినట్టు కనబడింది. కాని చటుక్కుని ఒకనవ్వునవ్వి "కాలక్షేపం ఎల్లాగ అవుతుందా అన్న బెంగ నాకెప్పుడూ లేదు. చిన్నన్నయ్యా! కాలాన్నిసృష్టించిన

పరమేశ్వరుడే ఆధారం వహిస్తాడు" అంది. ఆమాటమీద సురేశుడు "సరే! బాగానేఉంది. మామగారు ఇంక ఆట్టేకాలం బతకరు కదా! డాక్టరుగారు పశిమపై దేశంలో ఎక్కడైనా కొంతకాలం పాటుమహిమున్నెడుంచి తేనేగాని జబ్బునయం కాదంటున్నారు. అందుచేత ఆశస్న మరెక్కడికైనా తీసుకువెళ్ళవలెసి ఉంటుంది. అల్లాంటప్పుడు మీరుఒక్కరూ ఎల్లాగ ఉండగలరు? అన్నాడు. మృణాల అతనికేసి చూసి ఒకచిన్ననవ్వు నవ్వి 'అదీ పరమేశ్వరుడికే తెలియాలి!'' అంది. సురేశుషముఖంలోంచి అతనికి తెలియకుండానే ఒక పెద్దనిట్టూర్పు ఇవతలికి వచ్చింది. మృణాల "బహుశః మీకు వీటిఅన్నిటిమీదా నమ్మకం లేదనుకుంటాను" అంది.

"వేటిమీద ?"

"ఈభగవంతుడూ మొదలైన విషయాలమీద"

"లేదు"

"అయితే మాఅందరిమీదా కలిగిన నిరాదరణభావంచేత మీరీ నిట్టూర్పువిడిచిపెట్టారు ! ఇంతేనా ?"

సురేశుడు ఈప్రశ్నకి చటుక్కున ఏసమాధానమూ చెప్పలేక పోయాడు. ఆతరవాత కొంతసేపు ఏదో పరధ్యానంగా ఉన్నట్టు మృణాలకేసి చూశాడు. ఆతరవాత చటుక్కుని "కాదమ్మా ! అల్లాగ కాదు. కొందరు తమకి తెలియని భవిష్యత్తుకాలూకు భారం అంతా పరమేశ్వరుడిమీద పడవేస్తూఉంటారు. వాళ్ళకి పరమేశ్వరుడు ఎల్లాంటివాడో తెలియక వచ్చును ; కాని వాళ్లు సుగమమైనమార్గంలో వెడుతున్నారనిమాత్రం అంగీకరిస్తాను. అల్లాంటివాళ్ళని నేను అనేక మందిని చూశాను. పోనియ్యండి అమ్మా ! ఈవిషయాలన్నీ అల్లాగ ఉంచండి ! ఈమాటలన్నీ చెబుతూంటే మీకు నామీద అయిష్టం కూడా కలగవచ్చును" అన్నాడు

ఆపైన మృణాల చటుక్కుని వంగి, సురేశుడి పాదాలు స్పృశించి మళ్ళీ ఆచేత్తో తనశిరస్సుస్పృశించుకుని "అయితే సరే! పోనీలెండి!" అంది. సురేశుడు నిర్ఘాంతపడిపోయి "ఏమిటి ఇదంతాను?" అన్నాడు.

"ఏమిటి అన్నయ్యా?"

"అసలు ఏమీ మాట్లాడకుండా చటుక్కుని నాకాళ్ళకి నమస్కరించా రెందుకు?"

మృణాల "అన్నగారికి నమస్కరించడానికి పంచాంగంచూసి ముహూర్తంపెట్టుకోవాలా? ఏమిటి?" అనినవ్వింది. సురేశుడు "చాలా గట్టివారే" అని స్నేహపూర్వకంగా అని ముఖంతిప్పి అచలకేసి చూశాడు. ఆమెకేసి చూసేసరికి అతనికికలిగిన ఆశ్చర్యానికి అంతులేదు! ఆమెముఖం వర్షాకాలమేఘాలు దట్టంగాఅలుముకున్న ఆకాశంలాగ కనపడింది! కాని ఆ ఆశ్చర్యం తగ్గించుకుని సురేశుడామెను ఈవిషయంలో అడగకముందే, అచల మృణాలతో కలిసి గబగబా అక్కడినించి వెళ్ళిపోయింది. సురేశుడు ఏవేవో ఆలోచించుకుంటూ అక్కడేనుంచుండిపోయాడు!

సురేశుడు అల్లాగే స్తంభంలాగ నిలబడిపోయి తనలో తను అనేక ప్రశ్నలు వేసుకున్నాడు. "ఏమిటీచిత్రం! మృణాల పాదాలకి నమస్కరించడానికీ, ఈవిడ తెల్లబోవడానికీ ఏమిటి సంబంధం?" అని లోలోపల ఒకవిధంగా అనుమానపడి, ఆఅనుమానం తను స్థిరపరుచుకున్నాడు. "అయితే దానికీ దీనికీ సంబంధం ఏమిటి? అసలు మృణాల అకస్మాత్తుగా పాదాలకినమస్కరించి చటుక్కుని ఎందుకువెళ్ళిపోయింది? మృణాల అల్లాగ చెయ్యగానే అచల తెల్లతెల్లబోయి, ఆవిధంగా అక్కడినుంచి వెళ్ళిపోవడానికి అంతరార్థంఏమిటి?" అని అతను పరిపరివిధాల ప్రశ్నించుకున్నాడు. ఆతను మృణాలకీ తనకీ

మధ్యాహ్నం జరిగిన సంభాషణ అంతా మొదటినించీ గుర్తు తెచ్చుకున్నాడు; కాని దానివల్ల అతనికి ఏవిధంగానూ ఉపయోగం కలగలేదు. ఇల్లాంటి సంఘటనలు రెండు ఏమీ కారణంలేకుండా ఊరికే జరగవనికూడా అతనికి తెలుసును. అందుచేత అతను "తను ఏదైనా పొరబాటుపని చేసి ఉండవచ్చు ననిన్నీ అందుచేత ఈఅనర్థాలు జరిగిఉండవచ్చుననిన్నీ నిశ్చయించుకున్నాడు. ఈవిషయం తెలుసుకున్న కొద్దీ అతనికి గుండెల్లో బల్లెం పొడుచుకున్నట్లైంది.

మృణాలని ఈవిషయంలో ఏమీ అడగడానికీ వీల్లేకపోయింది. ఆమె రాత్రిఅంతా ఎవరికీ కనబడకుండా కాలక్షేపం చేసింది. ఒకవేళ కనబడినా అడగడంకూడా అసంభవము; కాని తెల్లవారగానే సురేశుడు అచలని ఒంటరిగా కలుసుకుని "నిమ్మల్ని ఒకమాట అడగాలి" అన్నాడు. ఆమాటవినగానే అచలముఖం సిగ్గుచేత ఎర్రగా కుంకం లాగ మారిపోయింది. అతను అడగబోయేప్రశ్న అచలకి ఇంతకు పూర్వం తెలిసిందే! గడిచిపోయినరాత్రి జరిగినదానికి ఏదోఒక సమాధానం చెప్పకతప్పదని ఆమె నిశ్చయించుకుంది. అందుచేత బాగా సిగ్గుపడుతూ "ఏమిటామాట ?" అంది. సురేశుడు మెల్లిగా "నిన్న మృణాల హఠాత్తుగా నాపాదాలకి నమస్కరించి వెళ్ళిపోయింది. ఆపైనిమీాకు ముఖంముడుచుకుని కోపంగా అక్కడినించి వెళ్ళిపోయారు. ఆముసలమ్మ చచ్చిపోతే చచ్చిపోతుందిలే" అన్నమాటకేనా ఇదం తాను ?" అన్నాడు. తలవనితలంపుగా అడిగిన ఈప్రశ్నవల్ల అచలకి తనమనస్సులో ఉన్నదికాస్తా అనెయ్యడానికి వీలుదొరికింది. ఆమె లోలోపల సంతోషపడుతూ "అసలు ఈప్రసంగం ఎత్తడం మీాకు బాగుందా? పాపం! ఆవిడకి అసలే భర్తపోయాడు. ఆపైన అత్తగారు కూడా చచ్చిపోతే ఆవిడ ఎంత నిస్సహాయురాలైపోతుందో ఆలోచించారా ?" అంది. సురేశుడు ఆమాటమీాద ఎంతో బాధపడి

"నిజమే! నేనన్నది పొరబాటుమాటే! కాని ఆముసలావిడ ఆట్టే కాలం బతకదన్నమాట మీకు మృణాలమ్మగారికీకూడా తెలుసుకదా! అదీగాక, ఆవిడ నిస్సహాయురా లెంతుకవుతుంది!" అన్నాడు. అచల "అసలు ఈవిషయం మేము ఆవిడతో ఎప్పుడూ ప్రస్తావించలేదు. మీరు ఆవిణ్ణి బాగా భయపెట్టేశారు. పాపం! ఇంక ఆవిడ ఆపల్లె టూరిలో ఒంటరిగా ఎల్లాగఉంటుంది?" అని అడిగింది. సురేశుడు ఆమాటమీద మరింత బాధపడ్డాడు. ఆతరవాత "అందుకోసనే వెళ్ళి పోయేటప్పుడు ఆవిడికి కొంతధైర్యం కలిగించి మరీపంపిస్తున్నాను. ఏం! నేను చేసినపని బాగాలేదూ? ఆవిడికి ఏవిషయంలోనూ భయంలేదన్నసంగతి———" అని ఏదో అనబోయాడు? కాని అతని కంఠం అంతలో గద్గద మయిపోయింది. అతనికి మృణాలిని మీద ఎంతో జాలి కలిగింది.

అచల అతనికేసి చూసి పకపకానవ్వింది. సురేశుడికి ఎవరైనా బాధ పడుతున్నా రన్నసంగతి వింటే ఎంతో బాధకలుగుతుంది. అచలకి అతనల్లాగ బాధపడి ఎంతోమందికి సహాయం చెయ్యడం తెలుసును. అచల "మీరు ఆవిడికి ధైర్యం చెప్పవలసిన అవసరం లేదు. ఆవిణ్ణి భయపెట్టడంకూడా అనవసరమే! అల్లాంటి సమయం మేవస్తే నేనుమాత్రం మాట్లాడకఊరుకుంటానా?" అంది. ఆమాట వినీ వినడంతోనే సురేశుడికి కలిగిన సంతోషానికి అంతులేదు. అతను ఆ ఆవేశంలో చటుక్కుని ఆమెచెయ్యిపట్టుకుని గబగబా కదుపుతూ "ఇదే మీరనవలిసినమాట! మీరు ఇల్లాగే మాట్లాడాలని నేనెప్పుడూ కోరుకుంటూఉంటాను." అన్నాడు; కాని వెంటనే తనుచేసినపనికి ఎంతో సిగ్గుపడి చటుక్కుని ఆమెచెయ్యి వదిలేసి గబగబా అక్కడనించి వెళ్ళిపోయాడు.

పరులకోసం స్వార్థత్యాగం చెయ్యడం విషయమై ఆలోచించడం

వల్ల ను రేశుడికింత ఆవేశంకలిగింది. కాని సిగ్గుపడి పారిపోయిన ఉత్తరక్షణంలో అతని కీ ఆవేశంఅంతా కలుషిత మైపోయినట్లు కనబడింది. అచల హృదయంలో రక్తంఅంతా విద్యుద్వేగంతో ప్రవహించడం మొదలుపెట్టింది. ఆమెశరీరం అంతా గబగబా ఒణికింది. ఆమె నుదుటిమీాద స్వేదబిందువులు తళతళలాడాయి. ఆమె అక్కడనే ఉన్న ఒకకుర్చీమీాద కూలబడి నిర్జీవ ప్రతిమ లాగ మారిపోయింది. క్రమంగా కొంతసేపటికి ఆమెకి కలి గిన ఆ భావోద్వేగం అంతా ఉపశమించింది; కాని ఆతరవాత జబ్బుతో మంచంమీాద పడిఉన్న భర్తదగ్గిరికి వెళ్లాలని అనుకునే సరికి ఆమెకేదో భయం వేసినట్లైంది.

మృణాల తీరా వెడదామని ప్రయాణం అయ్యేసరికి అదుగో ఇదుగోఅని రెండురోజులు పట్టింది. ఆమె ఈవేళ వెళ్లడానికి ప్రయాణంఅయి మహిముడి దగ్గిర సెలవుతీసుకోడానికి వెళ్లింది. ఎందుచేతనోగాని అతనీవేళ వేళగానివేళ నిద్రపోతున్నాడు. సెలవు తీసుకోడానికి వచ్చినమృణాలకి అతని దొంగనిద్రకి అర్థమేమిటో బోధపడిపోయింది; కాని పైకి "ఒదినా! అన్నయ్యానిప్పుడు లేపవలి సిన అవసరం లేదనుకుంటాను! ఏం?" అంది.

దీనికి ప్రత్యుత్తరంగా అచల పెదవులచివర ఒకవ్యంగ్యపూర్వక మైన చిరునవ్వు కనిపించింది అంతే! మృణాల లోలోపల 'మహి ముడుచేసిన తమాషా తెలుసుకొన్నవ్యక్తి ఇంకొకర్తెకూడా ఉన్న' దని అనుకుంది. అచల మృణాలకి తనమీాద ద్వేషంఉందని అనుకుంది. మహిముడు ఎప్పుడూ ఈవిషయంలో కొంచమైనా ఆచోకీ ఇవ్వలేదు; అయినాగాని అచల లోలోపల అల్లాగ అనుమానపడుతూ ఉంది. ఈఅచల అనుమానం తలుచుకున్నప్పుడు మృణాలకి లోపల ఎంతో బాధగాఉండేది. కాని వెళ్లేటప్పుడు అచల అనుమాన పక్షడం

తద్ద్వారా మహిముడు చిన్నబుచ్చుకోనడం—ఈగొడవలన్నీ మృణా లకి ఇష్టంలేకపోయాయి. వెళ్లేటప్పుడు ఆమెమనస్సుకి చాలా కష్టంగానే ఉంది; కాని ఆసమయానికి ఎల్లాగోఅల్లాగ మనస్సుకి సమాధానంచెప్పుకుని ఆమె అచలచెవిలో "ఒదినా? నీకు నేను ప్రత్యేకంగా ఏమీచెప్పక్కర్లేదు. నేను ఇల్లాగ వెళ్ళిపోతూన్నందుకు అన్నయ్యతో క్షమించమన్నానని చెప్పు! జబ్బునయంఅయి తిరిగి వచ్చిన తరవాత ఒకసారి ఉంటే మళ్ళీఒకసారి కలుసుకుంటూ నన్నా నని చెప్పు" అంది.

కేదారబాబు కిందఉన్నాడు. మృణాల నమస్కారంచేసి నిల బడేసరికి అతనికి కళ్లమ్మట నీళ్లు గిర్రునతిరిగాయి. ఈనాలుగు రోజుల్లోనూ అతనికి కూడా మృణాలంటే ఎంతో ఇష్టంకలిగింది. అతను చొక్కాఅంచుతో కన్నీళ్లుతుడుచుకుంటూ "అమ్మా! నీచేతి చలవమూలాన్ని మహిముడు బతికి మళ్ళీ నలుగురులోనూ పడ్డాడు. నీకెప్పుడైనా మళ్ళీరావడానికి వీలుకలిగితే కాస్త నా సంగతి మరిచిపోకు. ఏదో నేను పెద్దవాణ్ణి అయిపోయాను మాయిల్లు నీకు మీయిల్లులాంటిదే అనుకో" అన్నాడు. అచల అక్కడే ఉందిగాని ఏమీ మాట్లాడలేదు. మృణాల ఆమెని ఉద్దేశించి "ఇందులో నాచేతిచలవ ఏముంది. మాఒదినగారు ఉండగా మాఅన్నయ్యకి భయంఏమిటి? మాఅన్నయ్యని ఆవిడికిఅప్పగించానంటే నాచేతుల్లోంచి కొండంత బరువు దిగిపోయిందన్నమాట!" అంది. ఆమాట విన్నతరవాత కేదారబాబుముఖంలో కొంచెం గాంభీర్యం కనబడింది; కాని అతను మళ్ళీ ఏమీఅనలేదు.

ఇద్దరునౌకర్లూ ఒకదాసీదీ కలిసి మృణాలతోకూడా వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నారు. గుఱ్ఱపుబండి అందర్నీఎక్కించుకుని మెల్లిగా స్టేషనువైపు కదిలింది? తక్షణమే కేదారబాబు ఒకపెద్ద నిట్టూర్పు

విడిచిపెట్టాడు. ఆపైన మెల్లిగా "ఈఅమ్మాయి ఎంతో అద్భుతమైన మనిషి "అన్నాడు. సురేశునికికూడా బహుశః ఇల్లాంటి అభిప్రాయమే కలిగి ఉంటుంది. అతడా అభిప్రాయంఎంతో ఆవేశంతో అంగీకరిస్తూ చటుక్కుని "కేదారబాబుగారూ! నేను ఇల్లాంటి అమ్మాయిని ఎక్కడా చూడలేదండీ! అనేకమంది ఉంటారుగాని ఇంతచక్కగా మాట్లాడేవాళ్లుగాని, ఇంతచక్కగా పనిపాటలు చేసేవాళ్లుగాని ఎవ్వరూ ఉండరు. ఈఅమ్మాయికి మనం ఏదైనాపని చెప్పామంటే అతిచాకచక్యంతో చేసిపారేస్తుంది. ఎంతకొత్తపనిఅయినా చిన్నప్పణ్ణించీ అలవాటున్నపనిలాగ చేసిపారేస్తుంది. అసలు అన్నిటికంటే ఆశ్చర్యం ఏమిటంటే ఈఅమ్మాయి తనఉన్న పల్లెటూరువిడిచి ఎప్పుడూ ఇవతలికి రానేలేదు" అన్నాడు.

కేదారబాబు ఇదంతా నిజమేనని అనుకున్నాడు. కాని ఎంతో ఆశ్చర్యపడి "ఏమిటి అంటున్నారు" అన్నాడు. సురేశుడు "నేను చెప్పినదానిలో ఒక్కటీ అబద్ధంలేదు! ఈఅమ్మాయికేసి చూస్తూంటే జన్మాంతర సంస్కారాలమాట అబద్ధమేమో నని అనిపిస్తుంది. అనినవ్వడం ప్రారంభించాడు. పరలోకప్రసంగం ఎత్తగానే కేదారబాబు కేవేవో ఆలోచనలు కలిగాయి. అల్లాగ కొంతసేపు ఆలోచించి అతను చటుక్కుని "ఏమి ఎల్లాగ ఉన్నా ఈఅమ్మాయిని చూసినప్పటినుంచీ స్త్రీలందరిలోనూ ఈమె ఒకఅమూల్యరత్నం అని అనిపించింది. బతికిఉన్నంతకాలమూ ఈఅమ్మాయిని ఇల్లాగ జీవచ్ఛవంలాగ అట్టేపెట్టడం అంతమహాపాపం అదేగాని మరేమీలేదు. ఈ అమ్మాయి నాకూతురయితే ఏమయినాసరే— నేనిల్లాగఊరుకోను" అన్నాడు. సురేశుడు ఆశ్చర్యపడి 'ఏంచేస్తారు!' అన్నాడు. కేదారబాబు ఎంతో ఆవేశంతో "మళ్ళీ పెళ్ళి చేసేస్తాను. ఇంతచిన్నపిల్లని తీసుకువెళ్ళి ఒకముసలివాడికి కట్టబెట్టి, ఆముసలివాడు [illegible]

మనశాసనే జన్మంఉన్నంతకాలం సన్యాసినిగా ఉండమనడం కేవలం అన్యాయము. అల్లాగ అన్నవాళ్ళు ఆఅమ్మాయికి శత్రువులుగాని బంధువులుకారు. అల్లాంటి శత్రువులు చేసినపని న్యాయమని నేను ఎప్పుడూ అనను" అన్నాడు. ఆపైని ఒక్కనిమిషం ఊరుకుని మళ్ళీ "సురేశబాబూ ఇది ఇల్లాగ ఉండనిచ్చి ఆఅమ్మాయి భర్త ఎల్లాంటి పనిచేశాడో చూడండి. తనురెండు పెళ్ళిళ్ళుచేసుకున్నాడు. ఆఇద్దరు భార్యలూ చచ్చిపోయారు. యాభై ఏళ్ళవయస్సు వచ్చి ఇప్పుడు మళ్ళీపెళ్ళిచేసుకున్నాడు. ఆదుర్మార్గుడు తనసుఖంతప్ప తన భార్య భవిష్యత్తుసంగతి ఏమైనాఆలోచించాడా? చెప్పండి" అన్నాడు.

సురేశుడు సమాధానం చెప్పకపోవడంమూలాన్ని కేదారబాబు మరింతఆవేశంతో "సురేశబాబూ" మీతో నేనిప్పుడు విధవావివాహపు మంచిచెడ్డలని గురించి వాదించదలుచుకోలేదు. హిందూసంఘం అంతా కలిసి ముక్తకంఠంతో ఘోషించినా ఈఅమ్మాయి ఈవిధంగా ఉండడం శ్రేయస్కరం అన్నసంగతి నేనంగీకరించను! పాపం! ఇప్పుడు ఆ అమ్మాయికి దిక్కెవ్వరున్నారు! మీరందరూ బ్రహ్మచర్యం బ్రహ్మచర్యంఅని ఘోషిస్తూ ఉంటారు. అల్లాగ ఘోష పెట్టినంత మాత్రాన్ని ఈప్రపంచకం అంతా ఒక్కసారిగా ఋషివాటిక అయిపోతుందా? మీకీప్రపంచకం అంతా ఏదోవేళాకోళంలాగ కని పిస్తూన్నట్లుంది. నాకు ఆ అమ్మాయి కట్టుకునే బట్టలకేసి చూస్తూంటే గుండెచెరువై పోతూంది" అన్నాడు.

సురేశుడు సమాధానమూ చెప్పలేదు. ముఖంఎత్తి కేదారబాబు కేసి చూడనూలేదు. కాని క్రీగంటిచూపుతో అచలఉన్నద్వారంకేసి చూశాడు. ఇంతవరకూ ఆద్వారందగ్గిర శిల్పవిగ్రహంలాగ నుంచున్న అచల ఇప్పుడక్కడ లేనేలేదు! ఆమె నిశ్శబ్దంగా ఎప్పుడులోపలికి వెళ్ళిందో తెలియనేలేదు. మృణాల వెళ్ళిపోయినతరవాత అచలకి

సురేశుడు రెండుమూడుసార్లు కనపడ్డాడు. అతను ఏదో ఒక బాధ చేత రోజురోజూ కృశించిపోతున్నాడు. ఎప్పుడు చూసినా ఏదో పరధ్యానంగా ఉన్నట్టే కనబడ్డాడు.

తరవాత రెండుమూడు రోజులు అల్లాగే గడిచిపోయాయి. మధ్యాహ్నం మూడున్నర అయింది. అప్పటికింకా బాగా ఎండగా ఉంది. సురేశుడు వరాండాలో ఒక పడకకుర్చీమీద కూర్చుని ఏదో చదువుకుంటున్నాడు. ఇంతలో అడుగులచప్పుడయింది. అతను చటుక్కుని కళ్ళెత్తిచూశాడు. అచల అతనికోసం టీపట్టుకువస్తూంది. ఇది ఇంతకు పూర్వం ఎప్పుడూ జరగలేదు! అతను ఆశ్చర్యపడి నిటారుగా కూర్చుని "ఈవేళ మీరు పట్టుకువస్తున్నారేమిటి? వంటమనిషి ఎక్కడికి వెళ్ళాడు?" అన్నాడు. అచల ఆమాటకి సమాధానంఏమీ చెప్పకుండా అక్కడికి దగ్గిరగాఉన్న ఒక చిన్నబల్లలాగి దానిమీద టీకప్పుపెట్టి, వేరే ఒకకుర్చీని లాక్కుని దానిమీద కూర్చుంది. ఇదిచూసేసరికి సురేశుడికి ఇంక మళ్ళీప్రశ్న వెయ్యాలని బుద్ధిపుట్టలేదు. అతను టీకప్పు మెల్లిగాచేత్తో అందుకున్నాడు.

అచల కొంతసేపు అల్లాగ నిశ్శబ్దంగాకూర్చుని ఆపైన "మీకు విధవావివాహాలంటే ఇష్టంలేదా?" అని అడిగింది. సురేశుడు ఎత్తిన గిన్నె దించకుండానే "ఇష్టం లేకేమి! ఇష్టమే! నేనింకా అవి చెడ్డవి అనుకునేఅంతగా పాడైపోలేదు!" అన్నాడు. అచల ఆపైన ఏమీ ఆలోచించకుండానే "అయితే మృణాలలాంటిపిల్లని వివాహంచేసుకోవడంలో మీకేమీ అభ్యంతరం ఉండదన్నమాట!" అంది. సురేశుడు ఆగిన్నె చేత్తోపట్టుకుని గంభీరంగా కూర్చున్నాడు. ఆపైన "అంటే మీఅభిప్రాయం ఏమిటి?" అన్నాడు. అచల ముఖంలోగాని కంఠస్వరంలోగాని ఏవిధమైన ఆవేశమూ కనబడలేదు. ఆపైన ఆమె ఎంతో సహజంగా "మీకు నేను ఎన్నోవిధాల ఋణపడిఉన్నాను. ఇదీకాక

నేను మీ మంచి కోరే వాళ్ళి కూడాను. నాకు మీరు వివాహంచేసుకుని సుఖంగా ఉంటే చూడాలని ఉంది. ఒకప్పుడు మీరు వివాహంచేసుకోడానికి ప్రయత్నించారు. అందుచేత ఈవేళ మీరు వివాహంచేసుకోడానికి అంగీకరిస్తారని నా ప్రార్థన" అంది. ఆపైన గుక్కతిప్పుకోకుండా గబగబా పాఠం అప్పజెప్పినట్లు వగర్చడం మొదలుపెట్టింది.

సురేశుడు కొంతసేపటిదాకా రాతివిగ్రహంలాగ అల్లాగే కూర్చుండిపోయాడు. అల్లాగ కొంతసేపుండి ఆపైన "నేను వివాహంచేసుకుంటే మీరు నిజంగా సుఖపడతారా?" అన్నాడు. అచల "అవును" అంది.

"ఆమె ఒప్పుకుంటుందా ?"

"నేను అల్లాగే అనుకుంటున్నాను"

సురేశుడు నిరుత్సాహంగా ఒకనవ్వునవ్వి "నేను అల్లాగ అనుకోవడం లేదు. మీరు పుస్తకాల్లో కొంతమంది స్త్రీలు నవ్వుతూ నవ్వుతూ సహగమనం చేసేవారనే మాట చదివే ఉంటారు. మృణాల సరిగ్గా అల్లాంటివ్యక్తి! ఆవిణ్ణి ఒప్పించడం మాట అల్లా ఉంచండి! బలవంతంగా కాళ్ళూ చేతులూ కట్టేసినా ఆవిడ దీనికి అంగీకరించదు. ఇల్లాంటిఅసాధ్యమైన పని తలపెట్టి ఆవిడకి నామీద ఉన్న గౌరవం కాస్తా పోగొట్టుకోవడం నాకిష్టంలేదు. అదీగాక ఆవిడ నన్ను "అన్నయ్యా!" అని వరసపెట్టి పిలిచింది. ఆవిడకి నామీద కలిగిన గౌరవం పోగొట్టుకోకూడదని నిశ్చయించుకున్నాను" అన్నాడు.

అల్లాగ అతనిమాటలు వింటూ ఉంటే అచలముఖం కోపంచేత ఎర్రగా మారిపోయింది. సురేశుడు మాట్లాడడం పూర్తి కాగానే ఆమె కాఠిన్యం సూచించే మృదుస్వరంతో "సురేశబాబూ! ప్రపంచకంలో మృణాల ఒకర్తే పతివ్రత అనుకోకండి! అనేకమైన పరిస్థితులు ఏర్పడినా ఒక్క భర్తనే నమ్ముకుని ఉండే స్త్రీలు అనేకమంది ఉన్నారు. ఇల్లాంటిస్త్రీల విషయం మీరు పుస్తకాల్లో చదివిఉండరు; కాని ఇల్లాంటివాళ్ళు

ఉంటారనే మాటమాత్రం మరిచిపోకండి!" అంది. ఆపైన ఆమె నిర్ఘాంతపోయి కూర్చున్న సురేశుడివైపు చూడకుండా గబగబా సగర్వంగా నడిచివెళ్ళిపోయింది.

---

దీనితరువాతి కథ రెండవభాగమునందుకలదు

రెండవభాగము వెల [redacted] 2-0-0

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము